ఓం

శ్రీగురుభ్యోనమః

# ప్రబోధ చూడామణి యను

శక్తిద్వయ నిరాసకంబైన

# శుద్ధనిర్గుణతత్త్వ కందార్థదర్పణాలు

క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత

# పరమతత్త్వ కందములు

శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులచే

రచియింపబడి

అచలర్షి దయానంద రాజయోగి గారిచే

భావార్థ విశేషార్థములు వ్రాసి
ప్రకటింపబడినది



1990 వెల : రూ. 22/-

ఓం

శ్రీగురుభ్యోనమః

# ప్రబోధ చూడామణి యను

శక్తిద్వయ నిరాసకంబైన

# శుద్ధనిర్గుణతత్వ కందార్థదర్ప్యాలు

క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత

# పరమతత్వ కందములు

శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులచే

ర చి యిం ప బ డి

అచలర్షి దయానంద రాజయోగి గారిచే

భావార్థ విశేషార్థములు వ్రాసి
ప్రకటింపబడినది



1990 వెల: రూ. 22/-

—(శ్రీకృష్ణ నిజగురు పరబ్రహ్మణేనమః)—

ద్వైతాద్వైత రహిత పరమతత్వము వేదవేదాంత
సారాతీతము సకలసుకవిజన మనోరంజిత విలాసము
జనన మరణ ప్రవాహమును సులభోపాయముగా దాటించదగిన

ప్రబోధ చూడామణి యను
శక్తి ద్వయ నిరాసకంబైన

# శుద్ధ నిర్గుణతత్వ కందార్థ దర్పాలు

క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత

# పరమతత్వ కందములు

శ్రీ గోలకొండ యనంబరగు హైదరాబాద్ - దక్కన్
రాజధానియందు, భరద్వాజసగోత్ర పయఃపారావార
రాకా సుధాకరుండగు

## శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులచే

రచియింపబడిన నిజప్రతి

## అచలర్షి దయానంద రాజయోగి గారిచే

భావార్థ విశేషార్థము వ్రాయబడి భక్తమండలి ద్రవ్యసహాయముచే
ప్రకటింపబడిన నిజప్రతి

తృతీయ ముద్రణ

రిజిష్టర్డు కాపిరైటు| 1990 [వెల : రూ.

ఓం

శ్రీ సద్గురవేనమః

అవలర్షి సాంప్రదాయక

# పరంపరాధ్యానం

ఓంనమో బ్రహ్మాదిభ్యో । బ్రహ్మవిద్య సాంప్రదాయకర్తృభ్యో వంశ ఋషిభ్యో మహాద్భ్యో నమోగురుభ్యః ॥ సర్వోపప్లవరహిత ప్రజ్ఞాన ఘన ప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి అహంపదార్థ రహితః ॥

## —(శ్రీ మహావిష్ణు సాంప్రదాయం)—

శ్లో॥ శ్రీ బ్రహ్మవిద్యా । గురువిష్ణుసూర్యం
శ్రీయాజ్ఞ వల్క్యం । జనకంశుకంచ
సాందీపమీశం । కృష్ణంచ అర్జునం
వందేగురున్మే । గురుపాదుకాంతం ॥

# శ్రీ శివరామదీక్షిత గురు పీఠాధికార

## సాంప్రదాయధ్యానం

శ్లో॥ శ్రీధరస్వామినం నిత్యం । బోధకారణమవ్యయం
భావాతీత మహంవందే । సుఖజ్ఞానైక నిర్మలం ॥

శ్లో॥ వందారు జనమందారం । వందేహం తన్నిరంతరం
రామడుగు వంశజంశుద్ధం । శివరామాఖ్యదీక్షితం

శ్లో॥ యస్యబోధో దయాత్సర్వం । బ్రహ్మైవేత్యవగమ్యతే
శివరామేవిధిఖ్యాతం । తద్దైవితముపాస్మహే ॥

శ్లో॥ కామాదిరిపుహంతారం । కారుణ్యామృతసాగరం
కంబాలూర్యప్ప రావాభిదానం వందేత్య మద్గురుం ॥

శ్లో॥ శ్రీమత్పరబరామాన్వ । యాబ్ధిచంద్ర మనోరమం
నిత్యానందమహంవందే । సీతారామగురుంపరం ॥

శ్లో॥ శ్రీమత్కారుణికం మహాగుణనిధిం । పూర్ణప్రభాభాసురం ।
నిర్ద్వంద్వంని రపేక్ష కామమమలం । నిస్సంగమాద్యంవిభుం
నిత్యానందమయం । నిరీహమతులం । నిర్ముక్త కర్మాదికం
శ్రీకృష్ణాఖ్య గురుంభజేహమనిశం । శ్రీ చిత్త సంతోషణం ॥

శ్లో॥ నిత్యంసాంద్రకృపారసంవిజిత భావాభావమత్యున్నతం
ద్వంద్వాతీతమమత్సరంపరమ । కళ్యాణాత్మ తత్వంవిదుం
బ్రహ్మానందమయంసుబోధ నిలయం స్వానందభావం సదా
శ్రీమద్భాగవతాన్వయాబ్ధివిలసత్ । శ్రీకృష్ణ చంద్రంభజే ॥

శ్లో॥ శ్రీవత్సగోత్ర కలశాంబుధి పూర్ణచంద్రం
శ్రీకృష్ణపాద కమలామృత పానభృంగం
శ్రీపీలుఖాన వంశాంబుధి పారిజాతం
శ్రీలక్ష్మణార్యమనిశం స్వగురుంభజామి ॥

శ్లో॥ అచలపూర్ణదేవ । లాత్మ సత్స్వరూపదీపకం
పీలుఖాన లక్ష్మణాఖ్య । దేశికేంద్ర కారణం
బృహద్వసిష్ట సద్విచార । సాధుమార్గవర్తనం
సచ్చిదానంద వేంకటేశ । సద్గురుం భజామ్యహం

శ్లో॥ వేంకటేశ్వరపాదారవిందామృతరసాయనం । పిబన్మత్త
మనోభృంగం॰ హనుమంతం గురుంభజే ॥

శ్లో॥ వేదశాస్త్రవిధిఖ్యాతం । పూర్ణబోధోప దేశికం
సుగుణాకరం దయానందం । రాజయార్యగురుంభజే ॥

శ్లో॥ అద్వైత రహితసిద్ధాంత । భ్రాంతి రహితోపదేశిక
హెన్నాల రాజయోగీంద్ర । సద్గురోతే నమోనమః

శ్లో॥ ద్వయాత్మదోషరహిత కేవలాత్మ సత్స్వరూపకం
భూమానంద హనుమయార్య । పాదకమల సేవకం
పూర్ణబోధ సద్విచార రాజయోగప్రవర్తనం
దయానంద రాజయార్య । సద్గురుం భజామహ్యాం ॥

శ్లో॥ అస్మద్గురు సమారంభాం । కృష్ణసాందీపమధ్యమాం
శ్రీమహావిష్ణు పర్యంతాం । వందేగురుపరంపరాం ॥

ఓం

శ్రీకృష్ణగురు పరిపూర్ణ పరబ్రహ్మణేనమః

# ఆవతారిక

శాలివాహనశకము, 1765 సం॥నకు సరి అయిన, శోభకృతునామ సంవత్సర మార్గశీర్ష బహుళ చవితినాటికి రచింపబడిన "శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థ దరువులును, 1784 సం॥నకు సరిఅయిన దుందుభినామ సంవత్సర మాఘశుద్ధ పౌర్ణమినాటికి పూర్తిచేయబడిన క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత పరమతత్వ కందములును, శ్రీమద్రాజాధిరాజ మహారాజ రాజయోగీంద్ర చంద్రులగు శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులచే శిష్య ప్రశిష్యుల కనుగ్రహింప బడినవి. ఏతద్గ్రంథ రాజమునందలి విషయము సకల వేదాంత సారాతీతమై, ఆగమ నిగమోపనిషత్సాగర మధితార్థ ప్రకాశకమై వెలయుచున్నది.

## ఈ గ్రంథరాజమును గురించి

కం॥ నామాట లెన్నవినుమా । సామాన్యంబనుచు చూడ । జనబోధన్ । ప్రేమాతిశయమునంగని । వేమారిది గురునినోట । వినవలెనుమ్మా। నిత్యము దీన్ని చదువుకోనమ్మా ॥ అనియు,

కం॥ అర్థము దెలియక గ్రంథము । వ్యర్థంబని నిందజేయు । వ్యర్థుల మాటల్ । వ్యర్థములని యీగ్రంథం బర్థము సద్గురుని వలన బాగుగ వినుడీ॥ అనియును,

కం॥ ఏపురుషుడు గురువర్యుని । శ్రీపాదము బట్టలేక సేలుగనాతం। డీపుస్తకమును జూచిన । ఏపట్టునవిల్వకేగు యిది నిజమయ్యా । నరులార మీమది తెలియరయ్యా । యీ పరమ గోప్యాము ఎవరెరుగరోయయ్యా । నాపల్కు మదిలోన నాటిన వారికే। యిది నిజమయ్యా। నరులార మీమది తెలియరయ్యా॥ అనియు గ్రంథకర్తయే పాఠక లోకమును హెచ్చరించి యున్నారు.

ఈ గ్రంథమునం దిమిడియున్న "రహస్యమే తదుత్తమం" అవగా యాయుత్తమ రహస్యమును నిజసాంప్రదాయక సద్గురువుల వలన తెలుసుకుని పిమ్మట యీ గ్రంథరాజము నందలి ప్రబోధ శ్రవణము చేయవలయును, అట్లొనర్చిననే జననమరణ పరంపరకు మూలకారణముగ, నామరూప క్రియాత్మక

మగు ఏపదార్థము గలదో అది సమూలముగ నాశ మొందగలదు అట్లు సాంప్రదాయక మూలసూత్రముల గుర్తెరుగకనే గ్రంథస్త విషయమున ప్రవర్తింపనెంచినచో కర్మపాషండులై చెడెదరని గ్రంథకర్తయే సెలవిచ్చినారు. అయినను అట్టి మూలసూత్రముల రహస్యమెరుంగకనే కొందరీ కందార్థములకు భావార్థములు వ్రాసియు, కందార్థముల గొన్నిటిని సవరించియు, కొన్ని కందార్థములను నూతనముగా చేర్చియు ప్రకటించుచూ వచ్చిరి. అట్టివారు తాము చెడినదే గాక తమ్ము నమ్మియున్న వారలను కూడ చెరచుచున్నారనుట నిస్సంశయము. శక్తిద్వయ నిరసనము, క్షరాక్షరోపాధి ద్వయదోష రహితము నగు అచల పరిపూర్ణబోధ తాము ఉపదేశ పూర్వకముగా చక్కగా గ్రహించి జనన మరణ భ్రాంతి రహితులై, గురువాజ్ఞ గాని తిరిగి మరియొకరికి పునరావృత్తి భ్రమ రహిత పరచదగిన యుపదేశ మిచ్చుటకు తగిన అధికారము లేనిదే, తమతమ యూహాపోహలచే కందార్ధ భావనను తమ యిష్టానుసారముగా వ్యాఖ్యాన మొనర్చుచు అమాయక ప్రజానీకమును వంచించి అధోగతి పాలుచేయుట యెంతయు శోచనీయము.

అట్టి అనర్ధ కల్పనలకు తావులేకుండ, సకల సుజనాళికిన్ని, సకల నిగమాగమాంత సిద్ధాంత రహస్యవిదులకున్ను చేయు విజ్ఞప్తి ఏమనగా శ్రీకృష్ణదేశిక ప్రభువరుల స్వహస్తముతో సవరించిన పీఠంలోనుండి యున్న మూలగ్రంథ ప్రతిని ఆధారము చేసుకొని నాచే యీ గ్రంథము యొక్క ముద్రణ గావింపబడు చున్నది. సాంప్రదాయక గ్రంథములను చూడగోరు వారు యికముందు యీ గ్రంథమును మాపీఠ యాజమాన్యమున ప్రకటింపబడు యితర గ్రంథములున్ను మాత్రమే పఠనశ్రుతము లొనర్చవలెనని మనవి.

మూలగ్రంథమునందు పలువిషయములు ఒకే లక్షణమున చేర్చబడియుండి పాఠకులకు సులభ గ్రాహ్యము కాకుండ నున్నందున, ఒకేవిషయమున గ్రంథకర్తకుగల అభిప్రాయము లన్నియు నొకే శీర్షిక క్రిందకు సేకరించి ముద్రించుట వలన పాఠకలోకమునకు సౌలభ్య మేర్పడుననే యుద్దేశముతో కందార్థము లాయాశీర్షికల క్రిందకు చేర్చడమైనది. ఇదివరలో కందపద్యముల కెట్టి విభాగములును ఏర్పరచబడి యుండనందున విషయ గ్రహణ కనుకూలముగా నుండు తెరగున ప్రకరణ విభాగము చేయడమైనది.

ప్రపంచమున వ్యాప్తిలోనున్న సర్వప్రబోధలును ప్రాపంచిక సుఖము లను, సాలోక్య, సామీప్య, సారూప్యాది పదవులును మాత్రమే కల్గించునవియై యున్నవి. "నసపునరావర్తతే" అనగా కేవల జననమరణ భ్రాంతిరహిత మొనర్చునదీ ప్రబోధ మొక్కటియే. "కథకాదు జననమరణ వ్యథ మానుటకై రచియిస్తి ననియును, "ఏబోధ శిష్యులకుగల యా బాధలనణచివేసునదే సద్బోధ యనియును, "అందముగా సద్గ్రంథము చందము వినిపింతుదాన్ని చదివిన వినినన్, ముందుగ బయలెరుకై ఏనందున తేనెరుక లేక ! జనవలెనుమ్మీ" అనియును. బోధకు బందోబస్తైర చూడూ । రతనాలెట్లారాళ్ళు, రతినాలీ పద్యాలే" అనియును గ్రంథకర్త వ్రాసిన మాటలీ సందర్భమున తిలకింపదగి నవి. అందుచే యెంతేని తగియుండునని యెంచి యీ గ్రంథమునకు ప్రబోధ చూడామణి యని గూడ నామకరణము చేయడమైనది.

కనుక యీ గ్రంథము పీఠసాంప్రదాయకులకే గాక ముముక్షువులును, జిజ్ఞాసువులును అగు సర్వులకు, అమూల్య సహాయకారి కాగలదని విశ్వసించు చున్నాము.

ఇట్లు

అచలర్షి దయానంద రాజయోగి

శ్రీమదచలర్షి రామడుగు శివరామదీక్షితాచల

గురుపీఠాధిపతి

# శ్రీకృష్ణదేశిక సూక్తిముక్తావళి

1. సాంఖ్యమనగా, దేహి, దేహములయొక్క యితరేతర విభాగ దర్శనసిద్ధి పొందబడినటువంటి సారాసార విచారణ, వివేక విజ్ఞాన దృష్టియే సాంఖ్యము.

2. సాంఖ్యము వినా, యోగప్రాప్తి లేదు. యోగము వినా, సంఘఫలత్యాగము సంభవించదు. యెట్లనగా, బాహ్యాంతర గుణకర్మ త్యాగమే పారమార్థిక సన్యాసము గనుక పారమార్థిక, సన్యాససిద్ధి జ్ఞానవిష్ట సాంఖ్యము గనుక, బాహ్యాంతర గుణకర్మ త్యాగము వినా సంఘఫల త్యాగము సంభవించదు.

3. యీ అనుభవము గురుపుత్రుడగు పురుషునికి గమ్యమానమే గాని, మిగిలినవారు యీ శ్రవణము విన్నప్పటికీ అనుభవము లేని వారు గనుక మనస్సున పట్టదు.

శ్రీ శివరామదీక్షిత అచలగురు పీఠాధిపతి

గ్రంథకర్త

# శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులు

కం॥ భాగవత వంశభవుడను । భాగవతోత్తములపాద పద్మంబులకున్
సాగిలిమ్రొక్కెడువాడను । బాగుగనను జనులు కృష్ణభట్లు మరిలన్



కం॥ భారుణ్యత్రినసూయలు । వీరేయనిజనులుబొగడ వెలసినవారల్
నారాయణజానకియను । వారిరువురు గన్నయట్టి వాడనుసుమ్మా

కం॥ చిలర బోధల నన్నిటి । నొర్లరు రెజబోధ వెలసి యొప్పెటిపెట్టల్
పొల్లాయియందుకునేనవి । వల్లకి యూబోధయందె వర్తిస్తిజుమీ॥

కం॥ శ్రీమత్సీతారాము । స్వామికృపన్ జెప్పనయ్యె సదవద్రహితం బేమి
పదార్థము దానిని । యీమహా కందార్థములుగా నివి వినరయ్యా॥
ఓ జనులారా యిటు గనరయ్యా । వేమారు నే మిమ్ము వేడెదింతియ
యమ్మి । నామీద కృపజేసి ననుజన్మమునిమీర । లివి వినరయ్యా
వోజనులార యిటు గనరయ్యా॥

శ్రీ శివరామదీక్షిత అచలగురు పీఠాధిపతి



శ్రీ దయానంద పొన్నాల రాజయోగి

శ్రీ సీతారామాయనమః

# ప్రబోధ చూడామణి యను

## శక్తిద్వయ నిరాసకంబైన

# శుద్ధ నిర్గుణతత్వ కందార్థ దరువులు

## స భా వి జ్ఞా ప న

## (గ్రంథ ప్రభావము)

(౧.) జనులార జనన మరణము । లను దొలగన్ ద్రోయజాలు లక్షణ యుతమై । వినువారికి కనువారికి । తన లావెరిగించుదీని ॥ తప్పక వింటే ॥ అప్పుడెవార లెప్పుడుగంటే । కనుకా వినబుద్ధైతె వినుడీ చదివెద మీకె । కనుగొన మనసైతె కనుడీ పుస్తక మంత । తప్పక వింటే అప్పుడెవార లెప్పుడు గంటే॥

ఓ జనులారా లక్షణ యుతులై యీ ప్రబోధ తప్పక ఎవరు విని కని యెదరో అప్పుడె అచల పరిపూర్ణ పరబాహ్యము యొక్క ఆధిక్యత తెలియుచు పుట్టుచావులు లేకుండపోవును. గనుక వినవలయునని కోరిక యున్నవారు నేను చదివెదను వినండి. పరిశీలించుటకు యిష్టమున్న వారు గ్రంథమును సంపూర్ణముగా మీరే పరిశీలించుడి.

ప్ర॥ గ్రంథారంభమునందు దేవతా ప్రార్థన చేయక జనులారా యని సంబోధించుటకు కారణ మేమైయుండును ?

గు॥ జనన మరణ భ్రాంతి రహితము మానవోపాధి యందే యగును. దేవాది జన్మలయందు కాబోదు గనుక మానవ అవసర విషయము మానవులకే సంభోదించనైనది.

ప్ర॥ జనన మరణ భ్రాంతి రహితము దేవాది జన్మలయందు యెందుకు కాదు?

గు॥ ఆకాశాదిక భూతా నేకాత్మకమగుచు ఎఱుక నీ జగమయ్యెన్ ॥

జగము వలన సంకల్పము. జగమా సంకల్పంబు వలన జనియించును. గనుక కర్మమున బుట్టు జంతువు కర్మమునను వృద్ధి బొందు కర్మమున జెడున్ కర్మము జనులకు దైవము కర్మము సుఖ దుఃఖములకు కారణమధిపా యను నిర్ణయానుసారము దేవాది దైవ స్వరూపంబులు వారు యొనర్చు కర్మ ఫలంబులు క్షీణించగనే తిరిగి జన్మములు పొందుచుందురు. గనుక వారిని నియమిత దేవత లని చెప్పనగును. వీరు జనన మరణ ప్రవాహమునందే ప్రవహించేవారుగా యున్నందున జన్మరహిత పరిపూర్ణ బోధయందు నియమిత దేవతల ప్రసక్తే యుండదు గనుక వారి ప్రార్థన యుండదు.

శ్లో॥ దుర్లభం మానుషం దేహం యనే నిర్ణయమే గాని దుర్లభం దైవ దేహం యనే నిర్ణయం లేదు గనుక. నియమిత దేవతల కన్నా జనన మరణ రహితమునకై ప్రయత్నించు మానవోపాధి ఉత్తమమని నిర్ణయం.

శి॥ లక్షణయుతులయ్యి యీ బోధ వినవలయును. కనవలయును యని నిర్ణయము గనుక యీ బోధ వినుటకు కనుటకు ఏ పద్ధతి గలవారిని లక్షణ యుతులనెదరు ?

గు॥ వేదము, వేదాంతము, సిద్ధాంతమని మూడు విధంబులు. వేదము నందు, గుణత్రయములచే ఆచరించు కర్మా చరణంబులు వాటి వలన కలుగు యిహపర భోగంబులు నిర్ణయించి యుండును. ఆ పద్ధతులు ఆచరించు వేద పండితులకు కర్మా చరణంబులు బాహ్య సాధనములు. యింద్రాది భోగంబులు అంతర సాధనములని నిర్ణయము.

నేను వేదములను పఠన పాటవంబొనర్చు నటువంటి పండితుడను. నాకు వేదాంతము తెలియజేయమని గురువును ఆశ్రయించినా సాధన చతుష్టయ పద్ధతి తెలిసినవాడే వేదాంతమును శ్రవణము చేయుటకు లక్షణయుతుడుగాని, వేదమును పఠన పాటవములొనర్చిన వారు అధికారులు కారని వేదాంతమును ప్రబోధించరు. ఎందుకనగా

వేదాంతము శ్రవణము చేయువారికి సాధన చతుష్టయమను నిత్యానిత్య వస్తు వివేకము ఇహా ముత్రార్థఫల భోగ విరాగము. శమాదిషట్క సంపత్తి, ముముక్షత్వము అనునవి బాహ్య సాధనంబులుగాను. మహావాక్య నిర్ణయ పద్ధ తులు, లక్షణ త్రయములో శ్రవణాదులు యొనర్చుడము అంతర సాధనముడు

గాను నిర్ణయం గనుక వేదములను పఠన పాఠవములొనర్చునట్టి పండితులు వేదాంతము శ్రవణము చేయుటకు లక్షణయుతులు కారు. సాధన చతుష్టయములు గలవారే వేదాంతము వినుటకు లక్షణయుతులు.

శ్రవణాదులు మొనర్చు వేదాంతులు వార్తీక నిర్ణయము శ్రవణ మొనర్చుటకు అధికారులు. ఎందుకనగా, మహావాక్య నిర్ణయమునందు తత్త్వమసి బ్రహ్మ యను శ్రవణ వాక్యముద్వారా అయమాత్మ బ్రహ్మయనే నిర్ణయము గలిగి అహం బ్రహ్మాస్మి యనే పద్ధతిగా ప్రజ్ఞానం బ్రహ్మ యనే పద్ధతిలో ప్రవర్తించవలయును. ఈ పద్ధతియందు బ్రహ్మానుభవము నిలవదని వార్తీకాదులు మహావాక్య నిర్ణయాదుల యందలి శ్రవణాదులను నిరసించి వార్తీక పద్ధతిని నిర్ణయించినారు గనుక, శ్రవణాదులు మాత్రమే నిరసించి వార్తీక నిర్ణయము వేదాంతులకు మాత్రమే ప్రబోధించెదరు. యితరులకు ప్రబోధించరు గనుక, వార్తీక పద్ధతి వినుటకు వేదాంతులు లక్షణయుతులని నిర్ణయము.

వార్తీక నిర్ణయ పద్ధతియందు తన నిర్ణయము తనకు తెలియకుండా పోయినందున అగోచరమని నిర్ణయము. ఇటువంటి అగోచర పద్ధతియందు అచల పరిపూర్ణ పర బాహ్యము తెలియజేసినందున ఆ పరము జనన మరణంబులు లేనిదని దాని గొప్పతనము తెలిసి తాను బ్రహ్మమును అనుకొన్న భ్రాంతి తనతోకూడా లేకపోవుచున్నాడు గనుక,

వార్తీక పద్ధతి తెలిసికొని దాని నిర్ణయమునందు జనన మరణ భ్రాంతి తొలగబోదని తెలుసుకున్నవాడే పరిపూర్ణ బోధ వినుటకు లక్షణయుతుడు. ఆ పద్ధతి తెలిసినవారికే పరిపూర్ణ సూచన తెలియగలదు. దాని దర్శన మాత్రమున నే జన్మ రహితము కాగలదని నిర్ణయము.

వేదాంతము యనగా పరబ్రహ్మమును తెలియజేయునదియై, పరబ్రహ్మము వలన గలిగినదై ప్రకాశించు నాలుగు వేదములలో ఋగ్వేదమందు 'ప్రజ్ఞానం బ్రహ్మ' అనెడు సాక్షాత్కార వాక్యమున్ను యజుర్వేదమందు 'అహం బ్రహ్మాస్మి' యను అనుభవ వాక్యమున్ను, సామవేదమందు 'తత్త్వమసి' యను ఉపదేశ వాక్యమున్ను అధర్వ వేదమందు, 'అయమాత్మ బ్రహ్మ' యను సమాప్తి మహా వాక్యమున్ను గలవు. యీ నాలుగు మహా వాక్యములే నాలుగు వేదములు గనుక, ఆ వేదములను ఆధారము చేసుకుని, నాలుగు మహా వాక్యములను నిర్ణయించి జీవేశ్వర ఏక పద్ధతి అధిష్టాన చేతన బ్రహ్మమే యని తెలియుటకు తొలుత

ఋగ్వేదమందు 'ప్రజ్ఞానం బ్రహ్మ' యను సాక్షాత్కార వాక్యమును నిరూపించి దీనిచేత అనుభవము కలుగనందున, యజుర్వేద వాక్యమగు 'అహం బ్రహ్మాస్మి' యను మహా వాక్యముచేత అనుభవమును చూపి ఆ పద్ధతి చక్కగా తెలియుటకు మూడవది యగు సామ వేదమందలి 'తత్త్వమసి' యను మహా వాక్యము లక్షణత్రయము యనగా, జహల్లక్షణ, అజహల్లక్షణ, జహదజహల్లక్షణ యను మూడు లక్షణముల చేత ఉపదేశ క్రమము తెలిసి అదే సంపూర్ణమని సమాప్తి పొందుటకు అధర్వణ వేదమందు 'అయమాత్మ' బ్రహ్మయను మహా వాక్యము నిర్ణయించి శ్రవణ, మనన నిధి ధ్యాసలద్వారా బ్రహ్మము నొందగలరని నిర్ణయించి యున్నారు. గనుక, వేదాంతులకు సాధన చతుష్టయము బాహ్య సాధనములు, శ్రవణాదులు అంతర సాధనములని నిర్ణయము.

వేదాంతమునందు నిర్ణయించిన అధ్యారోపాపవాదము, రజ్జుసర్పదృష్టాంతము శ్రవణాదులు అపవాద పద్ధతులని వేదాంతము వాచ్యార్థమని, వార్తీకము లక్ష్యార్థమని వార్తీకాదులు నిర్ణయించినారు.

శ్లో॥ నిత్య నిరంతర నిష్ప్రపం చాద్వయ
మార్తాండా ఖండైక రసబ్రహ్మంబునందు.

కాలత్రయంబులు, కాలత్రయంబుల తోడ మాయా ప్రపంచమును, మాయా ప్రపంచమును అంధకారమును, కలుగజేయ కూడదు. కలుగజేసి అది లేనట్లుగా శ్రవణాదులు కూడదు. తానైన బ్రహ్మమును నిధి ధ్యాసము చేయుట యెట్లు ? నిరంతరము సమాధి సహజమైయుండగా ఒకప్పుడు సమాధినుండి అనుభవించుట యెట్లు ? కావున, శ్రవణముచే కూడుకున్న వేదాంతము వాచ్యార్థమని, శ్రవణాది రహిత పద్ధతిని నిర్ణయించిన వార్తీకము లక్ష్యార్థమని నిర్ణయించినారు.

లక్ష్యార్థకమగు వార్తీక పద్ధతి నిర్వసనా మౌనముద్ర, నిష్ఠ సదా స్వభావికముగా అనుభవమయ్యే యుండునని వారి నిర్ణయము. ఈ నిర్వాసనా నిష్ఠ పూర్వమనుభవముగా మౌన ముద్రచేత దక్షిణామూర్తి సనకాదులకు అనుగ్రహించిరని వేదాంత తత్వమునకు మించిన నిష్ఠ వార్తీక పద్ధతి గనుక వేదాంత నిష్ఠాపరుడే దీనికధికారి యితరులు అధికారులుకారు. నిర్వాసనా మౌనముద్ర నిష్ఠ చేత సూచించిన వార్తీక ముద్ర పద్ధతి ఎట్లున్నదనగా,

నీరే ప్రాణాధారమను నిర్ణయానుసారము నీటియందు మునిగి జల సమాధి పొందిన వారిప్రాణము పరమాత్మ యగునని నిర్ణయించుకొని నీట మునిగిన వారి

ప్రాణము ఉక్కిరి బిక్కిరి పొంది తాను యేమౌచున్నాననో పద్ధతి తెలియక అగోచర పద్ధతిలో యెట్లు మరణము పొందుచున్నాడో అటువంటి పద్ధతే యీ వార్తీక నిష్ఠయందున్న దని తెలుసుకొని.

నిర్వాసనా మౌనముద్ర నిష్ఠచేత సూచించిన వార్తీక నిష్ఠవలన తననిర్ణయము తనకు తెలియక అగోచరపరుడై జన్మ రహితము కాబోదని తెలుసుకున్న వాడు పరిపూర్ణ బోధ వినుటకు లక్షణయుతుడని చెప్పబడును. మరియు.

నరనారాయణు లనబడు శ్రీకృష్ణార్జునులలో శిష్యుడగు అర్జునుడు గురువగు కృష్ణమూర్తితో మనవి జేసినది 'శిష్యస్తేహం శాదిమాంత్వాం ప్రపన్నం'- నీకు నేను శిష్యుడను ఆ కారణము వలన నిన్ను శరణు నొందిన నన్ను శాసించుము. అనగా, నే నెట్లు నడచుకోవలెనో దానిని నియమింపుము. అని ప్రార్థించి తన కర్తృత్వమును విడిచి ఉన్నందున గురువగు శ్రీకృష్ణుడు రథ సారథిగా నుండి సర్వము యొనర్చి యున్నాడు. అట్లు

పరిపూర్ణ గురుని ఆశ్రయించిన వారు విద్యావంతులుగా నున్నను, విద్య లేనివారలుగా నున్నను, తమ కర్తృత్వము వదలి గురుభక్తి గురుసేవ గురు నిష్టయందు త్రికరణ శుద్ధిగా ప్రవర్తించు వారు పరిపూర్ణ బోధ వినుటకు లక్షణ యుతులని నిర్ణయము.

ఈ ఉభయులకే పరిపూర్ణ నిర్ణయము అనగా ఉన్నది పరిపూర్ణము లేనిది యెఱుక యని యెఱుకను విడిచే పద్ధతి తెలియగలదు. యితరులు యే పద్ధతిగల వారైనా, అది వారికి కలలోని వార్తగా నుండును.

శి॥ తప్పక వినవలయుననగా యేమి ?

గు॥ సిద్ధాంత పద్ధతగు పరిపూర్ణ ప్రబోధయందు ముఖ్య నిర్ణయములు మూడే. (1) అచల పరిపూర్ణము (2) ఎఱుక (3) ఎఱుకను విడుచుట, యీ మూటి విషయము ఏకాంతనో విని వినకుండుట అనే పద్ధతి గాక ఆ మూటి విషయము అనగా పరిపూర్ణమనగా యేది ఎరుకనగా ఎటువంటిది. ఎఱుకను విడిచే విధానము యెట్లు. అను వివరము వస్తు నిశ్చయముగా తెలుసుకున్న వారలకు, ఎప్పుడో జన్మ రహితము కాగలదను అంధ విశ్వాసము గాక ఆ పద్ధతి విన్నప్పుడే జన్మ లేకుండా పోవును అనగా

వార్తీక నిర్ణయ పద్ధతియందు, తన నిర్ణయము తనకు తెలియలేని అగోచర స్థితి తెలిసి పరిపూర్ణ గురుమూర్తి వలన పరిపూర్ణ పరబ్రహ్మమును, ఎఱుకను,

ఎఱుకను విడిచే విధానమును ఎప్పుడు ఎవ్వరు విని కనియెదరో అప్పుడే వారి జన్మ రహిత మగును గనుక, లక్షణయుతమై వినవలెనని నేను చదివెదను వినండి. లేక పరిశీలించుటకు యిష్టమున్న వారు గ్రంథమును మీరే పరిశీలించు డని సభా విజ్ఞాపన చేయనైనది.

## (గ్రంథ శ్రవణాధికారులు)

(౨) వినవలెనని కనవలెనని । మనసందున కోర్కెగల్లు । మనుజులే వినుడీ । వినజేసెద కనజేసెద । ఘనమగు యీబోధ విన । కన నొల్ల నట్టి । మనుజులు చను డొవ్విన త్రోవ బట్టీ తినుమంటె పులివల్లదనిలోకులన వింటి । గనుకానె వినవాలెనన నోరాడదు విన। కన నొల్లనట్టి । మనుజులు చను డొవ్విన త్రోవబట్టి ॥

జనన మరణ ప్రవాహమును ఇనికింప జేయునట్టి పరిపూర్ణ బోధ విన వలయునని జనన మరణములు లేని అశరీర విధానము కనవలయునని మన సందున కోరిక గల మనుజులకే యీ గొప్పదైన పరిపూర్ణ మార్గము వినజేసెద. జనన మరణ రహిత అశరీరపద్ధతి కనజేసెద. జనన మరణములు లేకుండా పోవు ప్రబోధ వినుటకు జనన మరణములులేని అశరీర పద్ధతి కనుటకు యిష్టములేని వారు జనన మరణ ప్రవాహమునందు యే కర్మానుభవమునకు వచ్చినారో ఆ కర్మ మార్గము ననుసరించి వెళ్ళవచ్చును. ఎందుకనగా, తినుమంటె పులి వొల్లదను సామెత లోకమున వాడుకలో నున్నది; ఆ పద్ధతి తెలిసిన నేను యీ మార్గము మీరు వినవలయునని నొక్కి చెప్పుటకు నా మనస్సు వొప్పుట లేదు.

శి॥ జనన మరణ రహిత పద్ధతి వినుటకు యిష్టము వుండని వారు యెవ్వరు ?

గు॥ ఒక మనుజుడు యేదైన నొక కార్యము చేయవలెననియెడి కోరికను కొనసాగించుటకు మనోవృత్తియు ఫలమును కావలయును.

మనోవృత్తియనగా, అంతర త్రిపుటులు, మధ్యత్రిపుటులు, బాహ్యత్రిపుటులు యని మూడు విధంబులు.

1. అంతర త్రిపుటులనగా అంతరేంద్రియములు
   జ్ఞాతృ : తెలుసు కొనునది, తెలివి, తెలియబడునది
   మనస్సు : సంకల్పించునది, సంకల్పము, సంకల్పింపబడునది.
   బుద్ధి : నిశ్చయించునది, నిశ్చయము, నిశ్చయింపబడునది.

చిత్తము : చంచలించునది, చంచలము, చంచలింపబడునది.
అహంకారము : అభిమానించునది, అభిమానము, అభిమానింపబడునది.

2. మధ్య త్రిపుటులనగా జ్ఞానేంద్రియములు.
శ్రోత్రము : వినునది, వినికిడి, వినబడునది.
త్వక్కు : స్పృశించునది, స్పర్శము, స్పృశింపబడునది.
చక్షువు : చూచునది, చూపు. చూపబడునది.
జిహ్వ : రసముల నెరుగునది/ రసము/ రసము కలది.
ఘ్రాణము : వాసన చూచునది/ వాసన/ వాసన కలది.

3. బాహ్య త్రిపుటులనగా కర్మేంద్రియములు :
వాక్కు : పలుకునది, పలుకు, పలుకబడినది.
పాణి : ఇచ్చునది, ఈవి, యీయబడినది.
పాదము : నడుచునది, నడక, నడుపబడినది.
గుహ్యము : ఆనందించునది, ఆనందము, ఆనందింపజేయునది.
పాయువు : విడుచునది, విడుపు విడువబడినది.

యీ వృత్తులన్నియు యేలుక యను అంతఃకరణ వృత్తియందు పుట్టుచు, పెరుగుచు గిట్టుచుండును. దరిద్రుని నుండి చక్రవర్తి వరకు, భక్తుని నుండి బ్రహ్మవేత్త వరకు త్రిపుటలయందే భ్రాంతి కలిగియుందురు. కాని వాటి ఫలములను అణచి, జనన మరణ రహిత పద్ధతి వినుటకు ప్రథమ సాధనము త్రికరణ శుద్ధి ప్రవర్తన కావలయును. త్రికరణశుద్ధి యనగా, తనువున వాక్కున మనసున పని యేకముగా జరుపునటువంటిది. (దీనివిశేష విమర్శన తెలుసుకొనగోరువారు పీఠాధిపతులచే రచియింపబడిన సాంప్రదాయక పరిపూర్ణ ప్రబోధమును చూచేది) యిటువంటి ప్రవర్తన భ్రమసహితులగు వారలకు యిష్టము వుండదు. ఒకవేళ వినవలెనని కోరిక కలిగినా, త్రికరణశుద్ధి ప్రవర్తనగా ప్రవర్తించి దానియందు గల అమృత పద్ధతి, అనగా మృత్యుభీతి లేని పద్ధతి కనవలయుననే నిర్ణయము వుండదు. గనుక వీరలు జనన మరణ రహిత ప్రబోధ వినవలయును. అమృత పద్ధతిగల అశరీర నిర్ణయము కనవలయునని యిష్టము వుండని వారని నిర్ణయము.

శి॥ తినుమంటె పులివల్లదని సామెత యెందుకు నిర్ణయించినారు ?

గు॥ పులి పక్ష్యాది జంతువుల రక్తమాంసాదులు తినే పద్ధతి గలది. దాని ముందు పంచభక్ష్య పరమాన్నములుపెట్టి తినుమంటె తినక అయిష్టత తెలియ

జేయును. అదే పద్ధతిగా, త్రిపుటి ద్విపుటులలో కర్మలు ఆచరించి దాని ఫలా సక్తి అనుభవించు వారికి త్రికరణ శుద్ధిగా ప్రవర్తించి, కర్తృత్వ రహిత కర్మాచరణ అమృతపద్ధతి తెలిపినసూ, వినకుండా అయిష్టత తెలియజేయుదురని పులి దృష్టాంతము తెలియజేసినారు.

## (గ్రంథకర్త నిస్వార్థము)

(౩.) నను మిము నేగని పుస్తక । మును జేసితి దీన్ని మీరు ముదమున వినుడం । చనుటయు మిము నను మీరలు । కనుగొని వినుపించు మనుట । కల యిట్టి మాటా । బోధను మేల్కగన లేదెన్నోటా । ఘనులార యిటువంటి కలలో ముచ్చటలాడి । గొనకొని మీరు మేల్కొని । మేల్కొల్పుడి నన్ను । కలయిట్టి మాటా । బోధను మేల్కగన లేదెవ్వోటా॥

ఓ మానవులారా ! నన్ను మిమ్ములను నేను చూచి యీ గ్రంథమును రచించినాను. దీనిని మీరు సంతోషముతో వినుమని నేను చెప్పుటయు నన్ను, మిమ్ము మీరలు కనుగొని వినుపించుమనుటయు దృగ్దృశ్య వివేకమని నిర్ణయము పరిపూర్ణ బోధయను మేల్కయందు దీనికి స్థానము లేనందున దృగ్దృశ్య వివేక మనునది కల యని నిర్ణయము గనుక, ఓ ఘనులారా యిటువంటి కలలో ముచ్చటలాడి యత్నముచేసి పరిపూర్ణ బోధ తెలుసుకొని మీరు మేల్కొని నన్ను మేల్కొల్పండి.

## (దృగ్దృశ్య వివేక నిర్ణయము)

దేవ మానవ పశు పక్షి క్రిమికీటకాది సకల చరాచర జంతువులున్ను ఆకాశాది పంచభూతములున్నూ, దేని యందుండి పుట్టునో దేని సత్తా మాత్రము చేత జీవించుచుండునో మరలా మహా ప్రళయంబున సకలము దేనియందు ప్రవేశించి లయించునో ఆ వస్తువే బ్రహ్మ మనబడును.

కేవల జ్ఞానమార్గ వస్తువగు దృక్కే సర్వ దేశ, సర్వ కాల, సర్వ వస్తువుల యందు పరిపూర్ణముగా నిండి (నువ్వుల యందు నూనె రీతిగా) సర్వాధిష్ఠానమై సర్వము తానై సర్వాధారమై వెలుగుచుండుటవల్లనూ, మరియు దాని యందుండే యీ చరాచర జంతుజాలము పుట్టుచు దాని నాశ్రయించుకొని జీవించుచూ మరల మహాప్రళయమున దానియందు ప్రవేశించి లయించుట వల్లనూ, ఆ దృక్కే బ్రహ్మ మనబడును.

ఆ పర బ్రహ్మాయగు దృక్కు యేవిధమైన శరీరములు లేనిది సచ్చిదా నంద స్వరూపమైనది అనగా, సత్తు చిత్తు ఆనందములే స్వరూపములైనది. చూచు నది, చూడబడినది యేకవస్తువే గనుక, దృగ్దృశ్య వివేకమని అధిష్టానచేతన బ్రహ్మ మని మత కర్తలు నిర్ణయించినారు. యీ పద్ధతి తెలిసినవారికి జన్మ రహిత మగునని, మానవలోకము భ్రాంతిలో నుంచినారు. దీనికి యీ దిగువ దృష్టాంతము సరిపోవును.

కంసాలి నగలు చేయవలెనని బాని ఆకారము తన అంతఃకరణము యందు నిర్ణయించుకొని దాగలి సుత్తి సానము కుంపటి మొదలగు వస్తువులతో లోహములపైన తన అంతఃకరణములో నిర్ణయించుకొన్న ఆకారము నియమించి ఆనందించిన విధముగా వున్నది కనుక యీ దృగ్దృశ్య వివేక నిర్ణయం సత్తు చిత్తు ఆనందరూప బ్రహ్మము, జనన మరణ పద్ధతిగల ఉపాధి ప్రళయ మొందు నది గాని జనన మరణములు ఉత్పత్తిప్రళయము లు లేని అచల పరిపూర్ణ పర బ్రహ్మముగాదు. గనుక, దృగ్దృశ్య వివేకము కలయని నిర్ణయము.

శి॥ గురువు పరిపూర్ణబోధ తన గురువువద్ద తెలుసుకొని, యెరుక యను కలనుండి మెలుకువజెంది తనను ఆశ్రయించిన శిష్యులను యెరుక యను కల నుండి మేల్కొల్పు పద్ధతి లోకమున ఆచరణలో నున్నది. మీరు మేల్కొని నన్ను మేల్కొల్పుడు ! అనే నిర్ణయమునందు శిష్యుడు ముందు మేల్కొని గురు వును మేల్కొల్పునట్లు తెలియుచున్నది కనుక, యీ నిర్ణయమునకు కారణమేమై యుండును ?

గు॥ సూరిజనులు పరిపూర్ణ గురువు ఆశీర్వాదము పొంది సంకల్ప రహిత పద్ధతిగా నుందురు. ఈ ధర్మ ప్రబోధ మానవలోకమునకు ప్రబోధించుమని గుర్వాజ్ఞ యున్నందున తనను ఆశ్రయించిన శిష్యుని ఆశీర్వదించి జన్మభ్రాంతిని తొలగొంప జేయునట్టి బాధ్యత వహించును యీ బాధ్యత గురువు అంతఃకరణము నందు నూతనముగా యేర్పడును. యీ బాధ్యత యగు ఆవరణము శిష్యుడు భ్రాంతి తొలగినదని తెలియజేసిన తదుపరే గురుని అంతఃకరణము నుండి తొలగి లేకుండా పోవును. శిష్యుడు తన నిర్ణయము తెలియజేయునంత వరకు గురుని అంతఃకరణము నందు శిష్య భ్రాంతి నశించక నిలచియుండి మరణాంత మున గురునికి జన్మకారణమగును. గనుక, శ్లో॥ శిష్యపాపం గురోరపి, యని

నిర్ణయము, గనుక, శిష్యుడు మేల్కొన్న తదుపరే గురువు మేల్కొనును. యీ పద్ధతే, గురుశిష్యోభయ రహితమని, సాంప్రదాయక నిర్ణయము.

## —(ఉపదేశము రెండు విధములు)—

1. మాటలతో ఉపదేశము చేయుట.

2. ఆచరణ ద్వారా ఉపదేశము చేయుట.

**మాటలతో** మనస్సునకు ఉపదేశము జరుగును. మనస్సు ఆ పద్ధతిగా నడుచుకున్న తర్వాత వారి ఆచరణ, పరులకు ఉపదేశమగును. కనుక, ఆరూఢుడైన వానికే శిష్యులను స్వీకరించు అధికారము గలదు. వారే శిష్యులను ముందు మేల్కొల్పి తదుపరి తాము మేల్కొనియెదరు. యీ నిర్ణయము తెలియక.

శ్లో॥ సుశ్రూషాలాభ పూజార్థం యశోఽర్థం వాసరిగ్రహః
శిష్యాణామను కారుణ్యాత్ సజ్ఞేయః శిష్యసంగ్రహః॥

సుశ్రూష పూజ కీర్తి ప్రతిష్ఠల కొఱకు మరియు శిష్యులయందు దయ వలన గాని వారిని సేకరించుట శిష్యసంగ్రహము యని తెలియనగును.

సుశ్రూష, పూజానమస్కార, ప్రతిష్ఠల కొఱకు మరియూ శిష్యుల యందు దయవలన గాని గురువులకు పునర్జన్మ తప్పదు గనుక మీరు మేల్కొని **నన్ను మేల్కొల్పుడని,**

కం॥ దిద్బుతనవు శిష్యువిమవ నొచ్చిన చినమివ్వడనుచు సూహించి భువిన్
యిద్భకము లాడటోకనుచప్పరి యూడించువాన్ని సద్గురువయా ఓ॥

**అని** శ్రీ భాగవత కృష్ణదేశికులవారు నిర్ణయించినారు. కనుక, సాంప్రదాయక ధర్మపద్ధతి ప్రబోధించి వారిని ధర్మప్రవర్తనగల వారినిగా జేయుటకు శిష్యులను స్వీకరించ వలయునుగాని, వారు యొనర్పు, సుశ్రూష, పూజ, కీర్తి ప్రతిష్ఠల కొఱకు శిష్యులను స్వీకరించకూడదు. ప్రతిష్ఠల **కొరకు శిష్యులను** స్వీకరించు వారి ఫలము యీ దిగువ నిర్ణయ పద్ధతిగా నుండును.

## - (శిష్యుని యందలి ప్రేమవలన శివుడు పొందిన ఫలము) -

శివుడు ఉపమన్యుడను శిష్యుని యందలి ప్రేమ వలన సృష్టికర్తయగు బ్రహ్మను వ్యతిరేకముగా తన తపోబలముచే **క్షీరసాగరమును సృజించెను.**

దేవతలు, రాక్షసులు మథింప, దాని నుండి అమృతము, హాలాహలము పుట్టెను. అమృతమును విష్ణుమూర్తి ద్వారా దేవతలు ముందు అందుకొనిరి. అదే పద్ధతిగా హాలాహలము దేవతలే మింగవలయునని దానవులు పట్టుబట్టిరి. అందుకు దేవతలు భయపడి శివుని ప్రార్థించగా శివుడావిషమును మింగి కంఠమందుంచు కొనెను. ఎందుకనగా, విషము గర్భకోశమునకు దిగిన తనకు ప్రాణహాని జరుగును. బైటకు గ్రక్కిన దానవులు బాధింతురని, తన యోగబలముచేత కంఠ స్థానమున నిలిపి యుంచగా దాని గుణ వ్యాపకముచేత శివుని శరీరమున అధిక ముగా వేడికలిగెను అ తాపము అణగుటకు చంద్రుడ్ని, ఆకాశ గంగను శిరము పైన నిలుపుకొని యోగదృష్టియంతా దానియందే నిలిపియున్నాడు. అందువలన, యోగఫలము నశించి కర్మఫలము అధికానుభవములోనికి వచ్చినది గనుక, శిష్యుని యందలి ప్రేమ పద్ధతి వలన గురువు యిటువంటి బాధ ఆచంద్రార్క ముల వరకు అనుభవించగలరని నిర్ణయము గనుక, పరిపూర్ణ ప్రబోధ యెనర్చు గురువులు శిష్యుల యందు కరుణామృత దృష్టి కలిగి యుందురు గాని వారు యొనర్చు సుశ్రూషా పూజాదులయందు భ్రాంతి కలిగి యుండరు.

## (గ్రంథ ఫలము)

(౪) ఒరులొరులు నేను నేనని । యొరులను తన నెన్న డెరుగ । కున్న బయలులో । నరుదెంచి తనను తాగని । పరులను:.ని లెన్సనేను॥ పరులాని యనుచూ । యెరిగే యెరుకే । బయలుండగనుచూ॥ నిరతాము తానెందు నిలువా కుండుటకూనై । విరవిస్తి దిన్నెరుకా వినెనా నిల్వదునేను। పరులాని యనుచూ । యెరిగే యెరుకే బయలులడగనుచూ ।

నేనీవని యెరుగని యచల పరిపూర్ణ పరబాహ్యమునందు నేను-పరులను యెరిగే ద్వంద్వపద్ధతిగల యెరుకవచ్చుచు పోవుచూ తనను-పరులను చూచి తాను సర్వమునకు కారణముగా యున్నందున క్షేమయుక్తమని శాశ్వితమని నిర్ణయించుకొని, తనను ఆశ్రయించుటకు ప్రయత్నించువారు పరులని-శ్రేష్ఠులని ద్వంద్వ పద్ధతిగా వ్యవహరించుచున్నది. అట్టియెరుక అచల పరిపూర్ణ పరబాహ్య మును వుండజాలిన యెరుక యెల్లప్పుడు యెచ్చట కూడా నిల్వకుండా యుండు టకై యీ గ్రంథమును రచియించినాను. యీ బోధను యెరుక తెలిసుకొనిన యెడల నేను-పరులను ద్వంద్వ పద్ధతిమాని తానులేకుండా పోవును.

శి॥ యెరుక తనను తాను చూసుకుని క్షేమయు క్తుని యెట్లు నిర్ణయించు కొనును ?

గు॥ బీజవృక్ష న్యాయమున యే బీజము యొక్క మూలమున యే వృక్షము మొలచుచున్నదో ఆ వృక్షము యొక్క అంతముయందు, ఫలమునందు, ఆ బీజమే యుంటూ వున్నది. అదే పద్ధతిగా.

కం॥ పిండ బ్రహ్మాండంబులు రెండును. యారెంటిలోని రెండహములు, యాఖండములు నాల్గుగూడి, అఖండంబగు యెరుకరూపు గనరా మాతంగ్రి॥ యిదిదెలిపిన ఘనుడే తలిసంగ్రి॥ అను నిర్ణయానుసారము, పిపీలికాది బ్రహ్మ పర్యంతము పరమాత్మ ప్రత్యగాత్మగా సకలోపాధులయందు యెరుకే కార్య కారణ పద్ధతిగా కలిగియున్నానని తననుతాను చూసుకొని నాశనము లేని క్షేమ యు క్తముగ యెరుక తనను తాను నిర్ణయించుకొనును.

శి॥ యెరుకకు పరులనువారు యెవ్వరు ? వారిని కూడా అధికులనుటకు కారణమేమై యుండును ?

గు॥ పిపీలికాది బ్రహ్మపర్యంతరము తానే కారణ కార్యములుగా ఉన్న యెరుక, సత్యా సత్యాన్వేషణ అంతఃకరణ పద్ధతిగల మానవోపాధికి వచ్చి వున్నది వున్నట్లు తెలుసుకొనక మతమనే అభిమానము వలన తాను నిర్గుణమని తన పరిణామరూపము సగుణమని, సగుణసృష్టి యందుగల మానవులు, కర్మ భ క్తి జ్ఞానవై రాగ్య తత్వము ముక్తత్వపద్ధతుల వలన అఖండ యెరుక పద్ధతగు, నిర్గుణత్వము పొందగలమని, నిర్ణయించుకున్న వారు, తనకు పరులని నిర్ణయము తనకు పరులుగా వున్నామని నిర్ణయించుకొని ప్రవ ర్తించుచున్ననూ యెరుకయొక్క ఆస క్తిగలవారే గనుక క్షేమకరులని నిర్ణయము.

శి॥ కారణ కార్యరూపమునవున్న యెరుక సగుణ నిర్గుణములయందు యెచ్చట కూడా నిలువకుండా యెట్లుపోవును ?

గు॥ యెరుక సృష్టియందలి జంగమ జీవులకు తమ తమ వుపాధి నుండి యున్న సహజలక్షణంబులు చీమకు దివ్యజ్ఞానము, కోడికి కాలజ్ఞానము, కుక్కకు బ్రహ్మజ్ఞానము, చేపకు దృష్టిసిద్ధి, తాబేలుకు సంకల్పసిద్ధి, చకోర పక్షికి చంద్ర కిరణములయందుప్రీతి. చాతకపక్షికి మేఘజలమునందుప్రీతి, హంసకు పాలు- నీరు వేరుచేయుశ క్తి. వీటి సృష్టియందే నిర్ణయించి సృష్టించనై నవి. గాని, అవి కర్మ భ క్తి జ్ఞానపద్ధతులు. జపతపాదులు యొనర్చి, వరములు పొంది సంపా

దించుకున్నవి గావు: అదేపద్ధతిగా మానవునికి సత్యాసత్య నిర్ణయపద్ధతి నిర్ణయించుకునే అంతఃకరణ పద్ధతిగలిగి మానవోపాధి సృష్టింపనైనది. యిట్టి జ్ఞానంబున సత్యమగు పరిపూర్ణ పరబాహ్యమును, అసత్యమగు యెరుకను, గురుమూర్తి చేత తెలుసుకొని అసత్యమగు యెరుకను కర్తృత్వరహిత కర్మాచరణద్వారా విడిచే పద్ధతికి మారుగా:

కర్మపద్ధతులగు కర్మసన్యాసము, కర్మఫలత్యాగము:

**భక్తి పద్ధతులగు. ఆర్తి జిజ్ఞాసి, అర్థార్థి, జ్ఞానభక్తియగు, బాహ్యభక్తి అనన్యభక్తి ఏకాంత భక్తి:**

జ్ఞానపద్ధతులగు సాత్వికజ్ఞానము, రాజసజ్ఞానము, తామసజ్ఞానము:

వైరాగ్యపద్ధతులగు అహింస, సత్యము, అస్తేయము, స్త్రీలదలంపి కీర్తింపకుండుట తద్భాషణములు వినకుండుట, గుహ్యభాషణములుచేయ నుద్యోగింపకుండుట. స్త్రీలను గూర్చి స్తోత్రము జేయకుండుట, సంభోగమున కుపక్రమించకుండుట:

**తత్వపద్ధతులగు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృధ్వి,** శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము, శబ్ద స్పర్శ, రూప, రస, గంధము, వాక్కు, పాణి, పాద, గుహ్య, గుదము, మనస్సు, బుద్ధి, చిత్తము, **అహంకారము, జీవుడు ఈశ్వరుడు, పరమాత్మ:**

ముముక్షత్వము అనగా సగుణత్వము విడిచి నిర్గుణత్వము పొందవలయుననే యిచ్ఛయందు గుర్తునిల్పి యుండును. మరియు నీవు నేనుయను ద్వంద్వ పద్ధతిగల యెరుక, సగుణపద్ధతి గలదేగాని, **నిర్గుణపద్ధతి ఏకాలమునందు, యేదేశమునందులేదు** ఎట్లనగా.

జగత్కారణ బ్రహ్మమగు యెరుక సర్వశక్తి స్వరూపము సర్వవ్యాప్తముగా నుండగా, కొందరు మతకర్తలు నిర్గుణమని చెప్పుచున్నారు. యీ మతకర్తల లక్షణములు ప్రపంచములో యింతకన్నా అర్థములేని మాటలు, మరికన **బడవు**. ఏలననగా గుణములేని బ్రహ్మం గుణములతో జేరిన ప్రపంచమునకు **కారణమెట్లగును. అయితే:**

1. శుక్తిరజిత భ్రాంతివలె బ్రహ్మము ప్రపంచమునకు వివర్తోపాదాన **కారణమని వారుచెప్పుదురు అప్పటికీ**, బ్రహ్మమునకు, భ్రమగలిగినదని యొప్పవలెను భ్రమ యొప్పితే గుణము కలిగెను.

2. ఘటమునకు కులాలునివలె ప్రపంచమునకు బ్రహ్మము **నిమిత్త**కారణ మని యందురు **అపక్షములో**, ద్వైతము వచ్చును. కావున. ప్రపంచమునకు, బ్రహ్మము పరిణామోపదాన కారణమనియే జెప్పవలయును.

కావున, గుణములతో జేరిన ప్రపంచమునకు, గుణములతో జేరిన (బ్రహ్మము) యొరుకనే కారణము గావలయును. బ్రహ్మము గుణములు లేనిదని నిర్గుణవాదులు చెప్పుచున్నారంటే, బ్రహ్మము సజాతీయ, విజాతీయ, స్వగత భేదములు లేనిదని వారి సిద్ధాంతము మరియు, జగత్సృష్టి పాలనాదులకు, హేతువులైన సర్వశక్తి సంకల్ప క్రియాదయాది గుణములు కూడా ఆ బ్రహ్మము నకు **లేవని** జెప్పుచున్నారు.

1. సజాతీయ భేదమనగా, బ్రహ్మమునకు సమానజాతియైన చిత్తులు.
2. విజాతీయ భేదమనగా, బ్రహ్మముకన్నా భిన్నజాతులైన చిత్తులు.
3. స్వగత భేదమనగా, బ్రహ్మమునందున్న సంకల్పాది గుణములు.

యిట్టివి బ్రహ్మమునందు లేవని చెప్పుచున్నారు.

వస్తు నిశ్చయముగా విచారించి చూచిన యేపదార్థము గుణ విశిష్టము గానిది లేదు. యే పదార్థంబును, గుణాశ్రయముగా నుండునేగాని. గుణాశ్రయము లేనిదిగాదు ఎట్లనగా, పృధ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశములు గంధ, రసరూప శబ్దాదిగుణములు, క్రమముగా లేకపుండవు. జీవేశ్వరులున్నచో కించి జ్ఞత్వ సర్వజ్ఞత్వాది గుణవిశిష్టులనియే నిర్గుణవాదులే చెప్పుచున్నారు.

పరబ్రహ్మ మనినచో సంకల్ప పూర్వక జగత్సృష్ట్యాది గుణములు లేకయే జగత్కారణ మెట్లగును అయితే: బ్రహ్మమునకు స్వసంకల్పమువలన జగత్సృష్ట్యా దులు గలుగలేదు. మాయా విద్యోపాదులచేత, నవచ్ఛిన్నుడై యీశ్వరత్వ జీవత్వాదులు గలిగి, నియామక, నియమ్యాది భావములు కలుగుచున్నవని జెప్పు చున్నారు.

సజాతీయ, విజాతీయ, స్వగతభేదములు, బ్రహ్మమునకు లేవని చెప్పు చును పైన జెప్పిన విజాతీయ భేదోపాదులవలన బ్రహ్మమునకు యీశ్వరత్వ జీవత్వాదులు గలుగుచున్నవనుట యిది యెట్టివిరోధమో విచారించి చూడుడు: అట్లయితే, బ్రహ్మము సర్వోపాధి వినిర్ముక్తుడని వారు చెప్పే దానికి భంగము కలుగును.

అయితే యీ బ్రహ్మమునకు, పైనజెప్పిన ఉపాధులు వాస్తవములు గావనియూ, రజ్జు సర్ప భ్రాంతివలె అధ్యారోపితములనియు, యిందువలన బ్రహ్మము ప్రపంచమునకు వివర్తోపాదాన కారణమనియు చెప్పుచున్నారు.

ఆ పక్షములో, భ్రమించువాడు, భ్రమాధార రజ్జువు, పూర్వము చూడ బడిన సర్పము భ్రమజనకదోషము యిన్నిలేక భ్రమకలుగదు. జగద్భ్రమ స్థల ములలో కూడా యిట్టి సామగ్రి యుండవలెను. యిన్నివుంటే, విజాతీయ భేదము కలిగి ద్వైతము సిద్ధించును.

మరియూ, బ్రహ్మమునందు బ్రహ్మమునకే భ్రమకలిగినదంటే అవ్యక్తమై, నిర్గుణమైన బ్రహ్మమునకు, తనయందే తనకు భ్రమ యెట్లు కలుగును ?

మరియూ, ముందు ఉపాధికలిగి అందువలన వెనుక భ్రమకలిగినదంటే ఉపాధియను ద్వితీయ పదార్థమును ఒప్పవలయును. లేక భ్రమకలుగుటయే ఉపాధియని యంటే సత్యజ్ఞానానంద స్వరూపమని వారిచే చెప్పబడే బ్రహ్మము నకు భ్రమ యెట్లుకలిగె?

అయితే, భ్రమ మాయవలన కలుగుచున్నది. మాయ మిథ్యభూతముగాన ద్వైతముగానీ యదని నిర్గుణవాదులు జెప్పుచున్నారు:

మిథ్యయనగా యసత్యమనియు, అందువలన మాయాకార్యమైన జగత్తు అసత్యమనియూ వీరే జెప్పుచున్నారు. యిందువలననే, శ్రు॥ బ్రహ్మ సత్యం జగన్మి థ్యయని వారి సిద్ధాంతము, బ్రహ్మము సత్యమగుట చేత, త్రైకాలకాబాధ్యత్వము చెప్పవలసినది మాయా విద్యాదులసత్యములగుటచేత త్రైకాలక బాధ్యత్వము నొప్పవలసియున్నది. యిట్టి సత్యప్రతిబంధియై వంధ్యాపుత్రతుల్యమైన మాయ యెప్పుడునూ లేనిదే ఆయెను. దీనివలన, త్రికాలములయందు, ఏకముగాను, నిర్గుణముగాను, నిర్విశేషముగాను, నిర్వికారముగాను నద్వితీయముగాను, ఉండు సత్పదార్థమునకు, ఉపాధి యెట్లు గలిగె? యిట్లుండగా బ్రహ్మము నిర్గుణమనుట యెట్లు ! పైగుణములు బ్రహ్మమునకు గలుగవంటారా ? మోక్షమనునది యేమిటి ?

కాబట్టి వీరు చెప్పెడు దృష్టాంత ద్రాష్టాంతములచేతను, యుక్తులచేతను, బ్రహ్మము సగుణమేగాని, నిర్గుణమని తెలియగాలేదు.

దీనికి పర్యాయముగా బ్రహ్మము లక్ష్యార్థముచేత సిద్ధించునుగాని వాచ్యా ర్థముచేత సిద్ధింపదని వారు చెప్పుచున్నారు.

ఎపదముగాని వాచ్యార్థమును బొత్తిగా విడిచి కేవల లక్ష్యార్థమును, ఎచ్చ టను బోధింపజాలదు అట్లు బోధించునెడల వాచ్యార్థమును గలిపి యేల చెప్ప వలయును, యిందుకు యిదె నిదర్శనము.

బ్రహ్మము సత్యజ్ఞానానంద స్వరూపమని వారేచెప్పుచున్నారు. యిందు వలననే బ్రహ్మము గుణవిశిష్టమని 'ఎరుకొక్కటుండె నేనియు, ఎరుకే యీ విశ్వ రూపమేర్పడ దాల్చున్' యని తెలియుచున్నది.

ఎట్లనగా సత్యమనగా త్రికాలములలో బాధితముగానిది అట్టి త్రికాలా బాధ్యముకలది, జ్ఞానమనగా తెలివి. అట్టి తెలివిగలది, ఆనంద మనగా సుఖము; అట్టిసుఖము గలదని చెప్పవలయును, యిందులో బ్రహ్మమునకు ముఖ్యలక్షణము జడవ్యావృతి, నిమిత్తము, జ్ఞానస్వరూప మనియును చెప్పుచున్నారు.

జ్ఞానమనగా తెలివి. యిది జ్ఞాతృ, జ్ఞానజ్ఞేయములు మూడులేక యేర్ప డదు, ఎట్లన, జ్ఞాత-తెలుసుకొనువాడు, జ్ఞానము-తెలివి, జ్ఞేయము తెలియదగిన పదార్థము, యీ మూడులేని జ్ఞానమనునది సిద్ధింపదు,

యిందువలన, బ్రహ్మము జ్ఞానస్వరూపమనుటలోని మూడు పదార్థము లుండవలసినట్లు, యేర్పడుచున్నది గావున జ్ఞానమనునదియు బ్రహ్మమునకు గుణముగానే యేర్పడుచున్నది గనుక.

కం॥ జ్ఞానము నేనన నొక్కటె జ్ఞానమునే పేరుంచు కనలేకుము
జ్ఞానము చొచ్చుమ పోవును జ్ఞానాతీతమును తామగాంచిన దాకన్ ॥

అను న్యాయమున పిపీలికాది బ్రహ్మపర్యంతరము సర్వము గుణసద్ధతి గలదే గాని నిర్గుణమనునది లేనేలేదు గుణపద్ధతగు జ్ఞానముచే యొనర్చు కర్మ భక్తి జ్ఞాన వైరాగ్యాదులు వాటిద్వారా కలిగే మోక్షఫలంబులు కర్మ జన్యంబులు గనుక అనేక జన్మంబులకు కారణమగును అందువలన, జ్ఞానమును యెరుక. కల యని నిర్ణయము.

ఎరుకయను కల అచలపరిపూర్ణ పరబయలువున్న విధానము తెలుసుకున్న యెడల, కర్మ భక్తి జ్ఞానవైరాగ్యతత్త్వము ముక్తత్వపద్ధతుల యందలి ఫలం బుల భ్రాంతిజెంది, ఆయాస్థానములయందు నివాసమొనర్చుకొని నేను పుణ్యా త్ముడను, నీవు పాపాత్ముడవు నేను జ్ఞానిని. నీవు అజ్ఞానివి యన ద్వంద్వ పద్ధతిగా వ్యవహరించే యెరుక నిల్వకుండా పోవును.

నీవు పాపాత్ముడవు నేను జ్ఞానిని, నీవు అజ్ఞానివి యని ద్వంద్వ పద్ధతిగా వ్యవహ రించే యెరుక నిల్వకుండా పోవును.

## (సృష్టి కారణం)

(ప) ఎరుకను కలలోపలనే। నరుదెంచితి మీరలట్ల । యరుదెంచితిరీ । యెరుకజన నేను మీరలు । యెరుకతో జనువార మనుచు । యెరిగేటి కొరకూ । గ్రంథముజే స్తినెరిగి యీవరకూ । గురుబోధంచను పేల్కు । నరులార చేకొంటిె॥ యెరుకానె కలజోలి నెరిగున్న నిల్వదం । చెరిగేటి కొరకూ । గ్రంథము జే స్తి॥ నెరిగి యీవరకూ ॥

నే-నీ వని ద్వంద్వ పద్ధతిగా వ్యవహరించే యెరుకయనే కలలోపల నేను వొచ్చితిని. అట్లే మీరు వొచ్చితిరి యెరుకపోయిన యెడల నేనూ, మీరూ యెరు కతో పోయేవారమని, నేను తెలుసుకున్నాను. అట్లే మీరు తెలుసుకొనుటకు యీ గ్రంథమును రచించినాను. గురుబోధయనెడి అచలపరిపూర్ణ పద్ధతియగు మెలు కువ మీరు తెలుసుకుంటే యెరుకయను కల సంబంధము యెరుగుచున్ననూ నిల్వడని మీకు తెలియును.

శి॥ యెరుకయను కలలోపల నేను యెట్లువచ్చుచున్నాను.

గు॥ ఎరుకైన భూతములు నీవెరుగుము, అనగా. ఆకాశాధికము యగు కూటస్థుడు ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి, ఓషధులు. అన్నము

శ్లో॥ అన్నాత్తేజో మనః ప్రాణ ః చక్షుశ్శ్రోత్రం
యశోబలం । ధృతిశ్శృతి తథాశుక్లం ॥

అనగా, అన్నమువలన తేజస్సు, ప్రాణము, కన్ను, చెవి, కీర్తి, బలము, ధైర్యము, శృతి నిర్ణయజ్ఞానము, ఉత్పత్తికి కారణమగు శుక్లము, కలుగుచున్నవి. గనుక, యీ సర్వమునకు ఎరుకనే కారణము గనుక, నేను మీరు, ఎరుకయను కలలోపల వొస్తూయున్నాము.

శి॥ ఎరుకజన నేను, మీరు యెరుకతో జనునట్లు యెట్లు తెలియును ?

గు॥ వేదము విద్ అను ధాతువునుండి పుట్టినది విద్ అనగా ప్రకాశము. ఎరుక, జ్ఞానమని నిర్ణయము, యీ వేదమును, శృతి ఆమ్నాయ. మని చెప్పట కలదు.

'శ్రూయత ఇతిశ్శృతి.' అనగా, శ్రోత్రేంద్రియములచే శబ్దరూపముగా తెలియబడుటను బట్టి శృతియనియూ జెప్పబడెను. 'ఆమ్నాయ' అనగా వల్లిం చుటయని యర్థము.

'వేద ఇతీతివేదః'-తెలియజేయునది గాన వేదమని చెప్పబడును. యీ వేదశబ్ద నిష్పత్తి యెట్లనగా, 'విదంతియతో ధర్మాధర్మమితి వేదః'-అనగా దీని సహాయము వలన ధర్మాధర్మములు తెలియబడును గనుక, యీ వేదము కర్మ కాండమనియు, ఉపాసనాకాండమనియూ, జ్ఞానకాండమనియు మూడుభాగము లుగా నున్నది.

1. కర్మకాండము :- ఇహపరసుఖములకు దగిన కర్మానుష్ఠానములను, జేయువద్ధతులను, అశ్వమేధము, వాజపేయము, మొదలగు యజ్ఞముల చేయు విధములును అవి చేయుట వలన కలుగు ఫలములను బోధించును.

2. ఉపాసనాకాండము :- పరమేశ్వరునియందు భక్తిచేయు విధమును, అట్లు భక్తిచేయు వారికి కలుగు ఫలమును బోధించును.

3. జ్ఞానకాండము :- తత్త్వజ్ఞానము వలన బ్రహ్మజ్ఞానము పొందు మార్గ మును, అందువలన కలుగు ప్రయోజనమును బోధించును.

'ముడివడి కర్మజ్ఞానము విడువక నారెంపువెలసె, విశ్వమన నదే' యను న్యాయమున కర్మ, యోగ జ్ఞానపద్ధతులయందు భ్రాంతిగలవారు, వాటి ఫలంబుల నిర్ణయానుసారము గుర్తు గలిగి ఆయాలోకములకువెళ్ళి

శ్లో॥ క్షీణే పుణ్యే మర్త్యలోకంవిశంతియను, న్యాయమున జన్మాదులు పొందుచుందురు. యెవరు యేకర్మ ఆచరించెదరో ఆఫలగుర్తువలన ఆలోకము లకు వెళ్ళెదరు.

గురుబోధయను అచలపరిపూర్ణ మెలుకువ తెలుసుకుంటే యెరుకయను కల యందలి జనన మరణంబులు తెలియుచున్నను అవి మాయందు తెలియవని మీకు తెలియును.

## (అచలబోధ సాంప్రదాయక గురుస్తోత్రవము)

(౽) శ్రీమించు నచలబోధను । యేమహానీయుండు । జేసియెగజల్లెనో యీ భూమిన్ సుజనులకొరకా । రాముడుగన్వయజ శివ । రామాదీక్షితులన్ । తలవి యప్పారావ్ । గుణతతులన్ । ప్రేమాతో బొగడినే భూమ నిర్జరు వరకు॥ రామా సీతారామ స్వామికి మ్రొక్కి । శివరామదీక్షితులన్ । తలవి యప్పారావ్ గుణ తతులన్॥

శ్రీని మించిన యచలబోధను శివరామ దీక్షితీయ మను బృహద్వాశిష్ట ముగా రచించి మానవులందలి సుజన బృందమునకు యెగజల్లినారో అనగా

వ్యాపింప జేసినారో అట్టి శ్రీమద్రామడుగు శివరామ దీక్షితులవారిని మనంబున దలంచి వారి శిష్యుండగు కంబాలూరి అప్పారావుగారిని వినుతించి వారిశిష్యుడు పృధ్వియందు పావుపుట్టుకలు లేనటువంటి పరశురామ సీతారామస్వామికి సాష్టాంగ నమస్కారము చేసినానని భావము.

శి॥ శ్రీ యనగా యేమి? శ్రీనిమించిన అచలబోధ మనగా యెటువంటిది ?

గు॥ శ్రీ యనగా ఐశ్వర్యము సంపద యని యర్థము. ఐశ్వర్యమనగా- అణిమాదులు-అవి యెనిమిది :-

1) అణిమ 2) మహిమ, 3) గరిమ, 4) లఘిమ, 5) ప్రాప్తి, 6) ప్రాకామ్యము, 7) ఈశత్వము 8) వశిత్వము. యీ యెనిమిదిన్ని అష్ట సిద్ధులని చెప్పబడును.

1. అణిమ యనగా - అణుప్రమాణులైన ప్రాణులయందు పరమాణు ప్రమాణులై యుండుట.
2. మహిమ యనగా-బ్రహ్మ, విష్ణు, రుద్ర, సదాశివ విరాట్ పురుషాండ ములకంటె పెద్దవాడై యుండుట.
3. గరిమ యనగా - బ్రహ్మాండములకంటె భారమై యుండుట.
4. లఘిమ యనగా-మేరువంతటి బరువు గలిగియుండి దూది లేశము వలె తేలికై యుండుట,
5. ప్రాప్తి యనగా - యిష్టపదార్థమును లభింప జేసికొనుట.
6. ప్రాకామ్యమనగా-గగన గమనాది సిద్ధి.
7. ఈశ్వరత్వమనగా-సూర్య, చంద్ర, మహేంద్ర, అగ్ని, ప్రముఖ దేవతలను పనులలో నియమించుట.
8. వశిత్వమనగా-సకల జంతువులను వశము జేసికొనుట.

యీ అష్టసిద్ధులు ఐశ్వర్యమని చెప్పబడును.

సంపదయనగా-సాధనచతుష్టయ సంపత్తి వలన కలుగుఫలము.

1. సాధన యనగా, నిత్యానిత్య వివేకము, ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము, శమాది షట్కసంపత్తి, ముముక్షత్వము, యను సాధనలు కలిగి వేదాంతమగు మహావాక్య నిర్ణయము, వార్తీక నిర్ణయము, తెలుసుకొను పద్ధతి సంపదయని నిర్ణయము, అణిమాది అష్టసిద్ధులగు ఐశ్వర్యముల వలన మహావాక్య వార్తీక పద్ధతగు సంపదవలన జనన మరణ రహితమునకు బదులు జన్మ

భ్రాంతి అధికమగును, గనుక జనన మరణ భ్రాంతి రహితము శివరామదీక్షి తీయమను బృహద్వాశిష్ఠ పరిపూర్ణావల ప్రబోధవల్లనే కాగలదని శ్రీమింతు నచలబోధయని నిర్ణయము.

## (గ్రంథస్థ విషయము)

(౭) శ్రీమత్సీతారామ । స్వామి కృపచే జెప్పనయ్యె । సదస ద్రహితం । బేమి పదార్థమొ దానిని । యీ మహి కందార్థములుగా ॥ నివి వినరయ్యా । ఓ జనులార యిటుగనరయ్యా । వేమారు నేమిమ్ము వేడెదింతి యనుమ్మి । నామీద కృపజేసి । నను జదువుమని మీర । లివి వినరయ్యా । వో జనులారా యిటుగనరయ్యా ॥

శ్రీమత్సీతా రామస్వాములవారి కృపవలన నాకు చెప్పినట్టి అచల పరి పూర్ణప్రబోధ సదసద్రహితమగునది. ఆ ప్రబోధ భావమును కందార్థములుగా వ్రాసినాను గనుక, ఓ, జనులారా: యీ మార్గమును మీరు గమనించి చూడ వలయును, మాటి మాటికి నేను మిమ్ములను వేడుకోవడము యెందుకనగా, నా మీద దయయుంచి నన్ను చదువుమని మీరు శ్రద్ధగా వినుటకు, యని భావము.

శి॥ సత్-యనగా నేమి? అసత్-యనగా నేమి ? వీటిరహితము నందు గలుగు ఫలమేమి ?

గు॥ "శృ॥ సత్యం జ్ఞానం - అనంతం బ్రహ్మ" అనే న్యాయమున బ్రహ్మము సత్యమైనది, జ్ఞానమైనది. అనంతమైనది. యని నిర్ణయము.

బ్రహ్మము కాలత్రయా బాధ్యమై యుండుట వలన సత్ అనబడును.

ఒక దానిచే తెలియబడక, యితర సహాయము లేక సర్వమును తెలుసు కొనుచు, దీపమువలె స్వయముగా ప్రకాశించుటవలన జ్ఞానమనబడును.

దేశ, కాల, వస్తు పరిచ్ఛేదము లేకుండుట వలన యనంత మనబడును.

బ్రహ్మము తనయందు మాయచే కల్పింపబడిన ఉపాధులలో నుండుటచే బ్రహ్మమునకే కూటస్థుడని, ప్రత్యగాత్మ యని పేరు.

కూటమయిన స్థూల, సూక్ష్మ శరీరములకు అధిష్ఠానమై యుండుటచే బ్రహ్మము కూటస్థుడనబడెను. వాస్తవమున కూటస్థుడు బ్రహ్మయే గావున బ్రహ్మ లక్షణములయిన సత్య, జ్ఞాన, అనంతత్వములు గలిగియున్నాడు.

ఇట్లు గలిగియుండుట, జాగ్రత స్వప్న సుషుప్తులయందు అనుభవమున తెలియనగును. ఆ యవస్థలందు దృశ్యములు సత్యములై తెలియబడునవియై

యున్నవి. వాని నెరుగ సంవిత్తు (తెలివి) సత్య జ్ఞానానంత స్వరూపమైయున్నది. ఆ తెలివియే కూటస్థమై తన్యము. కావున, దేశకాలవస్తు పరిచ్ఛేదములు లేక సత్య జ్ఞానానందము బ్రహ్మమని నిర్ణయము గనుక కాలత్రయా బాధ్యమై యుండుట వలన సత్ అనబడును.

అసత్ అనగా - శ్రు॥ సర్వం వికారజాతం, మాయామాత్రం॰ అనగా బ్రహ్మము భేదత్రయము కానిది. కావున దానికి వ్యతిరిక్తమైన నామ రూపము లతో గూడిన జగత్తంతయు యింద్రజాలము వంటిది గాని వాస్తవము గాదు, 'యామాసామాయా' యేదిలేనిదో యది మాయ యని మాయాశబ్దార్థము, గనుక బ్రహ్మమునకన్నా వ్యతిరేకమైనది. మిథ్య యని అసత్తని నిర్ణయము.

ఆ ఉభయ పద్ధతుల వలన జన్మ భ్రాంతి రహితమునకు బదులు అనేక జన్మంబులు గలుగుటకు కారణమగుచున్నది. వాటి రహితమునందే జన్మభ్రాంతి తొలగునని నేను తెలుసుకున్నాను. ఆ విధానము కందార్థముల రూపమున నిర్ణయించినాను, గనుక నాయందు దయయుంచి విన్ను చదువుమని, యీ విధానము మీరు శ్రద్ధగా వినవలయునవి భావము.

శి॥ యీ భావము యితరులకు చెప్పవలయుననే ప్రాధేయత యీ గ్రంథ కర్తకు యెందుకు, వుండవలయును ?

గు॥ బోధ యందలి నిర్ణయ విధానము తెలుసుకున్నవారు అహం బ్రహ్మాస్మి యను భ్రాంతి తొలగి జనన మరణ భ్రాంతి రహితులగుదురు. వారు తెలుసుకొనకపోయినా తాను తెలుసుకున్న పద్ధతి తనకు దృఢపడును గనుక యితరులను వినుమని ప్రార్థించనైనది.

## (గ్రంథకర్త గురుపరంపరాభి వర్ణనము)

(౮) శివరామ దీక్షితులు। శిష్యవరుం డప్పయ్యమంత్రి। యతని శిషువుడీ। భువి పరశురామ వంశో। ద్భవ సీతారాము లతని॥ భక్తుడ సుమ్మీ। తదోర్ధ ప్రయుక్తుడ సుమ్మీ। స్థవనీయులగు మీరు। త్సాహముతో యీగాధ। వినుండినే కందార్థములచే వినుపింతు। భక్తుడసుమ్మీ। తదోర్ధ ప్రయుక్తుడ సుమ్మీ॥

శివరామ దీక్షితుల శిష్యుడు అప్పయ్య మంత్రి. వారి శిష్యుడు పరశురామ సీతారామ స్వాములు, వారి శిష్యుడను నేను వారి మార్గమగు, అచల పరిపూర్ణ ప్రబోధయందు మిక్కిలి ప్రవేశము కలవాడను, స్థవనీయులైన మీరు పట్టుదలతో యీ బోధను వినండి. కందార్థములచే వినిపింతునని భావము.

## (సుకవి ప్రశంస)

(౯.) మనసిచ్చి వినుడి యికనొక ౹ మనవిని నాపాలి గురుని మదిలోపలనే
నునుచుకొని పెద్దలాజ్ఞను ౹ పనిబూనుకజేస్తి ఇట్టి ౹ పద్యాములన్నీ ౹ తప్పొప్పు
లేర్పడ దిద్దుండన్నీ ౹ ఘన మతిమంతూలు గనుకనే ప్రార్థిస్తి ౹ నసుమీ కటా
క్షేక్షణముల వీక్షింపూచు ౹ పద్యాము లన్నీ ౹ తప్పొప్పు లేర్పడ దిద్దుండన్నీ ॥

సుకవులగు మానవులారా ! నా యొక్క మనవి సావధాన చిత్తులై విన వలెను నా గురువర్యుని హృదయము నందుంచుకొని వారి యాజ్ఞాను సార మీ శక్తి ద్వయ నిరాసంకమైన శుద్ధ నిర్గుణ తత్వ కందార్థములను రచించితిని యిది కథ కాదు, జనన మరణ వ్యధమాన్ను నటువంటి పద్ధతి బుద్ధిమంతులు ఆమూలా గ్రముగా జదివి యిందలి తప్పులు, వొప్పులుగా తెలియునట్లు దిద్దవలయునని మిమ్ములను ప్రార్థించుచున్నాను గావున నన్ను మీ కరుణా కటాక్ష వీక్షణము లచే వీక్షింపుడని భావము.

శి॥ తప్పులను, ఒప్పులుగా యెట్లు దిద్దగలరు ?

గు॥ తాను స్వయముగా రచించిన గ్రంథమునకు, తమనిర్ణయాను సారము స్వతంత్రముగా భావార్థము వ్రాయుటయందు యేలాంటి అభ్యంతరము లుండవు కాని, యితరులు రచించిన గ్రంథమునకు భావార్థము వ్రాయుటకు నిర్ణయించు కొనువారు తమకు వున్న పాండిత్య ప్రతిభ విడచి గ్రంథకర్త యొక్క నిర్ణ యము యీ దిగువ నిర్ణయానుసారము తెలుసుకొని దిద్దవలెను.

1. పద్యము నందలి పదభాగంబులు చరణములు, విడి విడిగా యున్ననూ అధ్యాయములు వేరు వేరుగా అనేక పద్ధతులుగా వున్ననూ గ్రంథ విషయము ప్రతిపాదించుటలో భిన్న స్వరూపము వుండదు. (జనన మరణ భ్రాంతిరహిత విషయము ప్రతిపాదించుటలో భిన్న స్వరూపము వుండదు). విషయ ప్రతిపాద నము కూడా అన్ని అధ్యాయములలో సమముగానే వుండును. పువ్వులతో తయారు చేసిన 'మాల' వేరుచేయుటకు వీలుగానట్లు మరియు దాని సుగంధము వేరుచేయు టకు వీలులేనట్లు అన్ని పుష్పములు కలసి ఒకమాలగానూ, అన్నిటి సుగంధము ఒకే సుగంధము అయిపోవు రీతిగా, గ్రంథము నందలి వాక్యములు, పద్యములు అధ్యాయములు పీఠిక యందలి విషయములు గ్రంథమునకు చేసిన నామకర ణము ఆ విధముగానే విడదీయ రానివిగా ఏకపద్ధతిగా నుండును. గనుక, గ్రంథ కర్త నిర్ణయము ముందుగా తెలుసుకోవలయును.

కవనమునందు ప్రాస, యతి, శబ్దము, గణము, భావము, యుక్తియను షడంగములుండవలెను. అందు యే యంగము లేకున్నా కవనమునకు కొఱతగా యుండునని నిర్ణయము. అయినా మానవ లోకకల్యాణమగు మానవ సౌభ్రాతృత్వమునకు, అన్యోన్య సహకారమునకు, ఐహి కాముష్మిక పురోభివృద్ధికి, అనుకూలమగు గ్రంథ రచనయందు ప్రాస, యతి, శబ్దము, గుణము, సరిపోకున్ననూ భావము యుక్తి సరిపడితే చాలునని ఘనమతిమంతుల నిర్ణయము తెలిసి ప్రాస, యతి, శబ్దము, గణములనునవి తప్పుగా యున్ననూ భావము యుక్తి యను యేక పద్ధతిలో తప్పులను ఒప్పులుగా చేయుడని భావము.

(౧౦) విని మీరివి దిద్దుండని । పనిబడి ప్రార్థించ నేల - పరుసము వినుమి ! ట్లనుచె స్వర్ణము జైమని · తనకై తానౌను సన్ని ! ధానామందుంటే । తెల్పుడి యను ॥ మానామిందుంటే । మనవిజేసుని పాలిమ్మని తేగతల్లికి । తనకై తానిచ్చును దయచేసితా ! సన్నిధానామందుంటే । తెల్పుడి యనుమానా మిం దుంటే ॥

యీ కందార్థములను మీరు విని సరిదిద్దవలయునని ప్రాధేయ పూర్వకముగా పనిబూనుకొని నేను ప్రార్థించ నవసరములేదు. ఎందుకనగా, పరుసవేది సన్నిధినయున్న యినుము నన్ను బంగారము చేయుమని కోరునా, యీ నిర్ణయమునందు యేమైనా అనుమానముంటే విజ్ఞానవంతులు తెలియజేయవచ్చును. యిది యును గాక లేగదూడ పాలిమ్మని తల్లిని కోరక పోయిననూ తన సన్నిధానమందున్న దూడకు దయజేసి ఆవు స్వయముగా పాలిచ్చుచున్నది, అదే పద్ధతిగా నా గురుమూర్తిని అంతఃకరణమున నిలుపుకొని వారి సన్నిధానమునందు యీ గ్రంథమును రచించినాను. అందువలన, సలక్షణముగానే వుండగలదు. దీనిని యితరులు దిద్దవలసిన అవసరము వుండదని భావము.

(౧౧) అప్పకవీ యాద్యాంధ్రము । లొప్పగు మాఘాదికావ్య । మొగి జదివి కృతిన్ । తప్పని కవులకు సమముగ । తప్పులు లేకుండ జెప్ప తరమౌన కృతిని॥ ఈహనుజేస్తి మరినేసీ కృతినీ । గొప్పౌ పక్షులతోటి కొదువా పక్షులుపాటె । కుప్పారవీధిని కూద్యాడెటందూకు । తరమౌన కృతినీ । ఈహనుజేస్తి మరినేసీ కృతినీ॥

అప్పకవీయము మొదలగు నాంధ్రగ్రంథములను, మాఘాది సంస్కృత కావ్యములను చదివి తప్పులు లేకుండా కృతి యొనర్చునట్టి కవులకు సమముగా

కృతి జెప్పుటకు నాతరము గాదు అయినా ఆలోచించి భావము యుక్తికి లోపము లేకుండా కృతి యొనర్చినాను. ఎట్లనగా, ఆకాశమునందు తిరుగాడే పక్షులు చకోర పక్షులు గొప్పవి, ఊర పిచ్చుకలు చిన్నవి యనే నిర్ణయము వ్యక్తిగత ముగా వున్ననూ, ఆకాశము ఏకమే గనుక అందు తిరుగాడే పక్షులు గొప్పవి చిన్నవి అన్నిసమానమే యని భావము.

శి॥ గొప్ప పక్షులతోటి కొదువ పక్షులు యెట్లు సమానమగును ?

గు॥ పక్షులయందు హెచ్చు తగ్గులు యున్నా అవి తిరుగాడేందుకు గగన వీధి యేకమైనట్లు కవనమునందు హెచ్చు తగ్గులుగా యున్నా భావము యుక్తి ఏకముగానే యున్నందున సకల మానవులకు ఫలము సమానముగానే వుండును గనుక ఫలమునందు సర్వులూ సమస్వరూపులని భావము.

(౧౨.) ఛందం బెరుగక పద్యము । లెందుకు జేసెద వటంచు యెంద రనిననే । సందేహింపక జేసితి । నిందుల తప్పుంటె । మీర లివి దిద్దేరనుచూ । నే జదివితే । చెవియొగ్గి వినుచూ । అందముగా చిత్తమందిట్లు తలపోసి । కందార్థ ములను మీ । ముందార వెట్టితి । యివి దిద్దేరనుచూ । నే జదివితె చెవియొగ్గి వినుచూ॥

ఛందోలక్షణము తెలియక పద్యము లెందుకు జేసితివని యెందరన్నప్పటికీ నేను సందేహము లేక జేసితిని, యెందుకనగా యిందులో తప్పులుంటే మీరు దిద్దుదురని నేను చదివితే చెవియొగ్గి విందురని మనమున దలంచి యీ కందార్థ ములను మీముందు వుంచినానని భావము.

శి॥ ఛందోలక్షణము తెలియక పద్యములు చేయవద్దని యెవరన్నప్పటికీ, సందేహము లేకుండా యీ పద్యములు యెట్లు చేసినాడు?

గు॥ గురుమూర్తి ఆజ్ఞానుసారము భావమునకు యుక్తికి యేలాటి దోషము లేకుండా యీ పద్యములను రచించినాడు. అందులో యేలాటి దోషము వుంట దని గ్రంథకర్త యొక్క దృఢనమ్మకము. కనుక, యేలాటి సందేహము లేక పద్య ములను రచించి వారిముందు చదివి తప్పులు వుంటే దిద్దెదరని వారిముందు చదివినానని భావము.

(౧౩.) పునరుక్తి గలిగి యుండిన । విని కోపము జాయవలదు । వేడుకొని యెదన్ । వినువారు చూరపర్థము । గనవలె దగ్గర నటంచు । గల్పించినానూ । తెలియక కాదే । గ్రంథములోనూ । జననీ జనకులు తమ తనయుల పునరుక్తి ।

వినగోరుదురు తప్పంచనకానేనడిదెలిసి । కల్పించినాను । తెలియక కాదీ గ్రంథాములోను॥

యీ కవనమునందు పునరుక్తి దోషము కలదని కోపపడవలదని నేను ప్రార్థించెదను. ఎందుకనగా, వినువారలు గూఢమగు దూరపదార్థములు దగ్గరగా, వివరముగా తెలియుటకు, కల్పించి చెప్పినాను కాని తెలియక కాదు, అయినా, తల్లిదండ్రులు తమ బిడ్డలు పదేపదే పలికెడి పలుకులను తప్పని యెంచక సంతోషముతో వినెదరు. అటువలెనే మీరు వినవలెనని భావము.

శి॥ తల్లిదండ్రులు తమ బిడ్డల మాటలు సంతోషముగా యెందుకు వినెదరు?

గు॥ తమ బిడ్డలు చెప్పినదే మరల చెప్పినచో తల్లిదండ్రులు తప్పని యెంచక సంతోషించుటకు కారణ మేమనగా, చెప్పినమాటనే తిరుగా చెప్పుచున్నందున వాక్యము నందలి విషయమును గ్రహించు చున్నాడని సంతోషము చెందుదురుగాని, చెప్పినది చెప్పినందున దోషమని యెంచరు. ఎందుకనగా, విషయగ్రాహ్యమే ప్రధానము గనుక ఆపద్ధతిగానే గూఢార్థములు హృద్గోచరము అనగా, దగ్గరగా తెలియుటకు చెప్పిన వాక్యము లందు పునరుక్తియున్నా తప్పు యని యెంచబడదు ఎందుకనగా, విషయగోచర మవసరమని భావము.

(౧౪) ఇది యాంధ్ర కవిత్వంబని । మది రోయందగదు దీని మర్మ మరయుడీ । పదియారువన్నె పసిడిని । ముదమున తోల్పెట్టెనుంచ ముట్టాకుండుదురా । లోకులుబాత బట్టాకుండుదురా । యిదిగాక కులహీనుడిచ్చినద్రవ్యాము। విదితాముగా ఎంత వేత్తలైనను దాన్ని । ముట్టాకుండుదురా। లోకులు బాత బట్టకుండుదురా॥

పదారు వన్నెల బంగారము తోలుపెట్టెలో పెట్టినను, నీచమని పాటించక లోకులు గ్రహింతురు అనగా, తీసికొందురు కులహీనులు యిచ్చిన ద్రవ్యమును ఎంతటి వేత్తలైనను పుచ్చుకొందురు అట్లే యిది తెలుగు కావ్యమని విడువక దీనియందలి మర్మము తెలుసుకోవలెనని భావము.

శి॥ తెలుగు కవిత్వమని రోయుటకు కారణమేమై యుండును ?

గు॥ సంస్కృతము దేవభాష, ప్రాకృతము నరభాష జ్ఞానము దేవ భాషయగు సంస్కృతము వల్లనే కలుగును కాని, నరభాషయగు ప్రాకృత భాషవల్ల కలుగదని కొందరు నిర్ణయించుకొన్నారు. అయినా సంస్కృత భాషవలన భాషా జ్ఞానము కలుగును, కాని బ్రహ్మజ్ఞానము కలుగడము లేదు. బ్రహ్మజ్ఞానము

కలుగుటకు గురుప్రబోధ అవసరము. అయినా, సంస్కృత భాషకన్నా, ప్రాకృత భాష ఆబాల గోపాలము అవలీలగా తెలియగలదు సంస్కృతభాష 'రబ్బరు' వంటిది. ఎవ్వరు గట్టిగా లాగితే వారివంక సాగినట్లు, తర్కవ్యాకరణాది నేర్పు గలవారు, యెట్లువ్యాఖ్యానము జేసిన ఆపద్ధతిగా అర్ధముకాగలదు. అందువల్ల నిజ విషయము తెలియదు. ఉన్నది ఉన్నట్లు నిజము తెలియుటకు, ప్రాకృతభాషలే లోకకల్యాణమని నిర్ణయము "తేనె సోకనోరు తీయగ యగునట్లు, తోడనర్థమెల్ల తోయకుండ గూఢశబ్దములను గూర్చిన కావ్యంబు, మూగచెవిటివాని ముచ్చటగును." అని నిర్ణయము గనుక, సంస్కృత భాషకన్నా తెలుగుభాషవే లోక కల్యాణమగునని, పైనత్వక్కు బిరుసుగాయున్నా పనసపండులోని తొనలు రుచిగా యుండునను పద్ధతిన ఆంధ్రభాషయందు రచించ నైనదిగనుక, లక్షణము గ్రహించవలెను గాని భాషాభేదము యెన్నవలదని భావము.

(౧౪.) ఆసాంతము యీ గ్రంథము । ప్రాసయతుల్ శబ్దగణము భావము యుక్తుల్ । జూచి సరిపడని చోటను ! యీ సభలో పెద్దలెల్లా ! యిది దిద్ద వలెనా । దిద్ది యిదే నామది కద్దవలెనా । మీసాటి వారికి వ్యాసాట లేదుంటే నాసాటివారి ప్రత్యేకసాటి గాకుండు నిది దిద్దవలెనా ! దిద్ది యిదే నామది కద్ద వలెనా॥

యీ గ్రంథము కడవరకూ ప్రాస, యతి, శబ్దము, గణము, భావము, యుక్తి, విచారించి సరిపడనిచోటున యీసభలో యుండెడి పెద్దలు దిద్దవలెను. దిద్దనది నామదికి అద్దవలెను మీసాటివారికి శ్రమయనునది యుండదు. వుంటే నాసాటివారిగతి యేసాటిగాక యుండునని భావము.

శి॥ గ్రంథము సరిజూచేవారు గ్రంథకర్త భావము యుక్తిని గ్రహించ నిదే దిద్దగలరా ?

గు॥ "పొంకపుగావ్య లక్షణము పోకచెలుంగక దిట్టతూకమై
క్రొంకక వంకటర్థములు గూర్చి సభాస్థలి ప్రౌఢులట్లు ని
శ్శంక జరింపుమన్ సుకవిసంఘము పల్కుల మెచ్చతూరికే
యంతము పేయవచ్చు నలయయ్యల మున్నుగ ప్రస్తుతించెదన్.

అను నిర్ణయమున మీరు దిద్దినది నామది కద్దవలయునని హెచ్చరించ నైనది.

శి॥ మీసాటివారికి వేసటలేదు వుంటే నాసాటివారిస్థితి యేసాటిగాకుండును అను నిర్ణయమేమై యుండును ?

గు॥ నూరిజనులు మానవలోక కల్యాణమునకు యొనర్చు కార్యములు యేలాటి అయిష్టత జెందక స్వార్ధరహిత బుద్ధితో యొనర్చెదరు. స్వార్ధపద్ధతి గల వారు లోకకల్యాణమునకు యొనర్చు కార్యములు వృధాశ్రమయని 'అర్ధస్య పురుషోదాసో' యను పద్ధతిగా ద్రవ్యమునకు దాసులై ప్రవర్తింపెదరు మరియు యీ గ్రంథకర్త రచించిన గ్రంథము కేవల మానవలోక కల్యాణమునకు రచించినటు వంటిది. యిందు స్వార్ధమనునది యేకోశమునందు లేదు.

శ్లో॥ జ్ఞానశక్తి బలై శ్వర్య వీర్యతేజాంస్య శేషతః
భగవచ్ఛబ్ద వాచ్యాని వినాహే యైర్గుణాదిభిః॥

అనగా, జ్ఞానము శక్తి బలము ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు, యీసమస్త సద్గుణంబులు భగవచ్ఛబ్ద వాచ్యములు యిందు యేదోవొకటిగాని అన్నిగాని అభ్యసించి వాటివల్ల గలిగేకీర్తి ప్రతిష్టలకు లోబడి తనకన్నా యితరులు అధిక పద్ధతి గలిగియుండకూడదని తనకీర్తిని రక్షించు కొనుటయందే కట్టుబడి యున్నవారు, ఆయా పరిమితికి తగిననామంబులు, కవి, పండితుడు, భక్తుడు, జ్ఞాని, బ్రహ్మవేత్త, బ్రహ్మవిద్వరుడు, బ్రహ్మవిద్వర్యుడు, బ్రహ్మవిద్వరిష్టుడు అను పద్ధతుల యందు అభిమానయుతులై యుందురు గనుక పరమాత్మ సృష్టియందు వీరు యీ స్థితిగలవారని నిర్ణయము యుండును. అందువలన వారికి స్వార్ధరహిత పద్ధతి క్రమముగా నుండును. వీరు పరమాత్మ సృష్టికి వ్యతిరేకులని నిర్ణయము. పరమాత్మ సృష్ట్యానుసారము సృష్టింపనైన మానవులందరు పరిపూర్ణ గురుమూర్తిని ఆశ్రయించి జనన మరణ రహితపద్ధతిని తెలుసుకొని కర్మ సన్యాసము, కర్మ ఫలత్యాగము గాక కర్తృత్వరహిత కర్మాచరణ యొనర్చిన వారల జన్మభ్రాంతి అవలీలగా తొలగునని నిర్ణయించినారు. ఆ పద్ధతియందు వున్నదివున్నట్లు తామే లేకుండా పోతున్నారు గనుక వారిస్థితి వీరితో సమముగా వుండునని నిర్ణయించుటకు వీలుగాదు. గనుక నాసాటి వారిస్థితి యేసాటి గాకుండునని గ్రంథకర్త నిర్ణయము.

కం॥ యేనిర్ణయమును జేయదు నేనని మహాత్ముడెపుడు, నేననువాడే
నానా విధాల వదరును నేనను తనవంటి వారినెప్పుడు గనినన్ ॥

కం॥ గొప్ప ప్రతిష్టకు మిక్కిలి తప్పులుబడు నృతటిపేపడు తీరదు వివమూ
ఒప్పుల తుప్పగు బోవను తప్పక నామాట నమ్మదగు తప్పనకన్॥

యని సాంప్రదాయక నిర్ణయము.

## (కుకవి నింద)

([illegible]) తప్పొప్పులు రెంటెన్నెరుగని । తప్పంతనందుండి దీన్ని తప్పని కూసే । తప్పుడు నరునకు జెప్పెద చప్పుడు చాలించమనుచు సభవారు వినగా । సరెసరెనాని । సభవారిట్లనగా । చెప్పిన వినకుంటె తప్పు వానిదె సుమ్మి । తప్పొ గలిగిన వెనుక । గొప్పావా డెట్లౌను । సభవారు వినగా । సరెసరెనాని । సభవా రిట్లనగా ॥

తప్పును, ఒప్పును రెంటిని తెలియని తప్పును తనయందుంచుకొని యీ గ్రంథమునందు తప్పులు యున్నవని చెప్పెదీ, తప్పుడు నరునికి చప్పుడు చాలించుమని సభవారు వినునటుల విన్నవారు 'సరెసరె' యనునటుల, చెప్పుచున్నాను. చెప్పినా వినకుంటె తప్పువానిదె యగును. తప్పు గలిగిన వెనుక, గొప్పవారని యెవ్వరుకూడా అనుకోరని భావము.

శి॥ తప్పొప్పులు రెండు యెరుగనితప్పు యెటువంటిది ?

గు॥ ఇతరులు వచించు విషయములు తనకు సత్యమని తెలియుచున్ననూ అభిమానయుతముగా తనకు తెలిసియున్న అసత్యమును సత్యమని వాదించుట తప్పొప్పులు రెంటెన్నెరుగని తప్పుయని నిర్ణయము.

## (సజ్జన దుర్జన నిర్ణయుంము)

([illegible]) ఇలుజొచ్చి గ్రామసింహము । కలదొంతులు గూల్చునింటి । గరిత లౌరుగు దొం । తులు చక్కజేతు రట్లనే । యిలనుకవిజనోక్తి తప్పు లెంచూ దుర్జనుడూ । తప్పొప్పు గావించు సజ్జనుడూ । తులలేని బుద్ధిమంతులు సర్వజ్ఞులు మీరు । తెలుసూ నాతలపు నే తెలిపే దేమిక తప్పు । లెంచు దుర్జనుడూ । తప్పొ ప్పుగా । వించూ సజ్జనుడూ ॥

యింటిలో కుక్కలు జేరి దొంతికుండలు పడద్రోయును. ఆ యింటియందు గల ఆడువారు, కుండలను సవరింతురు, ఆ పద్ధతిగానే దుర్జనుడు తప్పులు చేయును, సజ్జనులు సవరింతురు అయినా సర్వజ్ఞులగు మీకు నామనోభావము తెలి యును కనుక వేరుగా నేను చెప్పవలయుననే అవసరము వుండబోదని భావము.

([illegible]) తనగొప్పనెంచరేమో । జనులని తలపోసిపాధు । జనకృత కవితల్ । వినడితరులు వినగోరిన । వినకనరాదనుచు మనసు విరుచూ దుర్జనుడూ । విని వినిపించు వేడ్కా సజ్జనుడూ । కనవచ్చె ముంజేతి కంకణాలకు వేరే । ఘననిల్వు టద్దాము గావాలెనా మనసు । విరుచూ దుర్జనుడూ॥ వినివినిపించు వేడ్కా సజ్జనుడూ ॥

ముంజేతి కంకణము జూచుటకు అద్దము అవసరము లేకుండానే కాన వచ్చును. అట్లే పరిశీలించకుండానే దుర్జనులను సజ్జనులను తెలుసుకోవచ్చును. యెట్లనగా, సూరిజనులు రచియించిన గ్రంథములను సజ్జనులైన వారు శ్రద్ధతో వినెదరు యితరులకు వినిపించెదరు. దుర్జనులైనవారు తాము వినరు యితరులవల్ల తమ గొప్పతనమునకు భంగము కలుగునని వారిని విననీయరు. అనగా, ముంజేతి కంకణము జూచుటకు అద్దము అవసరము లేకుండా తనకు అగుపడునట్లు, తన భార్యగుణములు యితరులు చెప్పకుండానే తనకు తెలియునట్లు, కౌపీన ధారిని జూచి వీడు దరిద్రుడని తనంతట తాను తెలిసికొనినట్లు, కాటు పోయిన కూరలను రుచిచూడకుండానే తెలిసికొన్నట్లు, విధవను చూచి యీామె పెనిమిటి లేనిదని తనకుతానే తెలిసికొన్నట్లు, వెర్రివాడు చేయు చేష్టలుచూసి యితరులు చెప్పకుండానే, వీడు వెర్రివాడని తెలుసుకొన్నట్లు సుజనులను దుర్జనులను యితరులు చెప్పకుండానే తనంతతాను తెలుసుకొనునని భావము.

## (గ్రంథ నిర్మిత విధానము)

(౧౫) ఆగామికథయెట్లన , బాగుగ వివరింతు చెవుల । పండువుగాగన్ । అగమ నిగమోపనిష త్సాగర మథితార్థమవల । సాంగోపాంగముగాన్। దయతో వినుడీ । సాంగోపాంగముగాన్ । ప్రాగర్థచరమార్థ యోగాములకు సంయోగము గావించి నేగు రెరిగినదంత । సాంగోపాంగముగాన్ । దయతో వినుడీ సాంగోపాంగముగాన్ ।

ముందు జరుగబోవు కథ యెట్టిదనగా, అగమము నిగమమును, ఉపనిషత్తును సాగరముగా జేసి తరించగా తేలిన సారమునకు అవలిదగు అచలపరిపూర్ణపర బాహ్యమును ప్రాగర్థ చరమార్థ యోగములకు సంయోగము గావించి నేగు రెరిగినది. యీ రెంటి విషయము చక్కగా చెవులకు యింపగునట్లు సంపూర్ణముగా వినిపించెదను. దయతో వినవలయునని భావము.

శి॥ అగమము యనగా నేమి ?

గు॥ ఆగమము యనగా దేవ పూజా విధానమును తత్సంబంధించిన విషయములను తెలుపునట్టి శాస్త్రము. మరియు వ్యాకరణాది శాస్త్రములు అనగా

శ్లో॥ శిక్ష వ్యాకరణం ఛందో నిరుక్తం జ్యోతిషం తథా
కల్పశ్చేతి షడంగాని వేదస్యాహు ర్మనీషిణః ॥

శిక్ష, వ్యాకరణ, ఛందము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అని వేదాంగములు ఆఱు-అగమము యని నిర్ణయము.

శి॥ నిగమము యనగా నేమి ?

గు॥ నిగమము యనగా వేదము. వేదమునందు కర్మకాండ, ఉపాసనా కాండ జ్ఞానకాండ అనునవి విభజనగా లేక ఒక్కటిగా యున్నందున అధ్యయనం చేయువారికి కఠినముగా నుండునని సులభముగా నుండునట్లు బాదరాయణ మహర్షి అనగా వ్యాస భగవానులు ఋక్, యజు, సామ, అధర్వణములని నాలుగుగా విభజించినారు. యజుర్వేదమును కృష్ణ, శుక్ల ని వాజసనేయుల కాలమున రెండు భాగములుగా విభజింపబడినది.

శి॥ ఉపనిషత్తనగా యేమి ?

గు॥ ఉపనిషత్తనగా-యీ వాక్యము మూడు పదములతో కూడియున్నది. ఉప+ని+షత్ అనియూ. ఉప=సమీపమున, ని=చక్కగా, సత్=పొందబడినది. ఉపనిషత్తునకు వేదాంతమనియు, వేదశిరస్సనియు, రహస్యమనియు చెప్పబడును.

1. వేదముయొక్క పర్యవసానము తెలియజేయునది గనుక వేదాంతమనియు,

2. వేదమునకు ఉపనిషత్తులు శిరస్థానమైనందున వేద శిరస్సులనియు,

3. పరమాత్మ జ్ఞానము కలుగజేయునదై ఆచార్యుని యొద్ద నభ్యసించదగినది యైనందున రహస్యమని, అంతరంగమనియు చెప్పబడును.

ఉపనిషత్తులు :- నాలుగు వేదముల నుండి పదకొండు వందల యెనభై ఉపనిషత్తులు కలిగెను. ఎట్లనగా, ఋగ్వేదమునుండి 21, శుక్ల యజుర్వేదము నుండి 109, సామవేదమునందు 1000, అధర్వణ వేదమునందు 50 మొత్తము 1180 శాఖలుగా నైననూ యిందు, 840 కర్మకాండను బోధించునవి, 232 ధ్యేయ బ్రహ్మమును బోధించునవి గనుక ఉపాసనా కాండ మనియు, 108 జ్ఞేయ బ్రహ్మమును బోధించునవి గాన జ్ఞాన కాండమనియూ చెప్పబడును.

యిందు ఈశ, కేన, కఠ, ముండక, మాండూక్య, బృహదారణ్యక, ఛాందోగ్య, ప్రశ్న, తైత్తరీయ, ఐతరీయ మను దశోపనిషత్తులు ద్వైతాద్వైత విశిష్టాద్వైత మొదలగు మతములవారు వారికి అనుకూల పద్ధతులతో భాష్యములు వ్రాసి ప్రచారములు చేయుచున్నందున 108 ఉపనిషత్తులలో యీ దశోపనిషత్తులు శ్రేష్ఠమని చెప్పుదురు. యీ దశోపనిషత్తులకు యిచ్చిన ప్రాముఖ్యత యితరోపనిషత్తులకు యివ్వరు. ఎందుకనగా, వారి వారి మత ధర్మములకు వ్యతిరేకమైన వాక్యములు వాటియందు యుండుటవలన.

అయినా ముక్తికోపనిషత్తు యను అంత్యోపనిషత్తు యందు విదేహ మోక్షమునకు 108 ఉపనిషత్తుల యొక్క జ్ఞానము అవసరమని శ్రీరామ చంద్రుడు ఆంజనేయునికి చెప్పినట్లుగా యున్నది.

వేద శిరస్సులనబడు ఉపనిషత్తుల పఠనమునకు శాంతి మంత్రములు నిర్ణయించి యున్నారు. ఉపనిషత్తు శ్రవణాది అంత్యములయందు అనగా పఠనమునకు పూర్వమునందును, పఠనమునకు తరువాతను పఠించవలయును. అట్లు పఠించని వారికి ఉపనిషత్పఠన శ్రవణము యొక్క శ్రమయే మిగులును కాని ఫలము యుండదు. గనుక, శాంతి పాఠము నందలి నిర్ణయ విధానము తెలుసుకొని ఆ పద్ధతిగా ఆచరించడము ముముక్షువు యొక్క ధర్మము.

1. ఋగ్వేద శాంతి: ఓం వాఙ్మేమనసి ప్రతిష్ఠితా
2. శుక్ల యజుర్వేద శాంతి. పూర్ణ మదః పూర్ణ మిదం
3. కృష్ణ యజుర్వేద శాంతి: సహనా వవతు
4. సామవేద శాంతి: ఆప్యాయంతు-
5. అధర్వణ వేదశాంతి: భద్రం కర్ణేభి

శి॥ సాగరమధి తార్థ మవల యనగా నేమి?

గు॥ సాగరమధి తార్థమనగా వేదమునందలి కర్మయోగ, జ్ఞాన నిర్మితంబులు శాస్త్రములగు న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, పూర్వ మీమాంస ఉత్తర మీమాంసములను వేదాంతములగు ఉపనిషత్తులను సాగరముగా జేసి తరించి చూడగా కార్యకారణ బ్రహ్మము యొక్క నిర్ణయము గలదు వీటి ఆది అంత్యములయందు పఠించు శాంతి పాఠములందు వాచ్య వాచ్యార్థ, లక్ష్య లక్ష్యార్థ రహితమగు అచల పరిపూర్ణ పరబాహ్య నిర్ణయము గలదు గనుక సాగరమధితార్థ మవలయని నిర్ణయము.

శ్లో॥ పూర్ణ మదః పూర్ణ మిదం పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమేవా వశిష్యతే.

(శు॥ య॥ బృహదారణ్యక)

ఆ పరోక్షము పూర్ణము యీ ప్రత్యక్షము పూర్ణము. పూర్ణము నుండి పూర్ణమును విచారించగా ప్రత్యక్ష పూర్ణము లేకుండా పోవుచున్నది. పరోక్ష పూర్ణము శేషించుచున్నదని నిర్ణయము.

శ్లో॥ కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః
కార్య కారణతాం హిత్వా పూర్ణ బోధోవశిష్యతే ॥

(కృ॥ య॥ శుకరహస్య)

ఈ జీవుడు అవిద్యా కార్యమైన శరీరమునుపాధిగా గలవాడు ఈశ్వరుడు. మాయా కారణమైన శరీరము నుపాధిగాగలవాడు కార్యకారణత్వమైన ఉపాధి ద్వయమును విడువగా పరిపూర్ణ పరబాహ్యము శేషించుచున్నదని నిర్ణయము.

శ్లో॥ తత స్స్వి మిత గంభీరం నతేజోనతమ స్తతం
అనాఖ్య మనభివ్య క్తం సత్కించి దవశిష్యతే.

(కృ. య-యోగకుండలీ)

మాయా కార్యమైన సమస్త ద్వైతమును నిషేధింపగా శాంతమును అవాఙ్మానస గోచరమైనదియూ, తేజస్సుగానిదియు, చీకటి గానిదియూ, పరిపూర్ణ మైనదియూ, పేరు లేనిదియూ, స్పష్టమైనది గానిదియూ యింద్రియములకు విశదీకరించుటకు శక్యము గానిదియు నగు శూన్యముగాని యొక వస్తువు శేషించు చున్నది.

శ్లో॥ యావద్యావన్మని శ్రేష్ఠస్స్వయం సంత్యజ్యతేఖిలం
తావత్తావత్పరలోకః పరమాత్మై వశిష్యతే॥

(అధర్వ - అన్నపూర్ణ)

వశిష్టాది మునులయందు మేలిమి పొందిన ఓ మునిశ్రేష్ఠుడా ! సత్యజ్ఞానానంత స్వరూపమే ఆత్మయను నితర సిద్ధాంతముల నొకదాని తర్వాత నొక దానిని విడువవచ్చును. అట్లు వానిని విడుచుచుండగా అచల పరిపూర్ణ పరబాహ్యము విడుచుట కశక్యమై శేషించి యుండును. యిట్లు ఉభయ సిద్ధాంతముల నెరిగినవాడే మునిశ్రేష్ఠుడు గనుక.

శ్లో॥ జ్ఞేయవస్తు పరిత్యాగే విలయం యాతిమానసం ।
మానసే విలయం యాతే కైవల్య మవశిష్యతే॥

(అధర్వ - శాండిల్య)

తెలియ దగినది లేనపుడు మనస్సు నాశనము పొందుచున్నది. మనస్సు నాశనము నొందుచుండగా పరిపూర్ణ పరబాహ్యమే శేషించును.

యీ ప్రకారము అచల పరిపూర్ణ పరబాహ్యము యొక్క నిర్ణయము ఆగమ నిగమ ఉపనిషత్ సాగరమధి తార్థమున తేలిన సారము సచ్చిదానంద బ్రహ్మమున కతీతము అచల పరిపూర్ణ పరబాహ్యమని నిర్ణయము.

శి॥ వేద శిరస్సులను ఉపనిషత్తులకు శాంతి పాఠముల నెందుకు నిర్ణయించినారు?

గు॥ అధ్యాత్మిక, అధి భౌతిక, అధి దైవికములైన విఘ్నముల యొక్క పరిహార నిమిత్తము, మరియూ, గురుశిష్యుల నిద్దరినీ, చైతన్య బ్రహ్మ భ్రాంతి సముదాయములో బడనీయక, అహం బ్రహ్మాస్మి యను భ్రాంతి సమాప్తి కొఱకు, శాంతిః శాంతిః శాంతిః యని ముమ్మారు చెప్పనైనది.

1. అధ్యాత్మిక మనగా-శరీరము నాధారము చేసుకొని, పుట్టునట్టి జ్వరము తలనొప్పి వ్రణము మొదలగు వాని వలన గలిగే తాపములు.

అధి భౌతికములనగా-దయ్యము, రాక్షసుడు, పులి, సింహము మొదలగు భూతముల వలన గలిగే బాధలు.

3. అధి దైవికములనగా-దైవవశముగా పిడుగు మొదలగు వాని వలన కలుగు తాపములు.

4. చైతన్య బ్రహ్మభ్రాంతి - సప్త విధములు. 1. శుద్ధ చైతన్యము- 2. ఈశ్వర చైతన్యము. 3. జీవ చైతన్యము. 4. ప్రమాత చైతన్యము- 5. ప్రమాణ చైతన్యము. 6. ప్రమేయ చైతన్యము. 7 ఫల చైతన్యము. యీ యేడున్నూ సప్తవిధ చైతన్యము లనబడును.

1. శుద్ధ చైతన్యమనగా-మాయోపాధి రహితమైన చైతన్యము.

2. ఈశ్వర చైతన్యమనగా-మాయోపాధితో కూడిన చైతన్యము.

3. జీవ చైతన్యమనగా-అవిద్యోపాధితో గూడిన చైతన్యము.

4. ప్రమాత చైతన్యమనగా-అంతఃకరణతో కూడిన చైతన్యము.

5. ప్రమాణ చైతన్యమనగా-అంతఃకరణ వృత్తితో కూడిన చైతన్యము

6. ప్రమేయ చైతన్యమనగా - మరువు రూపము అనగా ఎరుగబడని చైతన్యము.

7. ఫల చైతన్యమనగా-ఎరుగబడిన చైతన్యము.

యీ ప్రకారముగా అధిష్ఠాన చేతన బ్రహ్మమగు ఆత్మ ఉపాధిచేత అనేక విధములుగా చెప్పబడుచున్నాడు. ఉపాధిని త్రోసివేసి అద్వితీయుడై పరిపూర్ణుడైన ఆత్మ నేనేనని యెవ్వడెరుగుచున్నాడో వాడు ముక్తుడని వేదాంతశాస్త్ర సిద్ధాంతము.

ఈ నిర్ణయముల విధానము భ్రాంతిగా వున్నందున శాంతులను నిర్ణయించినారు.

1. వాఙ్మనసీ ప్రతిష్ఠిత-యనగా ఋగ్వేద మహావాక్య శాంతి

బ్రహ్మ విద్యను ప్రతిపాదించు గ్రంథ పాఠమునందు ప్రవర్తించు నావాక్కు నా మనస్సునందు సర్వదా ప్రతిష్ఠింపబడినది యగుగాక

ఓ ఆవిర్భూతమగు బ్రహ్మ చైతన్యమా నా కొఱకు నా యవిద్యను పోగొట్టుచు ప్రకటమగుము. అదే పద్ధతిగా బోధకులగు ఆచార్యులను రక్షించుగాక యని వాఙ్మనస్సుల రూపమగు చైతన్య బ్రహ్మమును ప్రార్థించియున్నారు.

2. సహనావవతు-యనగా కృష్ణయజుర్వేద మహావాక్య శాంతి.

ముందు పఠించబోవు బ్రహ్మవిద్య శిష్యాచార్యులగు మమ్మునిద్దరిని రక్షించును గాక. మా యిద్దరికిని పరబ్రహ్మానుభవము కలుగజేయును గాక. మా యిద్దరికిని బ్రహ్మవిద్య నిమిత్తమైన సామర్థ్యము కలుగును గాక. మాచేత నధ్యయనము చేయబడినది తేజోవంతమగును గాక. శిష్యాచార్యులగు మా యిద్దరికిని, ప్రమాదము వలన నయిననూ, అన్యాయమువల్ల నైననూ ద్వేషము కలుగకపోవును గాక. శాంతియగును గాక. యిట్లు ప్రార్థనా పూర్వకముగా ముందు పఠించబోయెడి వాక్యములయొక్క విఘ్న నాశనము కొఱకు శాంతినిజేసి అవిఘ్నముగా శిష్యునిచేత బ్రహ్మవిద్య ప్రాప్తి కోరబడుచున్నది యని తాత్పర్యము.

3. అప్యాయంతు-యనగా సామవేద మహావాక్య శాంతి.

సామవేదార్థసార భూతమైన తత్వమసి మహా వాక్యార్థ నిశ్చయ ప్రకారము త్వంపద వాచ్యుడైన జీవునియొక్క అవయవములగు వాక్కు, ప్రాణము, నేత్ర శ్రోత్రములు మనస్సు మొదలైన సకలేంద్రియములను విషయాదులందు ప్రవర్తించి నివ్వక త్వంపద లక్ష్యభూతుడైన ప్రత్యగాత్మోన్ముఖ మౌనటులజేసి జహదజహల్లక్షణచేత ప్రత్యగాత్మను తత్పద లక్ష్యమైన బ్రహ్మమందు అసి పదముచేత నైక్యపరచి సర్వం బ్రహ్మమను అనుభవానందము పొందుటకై పర బ్రహ్మమే సలక్షణముచేత సద్గురుడనియు విలక్షణముచే పరమాత్మ యనియూ అధికారియైన ముముక్షువు తనకు గురుబోధ యందునూ ఆ బోధ లక్ష్యమైన పరమాత్మ యందునూ అనిరాకరణము అలక్ష్యత లేక యుండుగాక యనియూ సద్గురుడునూ పరమాత్మయూ తన్ను నిరాకరించక భ్రాంతి సముదాయములో బడ నివ్వక ఆదరింతురు గాకయనియూ, బ్రహ్మానుభవమును అపేక్షించిన తన యందు వేదాంతములయందు చెప్పబడిన క్షమ దమాదులు మొదలైన యావద్ధర్మములు కలిగి యుండుగాక యని అప్యాయంతు యని శాంతిని ఉచ్చరించుట

ఆధ్యాత్మిక అధి భౌతిక అధిదైవికములైన విఘ్నముల పరిహార నిమిత్తమని తాత్పర్యము.

4. భద్రం కర్ణేభి - యనగా అధర్వణ మహావేద శాంతి.

ఓ దేవతలారా ? గురు శిష్యులము ముముక్షువులగు మేము కర్ణములచేత మంగళకరమైన వాక్యములను వినుచున్నాము. పూజ్యులైన యజ్ఞ దేవతలారా కన్నులచేత మంగళమైన మీ రూపములను చూచెదము గాక. దృఢమైనట్టి అవయవములచేతను శరీరముల చేతను స్తోత్రము చేయుచున్న వారమగుచు యేమా జీవితమైన ఆయుర్దాయము గలదో ఆ యాయుష్యును దేవతలకు ప్రియమగునట్లు చేయుచున్నాము.

సర్వ దిగంత విశ్రాంతమైన కీర్తి గలిగిన దేవేంద్రుడు మా కొఱకు శుభము నిచ్చుగాక సర్వజ్ఞుడైన సూర్యుడు శ్రేయస్సు నిచ్చుగాక శుభములకు ఆధారుడైన గరుత్మంతుడు మా కొఱకు శుభమును యిచ్చుగాక. దేవ గురువైన బృహస్పతి మా కొఱకు మంగళముల నిచ్చుగాక యని తాత్పర్యము.

5. పూర్ణమదః యనగా శుక్ల యజుర్వేద మహావాక్య శాంతి

శ్లో॥ పూర్ణమదః పూర్ణామిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్యపూర్ణ మాదాయ పూర్ణమేవా వశిష్యతే॥

ఆ పరోక్షము పూర్ణము, యీ ప్రత్యక్షము పూర్ణము యీ పూర్ణపద్ధతిని వివరించి చూడగా ప్రత్యక్ష పూర్ణము ఎండమావుల జల రూపకముగా లేకుండా పోవుచున్నది. పరోక్ష పూర్ణము శేషించి యుంటూ యున్నది. గనుక యిందు నిర్ణయించిన శాంతి ప్రత్యక్ష పూర్ణశాంతి కొఱకుగాని అధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవిక యితర విఘ్నముల శాంతికొఱకు గాదు. అనగా వాఙ్మేమనసీ శాంతి-సహనావవతత్వ్తతి శాంతి, ఆప్యాయంతుత్యతి శాంతి, భద్రం కర్ణేభిద్యతి శాంతి యను యీ నాలుగు విధ శాంతులు అధ్యాత్మిక, అధి భౌతిక అధి దైవిక యితర విఘ్నముల శాంతి కొరకు నిర్ణయించినారు. పూర్ణమదః - యీ శాంతి జనన మరణ రూప ప్రత్యక్ష పూర్ణశాంతి కొఱకు నిర్ణయించినారు. యెందుకనగా జనన మరణ రూప ప్రత్యక్ష పూర్ణము సప్తవిధ చైతన్య పద్ధతులుగా ఉపాధులు స్థానములయందు జనన మరణ రహిత పరిపూర్ణ పరబాహ్యామే యుండునుగాని జనన మరణ రూపచేతన బ్రహ్మము ఎండమావుల వంటిదని దాని శాంతికొఱకు యీ శాంతి ఏడు పూర్ణమను పదములతో కూర్చబడి యున్నది గనుక అగమ

నిగమ ఉపనిషత్సాగర మధితార్థ మవలిది జనన మరణములు పొందనిది అచల పరిపూర్ణ పరబ్రహ్మమని నిర్ణయము.

శి॥ ప్రాగర్థ పరమార్థ యోగములకు సంయోగము గావించి గురైరిగిన నిర్ణయ మేమైయుండును ?

గు॥ "శ్లో॥ ప్రాగర్థం ప్రకృతీ దేహం. పరమార్థంతు ఆత్మయో" అనగా, త్రిగుణ సామ్య ఆవరణ రూప ప్రకృతిదేహముగానూ, విక్షేప పద్ధతిగా తెలియు చున్నది. ఆత్మగాను తెలియుచున్ననూ అగ్నిని విడిచి వేడిమి, దీపమును విడిచి ప్రకాశము, బీజమును విడిచి వృక్షము యెట్లుండవో అట్లు ఆవరణమును విడిచి విక్షేపము, విక్షేపమును విడిచి ఆవరణము వుండవు. అదే పద్ధతిగా స్థావర జంగమ జీవులు వుండును. పిండ బ్రహ్మాండంబులను వీటి యందలి విక్షేప పద్ధతిగల జీవేశులను, యేకముచేసి చూడగా శాశ్వతముగా యుండక, పగలు రాత్రి తిరుగు విధమున 'అరుదెంచు' వచ్చుచు పోవుచుండునని నేను తెలుసు కున్న విషయము అనగా జనన మరణములులేని అచల పరిపూర్ణ పరబ్రహ్మ విషయము, జనన మరణములకు మూలకారణమగు అధిష్టాన బ్రహ్మ చైతన్య విషయము యీ రెంటి విషయము సంపూర్ణముగా వినిపించెదను. దయతో వినవలయునని భావము.

## (గ్రంథ రచనోద్దేశము)

(౨౦.) మోదమున ప్రొద్దు పోకకు । వాది ప్రతి వాదులగుచు । వరగురు శిష్యుల్ । వాదించురనుచు నొకసం । వాదము గల్పి స్తి కలగా । వదలాక వినుడీ । మొదటి నుంచి తుదవెళ్ళా గనుడీ । వేదాంతార్థాతీత వేత్తాలు మీరిందు। యేదేది సవరించు డిదేనావిజ్ఞాపన । వదలాక వినుడీ । మొదటినుంచి తుదవెళ్ళా గనుడీ ॥

సంతోషముగా పొద్దుగడుపుటకై వాది ప్రతివాదిగా వరగురు శిష్యులు వాదించిరనుచు, ఒక సంవాదము కలగా కల్పించినాను దీనిని మీరు, మొదటి నుండి తుదవరకు అనగా మధ్య భాగమునందు యెచ్చట కూడా విడువకుండా సంపూర్ణముగా వినవలయును మీరు వేదాంతార్థా తీతవేత్తలు గనుక నేజెప్పు వానియందు తప్పులు యే విధముగా సవరింతురో సవరించుమని భావము.

శి॥ సంతోషముగా పొద్దు గడుపువారెవ్వరు ?

గు॥ యీ ప్రపంచములో ప్రతి ప్రాణి సుఖమును కోరును. దుఃఖమును కోరదు. కొందరికి స్త్రీలయందు సుఖము లభించును, మరికొందరికి సంతానము

యందు అది లభించును. కొందరికి ధనమువల్ల అది లభించును కీర్తివల్ల నది లభించునని కొందరు. యివి ప్రపంచ విషయంబులు. ఆరంభమునందు అనగా ప్రథమా చరణమునందు అమృతమువలె నుండును గాని వెంటనే బలము వీర్యము ప్రజ్ఞకు భంగము కలిగించునని నిర్ణయించుకొని ప్రపంచ విషయములు విడిచి సన్యసించి పారమార్థ విషయంబులగు ఆసన ముద్రలక్ష్యసమాధి నిష్టలు, సాంఖ్య తారక అమనస్క మహావాక్య వార్తీక పద్ధతులు అనుసరించెదరు. యీ పద్ధతుల వలన హృదయ గ్రంధి నశించక జన్మ హేతువునకు కారణమగు చున్నది. గనుక వీరల కాలము దుఃఖ రూపము యని నిర్ణయము. అనగా మరల జన్మమును కలిగించుననియే గాని వీటి వలన జన్మ రహితము కాబోదు.

శ్లో॥ నమోక్షోనభసః పృష్టే నపాతాలేననభః భూతలే
అజ్ఞాన హృదయ గ్రంధ్నాశో మోక్ష ఇతిస్మృతః॥

ఆకాశమునందు మోక్షములేదు, పాతాలమునందును అది లేదు. భూతల మందున అది లేదు. జ్ఞానాజ్ఞాన రూప హృదయ గ్రంధియొక్క నాశమే మోక్ష మనబడును గనుక దుర్లభమైన మానవోపాధికి వొచ్చినవారు పూర్ణగురు సార్వ భౌముల నాశ్రయించి పరిపూర్ణ బోధ తెలుసుకొని కర్మ త్యాగము కర్మ ఫల త్యాగము ననుసరించక కర్తృత్వ రహిత పద్ధతిగా కర్మ యొనర్చి హృదయ గ్రంధి విడనాడు పద్ధతి తెలుసుకున్నవారే సంతోషముగా జనన మరణ భీతి రహితముగా కాలము గడుపగలరు. యితర యే పద్ధతి తెలిసినా అది వారికి అసాధ్యము. అనగా పునర్జన్మ తప్పబోదని సాంప్రదాయక సిద్ధాంతము.

శి॥ వరగురు శిష్యులనగా నేమి ?

గు॥ ప్రపంచమున అష్టవిధ గురువులు గలరు. వారు తెలియజేయు పద్ధతులు జన్మ భ్రాంతిని కలిగించును గాని జన్మరహిత పద్ధతిని కలిగించునవికావు. అందువలన మానవ లోకకల్యాణము కాదు. వారిని ఆశ్రయించిన శిష్యులు భ్రాంతి పరులే యగుచున్నారు. అందువలన వారిని గురుశిష్య లనెదరు, పరిపూర్ణ బోధకులగు వారిని వరగురు శిష్యులని సంబోధించెదరు. వరయనగా సస్య విశేషము సస్యమనగా వృక్షము, విశేషమనగా దాని ఫల పుష్పాదుల వలన జరుగు మానవ కల్యాణమని నిర్ణయం. అదే పద్ధతిగా, పరిపూర్ణ బోధ వలన మానవ జన్మ తరుణోపాయము. కర్తృత్వ రహిత కర్మాచరణ వలన మానవలోక కల్యాణమగును. గనుక పరిపూర్ణ బోధ గురు బోధయని, నుడివెదరు. బోధించు గురువులు శ్రవణము జేయు శిష్యులను వరగురు శిష్యులని సంబోధించెదరు.

శి॥ గురు శిష్య సంవాదము కలయనుటకు కారణ మేమైయుండును ?

గు॥ ఆకాశ గుణమైన శబ్దము ధ్వన్యాత్మకమనబడును. అక్షరములు మరియు అక్షర సముదాయమైన వాక్యంబులు వర్ణాత్మక మనబడును. వర్ణాత్మకమగు అక్షర సముదాయముననే వేదశాస్త్ర పురాణ ఉపనిషత్ మొదలగు సకలము నిర్మితములు. వర్ణాత్మకమగు అక్షర సముదాయమునకు కారణమైన ధ్వన్యాత్మకమగు శబ్దము అచల పరిపూర్ణ పరబాహ్యమునందు లేదు గనుక కారణమైన ధ్వన్యాత్మకము కలయని నిర్ణయము. కారణము కలగా నున్నందున దానివే నిర్మితమగు వర్ణాత్మకము కలయని నిర్ణయించనైనది.

శి॥ మహావాక్య నిర్మిత ప్రబోధము వాచ్యార్థ లక్ష్యార్థములచేత నిర్ణయించినారు. అదీ కలయేనా ?

గు॥ వాచ్యార్థమనగా పితృ శబ్దములకు సాక్షాత్సంబంధము తండ్రియని చెప్పబడును గనుక, యింతవరకే వాచ్యము అవసరము గనుక తండ్రిని తెలియజేయునది-శబ్దార్థమని నిర్ణయము. తండ్రినుండి తాత ముత్తాతలను తెలియవలెనని ఉపాధి ననుసరించి లక్ష్యార్థమే కావలయును గాని శబ్దార్థముతో నిమిత్తము లేదని జహల్లక్షణ, అజహల్లక్షణ, జహదజహల్లక్షణయను లక్షణత్రయముతో అద్వైత బ్రహ్మనిర్ణయము ప్రబోధించెదరు 'పలుకున గలిగిన యర్థము, పలుకును విడనాడి నిల్వబడు చోటించేది, రెండుగ ఒక్క పలుకే అయినాది' యను న్యాయమున వాక్యము, వాక్యార్థము, లక్ష్యము, లక్ష్యార్థము వాక్యమును విడిచి వేరుగా వుండుటకు వీలులేదు గనుక వాక్యము యెట్లు లేనిదో దాని నిర్ణయ లక్ష్యము లక్ష్యార్థము లేనివే యగును గనుక, సర్వము కలయని నిర్ణయము.

## (గ్రంథ విస్తరణ విశేషము)

(౨౧) కొంచములో సరిపుచ్చక । పెంచినవీ గ్రంధమనుచు । పెద్దలలుగకన్ । మించిన వేడ్కతొ వినుడీ । పెంచిన యర్థంబునే దెల్పెదలోకులెల్లా । అర్థము దెలిసి । మదినుల్లాసిల్లా । పెంచితి పెంచితి గొంచెము వెడలూవు । వుంచుండెనదిలోతం చెంచినామదిని దెల్పెదలోకులెల్లా అర్థము దెలిసి మదినుల్లాసిల్లా॥

యీ గ్రంథమును కొంచములో సరిపుచ్చక పెంచి పెద్దదిగా వ్రాసితినని పెద్దలగువారు కోపపడక అధిక సంతోషముతో వినవలెను పెంచిన అభిప్రాయ మేమనగా కొద్ది యెడఁగా యుండునదిని మానవులు దాటుటకు భీతి జెందెదరు. దానినే యెడముగా జేసినచో లోతు కొద్దిదగును అందువలన ప్రతి

మానవుడు భీతి జెందక సంతోషముగా దాటగలడు అని అభిప్రాయముతో యీ గ్రంథమును పెంచి వ్రాసినాను సకల మానవులు జనన మరణ రహిత పద్ధతి అవలీలగా తెలుసుకోగలరని భావము.

## —(పూర్ణ గురుదర్శన సంసిద్ధి కారణవము)—

(౨౩) సాధన సంపత్తియుగల । సాధకుడొక నరుడు ఘోర సంసార మునన్ । బాధ పడలేక తనపు । ణ్యోదయమున గురునిగాంచి యురుతర భక్తిన్ । శరణని మ్రొక్కి । మరిమారి యుక్తిన్ । బోధ జేయుము పుణ్య పురుషా మా బోంట్లాకు । సాధించదగుముఖ్య సాధనానిపల్కె। నురుతర భక్తిన్। శరణని మ్రొక్కి మరిమారి యుక్తిన్॥

సాధన సంపత్తి గల యొక మానవుడు ఘోర సంసార బాధచే పరితపించుచూ తన పుణ్యోదయమున అచల పరిపూర్ణ గురుమూర్తిని దర్శించి శిష్య న్యాయ పద్ధతితో భక్తి పూర్వకముగా నమస్కరించి, ఓ పుణ్యపురుషా! మాబోటి జనన మరణ బాధితులకు యే సాధన వలన జనన మరణ నివృత్తి యగునో అటువంటి ముఖ్య సాధన తెలియజేయుమని ప్రార్థించెనని భావము.

శి॥ సాధన యనగా యేమి ? దానివలన గలిగే సంపత్తి యెటువంటిది ?

గు॥ జనన మరణ రహితమునకు వేయు అభ్యాసము సాధన యనబడును దాని వలన కలుగు ఫలము సంపత్తి యనబడును, అది రెండు విధములు, 1, పూర్వ మీమాంసకమని, 2, ఉత్తర మీమాంసకమని,మీమాంసకమనగా కర్మ, బ్రహ్మ ప్రతిపాదిక శాస్త్రము, పూర్వ మీమాంసక మతము జైమినీ ఋషిచే స్థాపించబడినది. శ్లో॥ ఓం అథాతో ధర్మ జిజ్ఞాస, యను సూత్రమందు 'అథః' శబ్దము వలన వేదముయొక్క సాంగాధ్యయనము చేసిన తర్వాత యను నర్థము తెలియవచ్చుచున్నది.

మానవులకు ధర్మా ధర్మ స్వరూపము తెలియక, ధర్మానుష్ఠానము చేయుటకును, నిషిద్ధ ధర్మములు విడుచుటకును వీలు చొప్పడనందుచే, ధర్మా ధర్మమును రెండునూ విచారణీయములని అ ధర్మ జిజ్ఞాస యని యీ సూత్ర అభిప్రాయము, గనుక, వేదనిర్మిత విధానము పూర్ణముగా తెలుసుకున్న తద నంతరముననే మానవ కర్మాచరణ, యేది ధర్మమో, యేది అధర్మమో, యని నిర్ణయించవలయును.

వేదనిర్మితముయొక్క సంపూర్ణ నిర్ణయ విధానము తెలియక నిర్ణయించిన **యే ధర్మములైనా మానవ లోకమునకు అనర్థదాయకములే గాని సార్థకములుగావు.**

జైమినీ మహర్షి పూర్వ మీమాంస యను పేరుతో కర్మసూత్రములు రచించెను. వేద నిర్ణయానుసారముగా క్రతువులు వేయనిచో శాస్త్రోల్లంఘన చేసిన పాపము సిద్ధించును. మరియు వేద శాసనము తిరస్కరించినందున వేదమే వ్యర్థమగును. సృష్టి స్థితి లయాదుల త్రిగుణ సామ్య ప్రకృతివలననే జరుగుచున్నవి గాన పురుషుని ప్రాధాన్యత యేమీ వుండదని ప్రకృతికే ప్రాధాన్యత యిచ్చి కర్మను నిత్యకర్మ, నైమిత్తికకర్మ, కామ్య కర్మ, నిషిద్ధకర్మ, నాలుగు విధములుగా విభజించి, కామ్యకర్మను, నిషిద్ధ కర్మలను చేయక నిత్యకర్మ, నైమిత్తిక కర్మలను ఆచరించు వారికి మోక్షము కలుగునని సిద్ధాంతము చేసినందున ఆ పద్ధతిగా ప్రవర్తించుటకు సప్తాజ్ఞాన భూమికలు అనగా.

1. బీజజాగ్రము 2. జాగ్రము 3. మహాజాగ్రము 4. జాగ్రత్స్వప్నము 5. స్వప్నము 6 స్వప్నజాగ్రము 7. సుషుప్తి యీ యేడున్ను సప్తాజ్ఞాన భూమికలు.

1. బీజజాగ్రము :- నామరూప రహితాఖండ పరిపూర్ణ సచ్చిదానంద బ్రహ్మమందు జగత్సృష్టికి కారణముగా గలిగిన తెలివియే బీజజాగ్రమనబడును.

2. జాగ్రము :- అవిభక్తమగు నాతెలివికి ముందులేని భేదము సూక్ష్మముగా గలిగి ప్రపంచాది ముఖముగుట జాగ్రమనబడును.

3. మహాజాగ్రమనగా :- ఆలోక వాసన ప్రబలుట.

4. జాగ్రత్స్వప్నము :- జాగ్రద్దశయందు చూసినవి, చూడనివి సంకల్ప నిష్ప్రయోజనముగా మనోరాజ్య మేలుట, జాగ్రత్స్వప్నమనబడును.

5. స్వప్నమనగా :- ఆ జాగ్రమందు కల్పిత స్వరూపములు జూచుట.

6. స్వప్నజాగ్రమనగా :- మరచిన దానిని దలచుట.

7. సుషుప్తియనగా :- ఆత్మ ప్రతిబింబముగా తోచుచున్న జగద్విషయము సుఖమని దానిలో మునుగుట.

## —: సప్తజ్ఞాన భూమికలు :—

1. శుభేచ్ఛ, 2. విచారణ, 3. తనుమానసి, 4. సత్వాపత్తి 5. అసంసక్తి నామిక, 6. పదార్థభావన, 7. తురీయము.
యీ యేడున్ను సప్తజ్ఞాన భూమికలనబడును.

1. శుభేచ్ఛ :- బహు జన్మార్జిత సుకృత పరిపాకము వలన కాకతాళీయ న్యాయముగా దైవికముచేత జ్ఞానము గలవాడై, యీ అపార సంసార సాగర మెట్లు దాటగలనని పరితపించి సజ్జనులను చేరి పిమ్మట వారి వుపదేశంబున

సత్కర్మా చరణమును వేదాంత శాస్త్ర పరిజ్ఞానమును గలిగి మోక్షము నపేక్షిం చుట శుభేచ్ఛ యనబడును.

2. విచారణ :- అద్వైత శాస్త్ర పరిజ్ఞాన సత్సంగ వైరాగ్యంబులు గలిగి బ్రహ్మ మెయ్యది యని విచారించుట విచారణ యనబడును.

3. తనుమానసి :- యీ రెండు భూమికల సాధన పూర్వముగా గలిగి దారుణములగు విషయేంద్రియముల త్రిప్పలలో దగలక మనస్సును క్షీణింప జేయుట తనుమానసి యనబడును. దీనికే అసంగమని మరియొక పేరు గలదు. యీ అసంగమే సామాన్యా సంగమని, విశేషా సంగమని రెండు విధ ములు. యివియే నాల్గు విధములుగా జెప్పబడును.

1. సామాన్యా సంగమము. 2. సామాన్యా సామాన్యా సంగమము.
3. విశేషా సంగమము. 4. విశేషా విశేషా సంగమము.

1. సామాన్యా సంగమము :- శబ్దాది విషయములయందు నేను కర్తను, భోక్తను బాధ్యబోధకుడను గాను సుఖదుఃఖములు ఈశ్వరాధీనములని దేనియం దాశ లేకుండుట సామాన్యా సంగమ మనబడును.

2. సామాన్యా సామాన్యా సంగమము:- సంచిత కర్మలచేత లభ్యమయిన సుఖదుఃఖములయందు ప్రియాప్రియములు లేక ననుభవింపుచు వేదాంత మహా వాక్యార్థ నిశ్చయమునందు జేరుట సామాన్యా సామాన్య సంగమనబడును.

3. విశేషా సంగమము :- సత్సాంగత్యా పరోక్ష జ్ఞానపురుష ప్రయత్న జ్ఞాన శాస్త్రముల సంతతా భ్యాసముల వలన పరమ వస్తువు కరతలామలకమై కన్పించుచుండగా పరమతత్వ స్థితిజెంది మౌనియై శాంతి గలిగియుండుట విశేషా సంగమ మనబడును.

3. విశేషా విశేషా సంగమము :- చరా చరాత్మకమైన సకల వస్తువులను వస్త్వానుభవమును అఖండా కారముగా జూచుచు నిస్సంకల్పుడై ముందు దర్శిం చిన ఆత్మయందు మనసు గలుగుట విశేషా విశేషా సంగమ మనబడును.

4. సత్వాపత్తి :- యీ మూడు భూమికల నభ్యసించి యింద్రియార్థ ములందాశ మాని యితర సంకల్పములు లేక బ్రహ్మనిష్ట గలిగియుండుట సత్వా పత్తి మనబడును.

5. అసంసక్తినామిక :- యీ నాలుగు జ్ఞాన భూమికల అభ్యాసమువలన విషయ సంగమము గుణత్రయ సంగమము లేక బ్రహ్మ నిష్టయందు పట్టుతప్పక యుండుట అసంసక్తి నామిక యనబడును.

6. పదార్థ భావన :- యీ యైదు భూమికల అధాస్య విశేషముచేత బాహ్యాంతర దృశ్యమును లేక సాత్మా రాముడై బ్రహ్మము నేననుట పదార్థ భావమనబడును.

7. తురీయము :- యీ యాఱు భూమికల మార్గమెరిగి యేమిట భేదము లేమినిదెలసి పరబ్రహ్మ మాత్రుండై యుండుట తురీయమనబడును.

శుభేచ్ఛ, విచారణ, తనుమానసి యీ మూడు భూమికలు జాగ్రతావస్థ యనియూ !

అసత్వాపత్తియను నాల్గవ భూమిక స్వప్నావస్థ వనియూ;
అసంసక్తి నామికయను ఐదవ భూమిక సుష్యప్తావస్థ, యనియూ
పదార్థ భావనయను ఆఱవ భూమిక తురీయావస్థ యనియూ;
తురీయము యను యేడవ భూమిక తననిర్ణయము తనకు తెలియని అవాజ్మానస గోచరమని నిర్ణయము.

## —చతుర్విధ బ్రహ్మవేత్తలు—

1. బ్రహ్మవేత్త, 2. బ్రహ్మ విద్వరుడు, 3. బ్రహ్మ విద్వర్యుడు, 4. బ్రహ్మ విద్వరిష్టుడు, యీ నాలుగు చతుర్విధ బ్రహ్మవేత్త లనబడును.

1. బ్రహ్మవేత్త యనగా :- ప్రపంచ జ్ఞానము కలవాడై వపుడు బ్రహ్మ జ్ఞానమును విడువక సకల పుణ్య కర్మములు చేయుటచేత తన బ్రహ్మనిష్ట చెడు వనెడు భీతి లేక తన నిష్టకు కర్మములు విఘ్నకరములని వదలక తన వర్ణాశ్రమములకు తగిన లౌకిక వైదిక రూపములైన సకల లోక కృత్యములను విమర్శించి లోకోపకారము కొఱకు పుణ్య కర్మములను చేయుచు కర్మ ఫలములయందు అభిలాష లేక బ్రహ్మార్పణము చేయుచుండునతను బ్రహ్మవేత్త యనబడును.

2. బ్రహ్మ విద్వరుడనగా :- సకల వైదిక లౌకిక కర్మములు విధి పూర్వకముగా సన్యసించి పూర్వోక్త లక్షణంబుల విలసిల్లి సంప్రాప్త దుఃఖంబులను ద్వేషింపక నా వృత్తు సుఖంబులు గోరక ప్రకాశ వృత్తి మోహనంబుల నుదాసీనుని చందంబున జూచుచు సుఖదుఃఖ మోహాది కార్యాకార్య గుణంబుల యందు జితేంద్రియాది కారణ కార్య గుణంబులు ప్రవర్తించుచుండ వానిచేత జరింప జేయబడక నిశ్చయలుండును. సమదుఃఖ, సుఖుండును, స్వస్థుండును. సమలోష్టస్మ కాంచనుండును, ప్రియా ప్రియ నిందాస్తోత్ర, మానావమాన,

శత్రుమిత్రుల యందు సముండును, సంపరిత్యక్త సర్వారంభుండును, సగుణాతీతుండు, బ్రహ్మ విద్వరుండనబడును.

3 బ్రహ్మ విద్వర్యుండనగా, మున్ను వివరించిన గుణంబులన్నియూ ప్రకాశించు చుండ సంతత సహజామనస్క రాజయోగ నిష్ఠా గరిష్ఠుడై ఎడనెడ పరులవలన మేలుకొలుపబడి కించి దాహారంబు గొనుచు శక్తుండైన వాని తెరగున విశ్వంబు మరచియుండు నతడు బ్రహ్మ విద్వర్యుడనబడును.

4. బ్రహ్మ విద్వరిష్టు డనగా తన వలననూ, బరులవల్లనూ, పునరుత్థానంబులేక బాహ్యాభ్యంతరంబులు మరచి నిరంతర నిర్వికల్ప సమాధి నిష్ఠుండై పరిపూర్ణ సత్యా గ్భిన్న పరబ్రహ్మ చైతన్య ప్రకాశ మాత్రుండునై వెలుగు నతడు బ్రహ్మ విద్వరిష్టుడన బడును.

1. అజ్ఞాన భూమికల ఫలము సుషుప్తి
2. జ్ఞానభూమికల ఫలము తురీయము.
3. చతుర్విధ బ్రహ్మవేత్తలు వారి వారి పూర్వ ఫలాను సారముగా నాల్గు విధములైన వృత్తులు గలవారై నప్పటికినీ నల్వురకు బ్రహ్మను భవ మోక్షము సమమేనని వేదాంత సిద్ధాంతముగా యున్నను.

యీ బ్రహ్మనుభవ మోక్షము యొక్క ఫలము వృక్షాకారమంతయుబీజము నందు చేరి తనకుపాధి నశించినదని సంతోషించినట్లుగా యున్నది. గనుక, యీ పద్ధతులవలన జన్మకు హేతువే యగునుగాని జన్మరహితము గాదని సిద్ధాంతము.

"కర్మమున బుట్టు జంతువు, కర్మమునను వృద్ధిబొందు కర్మమున జెడున్
కర్మము జనులకు దైవము కర్మము సుఖ దుఃఖములకు కారణమధిపా"

యనే నిర్ణయాను సారముగా సర్వ యజ్ఞ కర్మలు గౌణములని నిర్ణయించి కేవల జ్ఞానముచే మోక్ష ప్రాప్తి యగునని జ్ఞానముతప్ప యితర యేపద్ధతులచే మోక్షము లభించుట శక్యము కానేరదని ఉత్తర మీమాంసా శాస్త్రమను బ్రహ్మ సూత్రముల యందు పురుష ప్రాధాన్య మిచ్చి ఉపనిషత్కారులగు వ్యాస భగవానులు నిర్ణయము చేసియున్నారు. వేదాంత శ్రవణాధికారికి ముఖ్యములైనవి.

1. సాధన చతుష్టయములు.
    1. నిత్యా నిత్యవస్తు వివేకము
    2. ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము
    3. శమాది షట్క సంపత్తి
    4. ముముక్షుత్వము, యను సాధనంబులు గలిగి.

2. మనో బ్రహ్మ పాద చతుష్టయము - వాక్కు, ఘ్రాణము నేత్రము శ్రోత్రము

3. ఆకాశ బ్రహ్మ పాద చతుష్టయము - అగ్ని, వాయువు, అదిత్యుడు, దిగ్దేవతలు.

4. ప్రణవ పాద చతుష్టయము - అకార, ఉకార, మకార, అర్ధమాత్రక.

5. ఆత్మ పాద చతుష్టయము - విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు, ప్రత్యగాత్మ.

6. బ్రహ్మ పాద చతుష్టయము - విరాట్, హిరణ్య గర్భ, అవ్యాకృత, పరమాత్మ.

యను పద్ధతుల ద్వారా పర బ్రహ్మ విధానము తెలుసుకుని,

7. అవాంతర వాక్య చతుష్టయము - ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ, సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ, సర్వం ఖల్విదం బ్రహ్మ, నేహనా నా స్తికించన.

యను న్యాయమున అధిష్టాన చేతన బ్రహ్మము తనకు పరోక్షముగా వున్నదని ఆ పరోక్ష బ్రహ్మము తనకు అపరోక్ష మొనర్చుకొనుటకు,

8. మహావాక్య చతుష్టయము —

1 ప్రజ్ఞానం బ్రహ్మ 2 అహం బ్రహ్మాస్మి

3 తత్త్వమసి బ్రహ్మ 4 అయమాత్మ బ్రహ్మ

యను మహా వాక్య నిర్ణయము వాక్యార్థ, లక్ష్యార్థ నిర్ణయ పద్ధతి లక్షణ త్రయముతో భాగ త్యాగ పద్ధతిగా శ్రవణాదులు యొనర్చి వార్తీక నిర్ణయాను సారముగా శ్రవణాదులు మాని పూర్ణ బ్రహ్మ పద్ధతిగా యున్ననూ,

బీజమునందు అణగివున్న వృక్షము బీజాకారముగా నుండి వృక్షాకారము పొంది వృక్షమునకు గలుగు ఫలమునందు వృక్ష వుపాధికి కారణమగు బీజము నిర్ణయమగునట్లు వార్తీక పద్ధతియందు జన్మకు కారణమైన గుర్తు నిలచి యుంటూ వున్నది కనుక, జనన మరణ రహితమునకు యీసాధన యొనర్చిన మనుజానికి కలిగిన ఫలము జన్మ హేతువునకు కారణముగా యున్నది.

శి॥ ఘోర సంసార బాధ యనగా యెటువంటిది ?

గు॥ సంసారమనగా పుట్టుక, దీనికి అంతము చావు, దుర్లభమైన మానవో పాధికి వొచ్చినవారు, పుట్టుక చావులు లేకుండా చేసికొనక చచ్చువారు కర్మాను సారముగా జన్మాదులు పొందవలయును జన్మరహితమునకు నిర్ణయించిన కర్మ

యోగ జ్ఞాన పద్ధతులు నిర్ణయానుసారము చేసి చూడగా ఉపాధికి కారణమగు గుర్తు నశించక నిలిచియుంటూ యున్నది. అందువలన, జనన మరణములు తొలగలేదనే నిర్ణయమున పరితపించు విధానము ఘోర సంసార బాధయని నిర్ణయము.

శి॥ పుణ్యోదయ మనగానేమి ?

గు॥ జనన మరణ రహితమునకు నిర్ణయించిన కర్మ, యోగ, జ్ఞాన పద్ధతులు చేసి చూడగా జన్మ రహిత పద్ధతి తెలియ లేదని విస్పృహ జెంది, ఆ ప్రయత్నము మాని ఊరుకొనక పూర్ణ గురుని దర్శించుటకు ప్రయత్నము చేయడము పుణ్యోదయమని నిర్ణయము.

శి॥ బోధజేయుము పుణ్యపురుష మాబోంట్లకు సాధించదగు ముఖ్య సాధన యనగా నేమి ?

గు॥ ఇంద్రాది భోగంబులు సత్యలోక కైలాస సామీప్యాది పదవులు జీవేశ్వరైక్యంబులు అహం బ్రహ్మాస్మి బ్రహ్మైవాహమస్మియను మోక్షంబుల పద్ధతులు గాక కేవల జనన మరణ రహితమునకు అనుష్టించదగు ముఖ్యసాధన యేదో అదిమాత్రము దయచేసి ప్రబోధింపుమని పూర్ణగురుని ప్రార్థించి యున్నాడు.

## —(ఉపదేశ సారము)—

(23) శరణాగతుడగు శిష్యుని కరుణామృత దృష్టిచాత । గనిమోదము । ముప్పిరిగొన మృదువాక్యములను । పరమదయాళుండు గురుడు భక్తా విను మనెనూ । నంశయమిక బాధింపదనెనూ॥ పరిపూర్ణ మొకటి లేవెరుకానె దొకటి। పరిపూర్ణ మెరుకాల నెరిగి । యెరుకనుమాను । భక్తా వినుమనెనూ। సంశయమిక బాధింపదనెనూ॥

శరణుజొచ్చిన శిష్యుని పరమ దయాళుండగు సద్గురుమూర్తి కరుణామృత దృష్టిచే చూచి జనన మరణ రహితము తెలియుటకు నీవు యిచ్చటికి రావడము సంతోషము, ముప్పిరిగొను మృదువాక్యములు విన్నబో జనన మరణ రహితమునకు నంశయమనే బాధ ఉండనేరదు, అవి యేమనగా, పరిపూర్ణ మనున దొకటి యెరుక యనునదొకటి, పరిపూర్ణ మెరుకలనెరిగి యెరుకను విడుమనదొకటి యని భావము.

శి॥ కరుణామృత దృష్టి యనగా నేమి ?

గు॥ దృష్టి యనగా, చూపు, బుద్ధి యని నిర్ణయము యిందు మృతదృష్టి అమృతదృష్టియని రెండు విధములు గురువులు తమ శిష్యులను కడతేర్చుటకు వారిపై ప్రేమ రసమును వెదజల్లుచు వారిని మనస్సు చేతనో, దృక్కుచేతనో స్పర్శచేతనో తరింపజేయుదురని తాబేలు, చేప,పక్షి దృష్టాంతములు చెప్పుదురు.

4. మనో దీక్ష :- తాబేలు పిల్లలను వేసి తాను పిల్లలు వేరు వేరుగా యెచ్చట సంచరించుచున్ననూ; ఆ పిల్లల మనస్సు తల్లిపైనున్ననూ, తాబేలు తన మనస్సుతో పిల్లలను తలంచినంత మాత్రమున వాటి ఆకలి తీరిపోవుచున్నది. అదే పద్ధతిగా శిష్యుడు తనకు జ్ఞానోపదేశము జేసిన గురువేదేశము యందుండి ననూ, అతని మనస్సెల్లప్పుడు గురుని పాదపద్మములయందు లగ్నమై యున్న యెడల. అతడు అమృతుడగుచున్నాడు, యీ పద్ధతి మనోదీక్ష యనబడును.

2. దృగ్ దీక్ష :- చేపలు గుడ్లను బెట్టి, ఆ గుడ్లను తదేక దృష్టితో చూడగా యీ గుడ్లు పగిలి పిల్లలగు చున్నవి. అట్లే శిష్యుడు గురుని సమీపము నందుండి యెల్లప్పుడతని స్వరూపమును వీక్షించుచూ యేక చిత్తముతోనున్నచో గురువతనిని కరుణ దృష్టితో చూడగనే యతడు అమృత తత్త్వమును బొందు చున్నాడు. యిది దృగ్ దీక్ష యనబడును.

3. స్పర్శ దీక్ష :- పక్షులు గుడ్లను పెట్టి దానిని పొదుగుటచే నవిబిట్లి పిల్లలగు చున్నవి. అట్లే శిష్యుడు యేకాగ్రచిత్తుడై యున్న సమయమున గురువు మస్తకమునందు తన హస్తమునుంచి మంత్రోపదేశము చేయగనే యత డమృత తత్త్వమును పొందుచున్నాడు. యిది స్పర్శ దీక్ష యనబడును.

మనో దీక్ష, దృగ్ దీక్ష, స్పర్శ దీక్ష యను త్రివిధ దీక్షలు విషయాదు లచే కూడి యున్నందున మృత దృష్టి కలవని నిర్ణయము. అదేపద్ధతి గా.గురుదు యొనర్చు, మనోదీక్ష, దృగ్దీక్ష, స్పర్శ దీక్ష విషయ వాసనచేకూడి యున్నందున మృత దృష్టి కలవని నిర్ణయము.

అచల పరిపూర్ణస్థితి పురుష లక్షణము విషయ వాసనా రహితము గనుక వారిది కరుణా మృత దృష్టి యని నిర్ణయము.

శి॥ ముప్పిరిగొను మృదు వాక్యములనగా యేమి ?

గు॥ పరిపూర్ణమును తెలుసుకొనునది యెరుకే యెరుకను తెలుసు కొను నది యెరుకే తానులేనని తననుతాను విడచుకొనునది యెరుకేయీమూడు పద్ధ తులు ఎరుకవే గనుక ముప్పిరిగొను మృదు వాక్యములని నిర్ణయము.

శి॥ 'పరమ దయాళుండు' అనగా యేమి ?

గు॥ దయతో అవల పరిపూర్ణ పరబాహ్యమును తెలియజేయు వారిని దయాళుడని చెప్పబడును.

శి॥ సంశయము బాధింప కుండుట యెట్లు ?

గు॥ జనన మరణములు లేని పరిపూర్ణ పరబాహ్యమును జనన మరణములు గలిగియున్న యెరుకను తెలుసుకొని పరిపూర్ణమున యెరుకకు యేలాటి సంబంధము లేదని లేనిది లేనట్లు విడిచి యుండును గనుక జనన మరణ పద్ధతిగల యేలాటి సంశయము బాధింపదని నిర్ణయము.

(24) ఏ సాధన నీకెందుకు । వీసానిక బనికిరాదు వినుమాయయ్యా । నేసాధులచే విన్నది । యేసాధన లేనిబోధ నెరిగింతు పోకూ। సాధనలందు మరిగీ తేరాకూ . యేసాధనలజోలి యేనొల్ల ననినీవు । బాసా జేసితివేని పరిపూర్ణబోధ నే! నెరిగింతుపోకూ । సాధనలందు మరిగీతేరాకూ॥

ఓ శిష్యుడా! జనన మరణ బాధరహితమునకు యేసాధనలు అణాభాగమునకు పనికిరావు. కనుక, సాధనలజోలి నీకు అవసరములేదు. నీవు యేసాధనల యందు ప్రవర్తించబోకు యేసాధనలు లేకుండా వున్నది వున్నట్లు లేనిది లేనట్లు తెలుసుకొనే మార్గము నేను సాధువులచే తెలుసుకున్నాను. ఆ మార్గము నీకు తెలియ జేసెదను. ఆ మార్గము తెలిసిన తదుపరి, యితర యేసాధనల జోలికి నేను భ్రాంతిజెందబోనని ప్రమాణము చేయవలెను. అట్లు చేసితివేని పరిపూర్ణ బోధ నీకెరిగించెదను అట్లు చేయుట కిష్టపడని యెడల నావద్దకు రాకుయని భావము.

శి॥ పరిపూర్ణ బోధకు సాధనలు అణా భాగమునకు కూడ యెందుకు పనికిరావు ?

గు॥ అణా భాగమునకు పనికొచ్చిన వస్తువు సంస్కార పద్ధతులతో పదహారణాల వరకు పూర్తి చేయవచ్చును.

సంస్కారమనగా,

(1) గుణా దాన సంస్కారము.

(2) దోషాపనయన సంస్కారము.

(1) గుణా దాన సంస్కారము :- ఫలవృక్షాదులకు ఎరువు వేసి మంచి పంటలను పొందుదుము. యిది గుణా దాన సంస్కారము.

(2) దోషాపనయన సంస్కారము :- మురికిగల అద్దమున ప్రతిబింబము కన్పించదు. ఆ మురికిని తుడిచివేసిన ప్రతిబింబము కన్పించును. యిది దోషా

పనయన సంస్కారము. యీ సంస్కార పద్ధతి అధిష్ఠాన చేతన బ్రహ్మమునకు సంబంధించును. గాని, అచల పరిపూర్ణ పరబాహ్యమునకు సంబంధించదు. అచల పరిపూర్ణ పరబాహ్యము వుత్పత్తి స్థితిలయ విస్తీర్ణ ఆకర్షణంబులుగానిది. అధిష్ఠాన చేతన బ్రహ్మము వుత్పత్తిస్థితి, లయ, విస్తీర్ణ ఆకర్షణములు బొందునది, గనుక.

శృ॥ బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్. అనగా బుద్ధిచే బ్రహ్మతత్వము గ్రహించబడును అను న్యాయమున, ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్వమసి బ్రహ్మ, అయమాత్మ బ్రహ్మ, యను పద్ధతుల ద్వారా వార్త్రీక నిర్ణయము వరకు సంస్కరించిన (చక్కజేసిన).

శృ॥ యతోవాచ నివర్తంతే అప్రాప్యమనసాసహ, తైత్తరీ యోపనిషత్ వాక్కు మనస్సు కూడ అచల పరిపూర్ణ పరబ్రహ్మమును విషయముగా చేసుకొన లేక వెనకకు మరలును, అని దాని యర్థము ఈ శృతినిబట్టి ఆ పరిపూర్ణ పర బ్రహ్మ మనస్సునకు విషయము కాదనుట సుస్పష్టము. అందుచే బుద్ధి గ్రాహ్య మనునది విరుద్ధమగును గనుక.

కం॥ బ్రహ్మందు లేక గలిగిన బ్రహ్మమనే ననెడిమాయ, ప్రబలె జగంబై
బ్రహ్మము గనితా నేగుటె బ్రహ్మననే మాయకు పని బ్రహ్మందు జుమీ

యని సాంప్రదాయక సిద్ధాంతము గనుక జనన మరణ రహిత పద్ధతి దెలుసుకొనుటకు యేసాధనలు అజ్ఞాభాగమైన పనికిరావని నిర్ణయము.

## (శిష్య ప్రశ్నావళి)

(25.) గురువర పరిపూర్ణంబున। నెరుకన నివిరెండు యెట్టి। వెరుకో ద్భవమెం' దెరుకజను బోటుయయ్యది' యెరుకను నేనెట్లు విడిచే దెరిగించు మనెనా। అట్లనేగురు డెరిగింతుననెనా ; వరణాధూళిని రెండు కరమూల గొని తన; శిరమూన ధరియించి శరణాని యాశిష్యు। డెరిగించుమనెనా। అట్లనెగురు డెరిగింతుననెనా॥

ఓ సద్గురువర్యా! పరిపూర్ణ మనునది యెరుక యనునది యీరెండు యెటు వంటివి. యెరుక యొక్క పుట్టుక యెక్కడ, యెరుకపోవు మార్గమ యేది, యెరుకను నేను విడుచుటయెట్లు, అని తెలుపుదని ప్రార్థింపగా ఆ పద్ధతిగానే గురుడు తెలియజేయుదుననగా శిష్యుడు సద్గురు పాదపద్మములకు సాష్టాంగదండ ప్రణామము లాచరించి పాదపద్మముల ధూళిని తన రెండుచేతులతో తీసికొని కన్నుల కద్దుకొని శిరమున ధరించుకొని అపద్ధతిగనే యెరిగించుమని ప్రార్థించె నని భావము.

## (గురుమూర్తి అభయ ప్రదానము)

(26.) మొదలచలము నెరిగింపెద । విదితముగా లేనియెరుక । వివరింతు వయిన్ । తుదకెరుకను విడిపించెద । మదిలో నామాటనమ్మి । మరివింటివేనీ । చంచలబుద్ధి మానంటివేనీ । పదుగూరు నినుజూచి భళిశాబాసీత్రోవ । కెదురూ లేదనెటట్టు । యిదిగో నేజేసెద । మరివింటివేనీ । చంచలబుద్ధి మానుంటివేనీ ॥

ఓ. శిష్యా ! మొదట అచల పరిపూర్ణ పరబాహ్యము నెరిగించెదను, తదుపరి లేని యెరుకను వున్నది వున్నరూపుగా నీకు తెలియునట్లు వివరించెదను. తదుపరి లేని యెరుకను విడిపించెదను నీవు యింతవరకు తెల్సుకున్న యితర బోధలయందు మనసు పోనీయక చంచల బుద్ధిమాని నేను బోధించు ప్రబోధ యందు మనస్సుయుంచి శ్రద్ధగా వినవలయును. నీవీబోధను వినిన తదుపరి నీ ప్రవర్తనను లోకులందరు చూచి భళి శబాస్, మానవ సౌభ్రాతృత్వమునకు అన్యోన్య సహకారమునకు, ఐహి కాముష్మిక పురోభివృద్ధికి అనుకూలమగు పద్ధతి పరిపూర్ణ బోధయందుగలదు. యితర మార్గములు భ్రమరూపములని నిన్ను మెచ్చుకొనునట్లు జేసెదనని భావము.

శి॥ మొదట అచల పరిపూర్ణ పరబాహ్యమును తెలియజేయు నిర్ణయ మెందుకు ?

గు॥ వేదములయందు వేదశిరస్సులగు ఉపనిషత్తులయందు, పద్నాలుగు కామవిద్యలు, ముప్పది రెండు బ్రహ్మవిద్యలు గలవు.

### -: కామ విద్యలు :-

1. తైత్తిరీయ పురుషవిద్య
2. ఉద్గీథో విషువ ప్రణవవిద్య
3. ప్రణవేపదోవరీ యస్త్వాది దృష్టివిద్య
4. ప్రణవే హిరణ్మయ విశిష్ట భగవదృష్టివిద్య
5. జ్యైష్ఠ్య శ్రేష్ఠ్య ప్రాణవిద్య
6. ప్రణవానస్త్వ దృష్టివిద్య
7. ఛాందోగ్యే పురుషవిద్య
8. హానోపాయన చింతనవిద్య
9. ప్రణవేరస తత్త్వాది దృష్టివిద్య
10. నామప్రకృతీష్టు బ్రహ్మ దృష్టివిద్య
11. ఉద్గీథాదౌ అదిత్య దృష్టివిద్య
12. మనశ్చిత వక్చిత్కాదివిద్య
13. కృత్స్నోద్గీత విద్య
14. జీవే బ్రహ్మదృష్టి విద్య

యీ 14 కామవిద్య లనబడును.

## -: బ్రహ్మ విద్యలు :-

1. ఈశావాస్యవిద్య
2. నాచికేతవిద్య
3. అంగుష్ఠ ప్రమితవిద్య
4. సత్యకామవిద్య
5. అక్షరపరవిద్య
6. ఆనందమయవిద్య
7. పురుషవిద్య
8. సద్విద్య
9. అంతరాదిత్యవిద్య
10. ఆకాశవిద్య
11. ప్రాణవిద్య
12. పరంజ్యోతిర్విద్య
13. శాండిల్య విద్య
14. ఉపకోసలవిద్య
15. వైశ్వానరవిద్య
16. భూమవిద్య
17. దహరవిద్య
18. మధువిద్య
19. సంవర్గవిద్య
20. పంచాగ్ని విద్య
21. ఉద్దాల కాంతర్యామివిద్య
22. గార్గ్యక్షరవిద్య
23. జ్యోతిషాం జ్యోతిర్విద్య
24. మైత్రేయివిద్య
25. ఆదిత్య మండలస్థ సత్య బ్రహ్మవిద్య
26. అక్షిస్థ సత్య బ్రహ్మవిద్య
27. ఉషస్తికహోళవిద్య
28. ప్రతర్దనవిద్య
29. బాలాకివిద్య
30. అజావిద్య
31. రుద్రవిద్య
32. చతుర్ముఖవిద్య

14 కామవిద్యలు 32 బ్రహ్మవిద్యల నిర్ణయము మహావాక్యముల ద్వారా నిర్ణయించి వున్నవి.

| | |
|---|---|
| 1. విధి వాక్యములు | 96 |
| 2. బంధమోక్ష వాక్యములు | 13 |
| 3. అవిద్యనిందా వాక్యములు | 21 |
| 4. జగన్మిథ్యా వాక్యములు | 33 |
| 5. ఉపదేశ వాక్యములు | 54 |
| 6. జీవబ్రహ్మైక్య వాక్యములు | 38 |
| 7. మనన వాక్యములు | 36 |
| 8. జీవన్ముక్తి వాక్యములు | 116 |
| 9. స్వానుభూతి వాక్యములు | 118 |

| | |
|---|---|
| 10. సమాధి వాక్యములు | 50 |
| 11. అష్ట విధ స్వరూప వాక్యములు | 32 |
| 12. పులింగస్వరూప వాక్యములు | 30 |
| 13. స్త్రీలింగస్వరూప వాక్యములు | 12 |
| 14. నపుంసక లింగస్వరూప వాక్యములు | 36 |
| 15. ఆత్మస్వరూప వాక్యములు | 40 |
| 16. సర్వరూప వాక్యములు | 40 |
| 17. బ్రహ్మ స్వరూప వాక్యములు | 93 |
| 18. అవశిష్ట స్వరూప వాక్యములు | 36 |
| 19. ఫల వాక్యములు | 40 |
| 20. విదేహముక్తి వాక్యములు | 77 |

యీ పద్ధతిగా వేదోపనిషత్తులయందు నిర్ణయము గలదు. అరుదెంచిన శిష్యుడు జనన మరణ రహితము యొక్క ఆశయముతో వచ్చినాడు. గనుక జనన మరణములు లేని అచలపరిపూర్ణ పరిపూర్ణ పరబ్రహ్మమును మొదట నెరిగించెదనని నిర్ణయము.

శి॥ లే నెరుకను తెలియబడునట్లు వివరించుట యెట్లు ?

గు॥ లేనెరుక ఉన్నట్లు యెట్లు తెలియుచున్నదో దానిని నిజమని నమ్మిన వారు యెటువంటిగతి అనుభవించుచున్నారో ఆ వివరమంతయు నీకు తెలియునట్లు వివరించెదను.

శి॥ యెరుకను విడిపించుట యెట్లు ?

గు॥ చెట్టునగాచిన కాయ పండిన తదుపరి దానిని చెట్టుపట్టుకొనియుండదు. అటులనే పండు చెట్టును పట్టుకొని యుండనట్లు యెరుక నిర్ణయము యెరుక తెలుసుకున్ననూ, తనంతటతానే లేకుండా పోవును.

## (శిష్య విజ్ఞప్తి)

(౨౭.) మీరంతవారు గనుకనె ! చేరితి మీపాదసేవ ' సిద్ధింపుటకై ' యేరింతవారు జగమున ' లేరని నామదికిదోచె । లెస్సాగ వినుడీ ' ఆజ్ఞకుమీర । లేదుకనుగొనుడీ ' యేరీతి వినుమంటెనారీతి వినియెద । మీరానతివ్వండి తోరామౌ యీబోధ ' లెస్సాగవినుడీ ఆజ్ఞకుమీర ' లేదా కనుగొనుడీ॥

ఓ, గురుస్వామి! మీరు అంతటి ప్రభావము కలవారు గనుకనే మీపాద సేవ ప్రాప్తించుటకై మిమ్ముల నాశ్రయించితిని. లోకమున మీవంటి మహాను

భావులు లేరని నామనంబునకు చక్కగా తెలియవచ్చినది. యిక నామనవి యేమనగా, మీయాజ్ఞను మీరను యే ప్రకారము వినుమంటే ఆ ప్రకారము వినెదను. గనుక, మీరు దయజేసి ప్రతసూత్ర ప్రాయమైన యీ బోధను చక్కగా బోధింపవలయునని భావము.

(౨౮) మొద్దులనై ననుదొల్తురు । బద్దుల బద్ధత్వమడవి పాల్జేతురుమీ । వద్దికివచ్చినగని । పరిశుద్ధపు బోధోక్తమైన । సూక్తాలు గుప్పీ । అందుకు తగిన। యుక్తాలు జెప్పీ । పెద్దాలచే మీ ప్రసిద్దీని వినవస్తి । దిద్దుడి నేవట్టి బుద్ధి హీనుడ నన్ను । గుప్పీ । అందుకు తగిన యుక్తాలు జెప్పీ॥

ఓ, ప్రభుస్వామీ ! మీవద్దకు వచ్చినవారికి కరుణచే దృష్టాంత ద్రాష్టాంతములతో పరిశుద్ధమైన అచలబోధను దెలిపి వారి వారి మొద్దత్వమును, బద్ధత్వమును అడవిపాలు గావింతురని పెద్దలచే మీ ప్రసిద్ధివిని వచ్చినాను. నేను బుద్ధి లేనివాడను గనుక నన్ను కృతార్థునిజేయ వలయునని ప్రార్థించెనని భావము.

శి॥ మొద్దులనగా యెటువంటివారు ?

గు॥ చేతన శబ్దమునకు తెలియని అర్థము. తెలివిగల ప్రాణరూపమైన వాయువు, అహోరాత్రమను నిర్ణయము లేక సూర్యచంద్ర నాడుల రూపమున బాహ్యమునకు సంచరించును. ఆ తెలివిగల ప్రాణవాయువును బ్రహ్మమునందు ఐక్యమొనర్చవలయునని నిర్ణయించుకొని ప్రాణవాయువును అపానవాయువుతో జేర్చి బ్రహ్మదండిద్వారా సహస్రార పద్మమునందు చేర్చిన వారివునికి తెలివి లేనిది యగుచున్నది గనుక, మొద్దులవంటి స్థితిగలవారని నిర్ణయము. అనగా, కాతలు పూతలు కాయకుండా వృక్షము కొమ్మలు కొట్టివేసిన మొద్దువంటివారని భావము.

శి॥ బద్దులనగా యెటువంటివారు ?

గు॥ అధిష్టానచేతన బ్రహ్మము తాను కారణముగానుండి త్రిగుణసామ్య ప్రకృతిద్వారా కార్యరూప జగత్తును సృష్టించుచున్నది. గనుక.

శృ॥ ఊర్ధ్వమూలం అధఃశాఖయని నిర్ణయము. కార్యరూపాదిగా వుపాధి జెందుచున్న జీవుడ్ని ఊర్ధ్వమూలముగా వున్న బ్రహ్మత్వము పొందింపవలయునని ప్రజ్ఞానం బ్రహ్మ, అహంబ్రహ్మస్మి, తత్వమసి బ్రహ్మ, అయమాత్మ బ్రహ్మయను, నిర్ణయానుసారముగా జీవుడ్ని ఊర్ధ్వ వ్యాపక మొనర్చిన సృష్ట్యాభిమానముగలచేతన బ్రహ్మమునందే కలియుచున్నది. గనుక వీరు బద్ధులని

నిర్ణయము. బద్ధులనగా జనన మరణ ప్రవాహామునందు బంధింపబడిన వారని నిర్ణయము.

శి॥ యీ ఉభయపద్ధతులు అడవిపాలైతురనే నిర్ణయమేమి?

గు॥ అరణ్యమునందు కాచిన ఫలపుష్పాదులు మానవులకు యెట్లు ప్రయోజనములు కావో అట్లు సమాధి పద్ధతులు అహంబ్రహ్మాస్మి నిర్ణయములు మానవ జన్మకు ఫలవంతములు కావని నిర్ణయము.

## (బోధ దృఢీకరణ విధానము)

(౨౮) నూటిగను బోధనామది । నాటినదిక చాలువాలు । నని నీకై నీ । నోటనీవు బల్కుదాకను । చాటువులను జెప్పచుందు । సరేనా నామాటా । రాగోరూచు మరి నేనీమాటా । నూటికొక్కటె సేలుమాటాని తెలియూము । మాటిమాటికి వట్టిపాటాలేమిటికింక । సరేనా నామాటా । రాగోరూచు మరినేనీమాటా ॥

ఓ, శిష్యుడా! "యీ పరిపూర్ణ బోధయొక్క ధర్మ కర్మ మర్మంబులు నా మనంబునకు చక్కగా తెలిసినవి. యిక బోధ చాలును," యని నీ నోట నీవు చెప్పువరకు నీ మనోభావమును నీనోట తెలుసుకొనుటు దృష్ట ద్రాష్టాంతములు చెప్పెదను. నామాట నూటి కొక్కటిగా నుండునని తెలుసుకొనుము. ఏదైన నీకు అనుమానముగావుంటే వెంబడెంబడే తెలుసుకొనుము. మాటిమాటికి ఇతర విషయములు అనవసరములని భావము.

శి॥ నూరు వాక్యములు అంతరముగాయున్న ఒక వాక్యము సూత్రప్రాయముగా చెప్పితే శిష్యుడు నిజమును యెట్లు తెలియగలడు?

గు॥ కారణమగు నొకదానిని తెలియచేసిన కార్యము విభజించ నవసరము లేకుండా శిష్యుడే సర్వము తెలుసుకొనును. యెట్లనగా,

1. బంగారము చూచినవారలకు నగల విభజన అవసరము లేనట్లు.

2. మన్ను తెలుసుకున్న వారలకు కుండలు వగైరా విభజన అవసరము లేనట్లు.

3. కారణమగు యెరుక తెలుసుకున్న వారలకు దాని కార్యమగు సకలము తెలియవలసిన అవసరము వుండదు.

అయినా, గురుమూర్తి తెలిపిన బోధ లక్షణము శిష్యునికి యెంతవరకు దృఢమైనదో శిష్యుని నోట విని మిగతా విషయము బోధించుతాననే నిర్ణయము గనుక సర్వము తెలియజేయగలనని భావము.

## (ప్రశ్నో త్తరములు)

★★ (౩౦) తానేననకను నిండిన దానికి పేరేమి । బయలు । తానే ననుచున్ నేననియెద నే నెవ్వరు । లేనెరుకవు । వుంటే । వుంటే లేనేలేననుమీ ! అంటిని అంటె లేనేలేవు సుమీ । లేనేలేనని నేను లేకపోయిన వెనుక తానుండుగద । వుంటె దాన్నెట్లెరిగెదవీవు । లేనేలేననుమీ ! అంటిని । అంటె లేనేలేవుసుమీ॥

శి॥ తాను, నేను అనకను నిండి యున్నదానికి పేరేమి ?

గు॥ అచల పరిపూర్ణపరబయలు

శి॥ తానేననుచున్ నేననియెద నే నెవ్వరు?

గు॥ అది ప్రకృతి నేను పురుషుడన్నియని ద్వంద్వ పద్ధతిగా ప్రవర్తించునట్టి లేనెరుకవు.

శి॥ అయమాత్మ బ్రహ్మం పద్ధతిగా వుంటినిగదా ?

గు॥ అయమాత్మ బ్రహ్మయను పద్ధతి భ్రాంతిజన్యము గనుక వున్నాననే నిర్ణయము లేనే లేననుమీ.

శి॥ అహం బ్రహ్మాస్మి నిర్ణయానంతరం త్రిగుణసామ్య ప్రకృతి లేకుండా పోతూవున్నది గనుక, లేనే లేదని యంటిని.

గు॥ ప్రకృతి లేనేలేదని యంటే దీనితోపాటు నీవుకూడా లేనేలేవుసుమీ.

శి॥ లేనేలేనని నేను లేకపోయిన వెనుక నేనైన బ్రహ్మము వుండునుగదా?

గు॥ ఆబ్రహ్మము నేనైనాను అను నీవు లేవని లేకపోయిన వెనుక ఆ బ్రహ్మము వుండునని యెట్లు తెలుసుకొనగలవో నిర్ణయించి చెప్పుమని గురుమూర్తి ప్రశ్నించగా,

శి॥ మహావాక్య పద్ధతి ననుసరించి వార్తిక నిర్ణయానుసారము నేనైన బ్రహ్మము యెట్లు లేకుండాపోవునో ఆ నిర్ణయము వారే తెలియజేయునట్లు ప్రార్థించవలయునని నిర్ణయించుకొని.

### —(శంకానివృత్తికి శిష్యవిజ్ఞాపన)—

(౩౧) మీరాజ్ఞ యిచ్చివుంటిరి । నేరుపుతో బయలు నెరుక నెరిగించిపయిన్; పేరణతు యెరుకననియ । ట్లారీతిన యెరుకపరచు ! మయ్యా మ్రొక్కేనూ । అనుమానాము జెయ్యకియ్యెడనూ । సారేకు మీపాదజలయుగ్మమునా ! హృత్పా

రాసమునసిల్పి। సల్పూపుమపూజనో యఃయ్యా మ్రొక్కేనూ। అనుమానాము జెయ్యా కియ్యేడనూ ॥

ఓ దేశికవర్యా! అచలపరిపూర్ణ పరబాహ్యమును, యెరుకను వున్నది యున్నట్లుగా యెరిగించి తదుపరి యెరుకను విడిపింప జేసెదనని అజ్ఞయిచ్చి వుంటిరి అదేవిధముగా నాకు ప్రబోధించుడు, నాయందు ఏ అనుమానము లేక బోధించగలరని ఎల్లప్పుడూ మీపాదపద్మములను నాయొక్క హృదయకమలము లందు నిలుపుకొని త్రికరణశుద్ధిగా పూజించి నమస్కారము గావించెదనని భావము.

## —(అచల పరిపూర్ణ దర్శనము)—

(౩.౨) పుట్టుట గిట్టుటలేకను। పుట్టిగిట్టేటి యెరుక పోడిమెరుగకన్। చట్టువలె కదలకుండును! బట్టబయల్ యిట్టిదెరిగి। భావింప దగునూ। యెరుకలేక సేవింప దగునూ। వట్టియాశలచేత పట్టూబడకనుయీ। గుట్టూ దేశికునోట గట్టిగ దెల సూక భావింపదగునూ। యెరుకలేక సేవింపదగునూ ॥

ఓ, శిష్యా! పుట్టుట గిట్టుట లేకను పుట్టిగిట్టేటి యెరుక యొక్క జాడ నెరుగక చట్టువలె కదలక యుండు నట్టిది అచలపరిపూర్ణ పరబయలు గనుక అటువంటిదాన్ని తెలుసుకొని ధ్యానించవలయును, పుట్టివచ్చే యెరుక లేకుండా సేవించవలయును, వట్టి యాశలచేత పట్టుపడక యీగుట్టు దేశికునోట గట్టిగా తెలుసుకోవలయునని భావము.

శి॥ పుట్టుక లేనిదని ఒక వాక్యము చెప్పినచాలదా గిట్టుట లేనిదని యెందుకు చెప్పవలెను ?

గు॥ అద్వైత ప్రబోధయందు అనిర్వచనీయమగు మాయకు పుట్టుక లేదు కాని కూటస్థ చేతన బ్రహ్మజ్ఞానము కలుగక పూర్వము దాని ప్రతీతి యున్నది. బ్రహ్మజ్ఞానము వల్ల అనిర్వచనీయ మాయకు గిట్టుట యున్నదని నిర్ణయించినారు గనుక అచల పరిపూర్ణ పరబయలు పుట్టుక లేనిదని ఒక వాక్యముతో ముగించినా శిష్యుని దృష్టి అనిర్వచనీయమగు మాయయందు పోవునని పుట్టుట గిట్టుట లేనిది అచలపరిపూర్ణ పరబయలని రెండు వాక్యములు ప్రయోగించినారు.

శి॥ పుట్టివచ్చే యెరుకజాడ యెరుగకుండా చట్టువలె కదలకుండా యెట్లు యుండును ?

గు॥ అధిష్టాన చేతన బ్రహ్మమగు యెరుక పంచ తన్మాత్ర సహితము గనుక విషయవాసనా పద్ధతి ననుసరించి ఉత్పత్తి, స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణ

పద్ధతులు కలిగియుండును పరిపూర్ణ పరబయలు తన్మాత్రరహితము గనుక యెరుక నిర్ణయము తెలియక ఎరుక వలన చలింపక యుండును.

శి॥ ఎరుకలేక సేవించుట యెట్లు ?

గు॥ పంచతన్మాత్రరహితముగా అచల పరిపూర్ణ పరబయలును గురు మూర్తి దర్శింప జేసినాడు గనుక ఆ దర్శన భాగ్యమున కర్మత్యాగము కర్మ ఫల త్యాగముగా గాక కర్తృత్వరహితముగా కర్మ ఆచరించిన యెరుక లేకుండా పోవును గనుక ఎరుకలేక సేవింప దగునని నిర్ణయము.

శి॥ వట్టియాశల చేత పట్టుబడక యీగుట్టు దేశికునోట ఘట్టిగా తెలుసుకో వలయునని యెందుకు నిర్ణయించినారు ?

గు॥ నేల విడిచి సాము వేయుటకు వీలుగాని విధమున మానవ తరుణో పాయమునకు నిర్ణయించిన వేదాంత సిద్ధాంత నిర్ణయంబులు అనగా ఋక్, యజుర్ సామ, అధర్వణంబులు యనువేదములు, వేదశిరస్సులగు ఉపనిషత్తులయందు నిర్ణయములగు వేదాంతములు, శాంతి పద్ధతుల నిర్ణయమగు సిద్ధాంతము యీ త్రివిధములు వేదము యనుపేరనే నిర్ణయము, వేద వేదాంతము, పరమశివుడు బ్రహ్మదేవునికి ప్రబోధించగా బ్రహ్మ తన మానస పుత్రుడైన వశిష్ఠునకు, వశిష్ఠుడు శ్రీరామ చంద్రునకు, శ్రీరామచంద్రుడు ఆంజనేయునకు ప్రబోధించి యున్నాడు. అందు సచ్చిదానంద స్వరూపమగు చేతన బ్రహ్మమే పరిపూర్ణ బ్రహ్మమని నిర్ణయించియున్నారు.

అంతములేని ప్రపంచమే స్వరూపముగా గలిగినట్టియు, సర్వమును వ్యాపించినట్టియు, సమస్తమునకు ఆశ్రయుడై నట్టియు విశ్వవ్యాపియగు విష్ణు మూర్తియను పరమాత్మ యీ విశ్వమంతయు తిలకించి తనను తాను తెలుసుకొని యిది యంతయు యేనుగు తొండమువలె కదులుచు నిలకడ లేకుండా ఉత్పత్తి స్థితిలయ వి స్తీర్ణ ఆకర్షణంబులు పొందుచున్నది. దీని శాంతి కొరకు నిర్ణయించిన వేదశాంతి పఠనము ద్వారా తెలియుచున్న అచల పరిపూర్ణ పరబయలు జనన మరణములు లేక శాశ్వతముగా నిలచి యుండునని సిద్ధాంత పద్ధతి తెలుసుకుని,

శ్లో॥ బ్రహ్మస్వరూపముదయే మధ్యాహ్నంతు మహేశ్వరం
సాయంధ్యాయే సదా విష్ణుః త్రిమూర్త్యాత్మ దివాకరం

అను న్యాయమున, పుత్పత్తి కారకుడు బ్రహ్మ స్థితి కారకుడు విష్ణు, లయ కార కుడు రుద్రుడని నిర్ణయములు యున్నను త్రివిధములయందు యుండు ఏకాత్మ

స్వరూపుడగు సూర్యునికి జనన మరణ రహితమునకు నిర్ణయించిన సిద్ధాంత పద్ధతుగు అచల పరిపూర్ణ పరబయలు నిర్ణయము ప్రబోధించినాడు. **సూర్యుడు** యాజ్ఞవల్కికి, యాజ్ఞవల్కి జనకునకు, జనకుడు శుకునకు, పరంపరగా సాందీపినికి, సాందీపుడు శ్రీకృష్ణ పరమాత్మునకు, శ్రీకృష్ణపరమాత్మ అర్జునునికి, ప్రబోధించియున్నారు. యీ వుభయ ప్రబోధల వలన కలుగు ఫలనిర్ణయము వేదాంతార్థాతీత వేత్తలు నిర్ణయించినారు.

శ్రీరామచంద్రుడు మాయామానస విగ్రహుడని, శ్రీకృష్ణపరమాత్మ లీలామానస విగ్రహుడని నిర్ణయించి యున్నారు.

శ్లో॥ దేహబుద్ధ్యాఽస్మి దాసోఽహం జీవబుద్ధ్యాత్వదంశకః

ఆత్మ బుద్ధ్యాత్వమేవాహ మితిమేనిశ్చితా మతిః॥

తా॥ నేను కేవలము దేహమునని తలచితినా నీకు దాసుడనగుదును. దేహవిశిష్టుడయిన యాత్మయగు జీవుండనని తలచితినా నీ యంశమగుదును దేహ వ్యతిరిక్తుడయిన కేవలాత్మ స్వరూపుడనని తలచితినా పరబ్రహ్మాయగు నీవే యగుదును, ఇట్లని నేను బుద్ధియందు నిశ్చయించుకొంటిని అని ఆంజనేయుడు తన స్థితిని తెలిపినాడు.　　(సీతారామాంజనేయ సంవాదము 3-185)

మంత్రంమంత్రార్థ మంత్రాభిమాన దేవతా స్వరూపంబ లను నీకు దాపకేను
నెఱుగ నుపదేశమిచ్చితి నింతకంటె ఘన విధానంబు లేదు నా మనమునందు
అని శ్రీరామచంద్రుని నిశ్చయము తెలిపినాడు భగవద్గీతలో శ్రీకృష్ణుడు

శ్లో॥ కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ ! త్వయైకాగ్రేణచేత సా
కచ్చిదజ్ఞాన సమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ॥

తా॥ అర్జునా ! నీవు నిశ్చలమగు మనస్సుతో దీనిని వింటివి కదా, పార్థా! నీ అజ్ఞాన జనితమగు మోహము తొలగినది కదా. యనియడుగగా అర్జునుడు

శ్లో॥ నష్టోమోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మ యాఽచ్యుత
స్థితోస్మి గత సందేహః కరిష్యే వచనం తవ॥

తా॥ అర్జునుడు పల్కెను కృష్ణా ! నీ కృప వలన అజ్ఞానము తొలగినది అనగా యింతవరకు నిర్ణయించియున్న ధర్మశాస్త్రములయందు కర్మ సన్యాసము కర్మఫల త్యాగము నిర్ణయించిన పద్ధతులు ప్రయోజన హీనములు. నీ నిర్ణయ

పద్ధతులగు కర్తృత్వత్యాగము, క్షరాక్షర పురుషస్పర్శలేని పుత్తము పురుష పద్ధతి అస్పర్శ యోగము యొక్క పద్ధతి తెలిసి నావలన స్మృతి పొందబడినది. సంశయ రహితుడనై తిని నీ వుపదేశమును పాలింతును అని విన్నవించినాడు.

విశ్వాభియనియగు పరమేశ్వరుడు బ్రహ్మకు, బ్రహ్మ వశిష్ఠునికి, వశిష్ఠుడు శ్రీరామచంద్రునికి, శ్రీరామచంద్రుడు అంజనేయునికి, బోధించిన ప్రబోధ వేద నిర్మితముగా యున్ననూ, భ్రాంతిగలది గనుక పునర్జన్మ హేతువని నిర్ణయము.

విశ్వవ్యాపియగు విష్ణుమూర్తియను పరమాత్మ సూర్యునికి, సూర్యుడు యాజ్ఞవల్క్యకి, యాజ్ఞవల్క్య జనకునికి, జనకుడు శకునికి, శకుడు పరంపరగా సాందీపినికి, సాందీపుడు శ్రీకృష్ణునకు, శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు బోధించిన ప్రబోధ సిద్ధాంత పద్ధతిగనుక పరిపూర్ణ ప్రబోధయని జనన మరణ రహితమునకు సరియైన మార్గమని నిర్ణయముగా యున్నందున యీగుట్టు అనగా యీ రెండు మార్గంబులు వేద పద్ధతులుగానే యున్ననూ, వాటి ఫలా ఫలంబులు దృఢ పద్ధతిగా తెలుసుకొని గురుమూర్తికి శిష్యుడుగావలయునుగాని, అన్నివేద మార్గంబులేయని గురువులకు శిష్యులుగా పట్టుబడకూడదని నిర్ణయము.

(33.) ఎరుకైన రీతినుండును । యెరుగ నశక్యంబటంచు । యెన్నిన యెరుకన్ యెరుగుదు ననినను యెరుకకె । యెరుగుట దుర్లభమనుమ్మి । యీవృత్తబైలూ । యెరుగనె యెరుగరు । దెరుక నీబైలూ । పెరుగాదు విరుగాదు వొరుగాదు తరుగాదు । అరుగాదు కరుగాదు తిరుగాదు మొరుగాదు। యీవృత్తబైలూ । యెరుగనె యెరుగ । దెరుకానీబైలూ ॥

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ పరబయలు యెరుకైనట్టులను యెరుగుటకు శక్యంబుగానటులను యే యెరుక తెలుసు కుంటున్నదో ఆ యెరుకకె యీ గుర్తులన్నీ, అదేవిధముగా అచల పరిపూర్ణ పరబాహ్యమునందు ఐక్యము పొందుతానని నిర్ణయించుకున్న పొందనశక్యము, యెందుకనగా అచల పరిపూర్ణ పరబయలు యీ యెరుకను యెరుగదు ఆ పరిపూర్ణ పరబయలు పెరుగదు విరుగదు వొరుగదు తరుగదు కరుగదు తిరుగదు మొరుగదని భావము.

శి॥ అచలపరిపూర్ణ పరబయలును యెరుక యెందుకు తెలుసుకోలేదు ?

గు॥ శబ్ద స్పర్శరూప రస గంధముయను తన్మాత్ర ప్రపంచము యెంత వరకు యున్నదో అంతవరకు యెరుక తెలుసుకోగలదు. పరబయలు తన్మాత్ర రహితము గనుక తెలుసుకోలేదు. మరియు, యెరుక పుట్టును పెరుగును నిద్రిం

చును తగ్గును కరుగును తిరుగును మొరుగును వచ్చును" పరిపూర్ణ పరబయలు పుట్టుట గిట్టుటలేదని నిర్ణయము.

(38) పలుకున బలుకగరాకను । తలపోయుదమనినమదికి దగులక యెపుడున్ । ములుగ్రుచ్చ సంధిలేకను । కలిగున్నది బట్ట బయలు । గదరామాయన్నా । యిదిగో చూడు కదులాదో యన్నా । పలుకన్న బలుకాక । తలపన్న దెరుగాక । చలియెండవానాల నలయాక నిలచుండు । గదరామాయన్నా ఇదుగో చూడు కదులాదో యన్నా ॥

ఓ,శిష్యుడు ! పరిపూర్ణ పరబయలు వాచ్యా వాచ్యర్థములకు అందు నట్టిది గాదు. లక్ష్యలక్ష్యార్థముగా మదిలో దానిని తలపోయదమనిన మనసునకు సాధ్యముగాదు. అనగా మనసునకు తగలదు ముల్లుగ్రుచ్చ సందులేక అది యున్నది అదిగో చూడుము. అది కదలక. యితర వస్తువులను కదిలించక పలుకైన పలుకక యెండకు యెండుక. వానకు తడియక, చలికి వణకక తలంపులకు తెలియక అస్థిర మనునది లేక స్థిరముగా యున్నది.

శి॥ మాటలచేత చెప్పుటకు యెందుకు సాధ్యముకాదు ?

గు॥ రూపముగలదానిని మాటలచేత వర్ణింపవచ్చును. రూపములేని దానిని యెట్లు వర్ణింపగలము.

శి॥ బయలని, అచలమని, పరిపూర్ణమని చెప్పబడినది ఐక్యములేగదా. యివి పరిపూర్ణమని యనబడదా ?

గు॥ అనబడవు ఎట్లనగా, బయలనగా బహిః ప్రదేశమని. చెట్టు చేమలేని చోటు అని చెప్పబడును. యీ వాక్యము వలన చెట్టుచేమ రహితమగు ప్రదేశమే తెలియుచున్నది కాని పరబయలు తెలియడములేదు కనుక, బయలు యను వర్ణన దానియందులేదు. గనుక బయలను వాక్యమునందు పరబయలు నిర్ణయము తెలియదు.

సూదంటురాయి తను ఉన్న చోటుననే వుండి యినుప ముక్కను చలింప జేయుచున్నది. గనుక, సూదంటురాయిని అచలమని యినుప ముక్కను చలనమని నిర్ణయము. అచలమగు వాక్యము వలన చలనములేని సూదంటురాయి తెలియుచున్నది కాని పరబాహ్య నిర్ణయము తెలియడములేదు. గనుక, అచలము యను వర్ణన వలన పరబాహ్య నిర్ణయము తెలియదు.

అపూర్ణ వస్తువునకు పరిపూర్ణమని నిర్ణయము, ఎట్లనగా స్థావర జంగమ జీవోపాధులయందు, యే వుపాధిని ఆ వుపాదే పూర్ణముగా యున్నట్లు తెలియు

చున్నది. వీటి వుపాధికి కారణమైన వస్తువగు 'యెరుక' మరియు అధిష్టాన చేతన బ్రహ్మము పరిపూర్ణమని నిర్ణయము. గనుక, పరిపూర్ణమనే వాక్యమునందు దాని కార్యరూపమైన స్థావరజంగమ నిర్ణయములు తెలియునుగాని పరబాహ్యానిర్ణయము తెలియదు గనుక పరబాహ్యమును బయలని, పరిపూర్ణమని, వాక్యములచేత వర్ణించుటకు సాధ్యముకాదని నిర్ణయము.

శి॥ మనస్సు చేత మననము చేయుటకెందుకు సాధ్యముగాదు?

గు॥ పరబాహ్యము నందు మనస్సు తోచుచున్నది గాని మనస్సునందు పరబాహ్యములేదు. యెట్లనగా, సముద్రముయందు చేప తెలియుచున్నది గాని చేప లోపల సముద్రములేదు గనుక, చేపకు సముద్రమును మననము చేయుట యెట్లు సాధ్యపడదో అట్లు పరబాహ్యమును మననము చేయుటకు మనస్సుకూ సాధ్య పడదు. మరియు దానిని పొందుటకు మనస్సు తరము గాదు.

శి॥ ములుగ్రుచ్చ సందులేక యున్న బయలునందు యింత బ్రహ్మాండము యెట్లున్నది?

గు॥ బ్రహ్మాండము యున్నదనుట బ్రాంతి. ఎట్లనగా వట వృక్షమునకు బీజము అణుమాత్రముగా నుండును వాతవరణము వలన అది మహావృక్షమై నిలుచును, అగ్నివలన వృక్షము బూడిద రూపమగును. వాయువు వీవగా ఆ బూడిద లేకుండా పోవును. ఆ బీజమునుండి యింత వృక్షము యెచటనుండి వచ్చెను. అగ్నివలన దహించి యెచ్చటికి పోయినదో తెలియదు కాని వచ్చిపోయిన దనే గుర్తు మాత్రము వుండును. ఎరుకై యున్నంత వరకు ఆగుర్తు వుండును మరుపునందు ఆ గుర్తుకూడా లేకుండా పోవును గనుక బ్రహ్మాండము వున్నదనే నిర్ణయము బ్రాంతియని సిద్ధాంతము.

శి॥ పలుకన్న పలుకక, తలపన్న దెరుగక, చలియెండ వానల కలియక వుండుటెట్లు ?

గు॥ ఆకాశగుణమగు శబ్దము ఉపాధిననుసరించి పర, పశ్యంతి, మధ్యమ వై ఖరిగా ఎరుక పరిణామము జెందుచున్నది. పరబయలునకు ఆకాశ గుణమగు శబ్దము, పరిణామము జెందు యెరుక లక్షణములేదు గనుక పలుకన్న పలుకదని నిర్ణయము పరబ్రహ్మము జగత్తును పుట్టించగోరి,

శృ॥ సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి ॥

యని తలంచి జగత్తును పుట్టించినాడు. అటువంటి తలంపు పరబయలు యెరుగదని నిర్ణయము. చలి యెండ వాన యను స్వరూపము గల కాలత్రయంబులు

నిర్ణయాను సారముగా కురియక హెచ్చు తగ్గులుగా కురిసినందున సస్యములు పండక జంగమ జీవులుఆయాసపడును అధికముగా కురిసినందున భూకంపాదులు, జలప్రళయాదులు బ్రహ్మప్రళయము వరకు జరుగును గనుక బ్రహ్మాండమునకు అలసట గలదు యీ పద్ధతి పరబాహ్యమునకు లేదు గనుక చలి యెండ వానలకు పరబయలు ఆయాసము పొందక నిలుచుండునని సాంప్రదాయక సిద్ధాంతము.

(౩౫.) సామార్థ్య మేమిజూపదు । కామక్రోధాదికముల గలయదనిశమే । నాముతెరుంగదు యితరులు । యేమనినను మారుబల్కా ౹ దీబట్టబైలూ ౹ దీనికి మ్రొక్కేరితర జేజేలూ ! నామరూపక్రియ నటనలన్నియుమీరి । యేమని యవ రాక యేకమై యున్నాది యీబట్టబైలూ । దీనికి మ్రొక్కేరితర జేజేలూ॥

ఓ, శిష్యుడా ! పరబయలు యే సామర్థ్యము జూపదు కామ క్రోధాధికముల కలయదు. ఉపాధియనునది యెరుగదు. ఎవ్వరేమనిననూ మారుపలుకదు. దీనిని యితర జేజేలు దర్శించి మ్రొక్కెదరు. కాని నియమిత దేవతలకు దానిని తెలియుటకు సాధ్యముకాదు ఎందుకనగా, అది నామరూపక్రియ నటనలన్నియు అంటక అతీతమై యిట్టి దట్టి దనరాక అన్యముగా యున్నదని భావము.

శి॥ బయలు సామర్థ్యము యేమీ యెందుకు జూపదు ?

గు॥ సామర్థ్యమనగా, ఉపాయము, నేర్పు శక్తి యనియు, మరియు బుద్ధి యనెడు గంధద్రవ్య మనబడునని నిర్ణయము. ఈ విశేషములన్నియు మూలం లేని గుర్తెరిగే శరీరముయందు తెలియునుగాని, పరబయలునందు తెలియవు. గనుక పరబయలు సామార్థ్యమేమి జూపదని నిర్ణయము.

శి॥ మూలంలేని గుర్తెరిగే శరీరముయందు యెట్లు తెలియును ?

గు॥ "శ్రు॥ సోకామయత బహుస్యాం ప్రజాయే యేతి" అను న్యాయము ననుసరించి మూలంలేని గుర్తెరిగే ఎరుకయను చేతనబ్రహ్మము జగత్తును పుట్టింప గోరి యితర పదార్థము లేనందున తానే తన స్వరూపమైన జగన్నిర్మాణ శక్తి చేత అనేక ప్రాణులను పుట్టించెను. యిటువంటి సామర్థ్యము పరబయలు చూపదని నిర్ణయము.

శి॥ కామక్రోధాధికముల కలయక యెట్లుండును ?

గు॥ ప్రాణమయ కోశ ధర్మంబులు ఆకలిదప్పులు వాటి నివారణ కొరకు. అన్నపానాదులు అవసరము గనుక వాటిని ఉపాయముచేత సమకూర్చవలయును. అన్నపానాదులవలన కలిగిన శుక్ల శోణితములచే ఉపాధిజెందిన భార్యాపుత్రాదు

లను పోషింపుట నేర్పుయనబడును. ఆకలిదప్పి నివృత్తికి అన్నపానాదులు వంశాభివృద్ధికి సంతానము ఉన్నవారిని లోకులుచూచి వీరు పుణ్యాత్ములని స్తుతించెదరు గనుక వాటి స పదయందు యిచ్ఛగలిగి యుందురు. అవి నమ కూరని యెడల కామ క్రోధ లోభ మోహాభయముల నొందుదురు, యీ పద్ధతులు పరబయలు తెలియదని నిర్ణయము.

శి॥ బయలు పుట్టుక యెట్లు యెరుగదు ?

గు॥ అవస్థాత్రయసాక్షి కాల త్రయాధిష్టానమగు యెరుక సకలోపాధులకు కారణము గనుక పుట్టుట గిట్టుట యెరుకకు తెలియునుగాని పరబయలుకు తెలియదు.

శి॥ యితరులు యేమనినను మారు పలుకక యెట్లుండును ?

గు॥ ఎరుకయందు భ్రమగల మతముల వారు అనగా ద్వైతా ద్వైత విశిష్టా ద్వైతులు—జీవేశులు బ్రహ్మస్వరూపులు శాశ్వితులు, త్రిగుణ సామ్య ప్రకృతిమాయ, అశాశ్వితమని అద్వైతుల నిర్ణయము.

జీవుడు, ఈశ్వరుడు ప్రకృతియను త్రివిధములు సనాతనములు గనుక శాశ్వితమని విశిష్టాద్వైతులు.

జీవుడు, ఈశ్వరుడు తేజః, అంధకారము భిన్నముగా యున్నట్లు, భిన్న స్వరూపులేగాని ఏకము కావని ద్వైతులు నిర్ణయించుకొని వాదోపవాదములు వేయు చున్నను పరబయలు "అవును" "కాదు" యని ప్రతిధ్వనించదని నిర్ణయము.

శి॥ పరబయలుకు నమస్కరించే యితర దేవతలు యెవరు ?

గు॥ పృథ్వియధిష్టాన దేవత బ్రహ్మ, జలాధిష్టాన దేవత విష్ణువు, అగ్ని అధిష్టానదేవత రుద్రుడు వాయువు అధిష్టానదేవత ఈశ్వరుడు. ఆకాశ అధిష్టాన దేవత సదాశివుడు, మరియు శ్రోత్రమునకు దిక్కులు, త్వక్కునకు వాయువు చక్షువునకు సూర్యుడు, జిహ్వకు వరుణుడు, ఘ్రాణమునకు అశ్వనిలు, వాక్కుకు వహ్ని, పాణికి యింద్రుడు, పాదమునకు ఉపేంద్రుడు, పాయువునకు మృత్యువు ఉపస్థకు చతురాననుడు-మనస్సుకు చంద్రుడు, బుద్ధికి బ్రహ్మ, చిత్తమునకు జీవుడు, అహంకారమునకు శివుడు, వీరలు యెరుకతో పుట్టి యెరుకతో పెరిగి, యెరుకతో లయము పొందువారుగా వున్నందున వీరికి నియమిత జేజేలని నిర్ణయము.

దుర్లభమైన మానవోపాధికివచ్చి జనన మరణములు కాని పరబయలును, గురుమూర్తిచేత తెలుసుకొని కర్మ సన్యాసము, కర్మఫలత్యాగ పద్ధతిగాగాక

కర్తృత్వ రహిత కర్మాచరణ యొనర్చిన వారు యితర జేజేలని నిర్ణయము.

శి॥ నామ రూప క్రియ నటనలన్నియు మీారి యేమనియన రాక బయలు యెట్టున్నది ?

గు॥ నామమనగా పుట్టిన దానికి పేరు పెట్టుట-నామకరణ - మనబడును. రూపమనగా ఆకారము కలిగి చక్షురేంద్రియ మనోగోచర మగునది రూపమన బడును. క్రియ యనగా ఆరంభ రూపకర్మ.

నటన యనగా లేని యెరుక వున్నట్లు నటించే కపట ప్రవర్తన. యీ లక్ష ణములుగల యెరుకను, అంటకుండ అతీతమైనది పరబయలని నిర్ణయము.

ప (౩౬) ఇంతంతని యనరానిది । వింతలుకాయనిది యెన్ని విధముల గని నన్ । చింత లెరుంగనిదీ । బయలెంతని వినిపింతునేనీ । కేమిర పృథుకా । తెల్పుట వినుట మిక పెద్ద కథకా । సంతాత మొకరీతి సకలదేశమూలాయం । దంతాట నిండున్న దదుగో పరిపూర్ణాము । యేమిర పృథుకా । తెల్పుట వినుట మిక పెద్ద కథకా॥

ఓ, శిష్యుడా ! యీ పరబయలు యింత అంతయని చెప్పరానిది వింతలు చాయనిది. యెన్ని విధములు విచారించినా చింతలను తెలుసుకొననిది గనుక ఆ పరబయలు విషయము నీకు యేమని చెప్పగలను నేను చెప్పుటకు నీవు వినుటకు యిది కథయా ! ఎల్లప్పుడు ఒక్కరీతిగా సకల దేశములయందు సర్వకాలముల యందు అంతటా నిండి నిబిడీ కృతముగ యున్నది. ఆ పరబాహ్యము అదిగో చూడుమని భావము.

శి॥ యింత అంతయని చెప్పశానికిరాని కారణమేమై యుండును.

గు॥ గంధతన్మాత్ర యెంతవరకు యుండునో పృథ్వి అంతవరకు యుం డును. రసతన్మాత్ర యెంతవరకు వుండునో జలము అంతవరకుండును. రూపత న్మాత్ర యెంతవరకుండునో అగ్ని అంతవరకుండును. స్పర్శతన్మాత్ర యెంతవరకుం డునో వాయువు అంతవరకుండును. శబ్దతన్మాత్ర యెంతవరకుండునో అంతవరకు ఆకాశముండును. ఆకాశమెంతవరకుండునో అంతవరకు మితముగా ఆకాశాధి కము (కూటస్థము) యుండును గనుక పంచతన్మాత్ర నిర్ణయము గల వస్తువులన్నిం టిని యింతది అంతదియని నిర్ణయించి చెప్పవచ్చును. పంచతన్మాత్ర రహితమగు పరబయలును యింత అంతయని నిర్ణయించి చెప్పుటకు సాధ్యముకాదు.

శి॥ వింతలు యెందుకు చేయదు ?

గు॥ వింతయనగా అన్యము యని యర్థము గనుక పరబయలు తనను తాను యెరుగదు అన్యము వున్నదనియెరుగదు గనుక వింతలు చేయదని నిర్ణయము.

శి॥ వింతలు యెట్లు యెరుగదు ?

గు॥ పరబయలుకు సంకల్ప రూపమగు మనస్సు లేదుగనుక శోక మోహ రూప తలంపు యెరుగదు.

శి॥ పరబయలును వర్ణించుట యెందుకు సాధ్యముకాదు ?

గు॥ పంచతన్మాత్ర స్వరూపమైన చేతనబ్రహ్మమును కూటస్థుడు, సాక్షి, సత్యజ్ఞానంద స్వరూపమని వాక్యములుచేర్చి ప్రబంధములు అనేకముగా చెప్ప వచ్చును. గాని, పంచతన్మాత్రలు లేనిది పంచతన్మాత్ర స్వరూపము గానిది పర బయలు గనుక కథగా చెప్పుటకు వీలుగాదు యీ పరబయలు ఆదిమధ్య అంతముయనే నిర్ణయములేక సర్వదేశములయందును సర్వకాలములయందును సమస్తమైన వస్తువులయందును నిండివున్నది పరిపూర్ణము అదిగో చూడుము.

(30) కనరానిదాన్ని శూన్యం అని యనదగునుగాని బయలు । ననదగదు. సుమీ । కనవచ్చుచున్నదిందులో । కనుగొనుటకు యెరుకలేదు। కనుగొనరాదా। యెరుకనె శూన్యమని యనరాదా । కనవచ్చెనా లేద కనుగొంటిలేదాని । యన రాద భయమేమి । యనుమానించకు మిదిగో । కనుగొనరాదా । యెరుకను శూన్య మని యనరాదా ॥

ఓ, శిష్యుడా ! కనపడని యెరుకను శూన్యమని చెప్పవచ్చునుగాని, పర బయలును శూన్యమని చెప్పరాదు. అది, ఆదిమధ్య అంతమను నిర్ణయము లేక సర్వత్ర నిండియున్నది కనబడుచున్నది. యిందులో తెలుసుకొనునట్టి యెరుక లేదు. గనుక ఉన్నది లేనిది నీవు తెలుసుకొని లేనియెరుకను శూన్యమని యనుము. ఎరుకలేని బయలు నీకు కనబడెనా?, కనబడలేదా? "తెలుసుకొంటిని" లేదా, తెలియలేదుయని భయపడక చెప్పుము, అనుమానము లేక యిదుగో చూడుము యని భావము.

(31) దేవుణ్ణి నిన్ను యెరుగవు నీ విప్పటి కెట్టివారో । నే దెల్పెదనీ । కే వెఱిబోధలెందుకు । కావున దేవుణ్ణె యిదుగో । కనుగొనవోయీ । నామరూప

కర్మాలేవోయీ । నీవా దేవునిలోన నినులెస్స వెదకిన । న్నావలి ముచ్చాట నడు గోయితెల్పెద । కనుగోనవోయీ । నామరూప కర్మాలేవోయీ ॥

ఓ, శిష్యుడా ! దేవుడెటువంటివాడో, నీవు యెటువంటివాడవో నీకు తెలియదు. నేను తెల్పెదను వినుము. పరిపూర్ణబోధతప్ప యితరబోధలు వెర్రిబోధలు నీకెందులకు ? వాటితో ప్రయోజనములేదు. ఆ దేవుడ్ని యిదిగో చూడుము- అతనికి నామరూప క్రియలులేవు. ఆదేవునియందు నిన్ను నీవులెస్సగా వెతుకుము- తదుపరి. నన్ను విచారింపుము. అవల విషయము చెప్పెదనని భావము.

శి॥ దేవునియందు నిన్ను నీవు లెస్సగా వెదుకుము. తదుపరి నన్ను విచారించుము. అవలవిషయము చెప్పెదనను నిర్ణయము యేమైయుండును?

గు॥ యితర శాస్త్రములయందు బ్రహ్మము దేవుడుగాను, సత్యజ్ఞానానంద ప్రకాశమైన ప్రత్యగాత్మ స్వరూపము సూర్యచంద్రాగ్ని మండల మధ్యమున హిరణ్మయమైన నీవారసూకము వంటి సూక్ష్మరూపముగానున్న తేజస్విని అనినిర్ణయము వున్నందున, అది నీవు దేవుడని నమ్మియున్నావు, గనుక. నేను నీకు చూపించిన పరిపూర్ణ పరబయలు జనన మరణములు లేనిది. దీనియందు నిన్ను నీవు వెతకి నీయోగ్యత యెటువంటిదో తెలుసుకొని తదుపరి నన్ను విచారింపుము అవలివిషయము తెలియజేయుదును.

(౩౯) లేదనకు మున్నదదుగో । నే దెలిసితిననకు దీన్ని నీ వెరిగేలా కాదది నీచే దెలియను । యేదిర తన్మాత్రసమితి యీ బట్టబైటా, దీనికి సాటి దేది యెచ్చోటా । వాదేల లేనెరుకతోదీన్ని కనిపెట్టి । పాదోలు మెరుక నింకేది బట్టదు బాలు । యీ బట్టబైటా । దీనికి సాటిదేదీ యెచ్చోటా ॥

ఓ, శిష్యుడా ! యీ పరబయలును లేదని చెప్పకుము. ఉన్నది అదిగో చూడుము, దానిని యెరిగితినని చెప్పకుము. నీవు దానిని యెరుగుటకు సాధ్యమగునా సాధ్యముగాదు. ఎందుకనగా, దానియందు పంచ తన్మాత్రల స్వరూప స్వభావములేవు దీనికి సమమైనది యితర మేదియులేదు. వస్తువుయొక్క స్థాన స్వరూప స్వభావములు తెలిసిన తదుపరి వాదముతో పనిలేదు. లేని యెరుకతో వున్నబయలును తెలుసుకొని, లేనెరుకను లేదని విడివిపెట్టినబాలును, జనన మరణ రహితమునకు యితరము యేదియును పట్టదని భావము.

(౪౦) కనవచ్చి యిట్టిదట్టిది । యనియనరాకుండు బయలు । నదెకను గొనుమిా। కనరాకపోతే శూన్యం ॥ బను మిట్టిదియట్టిదనుచు పలుక వచ్చిననూ

యెరుక దాంట్లోపలికి జొచ్చినను ! వినుమూబయలును నీవేమనిన వొప్పెదగ ।
నొప్పను నీమాటను నే జెప్పినరీతిగనవ స్తే ! పలుక వచ్చినమా యెరుకదాంట్లో
పలికి జొచ్చినమా ।

ఓ, శిష్యుడా! యీ పరబయలు అగుపడి వాక్కుచే అటువంటిదని యిటు వంటిదని చెప్పటకు అలవిగాక వుండును. అదిగో దానిని జూడుము. అది అగు పడని యెడల దానిని శూన్యమని చెప్పుము అయినా యీ బయలు అట్టిది.యిట్టిది యని చెప్పటకు శక్యమైనను, మరియు యెరుక దానిలోపలకు ప్రవేశించినట్లు తెలియుచున్ననూ, ఆ బయలును నీవు యేమని చెప్పినా నేను ఒప్పుకొనియెద అట్లుగాక, నేను చెప్పిన విధముగానే పరబయలు వున్నదని నిశ్చయించినయెడల నీ మాటలు వొప్పనని భావము.

శి॥ కన వచ్చినది చెప్పటకు యెందుకు సాధ్యముకాదు ?

గు॥ ఎరుగునట్టిది ఎరుక. దీనిచే యెరిగినట్టి విషయములు దీని పరికరము లగు మనోవాక్కు, కాయములను త్రికరణములచే తెల్పుటకు వీలగును. యిట్లు చెప్పగలిగిన ఎరుక అచల పరిపూర్ణమును తెలిసి చెప్పలేక పోవడము ఎందుకనగా'

వాక్కునందు ధ్వన్యాత్మకము వర్ణాత్మకమని రెండు విధములు. వర్ణాత్మక మునకు ధ్వన్యాత్మకము మూలము. గనుక, ధ్వనియందుగల వర్ణము వలననే సకలము వ్యవహరింపబడుచున్నది. వర్ణాత్మకమునకు మూలమగు ధ్వన్యాత్మకము పరబాహ్యమునందు లేదు గనుక అట్టిదానిని వర్ణాత్మకము యెట్లు వర్ణించి చెప్పను చెప్పజాలదు. అయినా, వర్ణాత్మకమువలన యేమి నిర్ణయింపబడుననగా, పర బయలునందు ధ్వన్యాత్మకము లేదని నిశ్చయింపబడునుగాని, పరయలు యిట్టిదని నిర్ణయింపరాదు.

మనస్సువల్ల ఊహించుటకు ఎట్లు తెలియబడదనగా మనస్సుయొక్క ఆవరణమునందు యిమిడి, యున్నదానినే అది విమర్శించగలదు. గాని దాని బాహ్యాంతరములు నిండియున్న పరబయలును ఎట్లు గ్రహించగలదు ఎట్లు విమర్శించగలదు విమర్శించలేదు. అయినా, పరబయలును తెలియజాలననే విషయము నిర్ణయించును.

కాయమునకు ఎట్లు తెలియదనగా, స్పర్శగల ఆవరణ లక్షణము కాయము గ్రహించగలదు గాని ఆవరణము లేని పరబయలు లక్షణము యెట్లు గ్రహించ గలదు ? గ్రహించలేనని నిర్ణయించి చెప్పగలదు గనుక పరబయలు తెలుసుకొని

ఎరుక లేకుండా పోవుటగాని ఎరుక పరబయలునందు లీనమై పోవుననే నిర్ణయము భ్రాంతి జన్యము.

శి॥ ఎరుక పరబయలునందే వున్నదిగదా, దానిలోపల ప్రవేశించక యెట్లు వుండును ?

గు॥ అద్దమునందు ముఖము తెలియునుగాని, అద్దం లోపల ముఖబింబము లేదు. ఆకాశమునందు వాయువు తెలియునుగాని ఆకాశము లోపల వాయువులేదు దీప ప్రకాశము ఆకాశము నందు వ్యాపించి యున్నట్లు తెలియునుగాని, ఆకాశము లోపల అదిలేదు పరయలునందు యెరుక యున్నట్లు తెలియునుగాని, పర బయలు నందు యెరుకలేదు. గనుకనే, ఎరుకతోనున్న జడచేతన రూపమగు ఎరుక, మరుపుయను ద్వంద్వ లక్షణములు పరబయలుకులేవు. ఎట్లనగా.

1. అంద వికారములు ముఖమునందే యున్నవి గాని అద్దముయందులేవు
2. చలనాదికములు వాయువుయందే యున్నవి కాని ఆకాశమునకు లేవు.
3. ఉష్ణాదికములు ప్రకాశమునందే వున్నవి కాని ఆకాశము యందులేవు గనుక.

పరబయలు యందు యెరుకవున్నట్లు తోచును గాని నిజముగా లేదు. గనుక పరబయలు తప్ప యితరము యేమి లేనేలేదని నిర్ణయము.

(౪౧) కనవచ్చు బయలులేదని । యనవచ్చునె యిట్టిదట్టి దనవచ్చునె । ఛీ యనరాదు. యెరుక కెన్నడు । కనుకనె యీ బయలు యెల్లాకాలముంచుందీ। దీనందెరుకే కాలాములేందీ । వినుమీ లేనెరుకాను వివరించ శూన్యమౌ । అను మానమేమెరుక గనువిశ్వమట్టిదే । కాలాముంచుందీ దీనందెరుకే కాలాములేందీ॥

ఓ, శిష్యుడా! అగుపడెడి పరబయలును లేదని చెప్పవచ్చునా! చెప్పరాదు. ఎరుక బయలును జూచి యిట్టి దట్టిదని చెప్పగలదా ? ఛీ దానికి చెప్పరాదు కాబట్టి, పరబయలు యెల్లకాలము వుంటూ వున్నది. యిందులో యెరుక ఏకాలము ఎప్పుడు లేనే లేదు గనుక, వినుము యీ లేనెరుకను విచారించిన యెడల శూన్యమై పోవును గనుక యీ యెరుకచే తెలియబడుచున్న యీ ప్రపంచము కూడా ఉత్త దేయని తెలుసుకొనుమని భావము.

(౪౨) గురుమూర్తి జూపకున్నను । పరిపూర్ణంబెట్లు తనకు ప్రత్యక్ష మగున్ । గురుమూర్తి జూపెనేనియు । పరిపూర్ణము తనకులెన్స ప్రత్యక్షమౌరా। చూస్తునెయెరుక పారిపోవునురా । యెరుకాబోయిన వెనుక యెవరా ప్రత్యక్ష్యన్ని

యెరిగిట్టిదట్టిదంచెరిగే వారటుమీద । ప్రత్యక్షమౌరా । చూస్తునె యెరుక పారి పోవునురా ॥

ఓ, శిష్యుడా! సద్గురుమూర్తి చూపకుండిన పరిపూర్ణపరబయలు తనకు సాక్షాత్కార మెట్లగును. సద్గురుమూర్తి చూపిన యెడల పరిపూర్ణ పరబయలు జనన మరణములు లేనిదని తనకు సాక్షాత్కార మగును పరిపూర్ణ పరబయలు యెరుక దర్శించిన తోడనే తనకుతానే లేకపోవును. పరిపూర్ణపరబయలు దర్శించిన యెరుక పోయిన తర్వాత ఆ సాక్షాత్కారమును తెలుసుకొని, యిటువంటిది అటు వంటిదియని చెప్పుటకు యెవ్వరుండరని భావము.

(४३.) పరమపద మనిన బయలన । గురుగుహ్యమనంతమనిన । గోప్యం బనినన్ । పరిపూర్ణ మచలమనినను ! తిరమనగా బట్టబయలు తెలియుమాయప్పా యీ తెలిసీన తెలివిమానప్పా । యెరుకా ఎరుగనిదన్న ఎరుకామీరినదన్న । యెరుకామరుపులు లేని పరవస్తువన బయలె । తెలియుమాయప్పా । యీ తెలిసీన తెలివిమానప్పా ॥

ఓ, యప్పా ! పరమపద మనినను, పరబయలనినను, గురురహస్యమనినను, అనంతమనిననూ, గోప్యమనిననూ. పరిపూర్ణమనిననూ స్థిరమనిననూ,పర బయలని తెలుసుకొనుము. తదుపరి, యీ యెగిరిన యెరుకను విడువుము. ఎందుకనగా, యెరుకను ఎరుగనిదన్ననూ, ఎరుకను మీరిన దన్ననూ ఎరుక మరుపులు గాని ,పరవస్తువనియన్ననూ, యీ పరబయలేయని తెలుసుకొని, యీ తెలుసుకొన్న తెలివిని విడువుమని భావము.

శి॥ అప్పా ! యని సంబోధించుటకు కారణమేమై యుండును ?

గు॥ అప్పా ! యనగా, తల్లి, తండ్రియని నిర్ణయము. తనకు శిష్యుడుగా యున్నవారు స్త్రీలుగాయుంటే "తల్లీ" యనియు, పురుషులుగాయుంటే "తండ్రీ" యనియు గురువు వారిని పిలువవలయును. గాని, యితర యేవిధముగా పిలచినా "శ్లో॥ శిష్య పాపం గురోరపి" యను న్యాయమున, ఆ పాపము గురువు యనుభవించవలయును. ఎందుకనగా, గురువు తెలియజేయు ధర్మమునకు శిష్యుడుగాని వ్యక్తికి శిష్యుడుకాడు గనుక, గురువు శిష్యులను తల్లీ, దండ్రీయని సంబోధింప వలెను.

(४४) బట్టబయలనుచు దీనికి । మొట్టమొదల్ పేరులేదు । ముదమున ఎరుకే । పుట్టి పేర్పెట్టి దీనిని । పట్టుక లవ్వాడలేక । పారిపోవునురా । కనరా

దింగు దూరానేరదురా। పుట్టిచప్పుచుమళ్ళీ బుట్టిగిట్టుచుబుట్టు। నిట్టితిప్పలనొందు ఎరుకె బయలునుజూ స్తె। పారిపోవునురా కనరాదింపు దూరనేరదురా ॥

ఓ, శిష్యుడా ! పరబాహ్యమునకు మొట్టమొదటనే పేరులేదు. ఎరుక పుట్టి తన ప్రకాశము కొరకు బయలను పేరుపెట్టి దానిని పట్టుకొని ప్రవర్తించ లేక పారిపోవును. ఎరుక స్వయముగా కానరాదు పరబయలునందు దూరనేరదు ఎరుక ఎల్లప్పుడూ జనన మరణములు పొందుచుండును. యిటువంటి తిప్పలు గల ఎరుక పరబయలును చూచినచో లేకుండా పోవునని భావము.

## (యెరుక నిర్ణయము)

(४७.) పిండ బ్రహ్మాండంబులు రెం। డును యా రెంటిలోని రెంతహములు యా ॥ ఖండములు నాల్గుకూడి । అఖండంబగు ఎరుకరూపు ॥ గనరా మాతండ్రి। యిది దెల్పిన ఘనుడే తలిదండ్రీ ఖండాఖండములుగా గనుపించె యెరుకానె। దండిదనేటె యుద్దండూల కలనై న గనరా మా తండ్రి। యిదిదెల్పిన ఘనుడే తలిదండ్రీ ॥

ఓ, శిష్యుడా ఆపాద మ స్తక పర్యంతము తెలియుచున్న వ్యష్టి ప్రాణము పిండమని, దాని యందలి వ్యష్టి మనస్సు అహమని; పృథ్వి ఆకాశము వరకు తెలియుచున్న సమష్టి ప్రాణము బ్రహ్మాండమని, దానియందలి సమష్టి మనస్సు అహమని నిర్ణయము. యీ పిండ బ్రహ్మాండములు వీటి అహములు నాలుగును గూడి అఖండమగు ఎరుక యనబడును. యీ ఎరుక యొక్క వాస్తవ లక్షణ మును దెల్పెడి సద్గురువే తల్లి, దండ్రి. ఖండా ఖండములుగా గన్పించుచున్న ఎరుకయే గొప్పదనుచున్న మతకర్తలు, ఎరుక యనెడి కలలోని వారని తెలుసు కొనుమని భావము.

(४८) ఎరుకే దేహేంద్రియములు। ఎరుకే వర్ణాశ్రమములు। యెరుకే శ్రుతులున్ ॥ యెరుకే నీవును నేనును ॥ యెరుకే సతిసోదరాదు। లెరుగుగూమువత్సా నేదీర్చెద విదుగో నీయిచ్చా। హరి, హర, బ్రహ్మాది, సుర నర, గిరి సరి। త్రుణ్మృగముఖ చరాచరములు ఎరుకాని। ఎరుగుము వత్సా। నే దీర్చెదనిదుగో నీయిచ్ఛా।

ఓ, వత్సా! దేహములు యింద్రియములు ఎరుకనే వర్ణములు ఆశ్రమ ములు ఎరుకనే, శృతిస్మృతులు ఎరుకనే, నీవు నేను ఎరుకనే, సతిసోదరాదులు ఎరుకనేయని ఎరుగుము. యిదిగో, నేను నీకోర్కెను తీర్చెదను. హరి, హర,

బ్రహ్మాది నియమిత దేవతలును, నరులు పర్వతములు, నదులు, స్థావరజంగమ జీవోపాదులన్నియు ఎరుకనే యని ఎరుగుమని భావము.

శి॥ దేహములు, యింద్రియములు ఎరుకయని నిర్ణయించుటను కారణమేమై యుండును ?

గు॥ దేహమనగా మేను, పుట్టునది. యింద్రియములనగా మనస్సు, దాని పరిణామమగు జ్ఞానకర్మేంద్రియములు

శి॥ వర్ణము, ఆశ్రమములు యెరుక ఎట్లు?

గు॥ ఎరుక యగు మనస్సు, జ్ఞానేంద్రియ రూపమున విషయ పంచకము తెలుసుకొని కర్మేంద్రియరూపమున మతకర్తల నిర్ణయాను సారము కర్మమొనర్చి. యిది బ్రాహ్మణకర్మ, యిది క్షత్రియ కర్మ, యిది వైశ్యకర్మ, యిది శూద్రకర్మ, యిది బ్రహ్మచర్యమ, యిది గృహస్థము, యిది వానప్రస్థము, యిది సన్యాసము యని తన గుర్తుయందు తానే నిర్ణయించుకొని, ప్రవర్తించును గనుక, వర్ణములు ఆశ్రమములు ఎరుకయని నిర్ణయము.

శి॥ శృతి, స్మృతులు ఎరుక యనుటకు కారణమేమి ?

గు॥ శృతి యనగా వేదము, స్మృతులు యనగా తలంపులు. ధర్మశాస్త్రములు తమ తమ అనుకూల పద్ధతిగా తలంచుకొని యేర్పాటు చేయునవి గనుక, వేదశాస్త్రములు యెరుకయని నిర్ణయము,

శి॥ నీవు నేను యనునది యెరుక యెట్లు ? సతి, సోదరీ సోదరులు యెరుక యనుట యెట్లు ?

గు॥ ప్రాణమనంబుల రూపమగు యెరుక ద్వంద్వైక యేక రూపము. ఏకైక ద్వంద్వ రూపముగా యున్నందున నీవన్నా, నేనన్నా, సతియన్నా, సోదరియన్నా, సోదరులన్నా, భేధ పద్ధతులుగా తెలియుచున్న యెరుక యందలి నిర్ణయములేనని తెలియుము.

శి॥ హరి, హర, బ్రహ్మాది, సుర, నర, గిరి, సరి తరు మృగముఖ చరాచరములు యెరుకని యెట్లు యెరుగ వలయును ?

గు॥ సృష్టిచేయువాడు బ్రహ్మ, స్థితి యొనర్చువాడు విష్ణువు, లయమొనర్చువాడు రుద్రుడు, విస్తీర్ణమొనర్చువాడు ఈశ్వరుడు, ఆకర్షణ మొనర్చువాడు సదాశివుడు, సురలనగా దేవతాస్త్రీలు బాలాత్రిపుర సుందరీ, రాజరాజేశ్వరి, గాయత్రి మొదలగువారు; మరియూ, రసగ్రాహ్యమును ఒకే తెలివిగల స్థావరంబులు. రస

రూపమను రెండు తెల్వులుగల జలచరంబులు, గంధ రసరూపమను మూడు తెల్వులుగల పక్షులు, గంధరస రూప స్పర్శ నాలుగు తెల్వులుగల మృగాదులు, గంధరస రూప స్పర్శశబ్దమను యైదు తెల్వులు గల మానవులు; మరియు వీటిని సంస్కరించునవి పర్వత భూజలాదులు, చరాచరంబులు యెరుకయని తెలియుము.

శి॥ 'నే దీర్చెద నిదిగో నీయిచ్చా' యనగా నేమి?

గు॥ ఎరుకనే శాశ్వితమని త్రిగుణసామ్య ప్రకృతి మాయయని యీ రెండు వేరని ఎరుకనే పరిపూర్ణమని ముందు వినియున్నాడు, పరిపూర్ణ ప్రబోధ వల్ల ఎరుకనె మాయయని మరుపుగలదని జన్మాదులకు కారణ కార్యములు ఎరుకనేయని నిర్ణయమగుచున్నందున, శిష్యుని సంశయము నివర్తించగలదని నిర్ణయము.

(౪౭) ఎరుకే విద్యా విద్యలు । యెరుకే ప్రణవంబునాద । మెరుకే కళయున్ యెరుకేబిందువు చిత్సత్తెరుకే అనందమిది నీ । వెరుగుసద్బుద్ధీ! నీనామాట లెరుకేని బద్ధీ యెరుకే నిర్గుణసగుణా । లెరుకే యెరుకకుయంత । యెరుకో నేనిది యంత యెరుకాజేసితి । నీ విబ్లెరుగు సద్బుద్ధీ । నీనామాట లెరుకే నిబద్ధీ॥

ఓ, శిష్యుడా! విద్యావిద్యలును, ప్రణవమును, నాదు బిందు కళయును, సత్తు, చిత్తు, ఆనందమును, ఎరుక యొక్క పరిణామములని నీవు తెలుసుకొనుము. ఓ, సుబుద్ధిమంతుడా ! నీ, నా వాక్యమునందు గల నిర్ణయము నిజముగా యెరుకే యని యెరుంగుము మరియు, సగుణ నిర్గుణములు యెరుకనే, అయినా, అది ఇది యననేల యమము నియమము ఆసనము ప్రాణయామము, ప్రత్యాహారము, ధ్యానము ధారణ, సమాధి, తారక, సాంఖ్య, అమనస్క మహా వాక్యవార్థిక పద్ధతులంతయు ఎరుకేయని నీకు తెలియజేయుచున్నాను. సర్వము యెరుకేయని నీవు తెలుసుకొనుమని భావము.

(౪౮) ఎరుకే ఇహపరసౌఖ్యము । లెరుకే జ్ఞానంబుజ్ఞేయ మెరుకే మోక్షం। బెరుకేభక్తి విరక్తులు । యెరుకే సంకల్పమని నీ । వెరుగుసత్కీర్తి॥ యెక్కడికొర యెరుకాసంపూర్తి । యెరుకె జీవుండీప డెరుకేత దేకత । ఎరుకె సర్వము నే గురుతెరిగి చెప్పితి । యూకీలెరుగూ సత్కీర్తి । ఎక్కడికొర ఎరుకా సంపూర్తి ।

ఓ, శిష్యుడా ! ఇహపర లోకములు ఆ లోకములయందలి భోగములు ఎరుకనే, జ్ఞానము, జ్ఞేయము యెరుకనే మోక్షము యెరుకనే, భక్తి విరక్తులు సంకల్పము యన్నా ఎరుకనే ఓ, సత్కీర్తి మంతుడా ! యెరుక యొక్క

సంపూర్తి యెంతవరకు యనగా, యెరుకే జీవుడు, యెరుకే యీశ్వరుడు, ఈ రెంటి ఐక్యము అనగా, జీవేశ్వరైక్యము ఎరుకయొక్క సంపూర్తి యని నిర్ణయము గనుక ఎరుకయొక్క పూర్ణత్వము నేను తెలుసుకొని నీకు తెలియజేయుచున్నాను. యీ మర్మము నీవు తెలుసుకొనుమని భావము.

(౪౮) వింతల తోటన ఎరుకే । వింతల పుట్టిల్లనంగ వెలసిన దెరుకే । తంతుల పేటన ఎరుకే । పంతములకు చూడమూల బలమన్న నెరుకే । జగజ్జనన స్థలమన్న నెరుకే । భ్రాంతూలకెల్లను పట్టణమనజెల్లి కాంతాదిరూపూలు గల్పించుటకు । మూల బలమన్న నెరుకే । జగజ్జనన స్థలమన్న నెరుకే ॥

యీ యెరుక తలంపులకు తోట వంటిది. వింతలకు పుట్టిల్లు వంటిది. తంతులకు పేట వంటిది పంతములకు మూల బలము వంటిది. జగత్తు పుట్టుటకు స్థానము యెరుకనే, భ్రాంతులకెల్లను పట్టణమన దగును. స్త్రీ పురుషాదుల రూపముల గల్పించుటకు, ఎరుకనే కారణ కార్యమని నిర్ణయము.

శి॥ వింతలకు తోట వంటిది యనగానేమి ?

గు॥ తోట యనునది ఒక పదము ఆ తోటయందు అనేక వృక్షలతాదులు వుండును అదే పద్ధతిగా యెరుక యనునది ఒకే వస్తువు యెరుక యందు అనేక తలంపులుండును. కనుక, యెరుక వింతలకు తోటవంటిదని నిర్ణయము.

శి॥ వింతలకు పుట్టినిల్లు యనగా నేమి ?

గు॥ వింత అనగా అన్యము అని నిర్ణయము కరచరణాది అవయవములతో తానేపుట్టి 'సర్వావయానాం శిరః ప్రధానం', 'సర్వేంద్రియానాం నయనం ప్రధానం', "సర్వాత్మానాం బ్రహ్మ ప్రధానం" యని నిర్ణయించుకొని ప్రధానమైన తనకు అన్యమని, తనయందే తాను నిర్ణయించుకొని ప్రవర్తించును గనుక, వింతలకు యెరుక పుట్టిల్లని నిర్ణయము.

శి॥ తంతులకు పేట వంటిది యనగా నేమి ?

గు॥ తంతు యనగా వుభయార్థసాధకమైన ఉపాయము. పేట యనగా ముక్కులోని గాలి. యీ గాలిని బ్రహ్మమని ప్రతిపాదించి ప్రపంచ పారమార్థ పద్ధతులయందు, తన ఆధిక్యత నిలుపుకొను ఉపాయము గలది యెరుక యని నిర్ణయము.

శి॥ పంతములకు మూల బలమనగా యెటువంటిది ?

గు॥ పంతమనగా ప్రతిజ్ఞ, ఏదైన ఒక పనిని తప్పక చేసెదనని ధృఢముగా జెప్పుట యెరుకకు సహజపద్ధతి యని నిర్ణయము.

గు॥ జగత్తు యనగా గాలి, తిరుగునది యని నిర్ణయము. గనుక, ఎరుక ప్రాణరూపమున సంచరించుచు సకలమును పుట్టించును గనుక జగత్తు ఉపాధికి స్థానము యెరుకనే యని నిర్ణయము.

శి॥ భ్రాంతుల కెల్లను పట్టణమన జెల్లుననగా నేమి ?

గు॥ భ్రాంతియనగా ఉన్నది లేనట్టు, లేనిది వున్నట్లు తలంచుట పట్టణ మనగా కోట చేతను, కోట చుట్టు త్రవ్వబడిన జలాధారముచేతను దుర్గమమైనది. అనగా ప్రవేశించుటకు సాధ్యము కానిది. అదే పద్ధతిగా, వున్న పరబయలును లేనట్లు, లేని యెరుకను వున్నట్లు శాస్త్రములు నిర్ణయించి ఇహపరలోక భ్రాంతులు కల్పించి పరబయలును తెలియుటకు, సాధ్యముగాకుండ నిర్ణయించియున్నారు. గనుక భ్రాంతుల కెల్లను పట్టణ మన దగునని నిర్ణయము.

శి॥ కాంతాది రూపములు కల్పించుటకు ఎరుక కారణ మెట్లగును?

గు॥ అన్నపానాదులు యేక పద్ధతిగా నున్నను, అవయవ మార్పు గల్పించి స్త్రీ యని, పురుషుడని, నపుంసకుడని, మాచకమ్మయని నిర్ణయించి ప్రవర్తింప జేయునని యెరుకనే యని, నిర్ణయము.

(౫౦) అన్నియుతానై । తనకవి పన్నుగ వేరనుచు నోటబలుకుచు । మరి తానన్నిటియెరిగే యెరుకై । యున్నానని యెరుకే నెరుక । నూహింపు చుండూ । తనలో తాను మోహింపుచుండూ । యెన్నో విచిత్రా లీ యెరుక సేతలు వింటె । వున్నాది లేదు । లేకున్నాది గలదాని । వూహింపుచుండూ । తనలోతానె మోహింపుచుండూ ॥

ఓ, శిష్యుడా ! పిపీలికాది బ్రహ్మ పర్యంతరము సర్వము తానేయై తనకునవి లేవని చెప్పుచు మరియు సర్వమును తెలుసుకొనెడి యెరుకై వున్నా నని యెరుకే యెరుకను ఊహింపు చుండును. మరల తనలోతానే మోహింపు చుండును. ఓ పుత్రుడా ! యీ యెరుక చేష్టలు విచారించితే యెన్నో విచిత్రము లుగా వున్నవి. ఎట్లనగా, వున్నదిలేదని, లేనిది వున్నదని తనలో తానే తలంచు చుండునని భావము.

శి॥ సమ స్తము తానై న విధము ఎట్లు ?

గు॥ కారణమైన బీజము కార్యరూప వృక్షమగునట్లు కారణమైన ఎరుక కార్యరూపమైన జీవేశ్వర జగత్తుగా నగును.

శి॥ సర్వము ఎరుకగానే వుండి, దానికి తాను వేరని ఎట్లు చెప్పును ?

గు॥ కారణమగు బీజాకారము దానికి కార్యరూపమగు వృక్షాకారము వేరు వేరుగా యున్నందున యిది బీజము యిది వృక్షము యని ఎట్లు నిర్ణయింపబడునో, అట్లు కారణ రూపమైన ఎరుక యొక్క ఆకారము కార్యరూప జీవేశ్వర జగత్తు యొక్క ఆకారము వేరువేరుగా యున్నందున కారణరూపమైన ఎరుక, కార్య రూపమైన జీవేశ్వర జగత్తులను వేరుజేసి తాను వేరని, తనకు అవి వేరని నుడువుచుండును.

శి॥ ఎరుకను ఎరుక ఎట్లు ఊహించును ?
తనలో తాను ఎట్లు మోహించును ?

గు॥ తన యందుగల జీవేశ్వర జగత్తుల వ్యవహారము తెలియజేయుదును గాని, చేయునది నేను గానని నిర్ణయించుకొని, తనలో తాను ఆనందించును.

శి॥ ఎరుక యొక్క వ్యవహారము విచిత్రముగా ఎట్లుండును ?

గు॥ ఊసరవెల్లియను తొండ నిలకడ లేక తన వర్ణములు ఎట్లు మార్పు చేయునో అట్లు జీవేశ్వర జగదోపాధిని స్థావర జంగమ రూపమున మార్పు చేయుచుండును.

శి॥ ఉన్న పరబయలు లేదని లేని తనను వున్నట్లు ఎట్లు ఊహించును ?

గు॥ పంచతన్మాత్ర ప్రపంచము నెరుగునటువంటిది యెరుక గనుక అన్నిటి యందు నేను వుండి తెలుసుకుంటూ వున్నానని ఊహించి లేని తనను వున్నట్లు నిర్ణయించును. పంచ తన్మాత్రులు లేనిది పరబయలు గనుక దానిని నిర్ణయించ లేక అది లేదని చెప్పును.

(౫౧.) తల్లిదండ్రులు జీవేశులు । యిలవ్యోమము లేనుమేను । లెరుక మరుపులున్ । కలమేల్కలు శుక్లాశ్రమంబులు । నీరాన్నములు ప్రకృతి పురుష డాల్మగడూ ॥ గానై యెరుకకెరుకే కానబడూ । తెలసి బయలున్నాది దెలశీ యా తెలివినీ । తెలివిచేతనెబట్టి తీసివెయ్యము ॥ ప్రకృతి పురుషూడాల్మగడూ । గానై యెరుక కెరుకే కానబడూ ॥

యెరుక యే తల్లిదండ్రులూ, జీవేశ్వరులు, భూమ్యాకాశములు నేను మేనులు, యెరుక మరుపులు, కల మేల్కలు, శుక్ల శోణితములు, అన్న పానములు, ప్రకృతి పురుషులు, భార్యాభర్తలుగానై తనను తానే ద్వంద్వ పద్ధతిగా నెరుగు చున్నదని తెలియుము. మరియూ, పరబయలున్నదని తెలిసిన తదుపరి యీ రెంటిని తెలిసిన తెలివిని ఆ తెలివి చేతనే తీసివేయుమని భావము.

శి॥ ద్వంద్వరూపములు తెలియుచున్న ఎరుక తనను తాను యెట్లు తొలగించనగును?

గు॥ ద్వంద్వరూపముగా ప్రవర్తించే యెరుక పరబయలు దర్శనమునకు పూర్వము దేనియందో ఒక దాని యందు భ్రాంతి కలిగియుండును. పరబయలు దర్శన మాత్రమున తన ద్వంద్వ పద్ధతులకు మూలము లేకుండా పోతున్నది గనుక ద్వంద్వ పద్ధతి విడనాడి తాను లేకుండా పోవును.

(౫౨) ఆటాడి ఆడకుండును । ఆటాడిన మేనుబొమ్మ యాటాడకనే । ఆటాడు ఎరుక యనియెడి । యాటాడించేటివాడు అతడేరా కర్త ! అంతటికీ యీ అచలమకర్తా । చేటుపాటుల రెంటిచేవొచ్చ ఫలము । ముమ్మాటికనుభవించి । మరణ జననములొంద ! నతడేరాకర్త । అంతటికీ యీ అచలమకర్తా॥

ఓశిష్యుడా ! ఎరుకయగు పురుషుడు ఆటాడును, ఆడకుండా యుండును. మరియు శరీరముచేత ఆడకుండా తనలోనే తాను ఆడుచుండును. గనుక, ఆటాడించువాడు, యెరుకయను పురుషుడే. కర్తయని నిర్ణయము. యీ సర్వమునకు పరబ్రాహ్మము అకర్తయని తెలుసుకొనుము. అందువలన, స్వర్గ నరకాదుల ఫలప్రాప్తి కొఱకు యొనర్చు, కర్మజ్ఞాన ఫలంబులు అనుభవించి జనన మరణముల నొందుటకు యెరుక పురుషుడే ముమ్మాటికీ కర్త భోక్తగాని, అచల పరిపూర్ణ పరబ్రాహ్మము కర్తగాని, భోక్తగాని కాదని భావము.

శి॥ యెరుక పురుషుడు, ఆటాడు యను నిర్ణయమేమై యుండును ?

గు॥ జ్ఞానేంద్రియములచేత విషయ పంచకము తెలుసుకొని, కర్మేంద్రియములచేత కర్మమొనర్చు పద్ధతులు వాక్కుచేత వచింపడము, అనగా, వేదములు పఠన పాఠన మొనర్చినవారు పుణ్యాత్ములు, పఠన మొనర్చనివారు పాపాత్ములు. పాణిచేత యజ్ఞ యాగాదు లొనర్చువారు యింద్రాది భోగంబులనుభవించెదరు, యొనర్చనివారు అటువంటి భోగంబు లనుభవించరు. పాదముచే గమన మొనర్చడము అనగా, తాను చేయు ప్రయాణము పుణ్యకార్యమునక పాపకార్యమునక యని తెలుసుకోవడము. గుహ్యముచే సంతానముగని యానందించుట, గుదముచే విసర్జించుట యనగా, శరీరము వాతపిత్త శ్లేష్మ రహితముగా నుంచుట, యెరుక పురుషుడు యాటాడు యని నిర్ణయము.

శి॥ యెరుక పురుషుడు అడకుండా వుండుననే నిర్ణయము యెటువంటిది ?

గు॥ పగలు రాత్రి యను నిర్ణయము లేకుండా. సూర్యచంద్ర నాడుల రూపమున, సంచరించుచున్న ప్రాణవాయువును, కుంభించి, మూలబంధము

వొడ్యాణబంధము, జాలాంధర బంధము, అను బంధ త్రయమున, కుండలిని పెకిలించి, షట్చక్రభేదన మొనర్చి, గంగ యమునా సరస్వతి యను త్రివేణీ సంగమమును దాటి చంద్రమండలము, సూర్యమండలము, అగ్నిమండలము, బ్రహ్మ విష్ణు యీశ్వరులకు, అతీతముగాయున్న అష్టదళ పద్మమునందు తాను బ్రహ్మమై యుండుట యెరుకయను పురుషుడు. ఆడకుండా వుండునను నిర్ణయము.

శి॥ ఆటాడిన మేనుబొమ్మ యాటాడకనే యాటాడుననునది యెట్లు ?

గు॥ ఋగ్వేద నిర్ణయము ప్రజ్ఞానంబ్రహ్మ, యజుర్వేద నిర్ణయము అహం బ్రహ్మాస్మి, సామవేద నిర్ణయము, తత్త్వమసిబ్రహ్మ, అధర్వణవేద నిర్ణయము అయమాత్మబ్రహ్మ. యను నిర్ణయానుసారము లక్షణత్రయములచేత భాగ త్యాగ పద్ధతుల నొనర్చి వార్తీక నిర్ణయానుసారముగా, బ్రహ్మమే తానై సర్వము బ్రహ్మమనే నిశ్చయమున శరీర మనునది తనకువేరుగా లేదని నిర్ణయించి ప్రవర్తించుట బొమ్మలేక ఆటాడునని నిర్ణయము.

శి॥ ఆటాడించెడివాడు అతడేకర్త యనగానేమి ?

గు॥ ఉత్పత్తి, స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణములు చేయునది యెరుకనే గనుక, ఆటాడించేటివాడు, యెరుకనే, కర్తయని నిర్ణయము మరియు జ్ఞానేంద్రియములచేత విషయపంచకము తెలుసుకొని కర్మేంద్రియములచేత కర్మ యొనర్చినను, ప్రాణాయామాది క్రియలచే అష్టదళపద్మమునందు నివసించి క్రియారహితముగా యున్ననూ, మరియూ, కర్మేంద్రియ పద్ధతులు మాని కేవల బ్రహ్మజ్ఞాన రూపమున అయమాత్మబ్రహ్మ వార్తీక నిర్ణయానుసారము సర్వము బ్రహ్మమే యని ప్రవర్తించిననూ, యీ సర్వము చేయునది యెరుకనేయని నిర్ణయము.

శి॥ అంతటికీ యచలము అకర్తయనగా నేమి ?

గు॥ అచలపరిపూర్ణ పరబ్రహ్మమునకు యెరుకకు ఏలాటి సంబంధము లేదు. అనగా ఉపహితచేతనము, విశిష్టచేతన విధానములు లేవుగనుక యెరుక పద్ధతులగు సర్వమునకు అచలము అకర్తయని నిర్ణయము.

శి॥ చేటుపాటుల రెంటిచేవచ్చు ఫలము ముమ్మాటి కనుభవించి జననమరణము లొంద యితడేకర్త యనగానేమి ?

గు॥ కర్మజ్ఞాన ఫలంబులు నిర్ణయానుసారముగా తప్పక అనుభవించి జనన మరణము లొందునది ఎరుకనేగాని, పరబ్రహ్మమునకు యేలాటి సంబంధము లేదని నిర్ణయము.

(౫౩) దేహమును జూచుకన్నులు। దేహమునకు వేరు లేని తీరున ; ఎరుకే కోహం కస్త్వం । తవదాసోహం సోహంబటంచు । చూచుచుండు సుమీ। తనకు తానె తోచుచుండుసుమీ । దేహిదేహములావె తెరగున ప్రసరించి। దేహముగాని విదేహిగ । తనను తా జూచుచుండుసుమీ॥ తనను తానె తోచుచుండు సుమీ॥

ఓ, శిష్యుడా! దేహమును జూచుకన్నులు, దేహమునకు వేరుగా లేని విధమున, ఎరుక దేహమునకు వేరుగా లేదుగాని, ఒకప్పుడు నేనెవ్వడను, నీ వెవ్వడవు, నీకు నేను సేవకుడను, మరియొకప్పుడు నేనే బ్రహ్మమును యని తనంతట తానే ఊహించుకొనుచు, తనకుతానే నానావిధములుగా తలంచు చుండును. యిదియునుగాక, యీ యెరుక దేహి దేహములుగా పరిణమించి నేను దేహమునుగాను. విదేహినని, తన్ను తాను జూచుచుండునని భావము.

శి॥ నేను యెవ్వడను యని యనుకొనుటకు కారణమేమై యుండును?

గు॥ సర్వ అవయవములలో ఆపాదమస్తక పర్యంతరమూ ఏకపద్ధతిగా తెలియుచున్న శరీరాభిమానము కలిగి జీవుడనని తలంచును.

శి॥ నీవెవ్వడవు యని యనుటకు కారణమేమై యుండును?

గు॥ తనకు ఆవరణముగాయున్న విశ్వము గొప్పది. దానిని సృష్టి జేయువాడు విశ్వాభిమానియగు పరమేశ్వరుడు గొప్పవాడని తలంచును.

శి॥ నీదాసుడను నేనని యనుటకు కారణమేమై యుండును?

గు॥ కాలత్రయములచేత అన్నపానాదులు యిచ్చువాడు, కర్మానుసార ముగా జన్మాదులొసంగువాడు, విశ్వాభిమానియగు పరమేశ్వరుడని మతకర్తలు నిర్ణయించినందున విశ్వాభిమానియగు యీశ్వరుడు సర్వజ్ఞుడు. జీవుడనగు నేను కించిజ్ఞుడ్ని గనుక, యీశ్వరునికి నేను దాసుడ్నియని దీనుడై యుండును.

శి॥ నేను బ్రహ్మమును యని యెట్లు నిర్ణయించుకొనును?

గు॥ పంచీకృత పంచభూతశరీర అంతఃకరణ యెరుకయేదో, పంచభూత రూపబ్రహ్మాండ కూటస్థమగు తెలివి అదేగనుక, నేను అధిష్ఠాన చైతన్యమునే యని తలచును.

శి॥ దేహిదేహములుగా యెరుకని వ్యాపించి దేహముగాక విదేహిగా తనను తాను యెట్లు చూచుకొనును?

గు॥ మతకర్తలు నిర్ణయించిన నిర్ణయానుసారము అన్నమయకోశధర్మము, చావుపుట్టుకలు, ప్రాణమయకోశధర్మము ఆకలిదప్పులు, మనోమయ కోశధర్మము,

శోకమోహంబులు, విజ్ఞానమయ కోశధర్మము ప్రపంచ వ్యవహారములయందు నేర్పుగలిగి యుండడము. అనందమయ కోశధర్మము, తనకు గలిగియున్న సంపదతో సంతోషించుట. యీ పంచకోశ ధర్మకర్మంబులు ప్రకృతి జన్యంబులు నేను సాక్షిమాత్రుడ్ని యని నిర్ణయించుకొని, నేను దేహముకాదు, విదేహినని తనను తాను చూచుకొనును.

(౫౪) పరిపూర్ణమొకటిదక్క నితరమైన ప్రపంచమెల్ల దగదెలియుము। నీ వెరుకేనని మదిలోపల। యెరుకే పరిపూర్ణమెరిగే దెరుకా నెరిగేదీ। యింకొకటి లేదీ రెంట్నెరిగేదీ। యెరుకా పుట్టువుమూల మెరుగానిదీ। యెరుకే యెరుకే। తా బుట్టిన దెరుగకోయితే। లేదంటెరుకా నెరిగేదీ। ఇంకొకటిలేదీ రెంట్నెరిగేది॥

ఓ, శిష్యుడా! పరిపూర్ణ పరబ్రహ్మ మొకటిదక్క ప్రపంచమంతయు యెరుకయేయని మనస్సులో యెరుగుము. యీ యెరుకే, పరిపూర్ణ మెరుగునది యనూ, యెరుకయును తనను యెరుగునదియనూ. యీ రెంట్ని యెరుగు టకు వేరొకటి యింకొకటి లేదుసుమా! యెరుకయొక్క పుట్టుకమూలమును యెరుగనిదీ యీ యెరుకే యీ యెరుక పుట్టుకమూలమును యెప్పుడు యెరుగునో అప్పుడే తనకుతాను లేకపోవుచున్నదని భావము.

శి॥ యెరుకయొక్క పుట్టుక యెందుకు యెరుగదు ?

గు॥ అవస్థాత్రయములకు సాక్షి కాలత్రయములకు అధిష్టానము, సత్య జ్ఞానానందరూప చైతన్యబ్రహ్మమే పరిపూర్ణముయని మతకర్తలు నిర్ణయించి నందున తానే పూర్ణముగా యున్నానని నిర్ణయించుకొని, ఆనందించును గనుక తన పుట్టుక తెలుసుకొనుటకు ప్రయత్నించదు.

శి॥ <u>యెరుక తన పుట్టుక మూలము యెప్పుడు తెలుసుకొనునో అప్పుడే యెట్లు లేకుండా పోవును ?</u>

గు॥ కార్యరూప అలలు, కారణరూప సముద్రము వేరుగా యుండక యేకముగా యుండి అహోరాత్రంబులు యెట్లు చలించునో, అట్లు కార్యరూప జీవేశ్వర జగత్తు, కారణరూప చైతన్య బ్రహ్మము, ఏకముగాయుండి, రాత్రి పగలుయను నిర్ణయము లేక, ఉత్పత్తిస్థితి లయము పొందును. యీ మార్పు నకు యెరుక విరక్తినొంది యెరుక తన పుట్టుకకు మూలము విచారించును తన పుట్టుకకు మూలము యెచ్చట లేనందున, యెరుక లేకుండా పోవును.

(౩౫) పాపములు పుణ్యములు। భవి ప్రాపించును। ఎరుకచేత భ్రమ సినవారిన్ ప్రాపింప వెరుక విడచిన శా పసులను। చిత్తమందు తగదెల్పు కొనుమీ। ఆగామీ బోధనులెస్స వినుమీ॥ పాపాలలోశుద్ధస్ఫటిక సన్నిభమైన అపోజ్యోతిని ప్రత్యగాత్మని। మదిలోన తగదెల్పుకొనుమి। అగామీ బోధను లెస్స వినుమీ॥

ఓ, శిష్యుడా! ఎరుకచేత భ్రమసినవారికి పాపములు పుణ్యములు కలుగును ఎరుకను విడిచినటువంటి సాధువులకు పాపములు పుణ్యములు అంటవని మన మున తెలియుము అది ఎట్లనగా, యికముందు రాబోయే ప్రబోధను చక్కగా వినుము కంటిపాపలనగుము శుద్ధస్ఫటిక కాంతిగల అపోజ్యోతిని ప్రత్యగాత్మయని మనంబున యెరుగవలయునని భావము.

శి॥ ఎరుక భ్రమగలవారికి పాపములు పుణ్యములు ఎట్లు అంటును !

గు॥ మతకర్తల నిర్ణయానుసారము కర్మత్యాగులకు పాపము కర్మ ఫల త్యాగులకు పుణ్యము ప్రాప్తించును.

శి॥ ఎరుకను విడిచిన సాధువులకు పాపములు పుణ్యములు ఎట్లుఅంటవు?

గు॥ యెరుకను విడిచిన స్వచ్ఛందులు వేదవేదాంత సిద్ధాంత పద్ధతిగా కర్తృత్వరహితకర్మ ఆచరించెదరు గనుక వారికి ఎరుక ననుసరించియుండు పాపములు పుణ్యములు అంటవు అయినా అలక్షణము ముందుబోధానుభవము వలన తెలియును

శి॥ కంటిపాపలలో శుద్ధస్ఫటిక సన్నిభమైన అపఃజ్యోతిని ప్రత్యగాత్మ యని ఎట్లు తెలియనగును.

గు॥ పాపయనగా కంటినల్లగుడ్డులోని ప్రతిఫలవము శుద్ధస్ఫటికా కార మున విశేషముగా ప్రకాశించుచున్నది. అదియే అపఃజ్యోతి, ఆ యాపఃజ్యోతి పరిపూర్ణ కేవలాత్మకంటే భిన్నముకాదని ఆర్యాదర్పణమునందు తెలియజేయు దురు. అది శరీరముతో నశించే ప్రత్యగాత్మ యని తెలుసుకొనుము.

(౩౬) ఎరుకన్నను మరుపన్నను। ఎరుకకు ఎరుకన్నను దేహియన మాయయనన్। గురుతన సాక్ష్యనజ్ఞ ప్త్యన। స్ఫురణయనన్ ద్రష్టయనిన, చూడు మొక్కటిగా। యిది లేకుంటె చూడ మొక్కటిగా। మరి చలాచల మూలమర్మ మెరిగెటిదన్న। యెరిగి తాలేనాని యెగిరి పొయ్యేటిదన్న। చూడుమొక్కటిగా। యిదిలేకుంటె చూడమొక్కటిగా॥

ఓ, శిష్యుడా ! యెరుకయనిననూ మరపుయనియనూ యెరుకను యెరిగెడి యెరుక యనిననూ, దేహియనిననూ, మాయయనిననూ, గురుతుయనిననూ, సాక్షి యనిననూ జ్ఞప్తియనిననూ, స్ఫురణయనిననూ, ద్రష్టయనిననూ, ఒకటిగా చూడుము. యీ యెరుక లేకుంటే దానిపరిణామమగు యేవొక్క దానినైనా చూడ లేము. మరియూ చలాచలంబుల నిర్ణయము తెలుసుకొనునది యీ యెరుకనే యెరిగి తాను లేనని తనంతటతాను లేకపోవునది యీ యెరుకయేనని భావము.

శి॥ యిన్ని మార్పులలోవున్న యెరుకను ఒక్కటిగా యెట్లుచూడవలెను ?

గు॥ 1. యెరుగునటువంటిది గనుక యెరుకయని చెప్పవలెను.

2. యెరిగినిది మరుపుజెందును గనుక యెరుకను మరుపని చెప్పబడును.

3. ప్రత్యగాత్మగా యున్నతాను పరమాత్మననే నిర్ణయము యెరుకను యెరిగెడి యెరుకయని నిర్ణయము.

4. దేహమును విడిచి వుండేందుకు చోటులేదు గనుక, యెరుకను దేహి యని చెప్పబడును.

5. ఇంద్రజాలకుడు యేపరికరములు లేకుండా తన మనోసంకల్పముచే సకలము సృష్టించి సర్వమానవులకు అది వున్నట్లు సకలవిధ కర్మానుభవము కలుగజేయుచున్నాడో అటు సకల జగమును తెలియజేయును గనుక యెరుకను మాయయని చెప్పబడును.

6. ఏ అవయవమునకు ఆ అవయవము నిర్ణయము గుర్తుగా యున్నందున యెరుకను గురుతని చెప్పబడును.

7. సకలము గనునది, వినునది గనుక యెరుకను సాక్షియని చెప్పబడును

8. సకలము తలంచునది గనుక యెరుకను జ్ఞప్తియని చెప్పబడును.

9. సకలము యెరుకకే తోచును గనుక, యెరుకను స్ఫురణ యని చెప్ప బడును.

10. యెరుక తనయందు తన సకలవ్యవహారములు తెలుసుకొనునది గనుక యెరుకను ద్రష్టయని చెప్పబడును. యీ యెరుకలేనిచో మనము దేనిని చూడ జాలము మరియు, అచలపరిపూర్ణ పరబాహ్యమును చలనముగల శనసూ, తెలుసు కొని, తానులేనని తనంతటతాను లేకుండా పోవునది యెరుకనేయని తెలుసుకొనుము

(72) అనుమానము మదినుంచక' వినుమింకను యెరుక పేర్లు వివరించెద' బుద్ధ్యన చిత్తంబన' మానసమున నహంకార మనిన । నంతఃకరణనినన్ ।

సంకల్ప మంచని నా, యిచ్ఛనినన్ । తన నితరులనే తానని గుర్తెరిగెటిదన్న తననేకా నితరూల । తననూ దెలిసెటిదన్న నంతః కరణనినన్। సంకల్పమంచని నా ఇచ్ఛనినన్ ॥

ఓ, శిష్యుడా ! ఎరుకయొక్క పర్యాయ నామములు **వివరముగా** జెప్పెదను. మనస్సున సంశయముంచక శ్రద్ధగా వినుము. బుద్ధియనిననూ చిత్తమనిననూ, మనస్సనిననూ, అహంకారమనిననూ. అంతఃకరణమనిననూ, సంకల్పమనిననూ, యిచ్ఛయనిననూ, తన్నునేననియూ, నితరులను వారనియూ, గుర్తెరిగెడిదనిననూ, తననేకాక తనకు యితరముగాయున్న సర్వముకూడా తానేయని తెలిసి కొనెడిదనిననూ, యెరుకనేయని తెలుసుకొనుమని భావము.

శి॥ ఎరుక తనను నేననియు, యితరులను వారనియూ గుర్తెరిగెడి నిర్ణయము యున్ననూ, యితరముగాయున్న సర్వము **తానేయని యెట్లు తెలియును.**

గు॥ స్థావరములగు వృక్షలతాదులు అనేక నామరూపగుణ పద్ధతులుకలిగియున్ననూ వాటివుపాధికి జలము యెట్లు యేకకారణమో । అట్లు జీవేశ్వర జగదోపాదులకు తానే కారణము గనుక ఎరుక సర్వముతానేయని తెలుసుకొనుము.

(౫౮) తమవెరుకులు రెండొక్కటి ' యని యనరాదనుచు కొందరందురు భువిలో । తను వెరుకలలో నొక్కటి ' గనరాకుంటేను । రెండుగనరావోయన్నా రెండొక్కాటె వినరా మాయన్నా । అనుమానమికయేల । అందారిమాటాలు' వినబోక । నేబోధించినరీతి నెప్పుడు ' గనరావోయన్నా । రెండొక్కాటె వినరా మాయన్నా ॥

ఓ, శిష్యుడా ! తను వెరుకలు రెండు నొక్కటిగాదు అవి భిన్నములని కొందరు చెప్పుదురు అవి సరిగాదు ఎట్లనగా, యీ రెంటిలో యేఒక్కటి అగుపడకపోతే రెండు కానరావు అందుచేత, రెండు వొక్కటేయని తెలుసుకొనుము. ఓ, యన్నా ! యనుమానమిక నెందులకు ! అందరిమాటలు వినబోకు, నేబోధించిన ప్రకారము కనుమని భావము.

శి॥ తనువెరుకలు రెండు ఒక్కటేనని యెట్లు తెలియును ?

గు॥ ఉపాధికి కారణమగు కర్మ, సంచితము, ఆగామి, ప్రారబ్ధముయను మూడుపద్ధతులుగా విభజించియున్ననూ అనుభవరూప ప్రారబ్ధము తనువెరుకలు రెండుగా వున్నప్పుడే జరుగునుగాని, వేరుగా ప్రారబ్ధానుభవము లేదుగనుక, తను వెరుక రెండు వొక్కటేయని సిద్ధాంతము.

(౫౯). కనకమన భూషణంబులు। యనుమన శస్త్రాదికంబు। యి త్తడి యనినన్ । గనుగొన పాత్రలు గనుపడు। తనువన నవయవములన్ని తగదొంతి యనినా। కుండలు। భూతతతి జగత్తనినా। వినుమిట్లు యెరుకన్న వివరించ తత్వాలు। మనసందు గట్టిగ మరువాకు మిామాట। తగదొంతి యనినా। కుండలు భూతతతి జగత్తనినా॥

ఓ, శిష్యుడా! బంగారమనగా భూషణంబులు యనుమనగా ఆయుధంబులు, యి త్తడియనగా పాత్రలు,శరీరమనగా అవయవములు, దొంతియనగా కుండలు: జగత్తుయనగా పంచభూతములు, నివియెట్లో, ఆవిధముగానే, ఎరుకయనగా, ఇరువదైదు తత్వముల చేరికయని, యీ లక్షణము నీ మనస్సున యెప్పుడు మరువవద్దని నిర్ణయము.

(౬౦) పొరలరటి దుంపయనినను। తరువులు వనమనిన । రవలుధారుణి యనినన్ । గిరియనిన రాళ్ళు। బట్టలు ధరముళ్ళియ యనిన । తత్వతతి యెరుకంచని నా। లేనిదె యెరుక స్థితిలెస్స కనినా। యెరుకా జేసిన విశ్వ మెరుక వంటిదె బయలు। నెరుకా గుర్తెరిగి। తానేగితెసరి । తత్వతతి యెరుకంచనినా। లేనిదె యెరుక స్థితిలెస్స కనినా॥

ఓ, శిష్యుడా! అరటి దుంపయనగా పొరలసమూహము, వనమనగా వృక్షముల సమూహము, భూమియనగా అణువుల సమూహము, పర్వతము యనగా రాళ్ళసమూహము, ముళ్లె యనగా బట్టలన్ని ముళ్లెగాగట్టిన సమూహము ఓ, శిష్యుడా! పొరలసమూహమును అరటిదుంపయనియూ,వృక్షముల సమూహమును వనమనియూ, అణువుల సమూహమును భూమియనియూ, రాళ్ళసమూహమును పర్వతమనియూ, బట్టల సమూహము ముల్లెఅయిన విధమున, పంచవింశతి తత్వ సమూహమునకు ఎరుకయని నిర్ణయము గనుక యెరుకను గూర్చి యెంత గొప్పగా విచారించినా లేనిదేయగుచున్నది మరియూ, యెరుకజేసిన విశ్వము యెరుక వంటిదే గనుక, అబయలును యీ యెరుక తెలుసుకొని తనంతట తాను లేకపోయితే చాలునని భావము.

శి॥ యెరుకస్థితి లెస్సగా విచారించిన యెటు లేకుండాపోవును.

గు॥ తత్వముల సమూహమునందు తెలియు యెరుకను మహావాక్య నిర్ణయ పద్ధతిగా అచలపరిపూర్ణ కేవలాత్మని నిర్ణయించుకున్ననూ, పరిపూర్ణ పర బాహ్యముతో కలయిక లేనందున, లేనిదేయగుచున్నది మరియూ, యెరుక జేసిన విశ్వము యెరుకరీతిగనే యశాశ్వతమని నిర్ణయము.

## — (బయలెరుకల యత్యంత విభిన్న తత్వము) —

(౭౧) దానము ధర్మము సగుణ । ధ్యానము ప్రతిమార్చనంబు తజ్జప తీర్థ స్నానము । లివి ముక్తి దమని। మానవు లొనరించ బయలు మాటాడదేమి। యెరుకేలేదు మాటాడదేమి । ఔనుకాదనకా, నీవనక నేననకొక్క । మేనైన తాగాక మితిమీరి యున్నాది । మాటాడదేమి యెరుకేలేదు మాటాడదేమి॥

ఓ శిష్యుడా ! ప్రపంచమునందలి మానవులు మోక్ష భ్రాంతిచేత దానము ధర్మము, సగుణధ్యానము ప్రతిమార్చనము మంత్రజపము, తీర్థయాత్రలు గంగ యమున మొదలగు నదులలో స్నానములు చేయుటచేతను మోక్షము కలుగునని నిర్ణయించుకొని. చేయుచున్ననూ, పరబయలు మాట్లాడలేదు. ఎందుకనగా, ఎరుక పద్ధతులు ఔనని కాదని; నీవని, నేనని; స్థూలసూక్ష్మ కారణ మహాకారణ కైవల్య శరీరములో నేదియగాక, పరబాహ్యము, ఆదిమధ్యాంత మనునది లేక నిండి యున్నదని భావము.

1. దానమనగా షోడశ మహాదానములు - గోదానము, భూదానము, తిల దానము, హిరణ్యదానము, రత్నదానము, విద్యాదానము, కన్యాదానము, దాసీ దానము, శయ్యాదానము, గృహదానము, అగ్రహారదానము, రథదానము, గజ దానము, అశ్వదానము, భాగదానము, మహిషిదానము.

2. ధర్మమనగా. నవవిధములు:- పుణ్యము, న్యాయము, సామ్యము, స్వభావము, ఆచారము, అహింస, వేదోక్తవిధి, ఉపనిషత్తు, యజ్ఞము

3. సగుణధ్యానమనగా- బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది స్వరూపంబులు మనమున నిలుపుకొని వారలు ప్రత్యక్షమగుటకు ధ్యానమొనర్చుట.

4. ప్రతిమార్చన యనగా, సగుణదైవములను ప్రతిమలుగా నిర్ణయించి కొని, సుగంధము ముగ్గు, అక్షింతలు, పుష్పములు, ధూపము, దీపము, ఉపా హారము, తాంబూలముతో అర్చించుట.

5. జపమనగా, గాయిత్రాది రామతారక మంత్రములు జపించుట.

6. తీర్థస్నానములు యనగా, పుణ్యక్షేత్రములు అందు ప్రవహించే గంగ యమున మొదలగు పుణ్యనదులు వీటియందు స్నానములుచేసి క్షేత్రములు దర్శిం చుటచేతను, మోక్షము కలుగునని తలంచి యొనర్చుట యెరుక భ్రాంతియే యని నిర్ణయము.

(౬౨) ఆకాశాదిక భూతా । నేకాత్మక మగుచు యెరుక । యీజగ మయ్యెన్ । రాకడ పోకడ దీనికి । ప్రాకటముగ దేనిలోనా బట్టబయలదిరా । కాదనియంటె వట్టిపల్కిదిరా । లోకత్రయము తన లోపాలదిరుగాగ ॥ జోక తోడుత దాని జోలెరుగనిది యేదో । బట్టబయలదిరా । కాదని యంటె వట్టి పల్కిదిరా ॥

ఓ. శిష్యుడా ! ఆకాశాదిమగు యెరుక పంచభూతములతో స్థావర జంగమ జీవోపాధి రూపమున యీ జగమైనది, దీని వుత్పత్తి ప్రళయములు స్పష్టముగా దేనియందు తోచుచున్నవో, అది పరిపూర్ణ పరబాహ్యమని నిర్ణయము. ఉపాది ప్రళయములు త్రిగుణసామ్య ప్రకృతినిగాని, ఆకాశాదిక మగు యెరుకని కాదం టివా, ఆకాశాదిమగు యెరుక యింద్రియ సముదాయము వలన తోచినదేగాని అది ఒక వస్తువుగాలేదు. అందువలన నీ నిర్ణయవాక్యము వొట్టిదేయగును. మరియూ స్వర్గమర్త్య పాతాలము అను లోకత్రయములు తనయందు తిరుగుచున్ననూ, ఉత్సాహముతో దాని సంగతి సంబంధములు ఎరుగనిది యేదో అది పరబాహ్య మని తెలుసుకోమని భావము.

(౬౩) తండోప తండములుగా । దండి ఝుషాదికము లన్ని తన లోపల నుద్దండత నుండిన పోయిన । నుండు సముద్రంబు యెరుగా కుండడూ నెప్పటికీ। పరిపూర్ణ మిట్లుండు నెప్పటికీ । యెండమావుల రీతి నుండేటి బ్రహ్మాండ । ముండీన పోయిన రెండు గుర్తెరుగాని దుండూ నెప్పటికీ పరిపూర్ణ మిట్లుండు నెప్పటికీ ॥

ఓ, శిష్యుడా ! సముద్రమునందు జలచరాదులు గుంపులు గుంపులుగా నుండి వ్యవహరించుచున్ననూ, అవి యన్నియూ నశించి పోయిననూ, వాటి నిర్ణయము ఆ సముద్రము యెన్నడు యెరుగనట్లు యెండమావులరీతి నుండు యీ బ్రహ్మాండము వుండిననూ పోయిననూ రెంటిని గుర్తెరుగక పరబాహ్యముండు నని భావము.

(౬౪) ఎరుకతొ వచ్చిన విశ్వము । యెరుకతొ జనుగాని నిల్వదీ । బయలైతే । ఎరుకతో రాదెరుకతో బో । దెరుకతనం దేమిలేదు ॥ ఇది నిశ్చయ మురా । వుండుంటె యీయెరుకే తానొరా । యెరుకా యెరిగినవస్తు వెరుకాని తెలి యుము । యెరుకా యెరుగదు బయలు నిట్టిదట్టిది యన । నిది నిశ్చయముదా । వుండుంటె యీ యెరుకె తానొరా ।

౬. శిష్యుడా!ఎరుకతోవొచ్చిన విశ్వము ఎరుకతో పోవునుగాని, నిలకడగా యుండదు. యీ పరబయలు ఎరుకతోరాదు ఎరుకతోపోదు. ఎరుక ఆ పర బయలందు ఎచ్చటకూడలేదు యిది నిశ్చయము. ఆ పరబయలందు, యీ ఎరుక ఎచ్చటనైనా యున్నట్లులైతే యీ ఎరుకనే ఆ యవల పరిపూర్ణమని చెప్ప నగును. అట్లుగాక, ఎరుకను చలనము, మృషయని చెప్పబడును గనుక, యీ ఎరుక యేవస్తువును ఎరుగుచున్నదో అదియంత ఎరుకనేయని తెలుసుకొనుము. మరియు యీ ఎరుక ఆ పరబాహ్యమును యిట్టిది, అట్టిదియని ఎన్నడైన ఎరుగ దని భావము.

శి॥ ఎరుకతో వొచ్చిన విశ్వము నిల్వకుండా ఎరుకతో యెట్లు పోవును ?

గు॥ బీజవృక్ష న్యాయమున బీజములో వుపాధిజెందిన వృక్షము బీజముతో ఎట్లుపోవుచున్నదో, అట్లు ఎరుకతో వుపాధిజెందిన విశ్వము ఎరుకతోనే పోవును గాని జగముపోయి ఎరుకనిల్వదు- ఎరుకపోయి జగము నిల్వదు.

శి॥ పరబాహ్యము ఎరుకతోరాక ఎరుకతోపోక ఎరుక తనయందు లేక యెట్లుండును ?

గు॥ పంచతన్మాత్ర స్వరూప స్వభావంబులు పరబయలుయందులేవు గనుక పంచతన్మాత్ర స్వరూపముగల ఎరుకకు, పరబాహ్యమునకు యేలాటి సంబంధము లేకవుండునుగనుక, యీ పరబాహ్యము ఎరుకతోరాదు, ఎరుకతోపోదు, ఎరుక ఆ పరబాహ్యమునందు యేమిలేదు. యిది వేద వేదాంత సిద్ధాంతము గనుక నిజముయని నిర్ణయము. ఆ పరబాహ్యము యందు ఎరుకవుంటే యీ ఎరుకనే తన్మాత్ర రహితమని చెప్పనగును. అట్లు లేదుగనుక, పరబాహ్యము శాశ్వతము ఎరుక అశాశ్వతమని నిర్ణయము.

శి॥ ఎరుక ఎరిగిన వస్తువు ఎరుకనేయని తెలియును యనగా నేమి ?

గు॥ సకలమత ధర్మ కర్మంబులు ప్రకృతిజన్యంబులు గనుకే ఫలస్వరూ పంబులు కావని, మహావాక్య వార్తీక పద్ధతిగా నిర్ణయించిన బ్రహ్మము ఫల వంతమని నిజమని నమ్మియుండడము ఎరుక నిర్ణయమని అది యంతయు ఎరుక పద్ధతియని తెలుసుకొనుము. యీ యెరుక ఆ బయలును యిట్టిదట్టిదియని యెన్న డైన యెరుగదని నిర్ణయము.

(౬౫) రవి తమసమున్న దెరుగునె । ప్రవిమల దావాగ్ని చెదలు । బట్టు టెరుగవా । దివమును రాతిరి రాత్రిని దివమెరుగునె। లేమి లక్ష్మీ దేవి యెరుగునా।

అన్నమును భూదేవి యెరుగూనా । భవనాశస్థితులు రాపాడేటి యెరుకాను ' భవనా
శస్థితిలేని బయలప్లెరుగదు। లక్ష్మీదేవి యెరుగూనా అన్నమును భూదేవియెరుగునా

ఓ, శిష్య,శా! సూర్యుడు పీఃటి యున్నదని యెన్నడైన యెరుగునా !
అగ్ని హెూత్రము వెదలు పట్టుట యెరుగునా, పగలు రాత్రిని, రాత్రి పగలును
యెరుగునా, పేదతనమును లక్ష్మీదేవి యెరుగునా, అన్నమును భూదేవి యెరు
గునా, యెరుగదు అటువలనే పుట్టి చచ్చే పద్ధతిగల యెరుకను, పుట్టు చావులు
లేని బట్టబయలు యెరుగదని భావము.

(౬౬) లేనికల గలిగినప్పుడు । దానికి దశదిశలయందు తగమొదటకొనన్
తానంటకున్న మేల్కను । లేనికలేచూచెనేని । లేకపోవుగదా ' కలతోమేల్క, లేక
పోదుగదా లేనెరుక బయలు యీలాగ నీకెపుడు గానవచ్చితె బోధ। గావాలెనన
వపుడు । లేకపోవుగదా । కలతో మెల్క, లేకపోదుగదా॥

ఓ శిష్యుడా! లేనట్టికల కలిగినప్పుడూ, దానికి పదిదిక్కుల యందునూ
ఆది అంతములను, అంటకయున్నట్టి మేల్కను లేనికల చూచినప్పుడు లేనికల
లేకపోవునట్లు మేలుక లేకపోదుగదా! లేనియెరుకను, వున్న బయలును యీరీతిగా
యెప్పుడు యెరిగెదవో, అప్పుడు జనన మరణ సంసార రహితమునకు, బోధ
కావలయునని అనవని భావము.

(౬౭) చచ్చుట పుట్టుట మేలుకవచ్చుట । గాఢాసుషుప్తి వచ్చుట । లీనాల్గ
చ్చముగ సహజ మెరుకకు । హెచ్చము । యీ యెరుకనిల్వ । బోధుమాయప్పా।
అచలము కిట్లు లేదుగదప్పా ' మచ్చికతో రెంటీ మర్మము నీకిప్ప। డెచ్చాగ
దెల్పితి నెరుగు । మెరుకనిల్వ బోధుమాయప్పా ' అచలముకిట్లు లేదుగదప్పా ।

ఓ శిష్యుడా! చచ్చుటయును, పుట్టుటయును, మెలుకువ వచ్చుటయును,
గాఢాసుషుప్తి బొందుటయును, యీనాలుగు లక్షణములు యెరుకకు సహజముగా
యున్నవి గనుక దీనిని అచలపరిపూర్ణమని నమ్మినవారిని మోసము చేయును.
యెందుకనగా, యెరుక యెచ్చటకూడా నిలచియుండదు. అచలపరిపూర్ణ పరబయలు
చావదు, పుట్టదు, మెలుకువ నొందదు సుషుప్తి బొందదు. యీరెంటి నిర్ణయము
వస్తునిశ్చయముగా నీకు చెప్పినాను గనుక తెలుసుకొమ్మని భావము.

(౬౮) తలయెత్తి జూడజాలునె । అలచీకటి యెదుటనిల్చి ' యజ్ఞాపుకశన్ '
కలవచ్చి మేల్కయందున గలచేష్టలు । మ్రోలనిల్చి కనుగొనగలదా । అట్లనె
యెరుక కనుగొనగలదా । యిలలో సద్గురుబోధ నెరిగిన నరుని । చేష్టలుగంటె
నుళ్ళక్కి । సద్గురు బోధాట ' కనుగొవగలదా । అట్లనెయెరుక కనుగొనగలదా॥

ఓ, శిష్యుడా ! సూర్యప్రకాశము ఎదుట చీకటి నిలచి తలఎత్తి చూడజాలని విధమున, కలవచ్చి మెలకువముందు నిలచి దానియందుగల చేష్టల నెరుగజాలదు. యీ ప్రకారముగానే పూర్ణ గురుబోధ వడసి అచల పరిపూర్ణ స్థితిగా యున్న పురుషుడుచేయు కర్తృత్వరహిత కర్మాచరణ విధానంబుల ఎరుక నిలచి కనుగొన జాలదని భావము.

(౨౯) ఎరుగదు సుషుప్తిని జాగ్రతని నిరవంద సుషుప్తి । రెంటినెరుగును మేల్కొ । ట్లరయగ బయలెరుకల రెంట్నెరుగదు బయ । లెరుక రెంట్నీ నెరుగూచు నుండూ । గురుముఖమున నెరిగి యీ రెండు । తిరమూగ ఎరుకాను తీసివేసితె చాలు । పరులూ నేననియేటి పలుకెలేకుండు । నిల్లెరుగుచునుండూ । గురుముఖమూన నెరిగి యీ రెండూ ॥

ఓ, శిష్యుడా । సుషుప్తి సుషుప్తిని జాగ్రతను రెంటిని ఎరుగదు. జాగ్రత సుషుప్తిని జాగ్రతను రెంటిని ఎరుగును. అటువలెనే, పరబయలు బయలునూ ఎరుకనూ రెంటినీ ఎరుగదు. ఎరుక పరబయలును, ఎరుకనూ రెంటినీ ఎరుగునూ గనుక, గురుముఖమున పరబయలును ఎరుకనూ ఎరిగి స్థిరముగా ఎరుకను తీసివేసితె చాలును. పరులు నేను యనునట్టి ప్రకృతి పురుష భ్రాంతియొక్క పలుకే లేకుండునని భావము.

శి॥ స్థిరముగా ఎరుకను తీసివేయుట ఎట్లు ?

గు॥ వాడుకొనుటకు తెచ్చుకున్న కడవలోని నీరు వాడుక అనంతరము వట్టికుండ అయినట్టు అహంబ్రహ్మాస్మియను భ్రాంతి విస్తరించే పద్ధతి లేకుండా కర్తృత్వరహిత పద్ధతి యొనర్చిన, యేకోశమునందు కూడా ఎరుక నిలచి యుండుటకు స్థానము లేకుండా పోవును.

(౩౦) ఎరుక జడము జడమీజగ । మరయగ పరిపూర్ణమేమీ । యనరానిది । యీయెరుక జగముల స్థిరములు । పరిపూర్ణము శాశ్వితపుది పాటించి కనరా । కావారెండీ పాటేవి వినరా । గురుముఖమున వీట్నే నరుడు గుర్తెరుగునా తిరిగిపుట్టునాడీ ధరపై మునుపటివలె । పాటించి కనరా । కావా రెండీ పాటీవి వినరా ॥

ఓ, శిష్యుడా ! విచారించగా ఎరుక జడరూపము, అజడరూపము, జగద్రూపములుగా తెలియుచున్నది. అచలపరిపూర్ణ పరబయలు యిందులో యేదిన్ని యనరానిది. గనుక, ఆ ఎరుక జగములు అస్థిరములు పరిపూర్ణ పరబాహ్యము

శాశ్వితము. గనుక విచారించి తెలుసుకొనుము. ఎరుక పరిపూర్ణముల రెంటి యొక్క శాశ్వితాశాశ్వితములను విని యీ రెంటిస్థాన స్వరూప స్వభావములు గురుముఖమున తెలుసుకున్న నరుడు మరల జన్మమునకు రాడని భావము.

శి॥ ఎరుక జడరూపముగా ఎట్లు వుండును ?

గు॥ జడమనగా తెలివిలేనిదని నిర్ణయము. తెలివి లేనిదనగా ఒక తెలివి కూడా లేని ప్రాణులు, రాళ్ళు, కొండలు, శ్రీ॥ అశేష చేతనయని చెప్పబడును.

శి॥ అజడమనగా యెట్లు వుండును ?

గు॥ తెలివిగల ప్రాణము యని నిర్ణయము.

శ్రీ॥ శేష చేతన, యని నిర్ణయము.

శి॥ జగమనగా యెటువంటిది ?

గు॥ జగమనగా తెలియుసదియని నిర్ణయము, గనుక యెరుక యీ త్రివి ధములుగా తెలియును గనుక అస్థిరమని సిద్ధాంతము.

(౭౧) మరుపుకు తన్మాత్రలుగల। వెరుకకు తన్మాత్రలున్న వీరెండాకటే, పరిపూర్ణమునకు లేవవి। పరిపూర్ణము యెరుకగాదు। మరుపుగాదోయి। వెతకిన దీని సరిది లేదోయి। పరిపూర్ణ మెరుకాల పరిశోధించీ గ్రంథము। రచించినీకి స్తి। మరువాకచదు వెరుకమరుపుగాదోయి। వెతకిన దీని సరిదిలేదోయీ॥

ఓ, శిష్యుడా ! మరుపుకు తన్మాత్రలున్నవి. ఆ తన్మాత్రలు యెరుక కున్నవి. యీ యెరుక ఆ మరుపు రెండూ వొక్కటే యగునుకాని వేరుగావు. ఆ యచల పరిపూర్ణ పరబాహ్యమునకు, పంచతన్మాత్ర స్వరూప స్వభావములు లేవుగనుక, పరబాహ్యము యెరుకగాదు మరుపుగాదు. వేదవేదాంత సిద్ధాంత పద్ధతిగా విచారించి చూసినా, యీ పరబాహ్యమునకు సమానమైనది యితరమేమియు లేదు. గనుక పరిపూర్ణ పరబాహ్యమును లేని యెరుకను, చక్కగా విచారించి యీ గ్రంథమును రచించి నీకుయిస్తిని దీనిని నీవు మరువక చదువుమని భావము.

(౭౨) సంకల్పాదిక గుణములు సంకుల। మాయెరుకయందు సమకూడుండున్ సంకల్పాదిక గుణముల సంకుల। మచలమున జాడజాడలేదన్నా। యీ రెంటికి యీడుగాదన్నా। కొంకాక యీ రెంట్ని గూర్చి గ్రంథము జేస్తి। సంకోచింపక జదువు। శంక బుట్టదు శంకజాడ లేదన్నా। యీ రెంటికి యీడుగాదన్నా॥

ఓ, యన్నా ! విచారింపగా, యీ ఎరుకయందు సంకల్పము మొదలగు గుణముల యొక్క వ్యాకులము సంబంధించియుండును. పరబాహ్యము నందు సంకల్పము మొదలగు గుణముల యొక్క వ్యాకులము సంబంధించి లేదుగనుక, యీ ఎరుకయును ఆ పరబయలును సమానములుకావు. అందువలన, నేను యేలాటి భీతిజెందక, ఆ పరబయలును, యీ తేనెరుకను రెంటిని జేర్చి శక్తి ద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్త్వ కందార్థములు యను గ్రంథమును చేసి నాను. దీనిని యేలాటి అనుమానములేక చదువుము. నీకు కలిగిన సందేహములు తొలగిపోవునని భావము.

శి॥ గ్రంథరచనయందు భీతిజెందవలసిన అవసరము ఎందుకు ?

గు॥ గ్రంథనిర్మిత ధర్మపద్ధతి మానవ సౌభ్రాతృత్వము అన్యోన్య సహా కారము, ఐహికాముష్మిక పురోభివృద్ధికి అనుకూలముగా యుండవలయును. అట్లుగాక, తన స్వార్థము ననుసరించియున్న యెడల అది మనోదోషము కలిగించి, నరకప్రాప్తి యగును, గనుక, ధర్మోపదేశమునకే గ్రంథము రచన యొనర్చవలయునుగాని, తన పేరు ప్రతిష్టల కొరకు యొనర్చకూడదు.

## —( బయలాకాశముల ఆరోపిత తాదాత్మ్యము )—

(౭౩) యెరుకైన భూతపంచక మెరుకకు । చరణములుకటియు హృదయము గళమున్ । శిరమును నయ్యెను క్రమమున । ధరణి మొదల్ జేసియిట్లు తనయాగు రైరుగు । గగనము బయలంచన రాదీమరుగూ । యెరుగకాకాశమే పరిపూర్ణ మనుచు । కొందరు పల్కిరిది విని గురితప్పి యుండేవు । తనయాగు రైరుగు । గగనము బయలంచన రాదీమరుగు ॥

ఓ పుత్రుడా ! యెరుకైనట్టి పంచభూతములే యెరుకకు దేహములును, యెట్లనగా,

1. పృథ్వి చరణములు
2. జలము కటి
3. అగ్ని హృదయము
4. వాయువు కంఠము
5. ఆకాశము శిరస్సు

యీప్రకారము సాక్షిభూతమగు యెఱుకకు దేహమగు పంచభూతములతో ఆకాశభూతము పరబయలని చెప్పుదురు. వారు, అట్లు చెప్పుటకు కారణమేమనగా, పరిపూర్ణ పరబయలు వారు తెలియరు యిది సద్గురు రహస్యము.

"శ్రృ రహస్యం యేతదుత్తమం" యిట్టి రహస్యమును నీకు **తెలిపి** యున్నాను. **ఆకాశమె** బయలని నిర్ణయించుకొని, నేను దెలిపిన రహస్యమును మరచి యుండగూడదని భావము.

(౭౪) యెరుక బయలందులేమిని । యెరుకను శూన్యంబటంచు యెరిగించ బడెన్ । యెరుగుమిదె **ఆకసం** । బిట్లెరిగితె యెరుకాకసములు । యేకమౌగదరా । **ఆకసము** బయ లేకమెట్లవురా । పరిపూర్ణమిదుగొ కన్నడుశూన్యమనరాదు । యెరిగుండు మెదిరిస్తె । యికనాపై జూచేవు । యేకమౌగదరా । **ఆకసముబయ** లేక మెట్లవురా ॥

ఓ, శిష్యుడా ! పరిపూర్ణ పరబయ**లులో** ఎరుక లేనందున ఎరుకను శూన్య మని చెప్పబడును. యీ ఎరుకనే **ఆకాశ**మని ఎరుగుము. యిట్లు తెలిసిన ఎడల, ఎరుకయును **ఆకాశ**మును (నువ్వులయందు నూనెయున్న విధమున, బెల్లము యందు తీపియున్న విధమున) రెండు యేకమే యగును. ఆకాశము, బరబయ**లు**. రెండు వొక్కటిగావు. అచలపరిపూర్ణ పరబాహ్యము, **అ**దిగోచూడు కనబడు చున్నది. దీనిని శూన్యమని చెప్పగూడదు; యని తెలిసి యుండుము, **అట్లు** ఎరుగక, ఎరుకే పరిపూర్ణమని ఎదిరించి వాదించితే నీవికముందు నేననే ఎరుక యొక్క స్థానము యేమగునో చూచెదవు యని భావము.

(౭౫) కనుపడెడి బయలులోపల । కనుగొనలేదయ్యె ఎరుక గావున శూన్యం బనవలసె । దీన్నె ఆకస మనవలసెను । దీనవిశ్వ మాయనోయప్పా । యింతకు వేరే మాయయేదప్పా । కనుకానె యీ విశ్వమును లేనిదనిలెస్స । వినజెప్ప నాయెను । కనబోకుండనిపోని । మాయనోయప్పా । యింతకువేరే మాయయే దప్పా ॥

ఓ, **శిష్యుడా** ! **కన్పడెడి** పరబయలుయందు, కనుగొనుటకు యెరుకలేదు గనుక, యెరుకను శూన్యమని చెప్పవలసి వచ్చెను. దీనినే **ఆకాశ**మని చెప్పవలసి వచ్చెను. దీనిచేతనే ప్రపంచమాయెను. గనుక, యింతకంటె వేరే మాయలేనం దున, యీ ప్రపంచము లేనిదని బొక్కగా వున్నది యున్నట్లు, వినజెప్పినాను. యిది **వుండినా** పోయినా, దీనిని కనబోకుమని భావము.

✱ (౭౬) అవరణము వాకసము । నిరావరణము నచలమనుచు । అనిరిమహా త్మల్ । **ఆవరణము** మితిగలిగిన । దావరణము లేంది **అమితమ**ని తెల్పుకోరా । యీరెంట్ని వేరని కనుక్కోరా । **ఆవరణముననే నిరావరణమునుజూచి** । యావ

రణ మెడలీన । అవల మాట । లేదని కనుకో్కరా యీ రెంట్ని వేరని కనుకో్కరా ॥

ఓ, శిష్యుడా ! ఆకాశరూపమైన ఆకాశాదిక కూటస్థమగు యెరుక ఆవర ణము గలది. అచలపరిపూర్ణ పరబాహ్యము నిరావరణము యని మహాత్ములు యీ రెంటి విషయము నెరిగి చెప్పిరి. మితముగలిగినది యావరణ రూపమైన యెరుక, అమితమైనది నిరావరణ అచలపరిపూర్ణ పరబాహ్యము గనుక, యీ రెంట్ని వేరని నీవు తెలుసుకొనుము ఆవరణమగు. యెరుకతో నిరావరణమగు పరిపూర్ణ పరబాహ్యము తెలుసుకొని, ఆవరణమగు యెరుకను నీతోవిడిచినవో నావల యేమాట లేదని యెరుగుమని భావము.

శి॥ మహాత్ములనగా యెటువంటివారు ?

గు॥ మహాత్ములనగా బుద్ధి తత్వమునందు గొప్పగా విహరించి తెలుసు కొన్న వారు అనగా, వేదము వేదాంతము సిద్ధాంతము యని మూడు విధములు. వేదనిర్ణయము తెలిసినవారిని కర్మాధికారులని, వేదాంత నిర్ణయముతెలిసిన వారిని జ్ఞానాధికారులు వేదాంతులని, సిద్ధాంతనిర్ణయము తెలిసినవారిని, కర్మజ్ఞానరహిత అచల ఋషి, నిరంజనఋషి, మహాత్మయని సంబోధించెదరు, గనుక, మహాత్ము లనగా సిద్ధాంత నిర్ణయము తెలిసినవారని తెలుసుకొనుము.

శి॥ ఆవరణమగు యెరుకను విడిచ్నవో, నావల యేమాట లేదనగా యేమై యుండును ?

గు॥ మాట యనగా ప్రతిజ్ఞా వచనమని నిర్ణయము, అనగా, ప్రజ్ఞానం బ్రహ్మ, అహంబ్రహ్మాస్మి తత్వమసిబ్రహ్మ, అయమాత్మబ్రహ్మ యను యే నిర్ణయములు వుండవు. ఎందుకనగా, తాను తెలుసుకున్న పరిపూర్ణ పరబయలు నందు, ఎరుకలేదు గనుక, ఎరుకనిర్ణయములగు, పరపశ్యంతి మధ్యమ వై ఖరీ లను యేవాక్యములు అందుయున్న ప్రతిజ్ఞలు వుండవని నిర్ణయము.

(౭౭) బయలాకాసమని కొందరు । భయపెట్టెద రందువలన । భయపడకు సుమీ । బయలందు శబ్దమున్నను । బయలాకాస మనుచు నమ్మబడని నీచేతా । శబ్దములేదీ భ్రమయెందుచేతా । బయలాకాశముగాదు పరిపూర్ణమనినమ్మి । నయ మూగ యెరుకాను నమ్మాక విడిచివో । బడనినీచేతా । శబ్దములేదీ భ్రమయెందు చేతా ॥

ఓ, శిష్యుడా! నీవు తెలుసుకున్న పరబయలు, శబ్దగుణముగల ఆకాశమని, "శృతి॥ ఆకాశం గగనం శూన్యం" అని శృతిని చూయించి, అది శూన్యము జడ మని, నీకు భయమును కలుగజేయుదురు అందువలన. నీవు భయపడకూడదు. ఎందుకనగా, నీవు తెలుసుకున్న పరబయలందు శబ్దస్పర్శ రూపరసగంధము, పరపశ్యంతి మధ్యమ వైఖరీయను వాక్యమును ఎరిగే ఎరుకలేదు. అదియున్న యెడల, ఆపరబయలును, శబ్దగుణముగల ఆకాశమని నమ్మును, పరబయలు నందు, యేగుణము లేదు గనుక, అటువంటి భయము నీకు అవసరములేదు పర బయలు, ఆకాశముగాదు. పరిపూర్ణమని నమ్మి యీ యెరుకను నమ్మక, నీతితో విడివిపెట్టుమని భావము.

శి॥ ఎరుకను నమ్మక నీతిగా ఎట్లు విడువవలయును ?

గు॥ గురుమూర్తి కరుణవల్ల లేనియెరుక లేదని తెలిసినవూ, స్వధర్మము నుండి చలింపకుండా, ఎరుకను న్యాయముగా విడవవలయును. స్వధర్మము నుండి చలించి ప్రవర్తించువారికి జన్మరహితమునకు బదులుగా నరకము కలు గును. గనుక, 'నయముగ యెరుకను నమ్మక విడివిపోబడని నీచేత' యని నిర్ణయము.

## —(సృష్టి విధానము) —

✱ (౭౮) మేలుక సుషుప్తిలోపల। యేలీలం తనకు దానుయేతెంచునో। గుర్తాలీల బయలు లోపల। వాలాయము తనకు దానే వచ్చునోయన్నా। వచ్చి హెచ్చి చచ్చు నోయన్నా। యాలోపలనె బట్టబయలున్న దెరిగితె యేలోకమున నిల్వజాల। చెరుగకంట వచ్చునోయన్నా। వచ్చి హెచ్చి చచ్చునోయన్నా॥

ఓ శిష్యుడా ! సుషుప్తి నుండిమెలకువ, తనంతటతానే ఎట్లు వచ్చునో అటువలెనే బయలునందు గుర్తెరిగే ఎరుక తనంతటతానే ఎడతెగకుండా వచ్చి హెచ్చి చచ్చును. వచ్చి హెచ్చి మృతిజెందేలోపల పరబయలు వున్నదని తెలిస్ని ఎడల ఎరుక యేలోకమున నిల్వజాలక లేకపోవుచున్నది. పరబయలును ఎరుగ కున్నచో, పుట్టుచు చచ్చుచు నుండునని భావము.

శి॥ ఎరుక తనంతటతాను వచ్చి హెచ్చి ఎట్లు మృతిజెందును ?

గు॥ ఆకాశస్వరూపముగాగల ఆకాశాధికమగు కూటస్థమగు ఎరుక ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి, ఓషధులు, అన్నము, నరులుగా ఎడతెగక అభివృద్ధి పొందును. మరియు ఊర్ధ్వమునందలి ఆదిత్యలోకము స్వర్గ

లోకమని స్థావరజంగమ జీవుల నివాసము మర్త్యమని, అధఃభాగము పాతాళ మని నిర్ణయించి యున్నందున హిరణ్మయ కోశమగు ప్రత్యగాత్మను, ఆయా లోక నివాసమునకు తగుకర్మ యొనర్చును. మరియు ప్రజ్ఞానంబ్రహ్మ అహం బ్రహ్మాస్మి, తత్వమసిబ్రహ్మ, అయమాత్మ బ్రహ్మయను, నిర్ణయ పద్ధతుల ద్వారా కూటస్థ బ్రహ్మములో ఏకత్వసిద్ధికి ప్రయత్నించును. లోకంబులు, లోకేశులు, ప్రళయము పొందినట్లు, అయమాత్మ బ్రహ్మయని నిర్ణయించుకొన్న తాను విషయవాసనలో మరణించి ఆయా కర్మ ఫలములు క్షీణించగనే జన్మాదులు పొందెదరు.

శి॥ పుట్టిచచ్చేలోపల, పరబయలు వున్నట్లు తెలిపితే, ఎరుక యేలోక మున నిల్వజాలక ఎట్లు పోవును ?

గు॥ ఎరుక స్వరూపములగు, జ్ఞాతజ్ఞాన జ్ఞేయములు: దృక్కు దృశ్యము, ద్రష్ట, కర్త, కర్మక్రియలు, యనునట్టి త్రిపుటి ద్వీపుటులు కూటస్థ ఎరుకయందు (అయమాత్మబ్రహ్మ) యను పద్ధతిగా లీనమైననూ, అనగా, (నీటిని వస్త్రగాలి తము పట్టి దానినుండి తరంగములు వేరుజేయుటకు వీలుకాని పద్ధతిగా) కూటస్థ బ్రహ్మమునుండి త్రిపుటులను వేరుజేయుటకు వీలుగాకున్ననూ, పరబయలుకు ఎరుకకు యేలాటి సంబంధము లేనందున ఎరుక తన వునికిని అశాశ్వతమని తెలుసుకొని, యేలోకమున లేకుండా పోవును.

శి॥ పరబయలును తెలియని ఎరుక, పుట్టుచావులు కలిగియుండుటకు కారణమేమై యుండును ?

గు॥ వేదనిర్మితమగు కర్మ ఫలభ్రాంతి. వేదాంత నిర్మితమగు జ్ఞానఫల భ్రాంతిలో చిక్కుకొని జన్మాదులు పొందుచుండును.

(2౯) వినుమూర్ఖనాళి ! తాబుట్టిన మీదట సృజనచేయు ! దినము హరించున్ ! ఘనమగు పటశతకోట్లను । తనలోపలి దారమునను । తానట్టె జనును । అట్లనెయెరుక తాబుట్టికనునూ । పనిబూని బ్రహ్మాండ భాండానంతము లాను । క్షణములోపల ద్రుంచి । కనరాక వేవేగ ! తానట్టె చనునూ । అట్లనె యెరుక తాబుట్టికనునూ !

ఓ, శిష్యుడా! శ్రద్ధతో వినుము. సాలెపురుగు పుట్టినపిదప తనలోపల నున్న జిగురులో అనంతములగు పటముల నల్లుచూ, దానియందు చిక్కియున్న మశకముల దినుచూ, ఆనందముతో యుండునుగాని, పుట్టినమండి ప్రతిదినము,

తన ఆయువు నశించుచున్నదని తెలియక, జిహ్వావస్థ భ్రాంతిలోపడి చచ్చి నట్లు, ఎరుక పనిబూని తన సంకల్పముతో బ్రహ్మాండ భాండములను పుట్టించి, కర్మ భక్తిజ్ఞాన ఆనందముతో యుండును. ప్రళయ సమయమునందు, కర్మ భక్తిజ్ఞాన ఆనంద భ్రాంతిలో చిక్కి బ్రహ్మాండ భాండముల విషయము తన విషయము తనకు తెలియక తాను కానరాక పోవుచున్నదని భావము.

(౭౦) వినుమితరులు । ఎరుకను సాక్ష్యనిపల్కిరి । నేను సాక్షి నహమని నీతో । వి జెప్పితి! నింతియె వేరనకూడదు। రెంటి నొక్కటని తెల్సుకోరా । మాటలభేద మనికనుక్కోరా । అనరాని వినరాని కనరాని బయలందు । తనకై తానరుదెంచి!తనకై తాజనును సాక్ష్యని తెల్సుకోరా మాటలభేద మనికనుక్కోకురా॥

ఓ శిష్యుడా! శ్రద్ధతో వినుము. అన్యమార్గస్థులు ఎరుకను సాక్షి యనుచున్నారు. నేనా సాక్షిని. అహమని నీతో చెప్పినాను. సాక్షి, అహము వేరుగావు. యీ రెండు ఒక్కటియే యగును మాటల భేదమేగాని, వస్తువునందే భేదములేదు యని కనుగొనుము. నోటితో చెప్పరానిదియు, చెవులతో వినరానిదియు, కనులతో కనుగొన రానిదియునగు పరబయలునందు, తనకై తానే వొచ్చి తనకై తానే పోవునని తెలియవలయునని భావము.

శి॥ సాక్షి-అహము, యీ రెండు ఒక్కటి ఎట్లగును ?

గు॥ సాక్షి యనగా ఏదేని ఒక కార్యమును కనిగాని. వినిగాని తెలిసిన వాడు అభిమానయుతుడే కనులతో చూచును. చెవులతో వినును. నోటితో చెప్పును. అభిమానము అహంకార గుణమైనందున సాక్షియనియు అహమనియు, మాటల భేదమేగాని రెండు ఒక్కటేనని నిర్ణయము.

శి॥ యితరులు ఎరుకను సాక్షియని చెప్పుటకు కారణమేమై యుండును ?

గు॥ ఎరుక రూపమైనబుద్ధి సాత్త్విక, రాజస, తామస వ్యాపారములు చేసినను చేయనిమ్ము. మరియు, "శృ॥ బుద్ధిః గ్రాహ్యమతీంద్రియమ్" అయమాత్మా బ్రహ్మమని, లయమును పొందిన పొందనిమ్ము. వీటన్నిటికి నేను సాక్షిని, ఏ కొంచెము చేయువాడను కాను-అని ఎరుక నిర్ణయము గనుక, అది నమ్మినవారు ఎరుకను సాక్ష్యని నిర్ణయించినారు.

(౭౧) పలుకన యుక్తిగనొక్కటి । తెలిపెదవిను । సందియంబు దీరునదీ న్ । పలుకున । గలిగిన యర్థము । పలుకును విడనాడి నిల్వ । బదు చోటింకేది । రెండుగ నొక్క పలుకె అయినాది । తెలియు మీళ్ళాగున తెలివి దేహము

లయ్యె । తెలివే తనువునుకాని తెలివే స్థిరముగనిల్వ । బడుచోటింకేది । రెండుగ వొక్క పలుకే అయినాది ॥

ఓ, శిష్యుడా ! నీకు సులభమైన ఒక యుక్తిని జెప్పెదను వినుము. దీనితో నీ సందేహము లన్నియు దీరిపోవును. అది యెట్లనగా, పల్కుయందలి యర్థము పలుకును విడిచి యుండదు. గనుక, పలుకు, యర్థము రెండు ఒక్క పలుకే యగును. అదేప్రకారము, తెలివి దేహము రెండు ఒక్కటేయగును. కాని వేరుగావు వేరని చెప్పినచో, తెలివి దేహమును విడిచి వేరుగా తెలియబడవలెను గదా అట్లెచ్చటను తెలియబడుటలేదు. కావున, తెలివి దేహములు రెండు ఒక్కటే నని తెలుసుకోమని భావము.

(౮౨.) ఎరుకైన భూతముల । వీ వెరుగుము ఆకసముగాడ్పు । యింగల మును । నీళ్ళిరవందనేలయని । నేనెరిగిన పద్ధతిని నీకు । నెరిగించినానూ । ముజ్జగము లయ్యెను వీట్లతోను । పరిపూర్ణమందు కన్పడుచు । తమకుదామె । మరి కానరావిట్టి। మార్గాము కలవీటి। నెరిగించినాను। ముజ్జగములయ్యెను వీట్లతోను ॥

ఓ, శిష్యుడా ! యెరుకైన పంచభూతములను తెలుసుకొనుము అవి యేవ నగా, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి అను అయిదు భూతములు గానైనది. ఆ పంచభూతము లెరుకచేతనే యెరుగబడి స్వర్గమర్త్య పాతాళలోక ములైనవి. గనుక, నేను తెలుసుకున్నట్లు నీకు తెలిపినాను. యివి పరిపూర్ణమందు కన్పడుచు తమకుతామే కానరాక పోవుచున్నవి. యిట్టి యెరుక లక్షణమును నీకు యెరిగించినాను చక్కగా యెరుగుమని భావము.

(౮౩.) ఎరుకోత్పత్తిని తెలియగ । సరసిజ గర్భాదులైన వారలరనెటిచో । నరుడెంతవాడు । వాడది యెరుగుదునన । వట్టి మాటలివి । వింతగాక। తప్పదు వాని కికరాకపోకా। అరమరలేక సద్గురుమూర్తి చరణ। పంకేరుహద్వ యార్చాన। నెరుగాని నరుమాట । లివివింతగాకా । తప్పదువాని కికరాకపోకా ॥

ఓ, శిష్యుడా ! ఎరుకపుట్టుక తెలియుటకు బ్రహ్మ విష్ణు మహేశ్వరాది దేవతలకు తరముగాదు. నరుడు యెంతటివాడు, దానిపుట్టుక తెలిసినానని చెప్ప టకు తెలిసినానని చెప్పినచో, అది సరిగాదనియు, వానికి జనన మరణంబులు తప్పవుయని నిర్ణయము. సంశయము లేక సద్గురుమూర్తి పాదపద్మంబులు పూజింపనెరుగని నరునిమాటను విచిత్రముగా నుండునని భావము.

(౮౪.) లేనెరుక । బయలులోపల । తానెట్లు జనించెననివ తగవిసు ।
వంధ్యాసూనునిగతి । వియదబ్జ విధానంబున । యక్షరాజధానీవిధమునన్ ।
రజ్జువు సర్పమైనా విధమునన్ స్థాణుపురుషుని చందానమృగజల । శశవిషాణము
స్వప్నానందముగ రాజధానీవిధమునన్ । రజ్జువుసర్పమైనా విధమునన్ ।

ఓ, శిష్యుడా! యీ లేనెరుక పరబయలులోపల నెట్లు పుట్టిన దనగా
చెప్పెదను వినుము. గొడ్రాలుకు బిడ్డ, ఆకాశమునకు పుష్పము, యక్షులకు
రాజధాని తాడయందు పాము, మోడుచెట్టునందు దొంగ, ఎండమావుల యందు
జలము, కుందేటికి కొమ్ము, మానవస్వప్న మందానందము, వాస్తవము గాక
పోయినను, వున్నదని తెలియుచున్నట్లు పరబయలునందు ఎరుకలేకపోయినను,
ఉన్నట్లు తెలియుచున్నదని భావము.

(౮౫.) లేనెరుకను యెరుకనియన । లేనెరుకెట్లాయననివ లెస్సగ వినుమా।
లేని మృగజలము । వంధ్యాసూనులు గలిగుండి వెదకి చూడాలేనట్లు । యీ
లేనెరుక యాడాలేదిట్లు । స్థాణుపురుషూడు శశవిషాణము । గగన సునాము ।
నరునీ స్వప్నానందమివి వెదకి । చూడాలేనట్లూ । యీలేనెరుక యాడాలేదిట్లూ॥

ఓ శిష్యుడా! లేని యెరుకను యెరుకయని చెప్పుట ఎట్లుకలిగినది యనగా,
చెప్పెదను లెస్సగా. వినుములేని యెండమావుల జలమును, గొడ్రాలు బిడ్డలును,
యుండినను విచారించిచూడగా, ఎటువలె లేవో, అటు వలెనే యీ లేనెరుక
యెచ్చట వెదకినా లేదు. అదియునుగాక స్థాణువు పురుషుడునూ, కుందేటి
కొమ్మునూ, ఆకాశ పుష్పమునూ, నరుని స్వప్నానందమూ, యున్నట్లు తెలియు
చున్నవి. వీటిని విచారించి చూడగా । యెటువలెలేవో అటువలెనే యీ లేనెరుక,
లేక పోవుచున్నది గనుక, యీలేనెరుక లేదని యెరుగుమని భావము.

శి॥ గొడ్రాలు బిడ్డలు వుండి విచారించగా యెట్లు లేకుండా పోవును ?

గు॥ బిడ్డలు లేనిదే గొడ్రాలు యనబడును.

శృ॥ అపుత్రస్య గతిర్నాస్తి, స్వర్గోనైవచ నైవచ, యను నిర్ణయము
ననుసరించి, తనకు స్వర్గగతులు గలుగుటకు, యితరుల సంతానమును తాను
దత్తుచేసుకొని, తన సంతానమువలె సాకును. వారల కష్టసుఖములకు తానే
శ్రమపడును. వారలకు యేదైనా వ్యాధివొచ్చి మరణించితే అహోరాత్రములు
యేడ్చును యిట్లు యేడ్చుటకు కారణము యేమని విచారించగా, 'నాకుమారుడు
చచ్చిపోయినాడని' చెప్పును. నీకు సంతానము లేదుగదా యనగా, కన్నదానికన్నా

పెంచినప్రేమ హెచ్చుగనుక. ఆ భ్రాంతివలన దుఃఖించుచున్నానని చెప్పును. యీ కుమారుడు భ్రాంతివలన నిర్ణయింపబడిన వాడేగాని, నిజము విచారించగా కొడుకులు కనలేదని తెలియును. గనుక, భ్రాంతివలన నిర్ణయింపబడినవారు వంధ్యపుత్రులు గనుక, ఎరుక నిర్ణయము భ్రాంతి నిర్ణయమేగాని, నిజముగా వుండునవిగావు. ఆదేపద్ధతిగా ఎండమావులు, ఆకాశ పుష్పము, కుందేటి కొమ్ము, స్థాణుపురుషుడు, నరుని స్వప్నానందము యుండునుగాని చక్కగా విచారించి చూడగా లేకుండా పోవును.

(౮౬) ఎరుకోద్భవ మెట్లన్నను । సరళంబగు నారికేళ సలిలము భంగిన్। యెరుకెట్ల పోవునన్నను । కరిమ్రింగిన వెలగపండూ కరణిగ నెరుగూ । తిరిగి రాని కరణంకోటెరుగు । పరిపూర్ణమున్నాది యెరుకాతా నెరిగితే । యెరుకే మ్రగ్గును । భస్మాసురుడు మ్రగ్గిననాటి । కరణిగనెరుగూ । తిరిగిరాని కరణంకో టెరుగూ ॥

ఓ, శిష్యుడా! యెరుక పుట్టుక యెట్లనిన టెంకాయలోకి నీరు వచ్చినటుల వొస్తూయున్నది. (యిది యెరుక పుట్టుక పద్ధతి) యెరుకపోవు విధాన మెట్లనగా, యేనుగ మ్రింగిన వెలగపండులోని గుజ్జు పోయినటుల పోవుచున్నది. (యిది తిరిగి జన్మమునకు వొచ్చేపద్ధతి). ఎరుక తిరిగి జన్మమునకు రానివిధము, యింకొకటి గలదు. అట్టి విధానము తెలుసుకొనుము. ఆ విధానము యెట్లులనగా పరిపూర్ణ పరబయలు యున్న విధానము యెరుక యెరిగిన యెడల భస్మాసురుడు నశించినట్లు యెరుక నశించిపోవునని భావము.

శి॥ టెంకాయలోనికి నీరు వొచ్చినట్లు యెరుక వుపాధిలోనికి ఎటులవొచ్చును?

గు॥ వృక్షోపాధికి కారణమైన నీరు కార్యరూపమైన టెంకాయలోనికి వచ్చినటుల, వుపాధికి కారణమైన యెరుక కార్యరూప వుపాధులలోనికి వొచ్చును. గనుక ఎరుక వుపాధియగు విధానమని నిర్ణయము.

శి॥ ఏనుగు మ్రింగిన వెలగపండు రీతిగా యెరుక యెటులపోవును తిరిగి జన్మాదులకు యెటుల వచ్చును?

గు॥ యేనుగు వెలగపండు మ్రింగును. దాని గర్భమునందలి జఠరాగ్ని వలన వెలగపండులోని గుజ్జు ద్రవరూపము పొంది వెలగకాయనుండి వెళ్ళటిల్లి ఏనుగకు యాహారమగును. వెలగకాయ, మలరూపమున బయటపడును. ఆహారము సప్తధాతువులుగా మారి యేనుగు పిల్లగా వుపాధికి వొచ్చును. అదే పద్ధ

తిగా, ఎరుక జ్ఞానేంద్రియములతో విషయపంచకము తెలుసుకొని, కర్మేంద్రియ ములతో యిహపరాదుల నిర్ణయమునకు, నిర్ణయించిన కర్మ భ క్తి జ్ఞానపద్ధతులు యొనర్చి, పాము కుబుస మిడివినటుల అన్నమయకోశము విడిచి వాటి ఫలా నుభవమునకు లింగశరీరరూపమున కర్మయానము పితృయానము దేవయానము లకు వెళ్ళి వాటి ఫలంబులు అనుభవించి, కర్మా ఫలానుసారముగా జన్మాదులు పొందును. కనుక, ఎరుక తిరిగి జన్మకు వొచ్చే పద్ధతియని నిర్ణయము.

శి॥ యెరుక తిరిగి జన్మకురాని పద్ధతి యెట్లు?

గు॥ భస్మాసురుడు తన వరము వలన తానే భస్మమై పోయినట్లు ఎరుక తన జనన మరణ రూపమైన కదలిక నశించి అచలపరిపూర్ణ పద్ధతిగా యుండు టకు అచలపరిపూర్ణ పరబయలును దర్శించగా, ఎరుక పుట్టుటకు, పరిపూర్ణ పర బాహ్యమునందు మూలముగాని, పరబయలునందు కలియుటకు స్థానముగాని లేనందున యెరుక తనంతనట తానే లేకపోవుచున్నది. గనుక, ఎరుక తిరిగి జన్మకు రాని పద్ధతి యని నిర్ణయము.

(౮౭) సంతోషాసంతోషము । లంతలొగనవచ్చి పిదప । నడుగు నెవటికో । వింతైయున్నది చూచితే । యింతియెసుమియెరుక పుట్టు । వికటెల్సుకోరా । సం శయమేలాయిది నమ్ముకోరా । యెంతానిదెల్పొదు । యీ దేవమార్గమందంతాట । బహువన్నె లగుపడి యగుపడ । వికదెల్సుకోరా । సంశయమేలా యిది నమ్ముకోరా॥

ఓ, శిష్యుడా! సుఖదుఃఖములు, అంతలోనే కనబడి మరి కనపడక ఎచ్చ టికి పోవునో చూచితే ఆశ్చర్యముగా నున్నది. అటువలెనే యెరుకయొక్క చావు పుట్టుకలునూ అతి విచిత్రముగా నుండునని తెలుసుకొనుము నిస్సందేహముగా యిదివిని నమ్ముకొని యుండుము. అయినా, యీ దేవమార్గమగు, పరిపూర్ణ పర బాహ్యమందు యీ లేనెరుక అచ్చటచ్చట అనేక చిత్రవిచిత్రముగా అగుపడి యగుపడనిదిగా యున్నవి. గనుక, దీని విషయము యెంతని చెప్పుదును. ఆ నిర్ణయము నీవే తెలుసుకొమ్మని భావము.

(౮౮). తొలుకారు మెరుపుకై వడి । పొలుపుగ నీళ్ళందు దోమ । బుగ్గల రీతిన్ । అలసూర్య కిరణమందున । గలనీళ్ళంబలెన్ । యెరుక గనుపించునయ్యా । అంతలో యెచట గనుపించదయ్యా । కలకాలమొక రీతి గలిగుండ దీయెరుక । తిలకింప పవలు రాతిరి దిరుగు విధమూన । గనిపించునయ్యా । అంతలో ఎచట గనిపించదయ్యా॥

ఓ, శిష్యుడా! తొలుకరి మెరుపువలెనూ, నీటియందు బుగ్గలవలెనూ సూర్య కిరణములచే కనపడు యెండమావులవలెనూ, యెరుక కనబడి మరల కన పడదు; యిదియునూగాక యీయెరుక యెల్లప్పుడూ ఒక్కరీతిగా యుండదు. విచారించగా పగలురాత్రి తిరిగినట్లు కనపడి కనపడక యుండునని భావము.

శి॥ పగలురాత్రి తిరుగువిధమున ఎరుకయెట్లు తిరుగును.

గు॥ మహావాక్య నిర్ణయానుసారము, అవస్థాత్రయములకు సాక్షి మాత్రుడనని నిర్ణయించుకొని, కర్మపద్ధతుల నమసరించి స్థావరజంగమ జీవోపాధులు పొందును. వారీక నిర్ణయానుసారము, బ్రహ్మత్వమున కాలత్ర యాధిష్ఠానముగా యుండి సృష్టిస్థితిలయ విస్తీర్ణ ఆకర్షణంబులు పొందును గనుక రెప్పపాటుకాలమైన నిలకడగా యుండబోదని నిర్ణయము.

(౮౯) కట్టెందు నిప్పులేకనె! కట్టియ నొకసమయమందు గనుపడి । బహుగా । మిట్టుపడి తుదకు గనుపడ । దట్టిదెసుమి యెరుక పుట్టు । వమలా విచారా । తనకుతానె యరుదెంచె నౌరా । పుట్టుగిట్టుటలానె నట్టేటనిలచుండి । బట్టాబయలుపొడ గట్టిన గనుపాడ దమలా విచారా । తనకుతానె యరుదెంచె నౌరా॥

అమల విచారముగల ఓ, శిష్యుడా! కట్టెయందు నిప్పుగనిపించదు. ఆ కట్టెపై మరియొక కట్టెనుంచి మదించినచో నిప్పు పుట్టును అనిప్పు పెద్దమంటగా మండి, యాకట్టెలను కాల్చివేసి తానుకూడ సమసిపోవును. అటువలెనే యెరుక పుట్టుకయొక్క నిర్ణయముగనుక. తనంతటతానే వొచ్చి కర్మ భక్తిజ్ఞాన వైరాగ్య పద్ధతులతో హెచ్చి తుదకు తన సంసార భ్రాంతి యందుతానే నశించిపోవుచున్నది యిట్టి జనన మరణ ప్రవాహముగా యున్నది యైనా, పరబయలును దర్శించినచో తనకు తానే కనపడక పోవుచున్నదని భావము.

(౯౦) తనమూలము తలిదండ్రులు । తనవలెనే వారువారి తలిదండ్రుల కున్ । తనవలెనెగాని । యన్యము గనజననస్థాన మొకటి గలదానతరమా । బ్రహ్మాదులకది తెలియతరమా । వినుము యీ బ్రహ్మాండ జననాము । నీ నాయందునన్నైన దిదియుగాదని । వేరే యింకోటి గలదాన తరమా । బ్రహ్మాదుల కది తెలియ తరమా॥

ఓ, శిష్యుడా! ఎరుక ఉపాధికి మూలము తల్లియు దండ్రియు. ఆపద్ధతి గానే సకలోపాధులకు మూలము తల్లియు దండ్రియునని తెలుసుకొనుము. యీ

పద్ధతిగాక యెరుకోపాధికి యితర మార్గముయున్నదనే నిర్ణయము లేదు. అది సృష్టికర్తయగు బ్రహ్మాదులకు తెలియదు గనుక, శ్రద్ధగా వినుము. యీ బ్రహ్మాండ జననము, నీనావల్ల నిర్ణయింపనైనదిగాని మరివొకరి వలన నిర్ణయింవినది గాదని యెరుగవలెనని భావము.

శి॥ ఎరుక యుపాధికి కారణము తల్లిదండ్రులని నిర్ణయించుటకు కారణ మేమై యుండును.

గు॥ రెండుపప్పు బద్దలు ఒకేయావరణము నందున్న గింజ (విత్తు) నుండి వృక్షోపాది యెట్లగునో ఆ పద్ధతిగానే జన్మోపాధులకు కారణమగు యెరుక తల్లి దండ్రి మూలముగానే జనియించును. యీ నిర్ణయముతప్ప ఎరుక వుపాధికి యితర నిర్ణయములు లేవు.

శి॥ సృష్టిజేయు బ్రహ్మాదులకు గూడా యెరుకస్సృష్టి యితరపద్ధతిగా యున్నదని తెలియక పోవడము కారణమేమై యుండును?

గు॥ సృష్టికర్తయగు బ్రహ్మసృష్టిని పెంపొందించుటకై సరస్వతిని వివాహమాడెను. స్థితికర్తయగు విష్ణువు లక్ష్మిని, శివుడు పార్వతిని వివాహమాడి సృష్టిని పెంపొందించిరి గనుక ఎరుక వుపాధికి తల్లిదండ్రులు మూలముగాని యితర మెచ్చటలేదు.

శి॥ యీ బ్రహ్మాండము నీనావలన యెట్లు జననమైనది?

గు॥ బ్రహ్మాండముగా స్వర్గమర్త్య పాతాళములుయను లోక నిర్ణయము గలది బ్రహ్మాండమని నిర్ణయము. యీ లోకంబులను లోకేశులను లోకస్థులగు వారు వేదశాస్త్ర పురాణ యితిహాసములద్వారా నీవు నేను ద్వంద్వ పద్ధతిగల యెరుక నిర్ణయించినదిగాని పరిపూర్ణ పరబాహ్యము నిర్ణయించలేదు. కాని యెరుక చేత నిర్ణయించిన లోకంబులు, లోకేశులు లోకస్థులు సర్వబ్రహ్మాండము లేక పోవుచున్నదది నిర్ణయము.

(౯౦) ఆకాశము శూన్యంబని లోకులు మొరబెట్ట। దాని లోపవనాదుల్। ప్రాకటముగ బుట్టినవని। వీకాకుగ। జెప్పినారు। ఛీవిన। రాదూ వంధ్యానంతీ క్షితిలోనలేదూ। కాకుంటె వినుచోద్య మాకుందేటికి కొమ్ము। కాలమునదే మేమే కంటి మనుమాట। ఛీ వినరాదూ। వంధ్యానంతీ క్షితిలోనలేదూ॥

ఓ! శిష్యుడా ! లోకులాకాశము శూన్యమని చెప్పుచు, దానిలో వాయువు అగ్ని జలము పృధ్వి ప్రసిద్ధముగా పుట్టినవని వీకాకుగా చెప్పి

యున్నారు. గనుక, ఛీ వినరాదు ఎందుకనగా, గొడ్రాలుకు బిడ్డ యెచ్చటనైనా పుట్టగలదా, యిదియునుగాక యిందొక విషయము చెప్పెద, వినుటకు, బోధ్య మగును. ఎట్లనగా, కుందేటి కొమ్ములను మేము యిప్పుడే చూచి వచ్చినామనే వారిమాట, ఛీ, వినరాదు యనిభావము.

శి॥ ఆకాశము శూన్యమని లోకులు యెచ్చట మొరపెట్టినారు.

గు॥ వేదశిరస్సులగు ఉపనిషత్తులయందు, నిర్ణయించినారు.

"ద్వితీయ కారణాభా వాదనుత్పన్నమిదంజగత్"
యథైవహినభశ్శూన్యం జగచ్ఛూన్యం తథైవహి"
(సామః 61 మహా. అ. 5. 13, 14)

తా॥ రెండవ కారణము లేనివలన యీ జగత్తు పుట్టనిదే, ఆకాశము యే రీతిన శూన్యమో, ఆ రీతిగానే జగత్తు శూన్యమేగదా! "శృ॥ సర్వం వికారజాతం మాయామాత్రం." నామరూప వికారములు గలిగి యుద్భవించినది సమస్తమును మాయాస్వరూపమైనది లేనిదే.

*. (౯౨.) అన్నపు సూక్ష్మాంశము మన । సెన్నగ నీరంబు ప్రాణ ' మెరుగుము । యీ రెండెన్నడు కలియవొ ' నాడేసున్నసు మీ యెరుక మాట ' సుగుణ సంపన్నా । కలసుటె ఎరుక సుమియింతకన్నా । వున్నాదెరుకమూల మన్నది వినలేదు ' యెన్నాడు యీ భ్రాంతి నిన్నంట నివ్వాకు । సుగుణ సంపన్నా । కలసుటె యెరుక సుమియింతకన్నా.

ఓ సుగుణ సంపన్నుడవగు శిష్యుడా! అన్నముయొక్క సూక్ష్మాంశము మనస్సు, నీటియొక్క సూక్ష్మాంశము ప్రాణము, యీ రెండు కలిసినప్పుడే స్థావరజంగమ జీవోపాధులయందు ఎరుక గలుగుచున్నది. మనః ప్రాణములు రెండు కలియనినాడు ఎరుక యుండదు. యింతకన్న అతీతమైయున్న పరబయలు ఎరుక సృష్టికి మూలమని యన్నది వినలేదు గనుక యీ యెరుక పరబయలందు ఐక్యమగునని ఆ పరబయలే యీ యెరుకయని నిర్ణయవాక్యములు నమ్మియున్న భ్రాంతి నిన్ను అంటనివ్వకుమని భావము.

శి॥ అన్నము సూక్ష్మాంశము మనస్సు యెట్లగును?

గు॥ అన్నము స్థూలాంశము మలము మధ్యాంశము మాంసము, సూక్ష్మాంశము మనస్సు.

శి॥ నీటి సూక్ష్మాంశము ప్రాణ మెట్లగును?

గు॥ జలము స్థూలాంశము మూత్రము. మధ్యాంశము రక్తము, సూక్ష్మాంశము ప్రాణము. అన్నము సూక్ష్మాంశము మనస్సును, జలముయొక్క సూక్ష్మాంశము ప్రాణమును శరీరమునందు కలిసినప్పుడే ఎరుక పుట్టుచున్నది కలియని నాడు యెరుక పోవుచున్నది.

౯౩. సంకల్పము లేనిదె । నిస్సంకల్పము లోనదోచు । చనుచోచుచనున్। సంకల్పము తప్పిన । నిస్సంకల్పము నెరిగెనేని । చను తాలేననుచూ । నిస్సంకల్పమును నిల్పేదనుచూ । సంకల్పించుట కింక సంకల్పమేది । నిస్సంకల్పమందిట్లు సంకల్ప మెరిగితే । చను తాలేననుచూ । నిస్సంకల్పమును నిలచేదనుచూ॥

ఓ, శిష్యుడా! సంకల్పమగు దెరుక లేచిదేగాని, నిస్సంకల్పమగు పరబాహ్యమందు తోచుచు పోవుచు మరల తోచుచు పోవుచుండును. యీ సంకల్ప రూపమగు ఎరుక, యొకప్పుడు సంకల్పములేని పరబయలును ఎరిగినచో సంకల్ప రూపమగు ఎరుక లేకుండాపోవును. గనుక, పరిపూర్ణ పరబాహ్యము నిలచి యుండునని, సంకల్పించి తెలుసుకొనుటకు సంకల్పరూపమగు ఎరుక వుండదని భావము.

౯౪. మాయగదా । లేనియహం । భాయగదా । తన్నుదానె యచలము యేర్పాటాయెగదా । మాయనెలేందాయగదా । మాయచిత్రామాయేగదోయి । సంశయమంత పోయేగదోయా । మాయాసమూలము । మాయాజూస్తుండంగ । మాయామైపోయేను । మాయాకె యిది చిత్ర । మాయేగదోమీా సంశయమంత పోయేగదోయి ॥

ఓ, శిష్యుడా! యెరుకయగు మాయ, లేని యభిమానరూప అహంకార పద్ధతిలో అచలపరిపూర్ణ పరబయలునందు తనంతటతానే యేర్పాటాయెగదా, ఉన్నది యున్నట్లు పరిశీలించగా ఎరుకయగు మాయలేనిది, ఆయెగదా! తనంతట తానే తోచి, తనంతటతానే లేకపోవుట ఎరుకయగు మాయకె చిత్రముగా యున్నదిగదా! యీ విషయమంతయు తెలుసుకొన్న నీకు సర్వ సంశయములు తీరిపోయినవిగదా! మూలములేక తోచుచుండెడి మాయ దీని సమూలము మాయ చూచుచుండగనే మాయమై పోవుచున్నదిగదా. యీ మాయయొక్క క్రీడ మాయకే చిత్రముగా యున్నదని భావము.

(౯౫) బిందువు తనువున బుట్టును । బిందువు । తనువింద్రియముల బృంద దం । బనువుల్ అందముగ గలుగునిని । దేనందున బుట్టినవో తెలియ । నజు నికి తరమా । మూలము లేనివని తెలుసుకొనుమా అందుకె బయలున్నాదరకి । మూలములేని బింద్వాదికంబూల । పేరుదల్వకు । తెలియనజునీకి తరమా । మూలము లేనివని తెల్సుకొనుమా ॥

ఓ, శిష్యుడా ! ఎరుకయను బిందువు ఇంద్రియ సమూహముయను తను వున బుట్టుచున్నది. గనుక, బిందువు తనువు యింద్రియముల బృందమని నిర్ణ యము దీనినుండి అంతఃకరణ చతుష్టయము ప్రాణపంచకము సమాన వ్యాన ఉదానప్రాణఅపానముకలిగి జ్ఞానేంద్రియములచేత విషయపంచకముతెలుసుకొని, కర్మేంద్రియములచేత అందముగా కర్మ యొనర్చుచున్నది. ఆ కర్మ భ్రాంతితో అనేక జన్మంబులు హొందుచున్నది. యివి దేనియందు పుట్టుచున్నవనే విషయము బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు కూడా తెలియదు. మూలము లేకయే తమంతట తాము కలుగుచున్నవని తెలుసుకొనుము. అందుకే పరిపూర్ణ పరబయలును తెలుసుకొని మూలము లేని యెరుక శరీరేంద్రియ కర్మఫలంబుల పేరు తలంపకు మని భావము.

## —(యెరుకను విడిచే విధానము)—

(౯౬) ఒక దేహధారి తనువున । సకలావస్థలు జనించి । చనిన విధము నన్ । అకలంకమైన బయలులో । ప్రకటంబై లేని యెరుక । బయలుండజూచి । తనముచ్చాట పరికించి లేచీ । వొక కొంత సేపైన వుండేటందుకు లేక । సకలాము తనవెంట జనుదేరజను । బట్టబయలుండ జూచీ । తనముచ్చాట పరికించి లేచీ॥

ఓ, శిష్యుడా ! ఎరుకోపాదియగు ఒక శరీరమందు కాలకృత్యమైన స్థితి విశేషమున బాల్యము యౌవనము కౌమారము వార్ధక్యము జాగ్రత స్వప్నము సుషుప్తి తురీయము మరణావస్థలు కలుగుచు పోవుచున్నవి, అట్లే నిష్కళంకమైన పరబయలునందు లేని యెరుక ప్రకటమగుచున్నది. ఎరుక తన మూలమును విచా రించగా యెచ్చటను లేకపోవుటచే బ్రహ్మానుభవ కలయను భ్రాంతినుండి మేలు కొని కొంత సేపైనను తాను నిలిచియుండుటకు స్థానములేక తన నిర్మిత సకల ప్రపంచముతో ఎరుకలేకుండా పోవునని భావము.

శి॥ పరబయలునందు ఎరుక యెట్లు ప్రకటమగుచున్నది ?

గు॥ ఆకాశాదికమగు కూటస్థ స్వరూపమగు ఆకాశము వాయువు, అగ్ని జలము పృథ్వి మరియు ఒక తెలివిగల స్థావరములు, రెండు తెల్వులుగల జల చరములు, మూడు తెల్వులుగల పక్షులు నాలుగు తెల్వులుగల పశువాదులు అయిదు తెల్వులుగల మానవులుగా పరిణామము బొంది భక్తి జ్ఞాన వైరాగ్యతత్వ ముముక్షత్వ పద్ధతులతో సాక్షిసత్యజ్ఞానానంద స్వరూపమున ప్రకటమగు చున్నది.

శి॥ పరబయలును చూచి తనవిషయము విచారించి యెట్లు లేక పోవు చున్నది ?

గు॥ అవస్థాత్రయ సాక్షియగు ప్రత్యగాత్మ మహావాక్య వార్తిక పద్ధతుల పరిపూర్ణ బట్టబయలైన కేవలాత్మ యని నిర్ణయించుకున్నను, తన మూలమును విచారించగా పరబాహ్యమునందు లేకపోవుటచే తాను తనతో తోచిన నామరూప ములు లేనివేయని యెరుక బ్రహ్మమను కలనుండి మేలుకొని లేక పోవుచున్నది.

(౯౭) రాకడ పోకడ లేకను । యేకస్థితినుండునట్టి యీ బయలందున్ । రాకడ పోకడ గలిగి । యనేకముగా దోచులేని యెరుకా సుశీలా ప్రతిమలోలేని పెరుమాళ్ళలీలా। లేక తోచిన యెరుక లేనేలేదనుచు! నీ కీకీలు గురునిచె యెరుకై తెజా । లుళ్ళక్కెరుకా సుశీలా । ప్రతిమలోలేని పెరుమాళ్ళలీలా ॥

ఓ, శిష్యుడా ! రాకపోకలు లేక ఏకవిధముగా యున్నట్టి పరబయలున యీ లేని యెరుక రాకపోకలు కలిగి అనేక తీరులుగా తోచుచుండును. ఎట్లనగా, ప్రతిమలయందు పెరుమాళ్ళ లీలవలె తోచుచుండును. లేకనే తోచినట్టి యీ లేనెరుక లేనేలేనకీలు గురునిచేత తెలిసినయెడల ఎరుక యుళ్ళక్కియై నిల్వక పోవునని భావము.

శి॥ ప్రతిమల లేని పెరుమాళ్ళలీల యనగా నేమి?

గు॥ మానవులు వారివారి మతానుకూలముగా సప్తలోహములతో కర్రలతో మరియు మట్టితో రామకృష్ణాది శివరూపమున శిల్పులచే చేయబడిన ప్రతిమల యందు నిక్కముగా ఆ దేవతలు వుండరు. వారు సజీవముగాయున్న కాలములందు గురువుల నాశ్రయించి మోక్షము నొందిరి. గనుక ప్రతిమలయందు వారులేరు మానవులు భ్రాంతివలన ప్రతిమలను నిర్మించి వాటికి ప్రాణ ప్రతిష్టలు యొనర్చి పట్టాభిషేకంబులు బాలభోగంబులు రాజభోగంబులు పవళింపు సేవలు యొనర్చి పూజించుచున్నట్లు రాకడపోకడ లేక, ఒకే విధముగాయున్న పరబయలునందు మూలములేక రాకడపోకడ గలిగి యనేక నామరూపములుగా తోచుచున్న ఎరుకను

సాక్షియని సత్యజ్ఞానానంద స్వరూపమని, కేవలాత్మయని, భ్రాంతిపరులు నమ్మి యున్నారు గనుక ప్రతిమలలేని పెరుమాండ్లలీలయని నిర్ణయము.

శి॥ మూలం లేకనే తోచిన యెరుక లేనేలేదనేకీలు గురుమూర్తిచేతయెట్లు తెలియును ?

గు॥ చావుపుట్టుకలు లేని అచలపరిపూర్ణ పరబాహ్యమును చావుపుట్టుకలు గలిగియున్న యెరుకను వస్తునిశ్చయముగా తెలియజేసి ఎరుకను విడిచేకీలు (ఉపాయము) సద్గురుమూర్తి వలన యెరిగినచో యెరుక యశ్శక్కి అయిపోవును॥

(౯౮.) వనగల్లుదకము లోపల । తనకై తావచ్చి । తనకు తా నేగు విధఃబున పరిపూర్ణము లోపల । తనకై తా వచ్చి యెరుక । తనకై తాజనునూ । అచలంబున్నదని తా నెరిగిననూ । తనలేమి నిజమాని తనకే తోచును । తోచి తనకల్మి మృషగా భావనజేసి నిలువాక । తనకై తా జనునూ ।అచలంబున్నదని తా నెరిగిననూ॥

ఓ, శిష్యుడా వనగండ్లుదకములోపల తనకై తావచ్చి తనకుతాను పోవునట్లు అచలపరిపూర్ణ పరబయలులో ఎరుక తనకు తానేవొచ్చి తనకుతానే పోవును. అచలపరిపూర్ణ బరబాహ్యము వున్నదని యెరిగినయెడల తనలేమిని నిజమని యెరిగి తనకలిమి యబద్ధమని భావనజేసి నిలువక తనకుతానే పోవును యని భావము.

శి॥ అచలపరిపూర్ణ పరబయలునందు తానులేని లక్షణము ఎట్లుతెలియును? తెలిసిన తదనంతరము తనకలిమి యసత్యమని తలంచి తనకు తానే యెట్లు పోవును?

గు॥ ఎరుక మితిగలిగినది గనుక, ప్రజ్ఞానంబ్రహ్మ, అహంబ్రహ్మాస్మి, తత్వమసిబ్రహ్మ, అయమాత్మబ్రహ్మ మరియు వాత్రీకనిర్ణయ పద్ధతుల ద్వారా అమితమునకు ప్రయత్నించుచు అమితమగు పరబయలునందు తనకు వునికి లేనందున తన లేమిని తాను తెలుసుకొనును తనలేమిని తాను తెలుసుకున్న యెరుక తాను పుట్టినవిధమును విచారించుకొనును. అచలపరిపూర్ణ పరబయలు తన పుట్టుకకు కారణముకాదు. తను పుట్టుటకు యితర కారణము యేమియున్ని లేనందున తనవునికి అసత్యమని తలంచి, తనంతటతానే లేకపోవును.

(౯౯.) పరిపూర్ణములోదోచుచు । యెరుకే చను । తనకు దానె యేర్పడ వినుమీ । తొరటలు తొమ్మిదిగలదై । తరితీపుల నొందుచుండి । తనువాన

దగుచూ । అచలంబున్నదని తాలే ననుచూ । మరుగిల్లెరుకకు దెలియ । యెరుకే నిల్వదుగాని । పరిపూర్ణ ముండు దాన్నెరిగే దెట్లిక గుర్తు । తనువాన దగుచూ॥ అచలంబున్నదని తాలేననుచూ॥

ఓ, శిష్యుడా! అచల పరిపూర్ణ పరబయలునందు, తనంతటతాను హోవు చున్న యెరుకే, నవరంధ్రములు గలిగిన శరీరముగా యేర్పడి దానియందలి భ్రాంతివలన సుఖదుఃఖములనుభవించుచు, తనకు తానేవొచ్చి తనకుతానే హోవును అచలంబున్నదని, తానులేనని యిట్టి మర్మము యెరుక తెలిసిన యెడల యెరుక నిలువదు అయితే పరిపూర్ణము వుండునుగాని దానిని గుర్తెరిగే యెరుక యెరుగ దని భావము.

శి॥ పరిపూర్ణమున్నదనే గుర్తుయెరుకకు యెందుకు వుండదు?

గు॥ అచలపరిపూర్ణ పరబయలునందు యెరుకలేదు గనుక లేనిస్థితి యందే తాను లేకహోవును గాని, పరిపూర్ణము వున్నదని గుర్తుపైన తాను లేక హోదు. అయినా ఎరుక లేదనిగుర్తు ఎరుకరహితమునకు సహజ లక్షణముగాని పరిపూర్ణమున్నదనేగుర్తు ఎరుక రహితమునకు లక్షణము సహజముగాదు. అట్టి గుర్తువల్లనే ఎరుకరహితము గాదు గనుక ఎరుకలేని స్థితియందే ఎరుక భ్రాంతి రహితమగును గనుక, పరిపూర్ణ మున్నదని ఎరుక ఎరుగదని నిర్ణయము.

(౧౦౦) అహమనదుగదా అచలము । అహమున్నదొ లేదొచూడ । దది నిజమె కదా । అహమును బుట్టించదుగద । అహ ముదయించేటి వరకే । అది వున్నదిగదా । అహమేశ్వమై నిల్చిందిగదా అహమే యీముచ్చట్ల । నన్నింటెన్నె రుగునుగద । అహమే తాలేనాని యరిగితె సరిగద ॥ అది వున్నది గదా॥ అహమే విశ్వమై నిల్చింది గదా ॥

ఓ, శిష్యుడా ! అచలపరిపూర్ణ పరబయలు నేనుయని యనదు. నేను-నేను యని వ్యవహరించెడి అహంకారము యున్నదో లేదో రెంటిని చూడదు. యిది సత్యమేగదా ! ఎరుకయగు యహంకారమును పుట్టించదుగదా! అహము పుదయించేటి వరకే అదివున్నదిగదా ! అహమే విశ్వమై నిల్చిందిగదా ! అహమే యీ ముచ్చట్లనన్ని యెరుగునుగదా ! అట్టియహము తాను లేనని అరిగితేసరి, అచలపరిపూర్ణ పరబయలు వుండునని భావము.

(౧౦౧) లేనెరుకను బయలందున । లేనేలేదనక । యితరులేలపలికిరో । లేనిది కలదని । పిచపను । లేనేలేదనుచు । సిగ్గులేక యీలీలా । ఛీ వినకీ

పీకాకు నీకేలా । మేనం దశుద్ధాము తానద్దుకొని మళ్ళి । పూని కడిగినరీతి నాను సిగ్గొకయింత । లేక యీలీలా ఛీ విసకీ పీకాకు నీకేలా ॥

ఓ, శిష్యుడా ! పరిపూర్ణ పరబయలులో లేని యెరుకను లేనే లేదనకకొంత మట్టుకు వున్నాదని, మరల లేదని నానావిధములుగా కొందరు సిగ్గులేక చెప్పి యున్నారు. అట్టి పీకాకు మాటలు నీవు వినగూడదు. ఎందుకనగా, శరీరమందు అమేధ్యము తానేపూసుకొని మరల పనిపూని కొంచమైనను సిగ్గులేక కడుగుకొను నటుల వున్నదని తెలుసుకొనుమని భావము.

(౧౦౨) పిల్లలు తాట్యాకులతో । పిల్లల గావించి పెండ్లి పేరంటంబుల్ । కొల్లలుగ జేయవారల। తల్లులుగని సత్యమనుచు। దలచేరా మదిసీ। నిను నీవిట్లూ దలచరా మదిసీ। కల్లా సంసారంబు । గని మానవులు సంతసిల్లాగా । గురు మంత్ర సిద్ధూలు నిజమాని తలచేరా మదిసీ । నిను నీవిట్లు దలచరా మదిసీ ॥

ఓ. శిష్యుడా । పిల్లలు తాటియాకులతో స్త్రీ పురుష రూపముగా బొమ్మలు జేసి వానికి పెళ్ళిండ్లు, పేరంటములు విందులు విశేషములుగా జేసి యవి సత్య ములని భావించి సంతోషముగా నుందురు. వారి తల్లులు వానిని జూచి నిజమని దలంచరు. అట్లే కల్ల సంసారమును నిజమనినమ్మి పామరులు సంతోషపడుదురు గాని గురుమంత్ర సిద్ధులగు సాధువులు నిజమని తలవరు అటువలె నిన్ను నీవు నిజమని యెరుగకుము యని భావము.

(౧౦౩) మేనెరుకల రెండింటిలో । దానిని యిది దీని నదియు। తగసృజి యించున్ । మేనెరుక లివియు మూలము । లేనిదె సృజనయ్యె ననుచు । లేనేలే వంటీ । అంటే తప్పు లేనేలేదంటీ । మేనెరుక లిప్పూడు దేనందున్నవో చూచి లేనిమేనెరుకల లేనివనుచూ నమ్ము॥ లేనేలేవంటీ । అంటే తప్పు లేనేలేదంటీ ॥

ఓ, శిష్యుడా । బీజవృక్షన్యాయముగా యెరుక తనువు రెండింటిలో ఎరుక తనువును । తనువు ఎరుకను పుట్టించును. అవి రెండు మూలము లేకనే సృజ నయ్యెననుచు లేనేలేవంటి, అంటే తప్పు లేనేలేదంటిని. మేనెరుక లిప్పుడు దేనందున్నవో చూచి లేని మేనెరుకాల లేనివనుచు నమ్ముమని భావము.

(౧౦౪) ఎరుకపని జేయదనకుము । యెరుగుట మరచుటలు రెండు । యెవ్వరి పనులో । యెరిగింపుము నామ్రోలను । వెరువను । తప్పితివె దెబ్బ వేసేనుచూడూ । అట్లనకుండ జేసేను నేడూ । వెరపించుటే దెబ్బ వేసేన నాతండ్రి । యెరిగించి పైపుర్మ । మెరుకాను నేదీసివేసేను చూడు । అట్లనకుండ జేసేను నేడూ ॥

ఓ, శిష్యుడా ! ఎరుక సాక్షిమాత్రమేగాని, పనిచేయదని చెప్పకుము. ఎరుగుటయును, మరచుటయును, యీరెండు ఎవ్వరిపనులు, నాఎదుట నిర్ణయించి చెప్పుము నీనిర్ణయమునకు నేను భయపడను. నీనిర్ణయము నిజము గానిచో నిన్ను దండించి సరిగా జెప్పనటుల జేసెదను. నా తండ్రీ ! నిన్ను భయపెట్టడమేగాని దండింతునా ! అచలపరిపూర్ణ పరబయలును యెరిగించి సాక్షియగు ఎరుకను తీసివేసెదను చూడుము యని భావము.

(౧౦౫) ఎరుకొక్కటుండె నేనియు । యెరుకే యీ విశ్వరూప । మేర్పడ దాల్చున్ । యెరుకొక్కటి లేకుండిన । యెరుకైన ప్రపంచమున్న । దెవరెరిగేరి కనూ । లేదనసైన నెవరుండే రికనూ । పరిపూర్ణమై నట్టి । బయలుండ గనిపెట్టి గురుని వాక్యము బట్టి । గురుతుబోగొట్టితె । యెవరెరిగే రికనూ । లేదనసైన నెవరుండే రికనూ ॥

ఓ, శిష్యుడా ! ఎరుక వొక్కటి వుండిన యెడల యీ యెరుకనే విశ్వ రూపము దాల్చును. యీ యెరుక నొక్కటి లేనియెడల ఎరుకైనట్టి విశ్వరూప మును యెవ్వరు యెరుగరు. అది లేదనిచెప్పుటకు యెవ్వరు వుండరూ. సద్గురు వాక్యముచే అచలపరిపూర్ణ పరబయలును వుండజూచి గురుతను యెరుకను విడి చిన యెడల ఎవ్వరుకూడ వుండరని భావము.

(౧౦౬) తెలుపు మృదుత్వము మధురము । గలవస్తువు చక్కెరనుచు గనుగొన్నట్లా । తెలివి శరీర జగంబులు । గలవస్తువు బిందువనుచు । గనుగొన రాదా । నేదెల్పితె విననమ్మరాదా । తెలిపిచె బయలుండ దెలశి । యీ తెలివిని। తెలివిచేతనేబట్టి తీసివెయ్యర పోని। కనుగొన రాదా। నేదెల్పితె విననమ్మరాదా॥

ఓ, శిష్యుడా ! తెలుపు మృదుత్వము మధురము గలిగిన వస్తువు చక్కెర యని తెలిసినట్లు, తెలివి శరీరము జగముగాయున్న వస్తువు ఎరుకయను బిందువు యని తెలుసుకొనుము. నేను చెప్పినది విని నమ్మియుండుము. ఎరుక చేత బయ లును వుండజూచి యీ ఎరుకను ఎరుకచేతనే తీసివేయుము యని భావము.

(౧౦౭) లేనెరుక బయలులోపల తానై తనకేరుపడిన తనమూల మునే। తానెరుగ దలచినప్పుడు । తానే లేకుండు । దృష్టాంతము వినుమిచటా । కల దోచాదె తనకై తానెచటా । తానై తోచినకల । తనమేల్కొ గనబోతే। తానె తన కూలేదు। తగియున్నదీ దృష్టాంతము వినుమిచటా। కలదోచాదె తనకై తానెచటా॥

ఓ, శిష్యుడా ! పరిపూర్ణ పరబయలులో లేనియెరుక తనకుతానే యేర్పడి తనమూలము తానెరుగగలచి నప్పుడు తానే లేకుండును అందుకు తగిన దృష్టాంతము వినుము. తనకుతానే తోచినకలతన మేలుక గనలోతె తానేతనకు లేకపోవుచున్నదని భావము.

(౧౦౮) ఎరుకను కలలో పురుషుని । కెరుకే యీ విశ్వమగును। యేర్పడు కలగా ' యెరుక బయలుగని । తాలేందెరిగిన । నెరుకకడి మేల్కొ । యిదినమ్ము లెస్సా ' యెరుకతో పొందు వదులాదె పిస్సా । యెరుకానె కలనీకు యెప్పుడు దోచితె। యెరుకా లేందనుమేల్కొ । నెరుగు మప్పుడె వాలు ' యిది నమ్ములెస్సా యెరుకతో పొందు వదులాదె పిస్సా ॥

ఓ, శిష్యుడా ! ఎరుక యనెడి కలలో పురుషనకు ఎరుకే ప్రపంచమై కలగా యేర్పడును. యీ యెరుక బయలును వుండజాలి తాను లేనని యెరిగిన యెడల, ఎరుకకు అదే మేలుక యని దీనిని నీవు దృఢముగా నమ్ముము. ఓయవి వేకుడా! నీవు లేని యెరుకను పరబయలని నమ్మి యుండకుము నిన్ను నీవు విడు వుము. ఎరుకయనెడి కల నీకు యెప్పుడు దోచితే ఎరుక లేదని అప్పుడే మేల్కొ నుము యని భావము.

శి॥ కల పురుషులు యనగా నెవరు ?

గు॥ ప్రపంచమున గల సకల మానవులు ఎరుక నిర్మితములే గనుకకల పురుషులని చెప్పబడును.

శి॥ కల ప్రపంచమనగానేది ?

గు॥ నామరూప క్రియలుగల ఎరుక నామరూప క్రియలు లేని పరబయలు యందు లేనందున ఎరుకని కలయని చెప్పబడును. యీ కలయగు యెరుక వల్లనే విశ్వ నిర్ణయము గనుక విశ్వమును కల యని చెప్పబడును.

శి॥ కల పురుష నిర్మితమగు కల విశ్వము ఆ కలపురుషునికి కలగా యెట్లు తెలియును ?

గు॥ రాత్రి పగలు రీతిన వచ్చి పుట్టే విధమున జాగ్రత స్వప్నము సుషుప్తి మరణము వుపాధి ప్రళయములుగా నిలకడలేక కలగా తిరుగుట తెలియు చున్నందున, ఎరుక పురుషునికి కల విశ్వము కలగా తెలియును.

శి॥ ఎరుక బయలుగని తాను లేనని తెలిసిన అది మెలుకువ యెట్లగును ?

గు॥ అవస్థాత్రయములకు సాక్షియేదో కాలత్రయములకు అధిష్ఠానము అనే యని నిర్ణయించుకొని,యున్ననూ తన మూలము పరబయలు నందున లేనందున ఎరుక లేకపోవును. కల రూపమగు లేని యెరుక లేక పోవడమే మేలుకయని నిర్ణయము గనుక దీనిని నీవు దృఢముగా నమ్ముము.

శి॥ ఎరుకతో పొందు వదలదే పిస్సా ! యనగా నేమి ?

గు॥ కలరూపమగు యెరుకను పరిపూర్ణమని తలంచి దీనియందు ఐక్యము పొందియుండకుము. అందువలన నీకు జన్మ భ్రాంతి తొలుగదు. యెరుక యనెడికల భ్రాంతి ఎప్పుడు కలిగితె ఎరుకలేదను మెలుకువ అప్పుడే తెలుసు కొనుము యని భావము

(౧౯౯) చిత్తరువు రంగు గోడల ! నె త్తెరగున దెలసినావొ ! నీవిప్పుడు నీచిత్తమున జగము నెరుకను । వుత్తబయల్ నట్లదెలియు మూహతోడుతనూ. తెలిసి విడువు మూహ జగములనూ। అ త్తెరగున జేస్తే ఆవాలి మాటాను యిత్తెర గని తెలియ నెవరుండె రటుమీద । నూహతోడుతనూ ! తెలిసి విడువు। మూహ జగములనూ ॥

ఓ, శిష్యుడా ! చిత్తరువును రంగును, గోడను. ఎటువలె ఎరిగినావో అటు వలెనే, ఇప్పుడు నీ మదిలో జగత్తును, ఎరుకను, బయలును, వూహచేత నెరిగి. అందు ఊహయను జగత్తును, ఎరుకను, ఈ రెంటిని విడువుము. ఆ ప్రకారము చేసినయెడల. పరబయలును, ఇట్టిది అట్టిదియని ఎరుగుటకు ఎవ్వరు వుండరు అని భావము,

శి॥ చిత్తరువును, రంగును, గోడను ఏప్రకారము తెలుసుకొంటున్నారు.

గు॥ గోడయందు ఎలాటి చిత్రములు లేవు. రంగులయందు ఎలాటి ఆకారములు లేవు గాని సంకల్ప పురుషుడు ఆకారములు లేని రంగులలో తన సంకల్పానుసారము చిత్తరువులు నిర్మించి యున్నాడని తెలుసుకొనును గాని గోడ చిత్తరువుగా మారినదని యెంతటి యమాయకుడైనా తెలుసుకొనడు.

శి॥ జగమును, ఎరుకను, ఉత్త బయలును, చిత్తమున ఎట్లు తెలియ వలయును? తెలిసినది ఎట్లు విడువ వలయును ?

గు॥ ఇంతవరకు విన్న జగము పరబయలు విషయములు జ్ఞాపకమునకు తెచ్చుకొని, ఎరుక పురుషుని సకల్ప ... వల్లదాని ఆకారమగు పంచభూతములతో స్థావర జంగమ జీవోపాధులు కలుగుచున్నవి. పరబయలువల్ల ఏదిన్ని గలుగ

డము లేదని ఊహించి ఎరుకను, జగమును విడువ వలయును. తదుపరి పర బ్రహ్మము వున్నదని నిర్ణయించుట కెరుక యుండవదని తెలియుము.

(౧౧౦) పరిపూర్ణములో లేనిదె । యెరుకొక్కటి దోచితనను యెరిగిన మృషగా । యెరుకే విడుచునదెట్లన । కరములు తమ పనులు తామె । గడువు నట్లుగనూ । యిదిగాకుంటె కలదింకోటి వినూ । మరి కాని దామాట మంచిదీ మాటాని । పరిపరివిధమూల పలుకే పలుకుల పని । గడుపూనట్లుగను । యిది గాకుంటె కలదింకోటి విను ॥

ఓ, శిష్యుడా ! పరిపూర్ణములో లేనిదే ఎరుక యొకటి కలిగి తన్నుతాను యెరిగినప్పుడు లేనని తనకుతాని లేకపోవుచున్నది యెట్లనగా చేతులు తనపనులు తమకుతామే చేసుకొనిన పిదప తమంతటతామే మానుకొనునట్లును, ఇదిగాక ఇంకో దృష్టాంతము చెప్పెదను వినుము, నోటినుంచి వచ్చే పలుకులు ఇది మంచిది కాదనియు, అది మంచిదనియు, పలుకులు నానా విధములుగా తమ పనులు తామే జరుపు కొన్నట్లని భావము.

(౧౧౧.) అంటదు కల మేల్కను । మేల్కంటదు కల నెన్నటికిని । కడు నిశ్చయ। మీ రెంటి క్రియగుర్తు బయలుల। రెంటిని రెండంటకుండు। రెండ్రెంటి లోను । కలయెరుకాలీ రెండూ మిథ్యేనూ । దంటాగ మేల్క బయలుంటూ నిప్పటి కెరిగి । గెంటూము పైరెంట । రెంటీకల యెరుకాల । రెండ్రెంటిలోను । కల యెరుకాలీ రెండూ మిథ్యేనూ ॥

ఓ, శిష్యుడా ! కలను మేలుక, మేలుకను కల యంటనిది నిజమే కదా, అటులనే పరబయలును యెరుక నంటదు యెరుక పరబయలును అంటదు. ఇం దులో కలయును, యెరుకయును ఈరెండు లేనివి మేలుక, పరబయలు యెప్పుడు యుండునని తెలసి కలను, యెరుకను రెంటిని విడచి పెట్టుము యని భావము.

(౧౧౨) కలమేల్క లెరుక బయలుల । కలసామ్యము జేసిచూడు మీ భ్రమదొలగున్ । ఫలమేమి పెక్కు చదువుల వలనను । జప యాగ యోగ వ్రతముల వలనన్ । శమదమ మఖశతమూల వలనన్ । తలక్రిందుగా బద్ధ తనువూనేగానన్న । కలమేల్కగని తానెక్కడనిల్వ నట్లవును । వ్రతముల వల నన్ । శమదమమఖ శతమూల వలనన్ ।

ఓ, శిష్యుడా ! కలయగు యెరుకను, మెలకువయగు పరబయలును ఈ రెంటిని సామ్యముచేసి చూడుము. నీ భ్రమ తొలగును. పెక్కు చదువుల

వల్లను, జపతపంబుల వలనను, యాగ యోగంబుల వలనను, వ్రతముల వలనను, శమ దమాదుల వలనను, తల క్రిందికిని, కాళ్ళు పైకినిపెట్టి ఘోరముగా తపస్సు చేసిననూ, నేను శరీరమును గాను। దానికంటె వేరుగా నున్నానని తలంచినను, యెలాటి ప్రయోజనములేదు. యెందుకనగా, కల మేలుకను జూచి తాను యెచ్చటగూడ నిలువనట్లు సకల భ్రాంతులు నిలువక లేకపోవును.

(౧౧౩) బంధన విద్యా ధైర్యంబులు। చక్కదనంబు। సత్య బుద్ధ్యాద్యుతులన్। కలలో యివి లేని మనుష్యుల। జగమును। తనను తాను। జూచి మానవుడూ। మేల్కొనెనేని చూడాలేదొకడు। కలమేల్కొ లెరుక బయలుల కట్ల జతగూర్చి। కలయెరుకలను। దేశికులచే వీడితెవాలు। చూచి మానవుడు। మేల్కొనెనేని చూడలేదొకడూ॥

ఓ, శిష్యుడా! బలమును, ధనమును, విద్యయును, ధైర్యమును, చక్కదనమును, సత్వగుణమును, మంచిబుద్ధిగల సకల మానవులను జగత్తును, తనను, తాను కలలోగాంచిన మనుజుడు మేల్కగనెనేని. ఇందులో దేనినైనా చూడలేడు, అట్లు సద్గురు కటాక్షముచేత యెరుకయగు కలను, పరబయలుయను మేలుకను జతచేసి కలయగు యెరుకను గురు నిర్ణయానుసారము విడివితే వాలును. ఇంక దేనిని చూడలేడని భావము.

(౧౧౪) వినుము నేనను యెరిగే। తనువందున లేక। బయలు తానిండ నదా। కనుగొను మదికనుగొని। యీ తనువును విడనాడుమింతె తడువేలనోయీ యీపనికింక గడువేలనోయీ। అనుమానముంటే సీవరయామూ। శివరాములను దీక్షితులుజేసె। నచల గ్రంథమునంత। తడువేలనోయీ। యాపనికింక గడు వేల నోయీ॥

ఓ, శిష్యుడా! శ్రద్ధగా వినుము, పరిపూర్ణ పరబయలులో నేనని గుర్రెరిగే శరీరము లేదు - ఆ పరిపూర్ణ పరబయలు తనకుతానే నిండి నిబిడీ కృతమై యున్నది. దానిని జూడుము. తదుపరి గుర్రెరిగే ఎరుక శరీరము విడువుము. ఇక ఆలస్యము కూడదు. ఈ కార్యమునకు గడువు అవసరము లేదు. నీకు సందేహము యున్నయెడల శివరామ దీక్షితులను వారు రచించిన శివరామ దీక్షితీయము అను బృహద్వాశిష్టమను అచల గ్రంథమును సంపూర్ణముగా విచారించి చూడుము అని భావము.

(౧౧౫) తిమిరారియందు లేనిదె। తిమిరము తమదానె వచ్చి। దేజో నిధియా। తిమిరారి యునికి గనుగొని తిమిరము తానిలువనట్లు। తెలుసుకో

రాదా । బయలెరుకాల తెలిసి యామీదా భ్రమరూపమైనట్టి । బ్రహ్మాండ మెరు కాల । భ్రమదీసి వేసితే । భ్రాంతి పుట్టదు మళ్ళీ తెలుసుకోరాదా । బయలెరుకాల దెలసి యామీదా॥

ఓ, శిష్యుడా, సూర్యునియందు లేని చీకటి తనకు తానే వచ్చి, సూర్యుని యునికి తెలుసుకొని తనంతట తానే లేకపోవుచున్నది. అట్లే పరిపూర్ణ పరబయ లును ఎరుకను ఎరిగిన తదుపరి భ్రమరూపమైన, బ్రహ్మాండ మెరుకల భ్రమ దీసివేసినచో, జన్మభ్రాంతి పుట్టుటకు వీలుకాదని భావము.

** (౧౦౨) మరుపన తొలిమేనులు మూ । డెరుకన నాలవశరీర । మీ రెం డొకటే । పరిపూర్ణ మవలి । దీవలి యెరుకను గురువాక్కు చేత । నెగర జిమ్మి ననూ । పోవును । లేని దెరిగేదేగిననూ । యెరిగేదెలేకుండు యేమొ అవలిజాడ । నెరిగేవారెవరింక । యింతె చాలెరుకాను । యెగర జిమ్మిననూ । పోవునులేని దెరిగేదేగిననూ ॥

ఓ, శిష్యుడా ! మరుపన తొలిమేనులు మూడు. ఎరుక యనగా, నాల్గవ శరీరము. నా రెండు ఒకటే. పరిపూర్ణ పరబయలు యనగా ఎరుక మరుపుయను ద్వంద్వ రూపముగల ఎరుకకు అవల యుండునది గనుక మూలము లేని ఎరు కను సద్గురు వాక్కుచే నెగుర గొట్టినచో నది నిలువజాలక లేకపోవును. యెరిగెడి ఎరుకలేకపోయిన పిదప అవల పరిపూర్ణ పరబయలు యున్నదని ఎరుగువారు లేరు కనుక, జనన మరణ భ్రాంతిరహితమునకు ఈ పద్ధతి చాలునని భావము.

**— (వంత నిరసన) —**

** (౧౦౩) వన్నియలై దొక చోటను । వన్నుగ గలసినది । హృదయ పద్మం బనుచున్ । యెన్నుదురు జనులు । యెరుకంటున్నాదని । శ్రుతులు బల్కుచున్నా విసుమ్మా । తెలుసుటే మోక్షమన్నావిసుమ్మా । వన్నెలన్నియు మీరి వున్న వస్తువుజాడ । నెన్న డెరుంగాక । యెన్నో రీతుల బల్కు । చున్నావి సుమ్మా। తెలుసుటె మోక్ష మన్నావిసుమ్మా ॥

ఓ, శిష్యుడా ! ఎరుపు, తెలుపు, పసుపు, నలుపు, సునీలము అను పంచ వన్నెలు కలిసినది హృదయ కమలమనియు జనులు నిర్ణయించినారు, దానియందు ఎరుక యున్నదనియు, దాని నెరిగినచో మోక్షము కలుగునని శృతులు చెప్పు చున్నవి. వన్నెలన్నియు మీరి యున్నట్టి అవల పరిపూర్ణ పరబయలు జాడ నెరుగక శృతులెన్నో విధముగా జెప్పుచున్నవని భావము.

శి॥ ఐదువన్నెలు కలిసినచోటు హృదయ కమలమని నిర్ణయించుటకు కారణమేమై యుండును ?

గు॥ ఇంద్రియములచే పదార్థములను గ్రహించుట ఏదిగలదో యది జాగ్రదావస్థ యనబడుచున్నది. విషయ పంచకము నెరుగుచున్న ఇంద్రియము లలో నేత్రేంద్రియము పదార్థ జ్ఞానము అంతఃకరణమునకు కలుగజేయును గనుక నేత్రేంద్రియమును, హృదయ పద్మమని జనులు నిర్ణయించినారు.

శి॥ హృదయమునందు ఎరుక గలదుయని శృతులు నిర్ణయించి దానిని ఎరిగిన వారికి మోక్షము గలుగునని ఎట్లు నిర్ణయించిరి ?

గు॥ హృదయమనగా మనస్సు,ఎరుక మనోరూపమున, నేత్రేంద్రియముల ద్వారా, నాకాశాదిక భూతములునూ, వాని వలన జనియించిన పదార్థములునూ, విరుద్ధ ధర్మములు గలిగియుండుట వలన పరస్పర భిన్నములై యున్నవి ఆ పదార్థములను గ్రహించు జ్ఞానము మాత్రము ఆ పదార్థములనుండి వేరువేయ బడినదై (కంటికినీ, కంటిచే చూడబడు పదార్థమునకు సంబంధము లేనట్లు జ్ఞానము తన ఏకత్వమునుండి భిన్నముకాదు।అదేపద్ధతిగా, స్వప్నావస్థ యందునూ సుషుప్త్యావస్థయందునూ పదార్థభేదమేకాని, జ్ఞానమునందు ఏ భేదము లేదుయని నిర్ణయించి ప్రజ్ఞానంబ్రహ్మ, అహంబ్రహ్మాస్మి తత్వమసి బ్రహ్మ, అయమాత్మ బ్రహ్మయను నిర్ణయానుసారము పదార్థ భ్రాంతినుండి మోక్షము కలుగునని శృతులు నిర్ణయించినవి.

శి॥ పరబయలు జాడ శృతులయందు లేదా ?

గు॥ శ్రవణేంద్రియములకు శబ్దరూపమున వినబడును గనుక, శృతియని చెప్పబడును, ఎంతవరకు మనోగోచరమగునో, అదిశృతియనబడును. వాక్కునకు మనస్సునకు అగోచరమగు పరిపూర్ణ పరబాహ్యము శృతి, స్మృతులచేత నిర్ణ యించుటకు వీలుకాక వేదమునందలి సిద్ధాంత భాగమగు శాంతి పద్ధతియందు పరిపూర్ణ పరబయలును నిర్ణయించినది గనుక అది శృతుల నిర్ణయమునందు తెలియబడదు.

(౧౧౮). మతముల వారలు। తమ సమ్మతమైనటువంటి। శాస్త్రమర్యాదలచే మితమేరు పరచుకొని । బహుగతులను కలహింతు ! రట్టిగతి నీకేమిటికీ । చప లతజెందె స్థితి నీకేమిటికీ । ప్రతిలేని యీ బట్టబయలుండజాలి । సంతతము లేనెరుక । లేదని నమ్ము । మికవారి గతినీకేమిటికీ । చపలతజెందె స్థితి నీకేమిటికీ ॥

ఓ, శిష్యుడా ! ద్వైతా ద్వైత, విశిష్టాద్వైత, శౌర, గాణ్తేయ, గాణ పత్యాది మతములవారు తమతమ మతములకు సరిపడు శాస్త్రములను నిర్ణయించుకొని వాని వాని మర్యాదల నతిక్రమించి నడువరాదని, హద్దులనేర్పరచుకొని, బహు విధముల కలహించుచుందురు. నీవు వారివలె కలహింపబోకుము. అందువల్ల బవ లత్వము కలుగును. పరిపూర్ణ పరబయలుతో సమానమైనది యేదియును లేదు కావున పరబయలు యుక్తికి నెరింగిలేని యెరుక లేనే లేదని నమ్ముము యని భావము.

(౧౧౯) ద్వైతాద్వైత విశిష్టులు ! సైతురు ! వినిసైనరెపుడు ! సైసక పిదపన్ ! సైతురు క్రమమునవేరన ! నాతతి మతి జీవశివులనవి వినబోకూ ! నే బోధించినది ! విడబోకూ ! పూతమూ బయలూను బొడజూచి గురునీచె ! ద్వైతా ద్వైత విశిష్టాద్వైతాములను మాను ! మవివినబోకూ ! నే బోధించినది విడబోకూ॥

ఓ శిష్యుడా ! ద్వైతులు, అద్వైతులు, విశిష్టాద్వైతులు జీవేశ్వరులు వేర నియు, వేరువారు ఒక్కటే యనియూ, ఈశ్వరుడు చిదచిద్విశిష్టుడని ఎల్లప్పుడు పలువిధముల వాదించుకొను చుందురు. అట్టి మిధ్యావాదంబులను వినకుము.నేను నీకు బోధించిన పద్ధతి విడిచిపెట్టకుము. పరిపూర్ణ పరబయలును గురు కటాక్షముచే నెరింగి ద్వైతా ద్వైత విశిష్టాద్వైతుల ప్రబోధనలను మానుముయని భావము.

శి॥ ద్వైతా ద్వైత విశిష్టా ద్వైత మతనిర్ణయములు ఏ ప్రకారముగా యుండును ?

గు॥ అద్వైతులనగా జీవేశ్వరులకు ఏకత్వము తెలియ జేయువారు. ఎట్ల నగా అఖండానంద రూపమగు చైతన్యము ఒక్కటే సత్య పదార్థము. అదియే బ్రహ్మము. సకల ప్రపంచమునకు సాక్షి భూతము. నిర్వికారమునగు బ్రహ్మము నందు జగద్భ్రాంతి అవిద్యా ప్రభావమున గలుగుచున్నది. అవిద్యను మాయ మరియు ప్రకృతి యనబడును. మాయయగు సత్వగుణమునందలి, చేతన ప్రతి బింబము, చేతనము, మాయ ఈ మూడు గూడి ఈశ్వరుడు. అవిద్యయగు రజో గుణము యందలి ప్రతిబింబము, చేతనము, అవిద్య ఈ మూడు కూడి జీవుడు, మాయ, అవిద్యోపాదులగు జీవేశ్వరులను తీసివేయగా, చేతన బ్రహ్మము శాశ్వ తము యని నిర్ణయము కలవారు అద్వైతులు.

విశిష్టాద్వైతులనగా, ఈశ్వరుడు, జీవుడు, ప్రకృతి, ఈ మూడు సనాతన ములు, శాశ్వతములు ఇందు ఏవీ నశ్వరములుకావు ప్రకృతి ప్రళయ కాలమందు తన స్థూల రూపమును విడిచి, సూక్ష్మరూపము జెందునేకాని నశించదు.

జీవుడు, ఈశ్వరుడు భిన్నులే జీవుడు అనాది వాసనవల్ల జనన మరణం బులు జెందుచుండును. ఈశ్వర సేవవల్ల వైకుంఠప్రాప్తి గలిగి, ఈశ్వర కైం కర్యము జేయుచూ, దివ్యదేహమును ధరించి, శాశ్వతముగా వైకుంఠమునందు యుండుట వీరల జీవన ముక్తియని విశిష్టాద్వైతుల నిర్ణయము.

ద్వైతులనగా, జీవేశ్వరులు వేరులగుదురుగాని ఏకముకాదు, ఎటులనగా, తేజోంధ కారములు ఏకము కానట్లు, మరియు జీవుడు కించిద్గుణములు గలవాడు ఈశ్వరుడు సర్వజ్ఞగుణములు గలవాడు గనుక వీరలకు ఐక్యము పొసగదు. ఐనా ఈశ్వరుడు వరము నిచ్చువాడు, జీవుడు వరము ననుభవించువాడని ద్వైతులు నిర్ణయము.

(౧౨౦) కొందరు దశవిధనాదములందున । నభపంచకంబునందున । చక్రాలందున । లక్ష్యధ్యానంబందున । హంసందుబుద్ధి నాటింతురోయీ । యోగ ములందు నటియింతురోయీ! అందిసిద్ధులచేత నానందింతురు కొంద। రెందుకొ? మనసే బోధందె నీవుంచూము । నాటింతురోయీ । యోగములందు నటియింతు రోయీ ॥

ఓ, శిష్యుడా ! ప్రపంచములో కొందరు దశవిధ నాదంబులందును, కొందరు ఆకాశ పంచకముల యందును, నవచక్రముల యందును, కొందరు లక్ష్యత్రయంబులందును, సగుణ నిర్గుణ ధ్యానంబులయందును, హంసయం దునూ బుద్ధి నిశ్చయము దృఢముగా నుంచెదరు. మరికొందరు అష్టాంగ యోగ ములందు, వాటివల్ల గలుగు సిద్ధులుపొంది ఆనందించుచున్నారు. ఈ విధముగా ఎందరు ఎన్నివిధములుగా ప్రవర్తించుచున్నను, నీవు మాత్రము ఈబోధయందే యుండి, నేను చెప్పిన పద్ధతిగా ప్రవర్తించుమని భావము.

శి॥ దశవిధ నాదములనగా యేవి ?

గు॥ చిణి, చిణి, చిణీ. ఘంటా మృదంగా, మేఘ, శంఖా, వీణ, తాళ, వేణు, భేరి, ఈపదిన్ని దశనాదంబు లనంబడును. సద్గురు ప్రోక్తమయిన ముద్రవేకర్ణ ద్వయంబుమూసి, ఈదశ నాదంబు లాలకించుచు, తుదకు ఘంటా నాదమందు మనంబులయము చేయువారు నాదబ్రహ్మమునందు లయము పొంద గలరు.

శి॥ నభ పంచకమనగా ఏమి ?

గు॥ ఆకాశ పంచక అంతరేంద్రియములు జ్ఞానము మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము జ్ఞానేంద్రియము ననుసరించువారు తత్వచింతనగల వారని మనోఇంద్రియము ననుసరించువారు యోగధ్యానకులని, బుద్ధేంద్రియము ననుసరించువారు మతసాంప్రదాయకులని, చిత్తేంద్రియము ననుసరించువారు భక్తులని, అహంకారేంద్రియము ననుసరించువారు మంత్రోపాసకులని నిర్ణయము మంత్రములయందు, భక్తి పద్ధతులయందు, మత నిర్మాణములయందు, యోగ పద్ధతుల యందు, తత్వవిర్మిత పద్ధతులయందు, నిర్మిత పరములకు భ్రాంతు లగుచున్నారని నిర్ణయము.

శి॥ నవచక్రము లనగా ఏమి ?

గు॥ ఆధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము అజ్ఞేయము, సహస్రారము, కర్మచక్రము, కాలచక్రము, అనునవి నవచక్రము లని నిర్ణయము.

శి॥ లక్ష్యత్రయమనగా ఏమి ?

గు॥ అంతర్లక్ష్యము, బాహ్య లక్ష్యము మధ్యలక్ష్యము ఈ మూడున్నూ లక్ష్యత్రయమనబడును. అంతర్లక్ష్యమనగా సకలము అయిన అంత రేంద్రియా ర్థములు జూచునట్టిలో జూపు.

బాహ్య లక్ష్ణమనగా సకలమైన బాహ్యేంద్రియ వృత్తుల జూచునట్టి వెలిజూపు.

మధ్యలక్ష్యమనగా సకలమైన బాహ్యేంద్రియ వృత్తుల జూచునట్టి మధ్య దృష్టి ఈ లక్ష్యసాధనచే శాంభవీముద్ర సిద్ధించుటే ఫలము.

శి॥ హంసయందు బుద్ధి నాటించటము ఎట్లు ?

గు॥ జీవహంసలు ఇరువదియొక్క వెయ్యి ఆరువందల దైవహంసలు మూడువేల నాలుగు వందలు జీవహంసలయందు బుద్ధిని స్థిరముగా నిలిపి ప్రత్య గాత్మను దర్శించువారిని హంసలనియు, దైవహంసలయందు బుద్ధి స్థిమితముగా నిలిపి, అధిష్టాన చేతన బ్రహ్మమును దర్శించువారిని పరమహంస అనియు నిర్ణ యము. ఈ పద్ధతుల వలన జీవన్ముక్తియు, విదేహముక్తియు కలుగునని వారి నమ్మకము.

శి॥ యోగము లందు నటించడము ఎట్లు ?

గు॥ అష్టాంగయోగములు 1) యమము 2) నియమము 3) ఆసనము 4) ప్రాణాయామము 5) ప్రత్యాహారము 6) ధ్యానము 7) ధారణము 8) సమాధి మరియు మంత్ర, లయ, హఠ, రాజయోగములు.

శి॥ సిద్ధులనగా ఏమి ?

గు॥ 1) అణిమ 2) మహిమ 3) గరిమ 4) లఘిమ 5) ప్రాప్తి 6) ప్రాకామ్యము 7) ఈశత్వము 8) వశిత్వము. ఈ ఎనిమిదిన్ని అష్టసిద్ధులని చెప్పబడును. వీటివల్ల కలిగే మహత్తులయందు ఆనందము పొందుదురు. వీటి వల్ల జన్మ భ్రాంతి అధికమగును గాని జన్మరహితము కాబోదు.

(౧౨౧) కొందరు ముద్రలుగనవలె నందురు । మరికొందరధిక మందురు ద్రష్టన్ । కొందరు భజనే లెస్సని యందురు. । యివీయన్ని యెరుకేననీ తెలుసు కొనుమీ ॥ నీ కివియేల పనిలేదు వినుమీ। ముందుగ పరిపూర్ణ మున్నా దిగని । గు రు నెంకుండకుండ ॥ దాన్నెగరగొట్టితె జాలు ! నని తెల్సుకొనుమీ। నీకివియేల పనిలేదు వినుమీ ॥

ఓ, శిష్యుడా! కొందరు ముద్రలు అభ్యసింప వలెనందురు కొందరు. ద్రష్ట శ్రేష్ఠమనెదురు కొందరు భజన చేయడము మంచిదనియందురు. ఇవి యన్నియు ఎరుకచేష్టలని నీవు ఎరుగుము నీకు వీటితో పనిలేదు. ముందుగా పరిపూర్ణ పరబయలును వుండజూచి గుర్తెగెడి ఎరుకను యెచట నిలువకుండ యెగరగొట్టితె చాలునని భావము.

శి॥ ముద్రలనగా ఏమి ?

గు॥ ఖేచరి, భూచరి, మధ్యలక్ష్యము, షణ్ముఖి, శాంభవి అను పంచ ముద్రలు.

1. ఖేచరి యనగా కనులుమూసి యైనను, తెరచియైనను, భ్రూమధ్య మందు దృష్టినిలిపి జూచుట ఖేచరిముద్ర యనబడును.

2. భూచరి యనగా నేత్రములు కదలింపక, నాశికాగ్రమునందు దృష్టి నిలిపి అంతర్లక్ష్యమందు మనస్సు నిలిపి జూచుట.

3. మధ్య లక్ష్యమనగా నాశికామధ్యమందు దృష్టినిలిపి అంతర్లక్ష్య మందు మనస్సు నిలిపి జూచుట.

4. షణ్ముఖి యనగా నేత్ర రంధ్రములు రెండు శ్రోత్ర రంధ్రములు రెండు నాసికారంధ్రములు రెండుకూడా ఆరు రంధ్రములుమూసి భ్రూమధ్యమున దృష్టి నిలిపి జూచుట.

5. శాంభవి యనగా అంతర్లక్ష్యము, బాహ్యదృష్టియు గలిగి, మనో మారుతంబుల, వికారంబు లుడుగించుట శాంభవిముద్ర యనబడును.

శి॥ ద్రష్ట యనగా ఏమి?

గు॥ దృశ్య పదార్థము లన్నిటి యెరిగెడి ద్రష్ట గొప్ప దనెదరు.

శి॥ భజన యనగా ఏమి?

గు॥ తాళ మృదంగాది, వాయిద్యములతో భగవంతుని భజనజేయుటయే యుత్తమ మార్గమందురు. గనుక ఇవి యన్నియు ఎరుక వేర్వలని నీవు ఎరుగుము. నీవు ముందుగా ।అచల పరిపూర్ణ పరబాహ్యమును తెలుసుకొని వీటి యందు ఎచటకూడ ఎరుక నిలువకుండా ఎగరగొట్టిన చాలును.

(౧౨౨) పంచాశదక్షరముల । ప్రపంచము తానుద్భవించె । ప్రణవాక్షరమం । దంచు శ్రుతులెన్నె । దాన్నెరుకంచని నీ వెరిగి । యెరుగు మచలాము దీనన్ । నిల్పకుమెరుక నచలాము లోనన్ । చంచాల మతిచాత । చతురాక్షరెక్కూవం చెంచేద వెందుకు । యిది నమ్మకెరుగుమీా । యచలాము దీనన్ । నిల్పకుమెరుక నచలాములోనన్ ॥

ఓ, శిష్యుఁడా! ఏబది యక్షరములచేత, శబ్ద విస్తీర్ణమయిన ప్రపంచము పుట్టినది. ఇందుకు కారణము ప్రణవాక్షరమని శ్రుతులు నిర్ణయించినవి. ఆ ప్రణవము ఎరుక నిర్ణయమని తెలుసుకొనుము. అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకొని, ఆ పరబయలునందు ఎరుకను నిల్పకుము. చంచల మతిచేత చతురాక్షరి శ్రేష్ఠమని తలంచకుము. ఇది నిజమని నమ్మక పరిపూర్ణ పరబయలు తెలుసుకొని ఎరుకను విడువుమని భావము.

శి॥ ఏబది యక్షరములచేత శబ్ద విస్తీర్ణమయిన ప్రపంచము ఎట్లుపుట్టినది?

గు॥ కర్మ నిర్మితమగు వేదంబులు, జ్ఞాన నిర్మితమగు వేదాంతములు, వాచ్య, వాచ్యార్థ లక్ష్య లక్ష్యార్థములతో, ఊర్ధ్వ, అధోలోకంబులు నిర్ణయించి యున్నారు. గనుక ఇది శబ్ద నిర్మిత ప్రపంచముగా యున్నందున పంచాశ దక్షరంబుల ప్రపంచమని నిర్ణయము.

శి॥ ఏబది యక్షరములకు మూలము ప్రణవమని శ్రుతులు నిర్ణయించుటకు కారణ మేమైయుండును? దీనిని పరిపూర్ణ పరబయలునందు లేకుండా ఎట్లు చేయవలెను?

గు॥ శ్రుతి-ప్రణవో యీా పరంబ్రహ్మ, ప్రణవశ్చ పరస్మృతః అనగా ఓంకారము నిశ్చయముగా పరంబ్రహ్మము. ప్రణవమే పరమాత్మ యని చెప్ప

బడుచున్నది. గనుక వాచ్యమగు బ్రహ్మమునకు వాచకమగు ఓంకారము వేరు కానందున ఓంకారము ఏబది యక్షరములకు మూలమని నిర్ణయము.

శ్రుతి । యతోవాచనివర్తంతే అప్రాప్య మనసాసః యను నిర్ణయాను సారము మనోవాక్కులు పరబయలును తెలియలేకపోవుచున్నవి. కనుక వాచక మగు ఓంకారము, వాచ్యమగు బ్రహ్మము లేకపోవునని నిర్ణయము.

శి॥ చతురాక్షరి యనగా యేమి? దానిని గొప్పదనుటకు కారణ మేమయి యుండును?

గు॥ చతురాక్షరి యనగా నారాయణ యని నిర్ణయము. నారాయణ యను నిర్ణయవాక్యమునందు బ్రహ్మ, విష్ణు, ఈశ్వర, సూర్యుడు, చంద్రుడు, అగ్ని అనునవన్ని ఇమిడియున్నవి. గనుక నారాయణ యనువాక్యము గొప్ప దని నిర్ణయించుటన్న ప్రయోజనము లేదని నిర్ణయము. గనుక అచల పరిపూర్ణ పరబయలును తెలిసి ఎరుకయను భ్రాంతిని వేడుము.

(౧౨౩) కొందరు భూతము లైదిటి యందున । చిత్తంబునంతు రధికము లనుచున్ । కొందరు యేమియు లేదని యందురు గురుడైదుగుమిన్ని యపశబ్దము లెరా । యివి నిలువాని వని తెలియవలెరా । యెందరెన్నన్నా నీ కెందూకు బయలూను । ముంధూగ గనిగురు నెందుండ నివకవ్వి । యపశబ్దములెరా । యివి నిలువానివని తెలియవలెరా ॥

ఓ, శిష్యుడా! కొందరు పృధ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచభూతములు గొప్పగానెంచి పూజించెదరు. మరికొంద రీ పంచభూత ములు శూన్యమై పోవుచున్నవి కావున శూన్యమే పరమ పదమని యందురు. వీరలు చెప్పెడి మాటలు నిజములు కావు. నిజము విచారించి చూచినచో నివి యేవియు నిలువజాలవు. గనుక ఎందరు ఎన్ని విధముల జెప్పినను, నీకు ఎందుకు పనికిరావు. ముందుగా పరిపూర్ణ పరబయలును ఎరిగి, ఎరిగెడి ఎరు కను, ఎందునుండ నివ్వకుమని భావము.

(౧౨౪) కొందరు కర్మమునే బాగందురు । మరికొంద రెక్కువందురు తను వున్ । కొందరు ప్రాణము లధికము లందురు నీ కిట్టి । వట్టి యాశాలేమిటికీ వారితోపొందు జేసేవేమిటికి యెందారి మాటాల నెన్నినయూబోధ । కిందీవెకాని । పై కెక్కేవి గావిట్టి । యాశాలేమిటికి । వారితో పొందు జేసే వేమిటి ॥

ఓ, శిష్యుడా ! కొందరు కర్మమునే బాగందురు. మరికొందరు శరీరము ఎక్కువయని యందురు. మరికొందరు ప్రాణములు శ్రేష్ఠమని చెప్పుదురు. ఇట్టి వ్యర్థమయిన కోరికలు నీ కెందుకు? అటువంటివారి సాంగత్యము నీవు చేయ కుము. ఎందరు ఎన్ని జెప్పినను విచారించగా, ఈ పరిపూర్ణ ప్రబోధ క్రిందిదే కాని పై విచారణకాదు యని భావము.

శి॥ <u>కర్మాచరణమే మంచిదనుటకు కారణమేమి</u> ?

గు॥ కర్మయందు నిత్యకర్మ, నైమిత్తిక కర్మ, కామ్యకర్మ, నిషిద్ధ కర్మ యని నాల్గువిధంబులు, నిషిద్ధకర్మ, కామ్య కర్మ జన్మాదులకు హేతువగును. నైమిత్తిక కర్మ చేసినను, చేయకున్నను ఏభ్రాంతియుండదు కనుక, నిత్యకర్మ యొనర్చు వారికి, స్వర్గలోకము తప్పక లభించునని వారి నిర్ణయము కనుక కర్మా చరణ మంచిదని వారి నిర్ణయము.

శి॥ <u>నిత్యకర్మ యనగా ఏది</u>?

గు॥ గర్భాదానము, పుంసవనము, శ్రీమంతము, ద్యూతకర్మము, నామ కరణము, అన్నప్రాసనము, చవలము, ఉపనయనము, ప్రజాపత్యము సౌమ్యము ఆగ్నేయము, వైశ్యదేవము, గోదానము, సమావర్తనము, వివాహము, అంత్య కర్మము యను షోడశకర్మములు నిత్యకర్మలని నిర్ణయము.

శి॥ <u>శరీరము అధికమనుటకు కారణమేమై యుండును</u>?

గు॥ శ్రుతి॥దుర్లభం మానుషం దేహం యను న్యాయమున స్థావర జంగము జీవోపాధులయందు సత్యాసత్యాన్వేషణ, అంతఃకరణ గలిగిన మానవోపాధికి వచ్చినానుయను నిర్ణయమున మానవోపాధి అధికమని నిర్ణయము.

శి॥ <u>ప్రాణములు అధికమనుటకు కారణమేమై యుండును</u> ?

గు॥ ప్రాణవాయువు అహోరాత్రంబులను నిర్ణయములేక సంచరించి, జఠరాగ్నిని కలిగించినందున, భుజించిన అన్నపానాదులు జీర్ణించి, స్థూలభాగంబును బహిర్గత మొనర్చి, సూక్ష్మ భాగమును,

శ్రు॥ అన్నాత్తేజో మనఃప్రాణం, శోత్రం, చక్షుయశోబలం, ధృతి, స్మృతి తథాశక్తం అనునవి కలుగజేయుచున్నందున ప్రాణము అధికమని నిర్ణయము.

(౧౨౫) కన్నుల ప్రక్కల వ్రేళ్ళిడి। తిన్నగ భ్రూమధ్యమందు దృష్టి నిలిపి। యందున్నది వెన్నెలలో బయలన్నా। కనుమందురెరుక అది నిలువా దోయా। తనువుతో బొయ్యేదని తెలిగుణెనాయా యెన్ని తనువులు వచ్చి।

యరిగీనరుణకాక । వున్నాబయలు జూచి వుళ్ళక్కెరుకనురూను । మది నిలవా దోయా । తనువుతోబొయ్యేదని తెలియుమోయా ॥

ఓ, శిష్యుడా ! కొందరు కన్నుల ప్రక్కన వేలుపెట్టి భ్రూమధ్య మందు దృష్టి నిలిపి పున్నమ వెన్నెలలో బయలును చూడుమని యందురు. అది ఎరుకయే యగును. గనుక అది స్థిరముగా నిలిచేదికాదు. శరీరముతో పుట్టినది శరీరమున్నంతవరకు మాత్రమే యుండి శరీరము పోవునప్పుడది పోవునని ఎరుగుము. జీవేశ్వర తనువులెన్ని వచ్చుచు పోవుచున్నను చలించక వున్న పరిపూర్ణ పర బయలు వుండ జూచే మూలములేని ఎరుకను విడువుము అని భావము.

శి॥ కన్నులలో వున్న వెన్నెలలో బయలును చూడుమని చెప్పుటకు కారణమేమై యుండును ?

గు॥ స్థావరజంగమ జీవోపాధులయందు మానవోపాధి దుర్లభ మనియు అందు యొనర్చు కర్మ ఉత్తమమనియు ప్రాణము శ్రేష్ఠమని నిర్ణయము యున్నను, జ్ఞానేంద్రియములగు శోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము యను వాటిలో శృతి " సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్ యను న్యాయముచే జ్ఞేయమును తెలుసుకొనుటకు నేత్రేంద్రియమే ప్రధానము గనుక నేత్రేంద్రియము లోని బయలును జూపించెదరు.

(౨౬) జనులాత్మానుభవం బైనను । ముక్తియని బల్కి । రిట్లు నమ్మకు । మెరుకే । కనరాదెచ్చట గురుకృప । ననుభవ మెవ్వరికి పైన ఆ మాట నిజమో । అనుభవముళ్ళ క్కీమాట నిజమో । వినజెప్పుమా రెండూ వివరించి పై మాట । వినినే ముందరిబోధ వినిపింతువేవేగ । ఆ మాట నిజమో । అనుభవముళ్ళ క్కీమాట నిజమో ॥

ఓ, శిష్యుడా! జనులు ఆత్మానుభవము ముక్తియని నిర్ణయించినారు. అది నమ్మకుము. ఎందుకనగా ఆత్మయనగా ఎరుకేయగును. అందువలన ఆ నిర్ణయము యందు గురుకటాక్షములేదు. గనుక అనుభవము ఎవ్వరికిన్ని లేదు. అయినా పై నిర్ణయానుభవము సత్యమా లేక అనుభవము వున్నది యను మాట సత్యమా ఈ రెంటినీ విచారించి చెప్పుము. అదివిని నేను ముందరి బోధ నీకు త్వరలో వినిపింతునను భావము.

శి॥ ఆత్మానుభవము ముక్తియని నిర్ణయించుటకు కారణమేమై యుండును?

గు॥ శృతి ఏకోదేవ, సర్వభూతేషు గూఢః సర్వవ్యాపి, సర్వభూతాంత రాత్మా" కృ, య ఆత్మయే దేవుడు, సమస్త భూతములందు ప్రత్యగాత్మ

న్స్వరూపమున గూఢముగా నున్నవాడు. కూటస్థజీవుల కన్యోన్య ధ్యాస గలిగి నందున కూటస్థుడు గూఢముగా నున్నవాడు. జీవుడు పైకి కనబడు చున్నాడు. ఆత్మయే అంతర్యామిగా యున్నవాడని నిర్ణయము యున్నందున ఆత్మానుభవము ము క్తియని నిర్ణయించినాడు.

శి॥ ఆత్మానుభవము నందు గురుకృప లేని కారణమేమై యుండును ?

గు॥ ఉత్పత్తి, స్థితి లయ, విస్తీర్ణ, ఆకర్షణములు గలిగియున్న ఆత్మను, కర్మానుసారము జన్మము బొందుచున్న జీవునికి దర్శింపజేసిన పరమాత్మగతి ప్రత్యగాత్మగతి ఏకముగానే యుండును. గనుక ఈ పద్ధతి గురుకృపయనరు. గురుకృప గలిగినవారికి మరణ జననములు లేక పోవలయును.

శి॥ అనుభవము నిజమా, అనుభవము ఉళ్లక్కి యనునది నిజమా యని శిష్యుణ్ణి ప్రశ్నించుటకు కారణమేమై యుండును ?

గు॥ ఇంతవరకు వస్తునిశ్చయముగా బోధించిన ప్రబోధ విధానము తెలిసి యున్నాడా లేదాయని శిష్యుణ్ణి పరీక్షించి తెలుసుకొని దాని ననుసరించి బోధింతు నని నిర్ణయము.

(౧౨) తనను తాగనిన। మోక్షంబని పల్కిరిగాని జనులు అది నమ్మకుమీ తనను తా బట్టబైటను। గనబోయితె తనకుదానె। కానరాదోయీ। విశ్వము తనకు కానరాదోయీ॥ తనసుంబైనది గనక। తాను విశ్వము రెండు। గనుపించుటుళ్ళక్కి। గావున తనకు దా గానరాదోయీ। విశ్వము తనకు గానరాదోయీ॥

ఓ, శిష్యుడా ! జనులు తన్నుతాను ఎరిగిన యెడల మోక్షము కలుగునని చెప్పియున్నారు అది నమ్మరాదు. ఎందుకనగా పరిపూర్ణ పరబయలు నందు తనను తాను వెతకినయెడల తనకుతాను కనిపించుటలేదు. దానితోపాటు ప్రపంచము గూడ అగుపడుటలేదు. ఎందుకనగా తననుంచే ప్రపంచము అయినది గనుక తాను ప్రపంచము అగుపడుట మిధ్యయని భావము.

శి॥ తనను తాను గనుట ఎట్లు ? అది మోక్షమని నిర్ణయించుటకు కారణ మేమై యుండును ?

గు॥ నేతినేతియనెడి మహావాక్యములచేత ఇది బ్రహ్మముకాదు. ఇది బ్రహ్మము కాదుయని అన్నిటిని త్రోయగా కడపట నిలచిన బ్రహ్మభిన్న ప్రత్య గాత్మాను భవరూపమైన బ్రహ్మమే తానుయని తెలియుట తనను తాగనుటయని నిర్ణయము.

సాధనచతుష్టయ సంపన్నుడై న సద్గురునివద్ద తత్త్వమస్యాది, మహావాక్య శ్రవణ, మననని ధ్యాసములచేత లభించిన పూర్ణాపరోక్ష జ్ఞానము గల వాడగుచు అవిద్యాకల్పితములై న జీవశరీరాదులను మాయాకల్పితములై న ఈశ్వర శరీరాదులను విడిచి జీవసాక్షియైన ప్రత్యగాత్మను ఈశ్వర సాక్షియైన పరమాత్మను విడువక యుండుట మోక్షమని నిర్ణయము.

శి॥ పరిపూర్ణ పరబయలునందు సాక్షియగు నేను యనెడి ఎరుకను వెదకి చూచినబో కనుపించకపోవడము కారణము ఏమైయుండును ? దానిచే నిర్మితమగు ప్రపంచము అగుపడక పోవడము కారణమేమి ?

గు॥ పంచతన్మాత్ర స్వరూప స్వభావములు సాక్షి సత్యజ్ఞానానందములు గలిగియున్న ఎరుక పరిపూర్ణ పరబయలుయందు లేదు గనుక ఎరుక తనకు తాను గానరాదు. అందువలన ఎరుకచే తెలియబడు సర్వప్రపంచము లేనిదే యగును.

## (యెరుక పరిణామము బయలు గుర్తెరుగునా)

* (౧౨౮) విత్తే చెట్టైయివుట్టును విత్తే । విత్తనమురీతి వెలయను ధరపై । విత్తుకు చెట్టుకువేరే । విత్తనమొకటున్నదనిన । వినగూడదోయీ తనకుదాబుట్టును వినుమోయీ । విత్తూచెట్టుల రెంటివిధమూ భూమెరుగా । నట్లుత్తా యలెరుగాదు। నత్తువిత్తూల రెంట్ని వినగూడదోయీ । తనకు దాబుట్టును వినుమోయీ ॥

ఓ, శిష్యుడా ! విత్తనము చెట్టుగా బుట్టుచున్నది. విత్తనము తన నిర్ణయ పద్ధతిగా భూమియందు తానుగానే పుట్టుచున్నది. విత్తనమునకు చెట్టుకు వేరే ఒక విత్తనము యున్నదని దానివల్ల ఇవి పుట్టుచున్నవి యని ఎవరైన చెప్పినా ఆ మాటలు వినగూడదు. ఎందుకనగా కారణమగు విత్తుకు కార్యమగు వృక్షముకు నొకటితో నొకటి పరస్పర కార్యకారణములే కాని నీరెంటికి నితర కారణమేమి యుండదు. విత్తుయందు చెట్టుకాని చెట్టుయందు విత్తుకాని తనకు తానే బుట్టును. అయినా కార్యకారణమైన చెట్టువిత్తుయొక్క విధమును భూమి ఎట్లు తెలుసు కోవడము లేదో అటువలనే సత్తువిత్తుల రెంటి విధము పరిపూర్ణ పరబయలు తెలుసు కోదని భావము,

(౧౨౯) చెట్టే మూలము విత్తుకు । చెట్టుకు మూలంబువిత్తు । క్షితిపై రెండుం । పుట్టిన చచ్చిన రెంటిని । గట్టిగ తానెరుగకుండు । గదరాయీనేలా । నీవీ రీతి గనుగొనవేలా । పుట్టూచు గిట్టూచు పొలు పొందు తనువెరుక । లిట్టివి విత్రాము । లెన్నడెరుగదు బయలు గదరా యీనేలా । నీ వీరీతి గనుగొనవేలా॥

ఓ, శిష్యుడా! చెట్టేమూలము విత్తుకు. విత్తుకు మూలము చెట్టు. ఈ రెండు భూమియందు పుట్టినను చచ్చినను భూమి యెరుగక యుండును. ఈ రీతి నీవు ఎందుకు తెలుసుకొనవు? పుట్టుచు గిట్టుచు యుండెడి శరీర మెరుకల యొక్క చిత్రవిచిత్రములను పరిపూర్ణ పరబయలు ఎప్పుడు ఎరుగ బోదని భావము.

శి॥ బీజవృక్ష విధానము భూమితెలియని రీతియందు తెలియునది ఏమై యుండును?

గు॥ బీజము తనంతట తానేపుట్టి వృక్షోపాధికి బీజము మూలమగుచున్నది. వృక్షము బీజోపాధికి మూలమగుచున్నది కాని బీజముయొక్క ప్రథమోపాధి యెటుల గలిగినదోయని విచారిస్తేమూలము తెలియడములేదు. ఐనాబీజవృక్షోపాధికి స్థానముగాయున్న భూమి, బీజవృక్షములు పుట్టినా చచ్చినా దాని విధానము తెలియక యుండును. అదేవిధముగా ఎరుక మూలము లేక తనంతట తానుపుట్టి శరీరోపాధికి మూలమగును. శరీరము ఎరుక వుపాధికి మూలమగును. ప్రథమమున ఎరుకయొక్క ఉపాధి ఎట్లుగల్గినదో యని విచారిస్తే మూలము తెలియడములేదు. ఎరుకయొక్క వుత్పత్తిస్థితి, లయ విస్తీర్ణ, ఆకర్షణ చావుపుట్టుకలు పరిపూర్ణము తెలుసుకొనదని నిర్ణయము.

## (పరిపూర్ణ బోధ)

(౧౩౦) భాగవతుల నారాయణ యోగికి। జానకి యనేటి। యువిదామణికిన్। బాగుగపుత్రుడనై। భూభాగమునన్ కృష్ణననుచు। ప్రభవించినాను। అనంతికి ప్రభువునైనానూ। నా గురువు కృపచేత। నయమైన యాబోధనేగంటి। కన్నంత నీకుదెల్పుటకిట్లు ప్రభవించినాను అనంతికి ప్రభువూనైనానూ॥

ఓ, శిష్యుడా! నేను ఈ భూమియందు భాగవతుల నారాయణ యోగికిని జానకమ్మయను నువిదామణికిన్ని పుత్రుడనై పుట్టితిని జనులు నన్ను కృష్ణదాసని పిలిచెదరు. అనంతలక్ష్మమ్మను స్త్రీరత్నమును వివాహమాడి యామెకు నేను భర్తనైతిని నాసద్గురుదేవులగు పరశురామ సీతారామస్వామి దయవలన పవిత్రమైన అచలపరిపూర్ణ ప్రబోధ నెరింగితిని అట్టి బోధను సంపూర్ణముగా నీకు దెల్పుట కొరకు ఈ గ్రంథమును వ్రాసితినని భావము.

(౧౩౧) ఎరుక తనకు దావిడిపో। దెరుకను విడిపించలేరు యెవ్వరు ధాత్రిన్। గురుడొకడుతప్ప। గురునకు పరిచర్య యొనర్చిబోధ పద్ధాతివినిసన్॥ తిరిగిరాని వద్ధాతిగనినన్। పరిపూర్ణమెరుక యేర్పరుచ నెరుక లేక। హరిని

ఓ, శిష్యుడా! చెట్టేమూలము విత్తుకు. విత్తుకు మూలము చెట్టు. ఈ రెండు భూమియందు పుట్టినను చచ్చినను భూమి యెరుగక యుండును. ఈ రీతి నీవు ఎందుకు తెలుసుకొనవు? పుట్టుచు గిట్టుచు యుండెడి శరీర మెరుకల యొక్క చిత్రవిచిత్రములను పరిపూర్ణ పరబయలు ఎప్పుడు ఎరుగ బోదని భావము.

శి॥ బీజవృక్ష విధానము భూమితెలియని రీతియందు తెలియునది ఏమై యుండును?

గు॥ బీజము తనంతట తానేపుట్టి వృక్షోపాధికి బీజము మూలమగుచున్నది. వృక్షము బీజోపాధికి మూలమగుచున్నది కాని బీజముయొక్క ప్రథమోపాధి యెటుల గలిగినదోయని విచారిస్తేమూలము తెలియడములేదు ఐనాబీజవృక్షోపాధికి స్థానముగాయున్న భూమి, బీజవృక్షములు పుట్టినా చచ్చినా దాని విధానము తెలియక యుండును. అదేవిధముగా ఎరుక మూలము లేక తనంతట తానుపుట్టి శరీరోపాధికి మూలమగును. శరీరము ఎరుక వుపాధికి మూలమగును. ప్రథమమున ఎరుకయొక్క ఉపాధి ఎట్లుగల్గినదో యని విచారిస్తే మూలము తెలియడములేదు. ఎరుకయొక్క వుత్పత్తిస్థితి, లయ విస్తీర్ణ, ఆకర్షణ చావుపుట్టుకలు పరిపూర్ణము తెలుసుకొనదని నిర్ణయము.

## (పరిపూర్ణ బోధ)

(౧౩౦) భాగవతుల నారాయణ యోగికి । జానకి యనేటి । సువిదామణికిన్ । బాగుగపుత్రుడనై । భూభాగమునన్ కృష్ణననుచు । ప్రభవించినాను । అనంతకి ప్రభువునై నానూ। నా గురువు కృపచేత । నయమైన యీ బోధనేగంటి । కన్నంత నీకుదెల్పుటకిట్లు ప్రభవించినాను అనంతకి ప్రభువూనై నానూ॥

ఓ, శిష్యుడా ! నేను ఈ భూమియందు భాగవతుల నారాయణ యోగికిని జానకమ్మయను సువిదామణికిన్ని పుత్రుడనై పుట్టితిని జనులు నన్ను కృష్ణదాసని పిలిచెదరు. అనంతలక్ష్మమ్మను స్త్రీరత్నమును వివాహమాడి యామెకు నేను భర్తనైతిని నాసద్గురుదేవులగు పరశురామ సీతారామస్వామి దయవలన పవిత్రమైన అచలపరిపూర్ణ ప్రబోధ నెరింగితిని అట్టి బోధను సంపూర్ణముగా నీకు దెల్పుట కొరకు ఈ గ్రంథమును వ్రాసితినని భావము.

(౧౩౧) ఎరుక తనకు దానిడిహో । దెరుకను విడిపించలేరు యెవ్వరు ధాత్రిన్ । గురుడొకడుతప్ప । గురునకు పరిచర్య యొనర్చిబోధ పద్దాతివినిన్॥ తిరిగిరాని పద్ధాతిగనినన్ । పరిపూర్ణమెరుక యేర్పరుచ నెరుక లేక । హరిని

మఱ్రిపులుగులరెంట్ని । మలచికొట్టరపోని । గలదొక్కతూటు । అదియెరుకానె । పులుగుండెబోటు॥

ఓ, శిష్యుడా! తొమ్మిదిగల శరీరమగు మఱ్రిచెట్టుకు ద్వంద్వైక్య ఏకదృష్టిగల రెండు నేత్రములు గలవు. ఆ చూపునందు ఎరుపు, తెలుపు, నలుపు, సునీలము అను నాలుగు రంగులున్నవి. అగ్రమందు గల సునీలమందు ఒక్క రంధ్రము గలదు. ఆ రంధ్రమునందే ఎరుకయను గుర్తుయుండును. ఓ, చిన్న వాడా సద్గురుబోధ యనెడి గొడ్డలిచేత శరీరము అనెడి వృక్షమును ద్వంద్వైక్య ఏకదృష్టిగల ఎరుకను రెంటిని మలచి కొట్టుమని భావము.

శి॥ <u>రెండు ఒకటిగా యుండునది ఏమైయుండును</u>?

గు॥ కాళ్ళు రెండుగా యున్నను నడక ఒకటిగానే యుండును. పెదవులు రెండుగా యున్నను మాటలు ఒకటిగానేయుండును. చెవులు రెండుగా యున్నను వినికిడి ఒకటిగానే యుండును. అపద్ధతిగానే నేత్రములు రెండుగా యున్నను దృష్టియొకటిగానే యుండును గనుక ఒక రెంటిలోయని ద్వ ద్వైక్య ఏకమని నిర్ణయము.

శి॥ <u>ఒకటిగాయున్న చూపులో ఎరుపు, తెలుపు, నలుపు, సునీలము యను నాలుగు రంగులు దాని అగ్రభాగమునందు రంధ్రము. ఆ రంధ్రమే ఎరుకయను గురుతు యుండుచోటు యనగా నేమి</u>?

గు॥ ఆకాశాదికమగు ఎరుక పురుషుని తను చతుష్టయము ఎరుపు, స్థూల శరీరము, తెలుపు సూక్ష్మశరీరము. నలుపు కారణశరీరము సునీలము మహాకారణ శరీరము. ఈ మహాకారణ శరీరమే ఎరుకయుండు స్థానము. అగ్రభాగమని నిర్ణయము.

శి॥ <u>గురుబోధ యనుగొడ్డలితో శరీరమగు వృక్షమును దాని అగ్రభాగము నందలి గుర్తును రెంటిని మలచి కొట్టుట ఎట్లు</u>?

గు॥ పరిపూర్ణ బోధయందు అచలపరిపూర్ణ పరబాహ్యమునకు ఎరుకను ఏలాటి సంబంధము లేదని వస్తునిశ్చయముగా నిర్ణయించి యున్నది గనుక ఆ విధానము గురుమూర్తి చేత తెలుసుకొని కర్తృత్వరహితముగా కర్మ అచరించినచో ఎరుక వృక్షము లేకపోవును.

(౧౩౪) తనువుతొ వచ్చిన యెరుకే । తనువును తనువనుచు తనను కావని యెరుగన్ । తనువును బాసినమీదట ! తనచా దేహమును రెంట్ని । తానెరుగ

దపుడూ । అదిగనుక తానేనేలేదెపుడూ । అనుమాన రహిత। మిందవలముస్నది కంటే । తనమాట తలపోయ ।తనకె సిగ్గె । తనను తానెరుగదపుడూ । అది గనుకతా । లేనేలేదెపుడూ॥

ఓ, శిష్యుడా ! శరీరముతో వచ్చిన ఎరుక శరీరమును శరీరమని తనను తాను తెలుసుకొనును. ఈ ఎరుక శరీరమును విడిచిన తరువాత తనను శరీరమును రెంటిని తెలుసుకొనదు. అందుచేతనే ఈ ఎరుక ఎప్పుడు లేనిదేయని ఎరుగుము. ఈ ఎరుక సందేహరహితముగా అచలపరిపూర్ణ పరబయలు ఉన్నది ఎరిగితే తన స్థితిని తెలుసుకొనుటకు తానేసిగ్గుపడి తన్నుగాని శరీరమునుగాని ఎరుగలేకపోవు నని భావము.

శి॥ ఎరుక తనస్థితిని తాను తెలుసుకొని సిగ్గుజెందుటకు కారణమేమై యుండును?

గు॥ శరీరముచేత యొనర్చిన కర్మవల్ల స్వర్గసౌఖ్యములు పొందగలనను నిర్ణయము ప్రజ్ఞానంబ్రహ్మ, అహంబ్రహ్మాస్మి. తత్వమసిబ్రహ్మ, అయమాత్మ బ్రహ్మ వార్తీకపద్ధతిగా తాను బ్రహ్మమనను నిర్ణయమును పరబయలునందు తనకు మూలముగాని స్థానముగాని, లేనందున తానె లేకపోవును గనుక తాను పూర్వము నిర్ణయించుకున్న పదవులు తలంచుకొని సిగ్గుజెందును.

(౧౭౫) ఉప్పెనచే జెడుతురు । వొకప్పుడు/విత్తనము బుప్పు । నారెంటికి యీతిప్పలు దప్పవు ధరియే తిప్పలు తానెరుగదట్లూ । తెలుసుగదోయీ । తను వెరుకా బయలులన బైరుగోయి । గొప్పైన గురుబోధ బొప్పున నెరిగి । యీ తిప్పాలు గలవాట్నె । తిప్పాదీసితెచాలు । తెలుసుగదోయీ ॥ తనువెరుకా బయ లులనబైరుగోయీ॥

ఓ, శిష్యుడా ! ఉప్పెన గాలిచే చెట్టు చచ్చిపోవుచున్నది. ఒకప్పుడు విత్తనము పుప్పుచున్నది. ఈ రెంటికి నీతిప్పలు తప్పవు. భూమి ఏతిప్పలు ఎరుగదని తెలుసుగదా. అటువలెనే తనువు ఎరుక బయలులను తెలుసుకొనుము. ఓవత్సా ! మహాశ్రేష్ఠమైన సద్గురుబోధచే పరిపూర్ణ పరబయలును తెలుసుకొని. చావుపుట్టుకలుగల తను వెరుకల భ్రాంతి విడువుమని భావము.

(౧౭౬) లేనియహముస్న బయలును । లేని ప్రపంచమును తనను లెస్సగ తనలో తాను విమర్శించిన । యాలేనివి లేకుండా । నవల లేదు యేమాటా । యిట్లననైన లేదు యేమాటా లేనియహ మిాబైట । లేనే లేదిదిజూచి । లేనిది కల దాని లేనిమాటాడేవు । లేదు యేమాటా । యిట్లననైన లేదు యేమాటా ॥

ఓ, శిష్యుడా ! లేని అహంకారములు వున్న పరిపూర్ణ పరబయలు లేని జగత్తును తనను వున్నది యున్నట్లు తనలో తాను విచారించిన యెడల లేని అహంకారం లేని ప్రపంచము లేనిజగత్తు లేకపోవును తదుపరి ఏమాట యుండదు. అచల పరిపూర్ణ పరబయలు యున్నది. అహంకారము లేదుయని జెప్పుటకు ఏమాటయునురాదు. పరిపూర్ణ పరబయలునందు లేని అహంకారము లేదని తెలిసి లేనిది కలదని అబద్ధవాక్యము చెప్పకుమని భావము.

(౧౩౨) పరిపూర్ణ మెరుక లెట్టిదో । గురుముఖమున । రెంట్నెలెస్స గురు తెరిగెరుకన్ । సరిపుచ్చుకొన్న మృషయని ॥ పరిశుద్ధపు బోధయాది । పాటించి కనరా । శివరామూల పద్ధతియిదెరా । నరులు కొందరు బల్కి రెరుకానుమ్రింగి । యీ పరిపూర్ణ మయ్యేమం చెరుగాక చెడుటాకై పాటించి కనరా ॥ శివరామూల పద్ధతి యిదెరా॥

ఓ, శిష్యుడా ! పరిపూర్ణ పరబయలు ఎటువంటిది? ఎరుక ఎటువంటిది? యని సద్గురుమూర్తి వలన వస్తు విశ్వయముగా వున్నది వున్నట్లు తెలుసుకొని రెంటిని సమముజేసి చూడగా ఎరుక అసత్యమగును గనుక ఇది పరిశుద్ధమైన అచలబోధయని చెప్పబడును. ఇది శివరామ దీక్షితులవారి మార్గము కనుక విచారించి తెలుసుకొనుము. కొందరు మానవులు ఈ అచల బోధ పద్ధతి తెలియక ఎరుకను పరిపూర్ణ పరబాహ్యమునందు ఐక్యమ చేసి పూర్ణత్వము పొంది యున్నామని పలుకుచుందురు. అది జన్మ హేతువగు చెడుమార్గమని భావము.

(౧౩౩) జనులనిరి దేవుడెవరికి కనరాడని । నామరూపకర్మ జననముల్ । గవనతనికి లేవని । యాజనవాక్యము । బయలు కెపుడు । సహజమౌ వినరా ॥ అనుమానాము చాలించి కనరా । కనినామ రూపాదికములున్న యెరుకాను । విన బోక కనబోక । విడిచి పెట్టర పోని । సహజమౌ వినరా । అనుమానాము చాలించి కనరా॥

ఓ, శిష్యుడా ! దేవుడెవ్వరికి అగుపడడనియు అతనికి నామరూప కర్మ, జనన మరణములు లేవనియు జనులనెదరు. ఆ జనుల వాక్యములు అచలపరిపూర్ణ పరబయలుకు మాత్రము సరిపోవుచున్నవి. కావున అపరబయలు దేవుడు గనుక ఏలాటి సందేహము లేక అచలపరిపూర్ణ పరబయలును వుండజాచి నామరూపకర్మ జనన మరణములు గల ఎరుక విషయము వినక చూడక విడిచి పెట్టమని భావము.

శి॥ ఎరుక విషయము వినక చూడక ఎట్లు విడువవలయును?

గు॥ సత్తుచిత్తు ఆనందస్వరూప లక్షణంబులు బట్టబయలు కేవలాత్మయని నిర్ణయ వాక్యంబులు యెరుక నిర్ణయములు. భ్రాంతి జన్యంబులు గనుక వాటిని సత్యమని నమ్మివినక చూడక విడిచి పెట్టవలయును.

(౧౩౯) అంతట గలదీ యెరుకని యెంతో వాదింపుచుండు రెరుగని వారలౌ ! అంతట నింతట గనుపడు ! నంతటిదే కాని యెరుక । అంతాటగలదా। అది నిజమైతే యగుపడవలదా ! అంతట గలదొక్క అచలామెకా ! నెరుక నంతాట గలదాని । యనరాదు వినరాదు । అంతట గలదా । అది నిజమైతే । యగుపడ వలదా॥

ఓ, శిష్యుడా ! వస్తు నిశ్చయము తెలియనివారు ఈ యెరుక సర్వత్రా వున్నదని యెంతో వాదింతురు. యెరుక అచటచట యుండునట్లు అగుపడుట మాత్రమే కాని సర్వత్రా అగుపడదు. యెరుక సర్వత్రాయుండునది సత్యమైన యెడల అంతట అగుపడవలయునుకదా! అంతట యుండునది నొక అచల పరిపూర్ణ పరబయలేకాని ఈ యెరుక సర్వత్రా యున్నదని అనరాదు. ఇతరులు ఈ సర్వత్రా వున్నదని చెప్పినా వినరాదని భావము.

(౧౪౦) తనువో బహిరింద్రియములో । మనసో ప్రాణములో విషయ మమతో ! నేనంచని నీవని యననిదియని । యనుమానించెదవదేల । అది తోవ గాదూ । నీవెన్నాడు యిది వినలేదూ! వినుమా పరిపూర్ణాము గని, లేని యామాదిః తనువాదికమును లేందని గురునిచే దెలియు ! మదిత్రోవగాదు । నీవెన్నాడు యిది వినలేదూ॥

ఓ, శిష్యుడా! నే నీవనియనని పరిపూర్ణ పరబయలు శరీరమా, బహిరేంద్రియములా మనస్సా ప్రాణములా లేక ఇంద్రియార్థమగు అహం భావమా యని అనుమానించెద వెందులకు, నీవనుకొనునట్టి మార్గమేవయును కాదు నీవు యెప్పుడు ఈ మార్గము వినలేదు. సద్గురు కటాక్షముచే అచల పరిపూర్ణ పరబయలును దర్శించి తదుపరి శరీరాది సకలమును లేని విధము సద్గురునిచే తెలియుమని భావము

(౧౪౧) నిను, నను, ప్రపంచమును, జగమని యెరిగే యెరుకచేత । సచలమును గనుంగొని ! నినునను జగమును జగమని యెరిగే యెరుకమానుమమలా వివేకా । చాలూ నీవీక్షము మెరిగినావ్వా । నినునన్ను । పై రె డింటిని విశ్వ మనక బయలనకుండె దున్నాదం ! చన గుర్తులేకుండు॥ మమలావివేకా ! చాలూ నీవీక్షమమెరిగినావ్వా॥

నిర్మల వివేకముగల ఓ, శిష్యుడా! నిన్ను నన్ను ప్రపంచమును జగమని తెల్సుకునేతెలివిచేత అచలపరిపూర్ణ పరబయలును తెలుసుకొని నిన్నునిన్నని నన్ను నన్నని జగత్తును జగత్తని తెలుసుకునే ఎరుకను విడువుము. ఈ పద్ధతి తెలిసినయెడల ఇతర పద్ధతులు ఏవీపట్టవు. నిన్నని నన్నని జగమని బయలని చెప్పగల ఎరుక లేకపోవునని భావము.

(౧౪౨) గురుడు పరిపూర్ణమునుజూ । పెరుకను లేందనుచుదెల్పి యిక దల్పకుమం చెరిగించక । విడిపోవునె యెరుక నరుల్ సాధనములు యెన్ని జేసినను ॥ లక్ష్యముద్ర లెన్ని జూచినను । హరిహరబ్రహ్మామరాసుర ముఖులైన । ధరణీసురాద్యష్ట । దశజాత్యుద్భవులాను । యెన్ని జేసిననూ ॥ లక్ష్యముద్ర లెన్ని జూచినను ॥

ఓ, శిష్యుడా ! సద్గురుమూర్తి పరిపూర్ణ పరబయలును జూపి లేనెరుకను లేదని వస్తునిశ్చయముగా తెలిపే పర్యంతము ఎరుక విడిపోదు. ఈ రీతిగాక ఎరుకనిర్మిత బ్రహ్మ విష్ణు మహేశ్వరాది దేవతలుగాని ఇంద్రాదిసుర అసురలు మరియు బ్రాహ్మణాది పదినెనిమిది జాతులలో పుట్టినవారు గాని ఎరుక నరులే గనుక సాధనలెన్ని జేసినను లక్ష్యముద్రలను ఎన్ని సాధించినను ఎరుక విడిపోదని భావము.

(౧౪౩) ఈవుత్త బట్టబయలును । నీవిప్పుడు వుండజూచి । నిజముగ యెరుకన్ । నీవని నేనని జగమని భావింపుము । పిదపదీన్ని బాయూమని శమున్ । నిజముగదీన్ని బాయకనిశమున్ । శ్రీవనితేశ రాజీవసంభవ భవ । దేవేంద్రాదుల నింక సేవించు తలపేల పాయూమనిశమున్ । నిజముగ దీన్ని బాయకనిశమున్ ।

ఓ, శిష్యుడా ! నీవు మొదట ఈ పరిపూర్ణ పరబయలుయున్నది కనుగొనుము? తర్వాత ఎరుకను: నీవని నేనని ప్రపంచమని భావించుము. తదుపరి ఈ ఎరుకను సదావిడిచిపెట్టుము. ఇదియే నిజమైనపద్ధతి. ఈపద్ధతి మరువకయుండుము. ఎరుకను విడువక దానిచే నిర్ణయింపబడిన బ్రహ్మ విష్ణు మహేశ్వర ఇంద్రాది దేవతలను పూజింపవలయునని తలంచకుమని భావము.

(౧౪౪) పరిపూర్ణ మనిన యెట్టిదో । యెరిగెదనని మెరుకబైటి కేగినయెరుకే యెరుకకు శూన్యం బయ్యెను । ఎరుకను జన్మించినట్టి । యీ విశ్వమంతా । యెరుకవలెనే యేమిలేదంతా ॥ యెరుకా వుండంగానే యెరుక విశ్వములు లే ।

వెరుకాకె యిదిజూడ ! యెంతో వింతై తోచె ! యీవిశ్వమంతా యెరుకవలెనె యేమిలేదంతా॥

ఓ, శిష్యుడా ! పరిపూర్ణము యనగా ఎటువంటిదో దానిని తెలుసుకొని యెదవని ఎరుక బయటికి పోయినచో అప్పుడే ఈ ఎరుక తనకుతానే లేకపోవును. అట్టి ఎరుకవలన కలిగిన ప్రపంచము ఎరుకతోపాటు లేకపోవు చున్నది. ఎరుక యుండగనే ఎరుకయును ప్రపంచమును ఈ రెండును లేకపోవు చున్నవి గనుక ఎరుకకు ఈవిషయము ఎంతో వింతగా తోచునని ఈవిషయము తెలుసుకోమని భావము.

శి॥ పరిపూర్ణ పరబ్రహ్మమును దర్శించిన ఎరుక దాని నిర్ణయ విశ్వము లేక యెట్లు పోవును ?

గు॥ పరిపూర్ణ పరబయలుకు ఎరుకకు యెలాటి కలయిక లేనందున ఎరుక శూన్యమగును. దానితోబాటు ఎరుక నిర్మిత విశ్వమంతయు శూన్యమగును.

శి॥ ఎరుక వుండగనే యెరుక దానిచే నిర్ణయించిన విశ్వము లేకపోవుటచూచి ఎరుకను చిత్రముగా యెందుకు తోచును ?

గు॥మంత్రశాస్త్రములందును, యోగశాస్త్రములందును, ఉపనిషత్ భాష్యము లందును నాలుగు మహావాక్యములందును వార్తి కపద్ధతియందును, ఎరుకయే పూర్ణబ్రహ్మమని నిర్ణయించి యున్నందున నమ్మియున్న నిర్ణయమునకు మూలము లేనందున తాను నమ్మియున్న బ్రహ్మస్థితి భ్రాంతియని తెలియటము చిత్రమని నిర్ణయము.

(౧౪౫) దేహాకారము గానిది ! యాహం భావంబులేని దఖిలజనులు దా ! సోహం సోహంబనినను మోహము జెందనిది బైలు ! మొదలెరుగవలెరా ! యెరిగిన యెరుక తుదకరుగ వలెరా ! కోహం కస్త్వంబాని ! కూతాలుగూసేటి ! దేహీదేహములాను తెలియాని యీ బైలు॥ మొదలెరుగవలెరా ! యెరిగిన యెరుక తుదకరుగవలెరా ॥

ఓ, శిష్యుడా ! ఈ పరిపూర్ణ పరబయలు కైవల్యశరీరాకారముగాని దనియు అహంభావము లేనిదనియు సకలజనులు నీకు దాసులమని స్తోత్రము లొనర్చినను మరియు నేనేనీవు నీవేనేను యనినను మోహము జెందక యుండును. అట్టి పరిపూర్ణ పరబయలును మొదలు తెలుసుకోవలయును. మరియు నేనెవరు, నీవెవరు యని వచియించేతను వెరుకను వదలవలయునని భావము.

శి॥ అచలపరిపూర్ణ పరబయలు తెలియని భక్తులనండి బ్రహ్మవేత్తల వరకు యున్నవారి విధము ఏమగును?

గు॥ వారు యొనర్చిన కర్మ ఫలానుసారమున జన్మాదులు పొందుదురు. జన్మరహిత పద్ధతి వారికి కలలోని వార్తగా యుండును.

(౧౪౬) ఏ వస్తువచేతను । తానావిర్భవమొందు దే । హమను తరువరయన్ । అవస్తువె దానికి విత్తె వెలయును । దాన్నె సాక్షి ద్రష్టాని కనుమిా । యెరుకయిదె స్పష్టాము వినుమిా । భావించి చూడుమిా । బట్టబయలనుభూమి। యావిత్తు చెట్టున్న దరయాదా విత్తానే । ద్రష్టాని కనుమిా । యెరుక యిదే స్పష్టాము వినుమిా॥

ఓ, శిష్యుడా ! వివరించి చూడగా ఏ వస్తువుచేత శరీరమనెడి చెట్టు గలిగెనో ఆ వస్తువే శరీరమునకు విత్తనముగా యున్నది. ఆ విత్తనమునే సాక్షియని ద్రష్టయని తెలుసుకొనుము. ఇదే ఎరుకయని చక్కగా వినుము. వివరించి చూచినయెడల బట్టబయలనెడి భూమి ఆ విత్తనమును చెట్టును ఈ రెండును వున్నవని ఎరుగదని భావము.

శి॥ విత్తనము ఎరుకను సాక్షియని ద్రష్టయని యనుటకు కారణమేమై యుండును?

గు॥ శ్రుతి॥ ద్రష్టా దృశ్యవశా ద్బద్ధో దృశ్యాభావే । విముచ్యతే సా: 61 మహానారాయణోపనిషత్తు

ద్రష్టయనగా చూచువాడు దృశ్యవశ్యుడగు చున్నాడు కనుక బుద్ధుడగు చున్నాడు. దృశ్యము లేనప్పుడు ముక్తుడగు చున్నాడు. గనుక బీజముగు ఎరుక వార్తీకనిర్ణయ బ్రహ్మమువరకు చూచును. గనుక ఎరుకను ద్రష్టయనబడును. ప్రత్యగాత్మయగు తనను బ్రహ్మముగా నిశ్చయించుకొను సమస్తమునకు సాక్షినను కనుక ఎరుక సాక్షి యనబడును.

(౧౪౭) ఏ పరిపూర్ణ మేనికి । లోపల వెలినిండియుండు । లోపము లేకన్ । అపరిపూర్ణమె జగతికి । లోపల వెలినుండుదాని । లోనేవున్నవిరా । పై రెండెవ్వి లేనివెన్నకురా । యీ పూర్ణబోధచే । పై ప్రపంచశరీర । రూపము । లెడబాపు । మిాపట్లనె । దాని లోనే వున్నవిరా । పై రెండివ్వి లేనీవెన్నకురా॥

ఓ, శిష్యుడా ! ఏ పరిపూర్ణము శరీరమునకు లోపల వెలుపలనిండి నివిడీకృతముగా యున్నదో ఆ పరిపూర్ణమే జగతికి లోపల బయట నిండి

యుండును. దానియందే ఈ శరీరమును జగమును రెండు తెలియుచున్నవి. ఇవి లేనివేగనుక వీటిని తెలువకుము. అచలపరిపూర్ణ బోధచేత పై ప్రపంచ శరీరముల రూపములను (చక్షురేంద్రియ గోచరము, స్వభావము) ఈ క్షణమే విడువుమని భావము.

(౧౪౮) ఎరుకనగా యెరిగేటిది । మరుపనగా యెరుక తనను మరుచుట । యీరెంట్నెరుగనిదే బయలిది । నీవెరిగెరుక । మరుపు నిప్పుడెరుకాచె విడరా । వీడితె పై మాటెరిగే దెవ్వరురా । యెరుకే పరిపూర్ణమం చెదిరించి వదిరేవు । పరిపూర్ణమైతే । చూపర బయలందునదాన్ని । యెరుకాచె విడరా । వీడితె పై మాటెరిగే దెవ్వరురా॥

ఓ, శిష్యుడా ! ఎరుకనగా ఎరుక తనను తాను ఎరిగినది. మరుపనగా ఎరుక తనను తాను మరచినది. బయలు యనగా ఎరుక మరుపుల రెంటిని ఎరుగనిది. వీటిని నీవు తెలుసుకొని ఇప్పుడు ఎరుకను మరుపును రెంటిని ఎరుకచేత విడువుము. అట్లు విడిచిన యెడల పరబయలును తెలుసుకొనువారు ఎవ్వరును లేరు ఈ ఎరుకనే అచలపరిపూర్ణ పరబయలని ఎదిరించి చెప్పకుము అది పరిపూర్ణమైనచో పరిపూర్ణ పరబయలునందు జూపుమని భావము.

(౧౪౯). లేదన్నను కనుపడుగద । నేదెలిసితి ననినపై టనే । నిల్వగదా । నేదీని వెనకగద । నాకేదో మూలంబు యిదిగా । దిక లేదెచ్చోటా । కనుకనె వుళ్లక్కనేనన్మాటా । యేద లేదిది దప్ప నేదెలియనిది యని । తాతెలుసుకొని యెరుకే తనను వీడితెజాలు । యికలేదెచ్చోట । కనుకనే వుళ్ళక్కనె నన్మాటా॥

ఓ, శిష్యుడా ! అచలపరిపూర్ణ పరబయలు లేదని చెప్పకుము. అది స్వతసిద్ధమై నిండి నిబిడీకృతంబుగా నున్నది. అగుపడుచున్నదిగదా! అట్టి పరిపూర్ణమును ఎరిగితిని చెప్పినను పరబయలులో నేననెడి ఎరుక నిలువదు గదా. నేననెడి ఎరుక పరిపూర్ణ పరబయలుకు ఏలాటి సంబంధములేక యున్నట్టు తెలియుచున్నందున ఈ ఎరుకకు అ పరిపూర్ణ పరబయలు మూలము కాదు. ఇతరము ఏమిమూలము లేనందున నేననెడి ఎరుక వృత్తదని చెప్పనైనది. అయినా నేనుయనెడి ఎరుక, ఎరుగనిది ఒక్క అచలపరిపూర్ణ పరబయలుతప్ప ఏదిలేదు యని ఎరిగి నేననెడి ఎరుక తనకు తానే వదిలిపోతే చాలునని భావము.

(౧౫౦) సత్యమగు బట్టబయలు ననత్యంబగు యెరుక నెరిగి । సద్గురు కృపచే । సత్యముగాదని యెరుకను । సత్యముగా నమ్మి వుంటే। చాలు చాలన్న।

వానితోటి సాటెవ్వరన్నా । నిత్యా నిత్యము లానె నిర్ణాయ మెరుగాక । నిత్యుడై యుండేటి నిజబోధ కలిగితె । చాలు చాలన్నా ॥ వానితోటి సాటెవ్వరన్నా ॥

ఓ, శిష్యుడా!సద్గురు కటాక్ష మువే సత్యమగు అచల పరిపూర్ణ పరబయలును అసత్యమగు ఎరుకను రెంటిని తెలుసుకొని ఈఎరుక నిత్యము గాదని నిజముగా నమ్మివుంటే చాలును, వానితో సమానులెవరును కారు నిత్యానిత్యములనె నిర్ణయము తెలియక నిత్యుడై యుండేటి నిజబోధ యునికి కలిగివున్న వానితో సమానులెవ్వరు కారని భావము.

శి॥ నిత్యా నిత్యములనే నిర్ణయము తెలియక నిత్యుడై యుండేటి యునికి ఏబోధవల్ల కలుగును?

గు॥ బ్రహ్మ భ్రాంతిగల మత ప్రబోధలయందు ప్రకృతి అసత్యము బ్రహ్మ సత్యము యని నిర్ణయము యున్నందున మాయయగు ప్రకృతి నేను కాను సత్యమగు బ్రహ్మమును నేనేయని నిర్ణయముగా యుండును. ఆ బ్రహ్మమునకు అచలపరిపూర్ణ పరబయలు యందు మూలముగాని స్థానముగాని లేనందున శూన్యమై లేకపోవును గనుక ఈ పద్ధతివలన తాను నిత్యుడై యుండే యునికి తెలియదు మత ప్రమేయము లేనివేద వేదాంత సిద్ధాంత పద్ధతులను అచలపరిపూర్ణ ప్రబోధవల్లనే నిత్యుడై యుండేటి నిజపద్ధతి తెలియగలదు.

(౧౫౧) పరిపూర్ణములో దోచిన । యెరుకేకల, లేని యెరుక నెరిగి మృషని యూమరుగెరుక కెరుక దెల్పిన । యెరుగుటయేమేల్కొ సుమ్మి । యిది యామారకుమీ! సద్గురువాజ్ఞ కెదిరిమీరకుమీ । యెరుక యూరీతిగ ॥ యెరిగిపోయిన వెనుక పరిపూర్ణ మొకటుండు ॥ పలుకారాదెట్లందు । నిది యామారకుమీ ॥ సద్గురువాజ్ఞ కెదిరి మీరకుమీ॥

ఓ, శిష్యుడా! అచలపరిపూర్ణ పరబయలున తెలియుచున్న ఎరుకయే కల, గనుక దీని లేనిపద్ధతి తెలుసుకొని అది లేనేలేదని ఈ మర్మము ఎరుకకు ఎరుకనే యెరిగించినయెడల అది తెలుసుకోవడము యెరుకకు మేల్కొయని నిర్ణయము. ఇది మరువవద్దు సద్గురు వాజ్ఞకు యెప్పుడు మీరవద్దు. ఈ లేనెరుక ఈ పద్ధతిగా లేక పోయిన వెనుక పరిపూర్ణ మొకటుండు అది చెప్పుటకు సాధ్యము కాదని భావము.

(౧౫౨) తిప్పలగు రాకపోకల । నెప్పుడు తానెరుగనట్టి । యీ బయలందున్, తప్పక తనకై తానే । తప్పున గనవచ్చి యెరుక తాగానరాదా ॥ బయలున్నాది తనకెరుకలేదా । యెప్పుడు బయలున్న దెరిగి తాలేనట్టి । చొప్పు

సద్గురుబోధ చొప్పున । దెలిసితే । తాగానరాదూ బయలున్నాది । తన కెరుక లేదూ॥

ఓ, శిష్యుడా! ఉపాధులగు జనన మరణములను యెల్లప్పుడు తెలియక యున్నట్టి అచలపరిపూర్ణ పరబయలున అకస్మాత్తుగా యెరుక తనకుతానే అగుపడి మరల అగుపడదు. అచలపరిపూర్ణ పరబయలు యున్నదవి యెరుకకు తెలియదు. సదా అచలపరిపూర్ణ పరబయలు యున్నదని తెలుసుకొని తాను లేనటువంటి విధము సద్గురుబోధ ప్రకారముగా తెలుసుకొనిన యెడల తనంతట తానే లేకపోవునని భావము.

శి॥ సద్గురుబోధపద్ధతిగా తెలుసుకోవలయుననే నిర్ణయము ఎందుకు?

గు॥ భక్తిజ్ఞాన వైరాగ్యతత్వముముక్షత్వ పద్ధతులుగల మతవాదులు ఒకరి పద్ధతి మరియొకరు అపవాదము యొనర్చుకొన్నారు సిద్ధాంత పద్ధతి తెలిసిన అచలపరిపూర్ణ పరబాహ్య నిర్మిత ప్రబోధకులగు సద్గురువులు ఏ ప్రబోధలను అపవాద మొనర్చక ఉన్నదియున్నట్లు లేనిదిలేనట్లు ప్రబోధించెదరు గనుక జనన మరణరహితమునకు ప్రయత్నించు స్త్రీపురుషులు పరిపూర్ణ ప్రబోధ సద్గురువులచే వస్తునిశ్చయముగా తెలుసుకోవలయునని సాంప్రదాయక సిద్ధాంతము.

(౧౩౩.) అన్నము శుక్లంబగు । రస మున్నతిగా రక్తమగును । నాకబో రెండున్ । వన్నుగ గలసిన మేనని । యెన్నబడున్ యెరుకగల్గి । యిదెమాయ సుమ్మీ॥ మూలము లేనిదిదె నీవునమ్మియున్నావు పరిపూర్ణ మున్నాదిగని । లేని దెన్నడు లేదాని యెరిగితే చాలు । గుర్తిదె మాయ సుమ్మీ । మూలము లేనిదిదె నీవు నమ్మీ।

ఓ, శిష్యుడా! పురుషుడు భుజించిన అన్నరసమువల్ల శుక్రము కలుగుచున్నది. స్త్రీ భుజించెడి అన్నపానాదుల రసమువల్ల శోణిత ముదయించుచున్నది. స్త్రీ గర్భమునందు ఈ శుక్లశోణితములు కలిసినయెడల యెరుకగలిగిన శరీరమని చెప్పబడును. ఇదే మాయయనబడును. మూలము లేనిదిగనుక దీని నీవు నమ్మకుము. అచలపరిపూర్ణ పరబయలున్నది తెలుసుకొని లేనటువంటి గుర్తెరిగే శరీరమును యెన్నడూలేదని తెలుసుకొనిన యెడల చాలునని భావము.

(౧౩౪.) పెనుమాయను జూడుము యిదె । జనకుని జఠరంబు వలన । జననీ గర్భంబునజొచ్చి । మారురూపున జనియించును । నవయవములు । జనితామై భువినీ । విను కను తిను మూర్కొను వచ్చునుచని । దినదిన మభివృద్ధా దీనిచే

బయలును । గనియా మాయలమల్లి కథ । మాయించుము పోనీ । జనితామై భువినీ । వినుకనుతిను మూర్ఖాను వచ్చునుచని ॥

ఓ, శిష్యుడా ! మహామాయను జూడుము ఇదియే తండ్రి గర్భము నుండి తల్లిగర్భము ప్రవేశించి పిండాకారమై అవయవములతో భూమిపైన బడును. అటు తర్వాత క్రమేణా జ్ఞానేంద్రియములతో విషయసంపర్కమును తెలుసుకొని అంతఃకరణమున నిశ్చయించి అనుకూల విధానముగా కర్మేంద్రియములచే కర్మయొనర్చి కర్మఫలముల ననుసరించి జన్మంబులు జెందును గనుక దీనిచే అచలపరిపూర్ణ పరబయలును గని మాయలమారియగు ఎరుక యొక్క కథను మాయించుము పోనియని భావము.

(౧౫౫) పెట్టియలోపలి గారడి । చెట్టుపయిన్ గానవచ్చి । చెట్టునజూడన్ । గట్టుపయి దోచునిది । కనుకట్టు సుమీ దీనివలెనే గనుపించు నెరుకా । అంతలో యెచట । గనుపించ దెరుకా । దిట్టమౌ బోధాచేష్టి । యెరుకను తిరిగి । పుట్టాకుండగ దాని । పుట్టే ముంచుము లేంచే । గనుపించు నెరుకా । అంతలో యెచట । గనుపించ దెరుకా ॥

ఓ, శిష్యుడా ! పెట్టెలో గూర్చుండబెట్టిన గారడిపిల్లవాడు చెట్టుపై కనుపించును. అచట మాయమై గట్టుపై గనుపించును. ఈపద్ధతి కనుకట్టు విద్యయనబడును, అదేవిధముగా ఎరుక తల్లిగర్భమగు పెట్టెలో కనుపించును. ఉపాధిజెంది శరీరమగు చెట్టుపై కనుపించును మరణము పొంది గట్టుపైన సమాధియందు తెలియును. మరల ఎచట గనిపించదు గనుక దృఢమగు అచలబోధను గ్రహించి ఎరుకను తిరిగి జన్మకురాకుండ దాని పుట్టుకయను మూలము పెకలించుము చాలునుయని భావము.

(౧౫౬) నేననని బ్రహ్మలోపల । లేనిదె సంభవము నొంది । లీల తనకు దా । మెను జగములై వెలసెను నేనదిమృగ జలమురీతి । నిజము గాదనుచూ । లోకులనేటి । గజిబిజి వినుచూ । మానాసమున వారి మాటకామోదించి । దానికి బోధకు తగునంచు వినజేస్తి నిజముగా దనుచూ । లోకులనేటి । గజిబిజీ వినుచూ ॥

ఓ, శిష్యుడా ! నేను అని యనని అచలపరిపూర్ణ పరబయలుయందు మూలము లేక లీలగానేని ఎరుక తనకు తానేవచ్చి శరీర ప్రపంచములుగా వర్ణమించెను దానికే నేను ఎండమావుల జలము వంటిదని చెప్పినాను. లోకులీ ఎరుకను నిత్యమని నమ్మించుటకు గజిబిజిగా చెప్పుమాటలువిని ఎరుక నిత్యమని

నమ్మించ లేక పోయినందుకు నానిర్ణయమే నిజమని నామనంబున వారిమాటలకు సంతోషించి వారిమాటలను ఈ అచలబోధకు తగునని వినిపించినానని భావము.

(౧౪౭) గుడమే మధురము మధురమె। గుడమూగుడ మధురములను గొన కొని తొలుతన్ । బొడమిన దేదన సరిగా । బొడిమిందొకటేగ రెండూ పోయినట్టె కదరా । తనువెరుకాలి। ట్లైనట్టె కదరా । పొడజూవి బయలు విప్పుడె మేనెరు కలజోలి । విడరాలేనివె రెండు । పెడచెవిబెట్టకవిను । పొయినట్టెగదరా । తను వెరుక లిట్లె నట్టెగదరా ॥

ఓ, శిష్యుడా ! బెల్లముతీపి ఆరెండును కలిసియే పుట్టుచున్నవి. పోవు నప్పుడు కలిసియే పోవుచున్నవి. అట్లే దేహమే ఎరుక ఎరుకయే దేహము. పుట్టె నప్పుడు కలిసియే పుట్టుచున్నవి. చనిపోవునప్పుడు కలిసియే పోవుచున్నవి గనుక నీవు నామాటను పెడచెవిన బెట్టక అచలపరిపూర్ణ పరబయలుయొక్క యునికిని జూచి శరీరమెరుకల జోలిని విడువుమని భావము

(౧౪౮) ఇదివున్నది యిదివున్నది । యిదివున్నది యనుచు బయలు నెరిగి యెరుకచే యిదిలేనిది యిదిలేనిది । యిదిలేనిది యనుచునెరుక । నెరిగితె సరిరా। ఆపై నుండె దెట్లందువినరా వుదయాస్త మానాములుడుగాక యిదినీనె । మ్మదిలోననమ్ము నా । మాట నిశ్చయమిట్లు । యెరిగితె సరిరా । ఆపైనుండె దెట్లందు వినరా ॥

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ పరబయలు ముమ్మాటికి వున్నదని ఎరు కచే తెలుసుకొని ఈ ఎరుక ముమ్మాటికి లేదని తెలిసినయెడల సరిపోవును. ఆపైన యుండేబయలు చెప్పుటకు నలవికాదు సూర్యోదయమునుండి సూర్యాస్త మయము వరకు [జాగ్రతావస్థ యున్నంతవరకు] నేను చెప్పినది నిజమని మనం బున నమ్మియుండుమని భావము

(౧౪౯) ఎరుకే చదువుల జేసును । ఎరుకేవిను చదువునెరుక నెరుకే తిరమం । నెరిగించును శంకించును । యెరుకే కొనకేమిలేక । యేగునో యన్నా బయలే వదువు । యెరుగాదో యన్న యెరుకే యెన్నటికైన పరిపూర్ణము న్నదం॥ నెరిగితాలేనాని యెరిగితే నిలువక । యేగునో యన్నా । బయలేచదువు । యెరుగా దోయన్నా ॥

ఓ, శిష్యుడా ! ఎరుకే వేదములు జేయును ఆ ఎరుకయే వినును చదు వును. ఆ ఎరుక స్థిరముగా యుండునదియని ఎరిగించి నమ్మించును. తన అస్థి

రము తెలుసుకొని శంకించును.తనకు యెచట మూలము లేనందున యెచటకూడ నిలువకుండా పోవును. అచలపరిపూర్ణ పరబయలు ఏచదువులు యెరుగదు. చేయదు. ఈ యెరుక యెన్నటికైన అచల పరిపూర్ణ పరబయలు వున్నదని తెలుసుకొనిన యెడల తాను యెచట నిలువలేక పోవునని భావము.

(౧౬౦) చూపులలోగల వస్తువు। చూపులుగను వస్తువులును చూపులు గూడన్। తేపకు యెరుకని తెలియును చూపులు లేనట్టి బయలు చూచెదింకేమి। యెరుకేలేదు। తోచెదింకేమి దీపామువలె కను పాపలో గలవస్తువై। పరమాత్మాని చూపితేయెరుకాయ। చూచెదింకేమి యెరుకేలేదు। తోచెదింకేమి॥

ఓ, శిష్యుడా! చూపునందువుండే దృక్కును చూపుచేత చూడబడే దృశ్యమును అంతరము నందుయుండి చూచునట్టి ద్రష్టయును వ్యవహారరీత్యా వేరుగా తెలియుచున్నను నొక యెరుకేయని తెలియుము. అచలపరిపూర్ణ పరబయలుకు చూపులేదుగనుక చూడడములేదు. అందువల్ల దానికి ఏ పద్ధతి తోచడములేదు. ప్రకాశమగు నొకదీప కాంతిని కనులయందు చూపించినందున నది యెరుకయే యగునని భావము.

(౧౬౧) శతపత్రా ప్తుని పొడగని। యతిరయమున తిమిరమణగి। యగుపడద। ట్లతులిత గురుకృపగలిగిన। మతిమంతుల జూచియెరుక మరినిల్వబోదూ। సంశయమునీ। మదినిల్పరాదూ। శ్రుతులందు స్మృతులందు। యితిహాసములయందు। సతతాము శ్రమపడి వెతకీన యీ। యెరుక। మరినిల్వబోదూ। సంశయమునీ। మదినిల్పరాదూ॥

ఓ, శిష్యుడా! సూర్యుని జూచేనా చీకటి అతిత్వరితముగా మటుమాయమై పోవునో, అటువలెనే సమానములేని సద్గురు కరుణాకటాక్షము జెందిన బుద్ధిమంతులను జూచి యెరుక నిలువజాలదు గనుక ఇకనీమనంబున సందేహము విడువుము శ్రుతులయందు స్మృతులయందు శాస్త్రములయందు యెల్లప్పుడు శ్రమపడి వెతకి యెరుకను నిలుపదలచినప్పటికిని మూలము లేనిది కనుక యెరుక నిలువజాలక లేకపోవును యని భావము.

(౧౬౨) లేనికల దోచినప్పుడు। లేని విచిత్రంబులన్ని లేకనె తోచున్। లేనికల మేలుకొన్నను। లేని విచిత్రములు తాను లేకాపోవునురా। అనుమానాము। లేదందు వినరా। లేనెరుక యీ రీతిగానె బయలును జూస్తె। తానుతన విచిత్రములు। పూనెందు నిలచుండ। లేకాపోవునురా। అనుమానము లేదింధువినరా॥

ఓ, శిష్యుడా ! లేనట్టికల గలిగినప్పుడు లేనట్టి విచిత్రములన్నియు లేకనే కలుగును. యీ లేనట్టి కలలోనుంచి మేలుకొనిన యెడల ఆ లేనట్టి విత్ర విచిత్రమును తానును లేకపోవును. యిందుకు యేలాటి సందియము లేదు వినుము యీ లేనట్టి యెరుక యీ ప్రకారముగా నచలపరిపూర్ణ పరబయలును చూచిన యెడల తాను తన విత్రములను యెన్నటను నిలువలేక పోవునని భావము.

(౧౬౩) మరణ సుషుప్తుల జెందిన ' పురుషుడు మేల్కొనినవాడు భవిత దితరుడౌ । పురుషుడు కలగనువాడని! యెరిగుండుము మొదటి యత డెరుగాడీరెంట్నీ ' రెండోపురుష డెరుగు నీరెంట్నీ । యిరువూరొక్కటెసుమ్మీ తిరిగి పుదుదురువీరె। గురునీచె మేల్కొంటె తిరిగి పుట్టనెపుట్ట । డెరుగాడీరెంట్నీ రెండో పురుష । డెరుగునీరెంట్నీ ॥

ఓ, శిష్యుడా ! క్షరాక్షర పురుషద్వయము నందు మరణ సుషుప్తులు జెందువాడు క్షరపురుషుడు. అహోరాత్రములను నిర్ణయములేక వుత్పత్తి, స్థితి, లయ, విస్తీర్ణ ఆకర్షణములు కలుగజేయుటవలన అక్షరపురుషుడ్ని మేల్కనిన వాడని నిర్ణయము వున్ననూ, అక్షర పురుషుడు కలగను వాడని యెరిగుండుము. మొదటి పురుషుడగు క్షరపురుషుడు తనను తానుగాని అక్షర పురుషుడ్ని గాని యెరుగడు. రెండో పురుషుడగు అక్షరపురుషుడు తనను క్షర పురుషుడ్ని రెంటిని యెరుగును. మరణ సుషుప్తులు జెందునట్టి క్షర పురుషుడు యెరుగక పోయిననూ, అక్షరపురుషుడు సర్వము యెరుగుచున్ననూ ఉభయులు యెరుకలోని వారేగనుక వీరికి జనన మరణములు తప్పవు పరిపూర్ణ గురు కటాక్షముచే అచలపరిపూర్ణ పరబయలునందు యెరుక లేదను మెలుకువ యెరిగిన యెడల జనన మరణముల జెందరని భావము.

(౧౬౪) యెరుకే యెరుకకు కొడుకులు । యెరుకే తలిదండ్రి యెరుక । కెరుకేయితరుల్ । యెరుకే యెరుకకు మూలము । యెరుకకు మూలంబు బయలం చెట్లందునోయీ । యెరుకే యెరుకకేమీ లేదోయీ యెరుకలేని వృత్త పరిపూర్ణమును జూచి । యెరుకేతాలేనాని । యెరిగి పోయితెప్పె ! మాటెట్లందునోయీ ' యెరుకే యెరుక కేమీలేదోయీ ॥

ఓ, శిష్యుడా ! యెరుకనే యెరుకకు కొడుకులు, యెరుకనే తలిదండ్రులు. యెరుకకు యెరుకే యితరులు,యెరుకకు యెరుకనే మూలమని యెరుగుము. యెరుకకు అచలపరిపూర్ణ పరబయలు మూలమని చెప్పరాదు. యీ ఎరుకే ఎరుకకు

శూన్యమని తెలియుము. ఎరుక లేనట్టి పరిపూర్ణమును పుండజూచి యీ యెరుక తాను లేనని యెరిగిపోయినచో పరిపూర్ణ పరబయలు యిట్టిదని చెప్పనలవికాదని భావము.

(౧౬౫.) వినునీవు నన్నునేనును। ననునీవునే నిన్ను యెరిగినదెకల। యిదితా తననెరుగని దానిని గని। తన కలిమి మృషనుచు దెలిసి। తానేగనేనీ। అది మేల్కవలి। దాన్నెవ్వడెరిగినీ వినునీవునే నిన్నుబోధ। వినిపించూ వినుమాని। యనుటా కిద్దరికిపుడు॥ మునుపున్న యెరుకేది। తానేగనేని। అది మేల్కవలి। దాన్నెవడెరిగినీ॥

ఓ, శిష్యుడా! నిన్నునీవు, నన్నునేను, నన్నునీవు, నేనిన్నునూ తెలుసుకున్న యెరుకేకల. అట్టియెరుకకు తనను తాను యెరుగని అచలపరిపూర్ణ పరబయలును తెలుసుకొని తాను వున్నాననే నిర్ణయము అసత్యమని తెలిసి తనతో కూడా లేకపోయిన అదిదానికి మెలకువయని నిర్ణయము అటుతర్వాత, పరిపూర్ణ పరబయలును యెవ్వరూ తెలుసుకొనజాలరు. అచలపరిపూర్ణ బోధను నన్ను నీవు వినిపించుమనుటకును, నేనునిన్ను వినుమనుటకున్ను, అప్పుడుండినట్టి యెరుక యిప్పుడు లేదని భావము.

(౧౬౬) నానావిధావయవములు। నానావిధ నామరూపనటనలు మాయల్ నానావిధాల పూహాలు। నేనను యెరుకందె యిన్ని। నిబిడామైయుండూ బయలును గనతా। నిలువలేకుండూ నేను మేనిరెండునేనె నేలేకుంటె; మేను లేదిదిలేక నేనిలిచేదెట్లన్ని। నిబిడామై యుండూ। బయలును గనతా। నిలువాలేకుండూ॥

ఓ, శిష్యుడా! నానావిధములగు అవయవములు, నానావిధములగు నామరూప నటనలు, విచిత్రముగా తెలియు మాయలు, నానావిధములైన యూహాలు, నేనను యెరుకయందు నిండి నిబిడీకృతములై యున్నవి. యీ యెరుక అచల పరిపూర్ణ పరబయలును చూచినచో తాను నిలువలేక పోవును. నేను మేను యను నది నేనే, 'నే' లేకుంటే మేనువుండదు. మేను లేకుంటే నేనువుండదని భావము.

(౧౬౭.) పరిపూర్ణ మనెటి పలుకే। యెరుకను బల్యాక్షరముల కెచ్చట గనినన్ తిరమై యున్నది కనుగొని। యెరుకను బల్యాక్షరముల। నికగట్టి పెట్టూ। యెవరికి దెలియ। నిడిమూల గట్టూ। గురుమూర్తి కరుణాచె నెరిగి తెల్పితినేనీ। పరిపూర్ణబోధాను పరులు జెప్పినబోధ। నికగట్టిపెట్టూ॥

ఓ, శిష్యుడా ! పలకమీద బలపముతో నక్షరములు వ్రాయబడుచున్నట్లు అచలపరిపూర్ణ పరబయలనెడి పలకయందు ఎరుక ఇహపర రూపమగు శబ్ద ప్రపంచము సృజింపినది. నీవు స్థిరముగాయున్న అచలపరిపూర్ణ పరబయలును తెలుసుకొని ఎరుకను ఎరుకనిర్మితశబ్ద ప్రపంచమును తుడిచివేయుము ఈ రహస్యము ఎవ్వరికితెలియదు. ఈ రహస్యమును నేను సద్గురుమూర్తి కరుణవే నెరిగి నీకుచెప్పితిని గనుక ఈ పరిపూర్ణ బోధను నీవు తెలుసుకొని ఇతరులు నీకు చెప్పిన బోధలను కట్టిపెట్టుమని భావము.

శి॥ ఈ రహస్యము ఎవ్వరికి యెందుకు తెలియదు ?

గు॥ వేదములయందు వేదశిరస్సులగు వేదాంతములను ఉపనిషత్తుల యందు నిర్ణయించిన పడవులకు హద్దులు నిర్ణయించుకొని మతకర్తలు కర్మ,భక్తి, జ్ఞాన, వైరాగ్య, తత్వ ముముక్షత్వ పద్ధతులు నిర్ణయించి మానవులను భ్రాంతి పద్ధతుల యందు ప్రవర్తింపజేయు చున్నందున జనన మరణ రహితమునకు నిర్ణయించిన సిద్ధాంతపద్ధతి వారికి తెలియదని నిర్ణయము.

శి॥ వారి నిర్ణయంటులు కట్టిపెట్టుట యెట్లు ?

గు॥ యెరుకనిర్మిత శబ్దప్రపంచమునందలి నిర్ణయంబులు మతకర్తలు ఒకరి నిర్ణయంబులు మరిఒకరు అపవాదమొదర్చు కున్నారు. అయినానవి శూన్య మగు యెరుక నిర్ణయములేగనుక జన్మరహితము వారికి కలలోనివార్తగా యుం డును. నీవు ఆ పద్ధతిగా యొనర్చక జనన మరణములు లేక జనన మరణములు కలిగియున్నయెరుకను తెలియక స్థిరముగాయున్న అచలపరిపూర్ణ పరబయలను తెలుసుకొని లేనట్టి ,నిన్ను నీకు తెలియునట్టి ఇహపరాదులను కర్తృత్వరహిత కర్మాచరణగా విడిచిపెట్టుము. స్థిరముగాయున్న అచల పరిపూర్ణ పరబాహ్య మును తెలుసుకొనక కర్మ సన్యాసముగాను మరియు కర్మ ఫలత్యాగముగాను కర్మ, భక్తి, జ్ఞాన పద్ధతులు విడిచినచో యెరుక నిర్మిత అనేక జన్మంబులు కలు గును. గనుక అచల పరిపూర్ణ పరబయలు యొక్క నిర్ణయము తెలిసినవారికే జననమరణ రహితము అవలీలగా సిద్ధించును.

(గేయ) చూపించ జూపరానిది । చూపించితి దాన్నివుండ । జూచితివి గదా । చూపించ జూచెనిది దీ । న్నే హార్ధిక దల్చబోకు । మిదె గురుబోధా । నిన్నంటాదు నితరమేబాధా । నాపాప నాకూన నాచిన్నినాయన్నా నాపెన్నిధా నామా నారత్నములకొండ । యిదెగురుబోధా । నిన్నంటాదు నితరమేబాధా॥

ఓ శిష్యుడా ! అచలపరిపూర్ణ పరబయలు చూపించుటకు చూప శక్యము కానిది చూపించితి. దానిని వుండచూచి నావుగదా. చూపించితె చూచిన ఎరుకను ఏపొద్దు తలువకూడదు. ఇదే సద్గురుబోధ. ఇక నీకు ఇహపరాదులయందు ఏ ఉపాధులు కల్గవు, నాపాప ' నాకూన । నాచిన్ని నాయన్న । నాపెన్నిధానమా ' నా రత్నములకొండా ' ఇదే సద్గురుబోధయని భావము.

(౧౬౯) నామము రూపమునటన । స్తోమము బయలందులేదు చూడుము నీవా। నామము రూపము నటన। స్తోమము యెరుకందుగలదు చూడుమి నిజమూ। బయ లెరుకాలా ' చూచి చూడకుమూ । వేమారు నేనెంతవినజెప్పినా గాని । యీమార్గమే తప్ప । యికలేదు రెండోది ' చూడుమి నిజమూ ' బయలెరుకాలా। చూచిచూడకుమూ ॥

ఓ, శిష్యుడా ! అచలపరిపూర్ణ పరబయలునందు నామము, రూపము నటనల యొక్క సమూహము లేదు. ఎరుకయందు ఈ నామములు రూపములు నటనల యొక్కసమూహము మొదలైనవి యున్నవి. సత్యముగా చూడుము. ఈ బయలును ఎరుకను రెంటిని జూచి చూచిన ఎరుకను చూడకయుండుము వేమారు నేనెంత వినజెప్పిననూ ఎరుకరహితమైన ఈ రాజమార్గము తప్ప వేరుమార్గము రెండవది లేదని భావము.

(౧౭౦.) గురుడు గురుబోధ శిష్యుని । కెరిగించెటివేళ శిష్యుడెరిగెటిదివేళన్' యిరువురు వైశ్వానర క ' ర్పురములవలె వెలిగియవల । పొడజూపరోయీ అట్లనెనీ ' నిక్కడ దెలియుమోయీ ' పరిపూర్ణమెరుకాల నెరిగి। యామీదాట। యెరుకాను విడచూటె । గురుబోధంబెరుగూ । పొడజూపరోయీ । అట్లనె నీవిక్కడ దెలియుమోయీ ॥

ఓ, శిష్యుడా! సద్గురువు సత్శిష్యునికీ గురుబోధయనెడి అచలపరిపూర్ణబోధ దెలిపే కాలమందు సత్శిష్యుడు సద్గురువు వలన గురుబోధ యనెడి అచల పరిపూర్ణ మెరుంగు నప్పుడు ఆ గురుశిష్యు లిరువురు అగ్ని శిఖ కర్పూరము వలె వెలిగి మరల అగుపడరు గదా ! అటువలెనె నీవు ఇక్కడ ఎరుంగుము. ఎట్లనగా అచలపరిపూర్ణ పరబయలును ఎరుకను ఈ రెంటిని ఎరిగి అటుతరువాతను ఎరుకను విడువడము గురుబోధ యనే అచల పరిపూర్ణ బోధయని భావము.

(౧౭౧.) సతికౌంగిట తత్పతి, త । త్పతి కౌంగిట సతియు జేరి ' పవళించి కలన్ । మృతిచెంది మేలుకని సు ' స్థితులై యొక రొండొరికట్టి చేష్ట దెల్పుదురా।

సిగ్గెడలి యా । చేష్టా నిల్పుదురా । ప్రతిలేని గురుబోధస్థితి జెందియట్లనె వం । తత తిరిగి లేనెరుక । గతి యిట్టిదని దాని । చేష్టా దెల్పుదురా ॥ సిగ్గెడలి యా। చేష్టనిల్పుదురా ।

ఓ, శిష్యుడా! భార్యాభర్తలిరువురు నొకరి నొకరు కౌగిలించుకొని పండుకొని భార్యకు భర్త భర్తకు భార్య వచ్చినట్లు కలగని మేల్కొని సుస్థితులై యున్నట్లు ఒకరి నొకరు తెలుసుకొని కలనిర్ణయము ఒకరి కొకరు చెప్పుకొనరు. ఎందుకనగా అవిషయము వారికి దుశ్శకునముగనుక సిగ్గువిడనాడి స్వప్న పద్ధతి నిజమని నిర్ణయించలేరు. అట్లే సాటిలేని సద్గురు బోధ పొంది అచలపరిపూర్ణ పరబయలును ఎరుకను ఎరిగి ఎరుకను విడిచి యున్నవారు. ఎరుక చేష్టలు వృత్తమ మని ఎవ్వరికి చెప్పరు సిగ్గు విడిచి వాదించి ఎరుక చేష్టలు నిజమని నిర్ణయించ లేరని భావము.

(౧౭౩) పరిపూర్ణ మెరుకలివియని । గురువరుడెరిగించి యెరుక కూటమి మాన్పన్ । గురువుకు గురు । వెవరనుటకు మరిశిష్యునికింక నోటా ! మాటా వెళ్ళినా । పోయినయెరుక మళ్ళిమళ్ళినా । గురుశిష్యులనియేటి గురుతెన్న డెరుగాక నిరతాము వకరీతి నిలచున్న బయలందు । మాటావెళ్ళినా పోయిన యెరుక మళ్ళి మళ్ళినా ॥

ఓ, శిష్యుడా ! సద్గురుడు ఇది పరిపూర్ణ మనియు ఇవి ఎరుకయనియు ఈ రెంటిని తెలిపి ఎరుక యొక్క భ్రాంతిని విడపించిన పిమ్మట గురువుకు గురువెవ్వ రని చెప్పుటకు శిష్యునికింక నోరు ఆడదు. విడిపోయిన ఎరుక తిరిగిరాదు. గురు శిష్యులనియేటి ఈ గుర్తు ఎప్పటికి తెలియక ఎల్లప్పుడు యొక్కరీతిగానే యున్న బయలులో శబ్దము గలుగదని భావము.

(౧౭౪) అందముగా సద్గ్రంథము । చందము వినిపింతుదాన్ని । చదివిన వినినన్ । ముందుగ బయలెరుకైయే । సందునలేనెరుకలేక । జనవలెసుమ్మీ । అదేయిది । విని చదువు నమ్మీ । యెందుకు నీకింక । యితర శాస్త్రములజో । లందుగుర్తుండి పోదదిగాన । యీ యెరుక జనవలెసుమ్మీ । అదేయిది విని చదువు నమ్మీ ॥

ఓ, శిష్యుడా ! శక్తి ద్వయనిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్వమును అచల పరిపూర్ణ పరబయలును తెల్పెడిగ్రంథమే సద్గ్రంథము ఇట్టి సద్గ్రంథమును నేను నీకు వినిపించెదను దానిని నీవు చదివినను సద్గురువు వలన వినినను ముందుగా నీకు అచలపరిపూర్ణ పరబయలు, ఎరుక తెలియబడి లేని ఎరుక ఇహపరాదుల

యందు ఎచటగూడ లేకపోవలయును. అట్టి సద్గ్రంధము ఇది నీవు నామాటనమ్మి ఈ గ్రంథమును సద్గురువువలన శ్రవణము చేయవలెను. ఇతరశాస్త్రములు నీకు అవసరము లేదు. ఎందుకనగా ఆ శాస్త్రములు వినినను చదివినను ఈ గుర్తనెడి ఎరుక లేకపోదని భావము.

(౧౭౪.) అల భద్రాచల మనిన బ। యలుగా గుర్తెరుగవలయు । యెరుకను విఘ్నం ' దులదోఓ గురుని కృపచే । నిలువక విఘ్నెగిరిపోతె । నిశ్చయమదెరా ' కృష్ణదాసు ' నిశ్చయమదెరా యిలమీద యెవరైన యీ కందార్థముల॥ లోపలిగూఢార్థముదెలియ భ్రమను జెందరువారు । నిశ్చయమదెరా ' కృష్ణదాసు నిశ్చయమిదెరా ॥

ఓ, శిష్యుడా! అల భద్రాచలమనగా అచలపరిపూర్ణ పరబయలుగా తెలుసుకొనుము. ఆ బయలునందు ఎరుకయనే విఘ్నతోచును. సద్గురు కృపచే ఎరుకయను విఘ్నవు నెగరగొట్టినచో అచలపరిపూర్ణ పరబయలు నిలిచియుండును. ఇదియే శ్రీభాగవత కృష్ణదేశిక ప్రభువుల నిశ్చయము. ఇలలో ఎవరైనను ఈ శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థములలో నుండెడి మర్మము ఎరిగిన యెడల ఏలాటి భ్రాంతి జెందరని భావము.

(౧౭౫.) ఒరులు నేననక నిండిన దెరిగింపుమదేమొ ? బయలు । యేనొరులనుచున్ యెరుగునీవెవరు ? యీలే నెరుకను । వున్నావు ? వుంటె యిది లేనంచనుకో ! నేనొ ? నినునీమదినీ లేననుకో ! యెరిగి యీలే నెరుక యిట్లాలేకుండితె పరిపూర్ణ । మొ ? దాన్నే పగిదీగు ర్తెరిగేము ? యిదిలేనంచనుకో । నేనొ? నినునీ ' మదినిలేననుకో ॥

ఈ కందార్థ భావము ప్రశ్నోత్తరములుగా నున్నది.

ఓ, శిష్యుడా ! పరులనియు నేననియు ఎరుగక నిండియున్నది యేది ? దానిని తెలుపుము ?

శి॥ అచలపరిపూర్ణ పరబయలు అది

గు॥ నేనని పరులని తెలుసుకొనెడి నీవెవరు ?

శి॥ లేని యెరుకను.

గు॥ ఉన్నావు గదా ?

శి॥ ఉంటే లేనని యనుకొనుము.

గు॥ నీవు లేకపోయినా నేను వుండినిగదా ?

శి॥ నిన్ను నీవు నీ మనంబున లేనని యనుకొనుము.

గు॥ ఈ లేనెరుక యారీతిగా లేకపోయిన వెనుక అచలపరిపూర్ణ పర బయలు వుండును గదా ?

శి॥ అది యున్నదని లేదని ఎట్లు నెరుగగలము ? ఎరుగునట్టి ఎరుక లేదని నిర్ణయము.

ఈ విధముగా సద్గురు సశిష్యుని ప్రశ్నించుటకు కారణమేమనగా లేనేలేనని నేను లేకపోయిన వెనుక తానుండునని శిష్యుడు అని యున్నాడు. ఆ గుర్తు పోవుటకు శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ అచలపరిపూర్ణ ప్రబోధ బోధించి ఆగుర్తు ఎగిరిపోయినది లేనిది తెలుసుకొనుటకు శిష్యుణ్ణి పరీక్షించినాడని భావము.

## —( హితోపదేశము )—

(౧౨౬) మానవుడు చేయబూనిన। దానిని లోతెరిగి చేయదగుననిమదిలో। నేనెరిగి నీకు జెప్పితి। పూనుమురుచి బుట్టదేని। పోని నీ మనుసా। రుచి బుట్టితే। పూను నీ మనుసా। నేనేమి యనబోతె నీకేమి దోచునో। లేని నిష్ఠూరము లేకుండుటే లెస్స। పోని నీ మనుసా। రుచి బుట్టితె। పూనునీ మనుసా॥

ఓ, శిష్యుడా ! మానవుడు చేయదలంచిన కార్యము చక్కగా విచారించి చేయుట మంచిది నేనే విషయమును మనంబున బాగుగా గుర్తెరిగియే చెప్పు చున్నాను గనుక నీవు అట్లు చేయుము. ఈ భావము నీకు రుచి బుట్టని యెడల నీ ఇష్టము వచ్చినట్లు యవలంబింపుము. ఈ భావము నీకు రుచిబుట్టినచో మనంబున విచారించి నేను చెప్పినట్లు చేయుము. నేను నీకు వున్నది యున్నట్లు యదార్థము చెప్పినప్పటికిని నీ మనస్సునకు మరియొక విధముగా తోచవచ్చును. లేని నిష్ఠూరము లేకుండుటయే మంచిది యని భావము.

శి॥ వున్నది యున్నట్లు యదార్థము తెలిపినవారి మనస్సునకు మరియొక విధముగా తోచుటకు కారణమేమై యుండును ?

గు॥ ఆనందములు అష్టవిధములు.

1. బ్రహ్మానందము 2 వాసనానందము 3. విషయానందము 4. ముఖ్యానందము 5. ఆత్మానందము 6. అద్వయానందము 7. నిజానందము 8. విద్యానందము.

1. బ్రహ్మానందము సుషుప్తియందు స్వజాతీయ విజాతీయ స్వగత భేద రహితముగా జ్ఞానము వెలుగుచుండుట బ్రహ్మానంద మనబడును.

2. నిద్రగడనిన క్షణమే వృత్తి తోచుట వాసనానంద మనంబడును.

3. స్రక్చందనా భరణ వసన వనితాది భోగములచే గలిగిన సుఖము విషయానంద మనబడును.

4. ద్రవ్యాది సమస్త వస్తువులు లభించినప్పుడు తొలగినప్పుడు సుఖ దుఃఖములు లేక యుండుట ముఖ్యానంద మనబడును.

5. వనితాది విషయాభిలాషయందు తోచు ప్రవృత్తులే ఆత్మానంద మన బడును.

6. ఆ బ్రహ్మము సత్యము నామరూపాత్మక ప్రపంచము అసత్యమని తోచుట అద్వయానంద మనంబడును.

7. ఆ యోగాభ్యాసముచేత మనోలయమగుట నిజానంద మనంబడును.

8. తత్వమస్యాది వాక్యార్థ విచారణ జనిత పరోక్షజ్ఞానము విద్యానంద మనంబడును.

వాసనానందము, విషయానందము ఆత్మానందము ఈ మూడు దక్క తక్కిన ఐదున్ను మోక్షప్రదంబని నిర్ణయము యున్నందున నవి భ్రాంతి జన్యం బులని యదార్థమును చెప్పినప్పటికి ఆ యానందానుభవంబులు నాకు లేకపోవు నని మనస్సునకు మరియొక విధముగా తోచవచ్చును. అట్టి నిష్ఠూరములు నాకెం దులకు ? నీవు చక్కగా విచారించిన పిదప నీకు అనుకూలమైన మార్గము ననుస రింపుమని నిర్ణయము.

(౧౭౭) హరికర నఖముఖ విదళిత । కరికుంభస్థల గళితమైన । ఘన మౌక్తిక ముల్ । దొరికిన నెరుకలు గురిజలె । దరియించెదరు రెంటి విలువా । తమరెరుగ కనెకా ॥ అట్లనెబోధ । క్రమమెరుగ కనెకా । పరిపూర్ణబోధాను నెరిగింపుచుండిన। యెరుకాకె । కొందరు మరిగేరీ మార్గాము । తమరెరుగ కనెకా । అట్లనెబోధ క్రమమెరుగ కనెకా ॥

ఓ, శిష్యుడా ! సింహము యొక్క గోళ్ళచే చీల్చబడిన ఏనుగు యొక్క కుంభస్థలము నుండి జారిపడిన ముత్యములు ఎరుకలకు దొరికినప్పటికిని వారు గురిగింజల పేరులనే ధయించెదరు. ఎందుకనగా రెంటి యొక్క విలువలు

వారికి తెలియవు అదే ప్రకారము అచలపరిపూర్ణ ప్రబోధ చెప్పినను వినక జనన మరణ రహిత పద్ధతి నరయజాలక భ్రాంతిజన్యములైన ఎరుక మార్గములయందే ప్రవర్తింతెదరు యని భావము.

(౧౭౮) ప్రొద్దున నిద్దుర మేల్కని । వద్దికి యేతెంచి గురుని । వక్త్ర జనితమౌ । సుద్దులు మ్రొక్కి వినుము యే । ప్రొద్దిది బహుముద్దు సుమ్మి । పుట్టీనందులకూ । గురుచరణాముా పట్టీనందులకూ । నిద్దామౌ భక్తీచే । నీవిట్లూ జేసీతె । దిద్ది తీరిచిబోధ తెరువూ జూపును నీవు । పుట్టీనందులకూ గురుచర ణాము పట్టీనందులకూ ॥

ఓ, శిష్యుడా ! నిద్రనుండి మేల్కని అంతఃకరణమున నెలకొనియున్న సద్గురుమూర్తి సన్నిధికేతెంచి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి ఓ, సద్గురుప్రభూ, నేను నీ ఆజ్ఞయందు ప్రవర్తించువాడను గావున నన్ను కరుణించి సర్వకాల సర్వావస్థలయందు అహంపదార్థ రహితస్థితి నాకు ప్రసాదింపుమని ప్రార్థించి శ్రీవారినుండి వెలువడెడి విషయములను వినుము. నీవు మానవజన్మ మెత్తి గురుపాదము పట్టినందుకు నీజన్మ సార్థకమగును. ఆత్మ అంగస్థానభావ శుశ్రూషలు ఎడతెగని భక్తితో నీవిట్లు చేయుచున్నచో నా సద్గురుమూర్తి కను గ్రహము కలిగి నీ కచలపరిపూర్ణ పరబాహ్యము ఎరిగించి నిన్నుదిద్ది తీర్చి నీవు జన్మరహితము పొందే మార్గము చూపునని భావము.

(౧౭౯) నామాట లెస్సవినుమూ । సామాన్యం బనుచ జూడ । జనదీ బోధన్ । ప్రేమాతిశయమునన్ గని । వేమారిది గురుని నోట । వినవలె సుమ్మీ నిత్యము చదువు । కొనవలె నమ్మీ । నామ రూప క్రియ నటనలు గలిగిన దేమి వస్తువౌ దాన్ని । యెటు నిల్వనివ్వదు । వినవలె సుమ్మీ । నిత్యము చదు వుకొనవలె నమ్మీ ॥

ఓ, శిష్యుడా ! నేను చెప్పిన అచలబోధను చక్కగా వినవలయును. అత్యంతప్రేమతో జూడవలయును. గాని సాధారణముగా జూడరాదు. ఈ బోధను పలుమారు సద్గురు ముఖముగా వినవలయును. శ్రద్ధతో ప్రతిదినము చదువుకొని అచలపరిపూర్ణ పరబయలు దర్శనభాగ్యమున నామరూప నటన - క్రియలుగల ఎరుక ఇహపరాదులయందు ఎచట నిలువక లేకపోవునని భావము.

(౧౮౦.) అన్నము దిన్నను ఆకలి । తిన్నగ నీరంబుద్రావ తృష్ణయు రోగం । చెన్నగ నౌషధసేవను । జన్మ క్రియన్ యెరుక నిల్వ జాలదో

యన్నా। యీబోధనీ। చెవులతో విన్నా। కన్నూలతో జూచి కడముట్ట జదివీన। నిన్నెన్నటికి యెదుట నిలచుండి కనుగొన। జాలదో యన్నా। యీబోధ చెవులతో విన్నా॥

ఓ, శిష్యుడా! అన్నము తినినను ఆకలియును నీరు త్రాగిన దప్పికయును ఔషధము సేవించిన రోగమును ఎటువలె దీరుచున్నవో అటువలెనే యీ అచల బోధను నీవు చెవులతో వినినయెడల ఎరుక లేకపోవును గనుక అచలపరిపూర్ణ పరబయలును కన్నులతో జూచి ఎరుక కడముట్టేవరకూ కర్తృత్వరహిత కర్మాచరణ యొనర్చినచో ఎరుక నీయెదుట నిలబడి నిన్నెన్నటికి చూడజాలదని భావము.

(౧౮౧.) జనన మరణ ప్రవాహము। సహమను యీబోధ పట్టుడని సాధువు లిచ్చిన। నొల్లకుండి వారలు। జనినపుడాబోధ మీద। జనియించి ప్రేమా। వెదకెద రట్టి। జనచేష్టలేమా। యనితోచి నీకు నేవిన జెప్పవలసె! నీవును యీబోధను వల్లనసకు దొరకదుమళ్ళీ జనియించి ప్రేమా॥ వెదకెదరట్టి జనచేష్టలేమా॥

ఓ శిష్యుడా! సద్గురు సార్వభౌములు అచల పరిపూర్ణబోధ మీ జనన మరణ రూపమగు సంసార ప్రవాహమును ఇనికింపజేయును. కావున దీనిని తెలుసుకొనుడని చెప్పినను వినక వారుపోయిన తరువాత నా అచల బోధమీద మనస్సుకలిగి ఆ యచల సద్గురు సార్వభౌములను వెదకెదరు. అటువంటి పామర జనుల యొక్క నడకలు ఏమనిజెప్పుదును ? నవి మానవజన్మ తరుణోపాయము నకు విరుద్ధములని నామనంబున నిర్ణయించి మీకు శక్తి ద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ అచలపరిపూర్ణ బోధను వినుమని చెప్పితిని. నీవును అచలబోధను వద్దనకుము. మరల దొరకదని తెలుసు కొనుమని భావము.

(౧౮౨) చక్కెర మెక్కక లోకులు। చక్కెర మాధుర్య మెరుగజాలరటు వలెన్। మక్కువతో వినిచదువక। చక్కగ గ్రంథార్థ మెరుగ జాలేర జనులు కావున నీవు చాలించిపనులూ। చొక్కామీ గ్రంథాము చూడూమి కొనవెళ్ళ। యిక్కాడితో జన్మా మెత్తావు సరి। తెలియ జాలేర జనులూ। కావున నీవు చాలించి పనులూ॥

ఓ, శిష్యుడా! మానవులు పంచదార తినక దాని తీపి ఎటువలె తెలుసు కొనలేరో అటువలెనే ఈ లోకులు ఈ దివ్యమైన శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ

నిర్గుణతత్వ నిర్మిత గ్రంధమును సద్గురునోట వినకను ప్రేమతో చదువకను దానియొక్క భావార్థమును తెలుసుకొనలేరు. గనుక నీవు ఇతర గ్రంథముల పరిశోధన కార్యములను విడిచిపెట్టి స్వచ్ఛమైన ఈ పరిపూర్ణ గ్రంథమును కడవరకు జూచినయెడల ఇంతటితో నీకు జననమరణ రహిత మగునని భావము.

(౧౮౩) గూఢార్థ మెరిగి సతతా। రూఢుండైనతడు గ్రంథ। రుచిగొనడు భువిన్! గాఢతర జ్ఞానంబున। మూఢుండై యున్నవాడు మొదటికె వినడూ॥ సుజనులపొడ ముదమొప్ప గనడూ। వాడు వీడనరాని వాడె గ్రంధమువినె వాడు నిశ్చయమిట్టి। వార్త లెరుగనివాడు। మొదటికె వినడూ! సుజనులపొడ ముదమొప్ప గనడూ॥

ఓ, శిష్యుడా! సద్గురు సార్వభౌమునివలన పరమరహస్యము తెలుసుకొని యారూఢుడై యున్న వానికి ఆచరణ విధానమే కాని గ్రంథము యొక్క ప్రయోజనములేదు. అజ్ఞానమున యున్నవాడు మొదలేవినడు సద్గురువుల సాంగత్యము గూడా వానికిట్టదు, అయితే ఆరూఢత అజ్ఞానము లేని జిజ్ఞాసువే ఈ గ్రంథమును సద్గురువు వలన వినును. ప్రేమతోచదివి కర్తృత్వ రహిత కర్మాచరణ అలవరచుకొనునని భావము.

(౧౮౪) తాబేటి తలపుచేతను। తాబేల్పిల్లల క్షుధార్తి। తలగుట తెలియన్ తాబేటి గర్భమందున॥ తాబేలై పుట్టకున్న తరమా యితరులకూ। సద్గురుబోధ ట్లరయ నితరులకూ। యేబాధ లెరుగాని యీ బోధ గలవారి। చేబోధ బడయక చేకోన దలచితె తరమా యితరులకూ। సద్గురు బోధట్లరయ నితరులకూ॥

ఓ, శిష్యుడా! తాబేలు తన పిల్లల క్షుధతీరవలయునని మనంబున కోరగనే తన పిల్లలయొక్క ఆకలితీరును. అట్టివిషయమును తెలియుటకు తాబేలు కడుపుయందు తాబేలై పుట్టవలయును. ఇతరోపాధులకు వశముగాదు. అటువలెనే సద్గురు పుత్రులకు సద్గురు ప్రబోధ ప్రభావము తెలియును. గాని ఇతరుల కెంత మాత్రము తెలియదు. జననమరణ బాధలు లేని సద్గురులచే నీ పరిపూర్ణ ప్రబోధను బడయజాలక ఎరుక భ్రాంతిగల వారిచే బోధను పొందిన వారికి జననమరణ బాధ తొలగదని భావము.

(౧౮౫) ఈతాపేక్షను మనుజులు। నూతిదరిం జేరినిల్చి నోట గొలిగినన్ యీ తేలవచ్చువారికి। చేతులతో నీళ్ళమీవ చేరీ యీవకనూ మును నేర్చిన। వారీదించకనూ। యీ రీతిగనె దేశికేంద్రుడు దెల్పాక। చాతుర్యమునబోధ సాధించనయ్యాన॥ చేరీయీదకనూ। మును నేర్చిన। వారీదించకనూ॥

ఓ, శిష్యుడా ! నీటి గండము తప్పించుకోవలయునని ఇచ్ఛగల మానవులు బావి యొద్దకుగాని చెరువు వొద్దకుగాని వెళ్ళి యొడ్డున నిలబడి నీట ఈతగొట్టే వారెని చూచి నోటితో వారి మచ్చట్లు చెప్పకొనుచున్నచో వారికీత ఎట్లువచ్చును? పూర్వమే ఈతనేర్చినవారి సహాయముతో నీళ్ళలోదిగి నీళ్ళపైన చేతులతో నీది నచో నీత నేర్చుకొనవచ్చును. అన్యవిధముగా రానేరదు గాని బావియందు ఈత నేర్చినవారు చెరువుయొక్క ఎడుములోతు చూచి అందు ఈదుటకు భీతిచెందు చుండును. బావినందు చెరువునందు ఈత నేర్చినవాడు నదిప్రవాహమును చూచి అందు ఈదుటకు భీతిచెందును బావి చెరువు నది ప్రవాహమునందు ఈతనేర్చిన వాడు సముద్ర అలలుచూచి అందు ఈదుటకు భీతిజెందును. బావి చెరువు నది ప్రవాహము సముద్రను నందు ఈతనేర్చినవాడే జలగండము తొలగినదని ఆరూ ఢత పొందవలయును గాని బావి చెరువు నది ప్రవాహమునందు ఈతనేర్చుకొని నీటిగండము తొలిగినదనే నిశ్చయము మోసమగును. అట్లే శక్తిద్వయ నిరాస కంబైన శుద్ధనిర్గుణతత్వ అచల పరిపూర్ణ ప్రబోధ నెరుంగ దలచిన వారా భావము నెరింగిన సద్గురు సార్వభౌముల నాశ్రయించి వారివలన నెరుంగదగును గాని ఎరుక నిర్మిత భ్రాంతిజన్మ గ్రంథములు చాతుర్యముతో పరిపూర్ణ బోధయని బోధించినంత మాత్రమున జన్మరహితము కాబోదు అది వారికి మోసమే యగు నని భావము.

(౧౮౬) ప్రవిమల చిత్తుడు శిష్యుడు । సవినయముగా దేశికునకు శరణా గతుడై । త్రివిధ ప్రసాదములనుగొని భవనాశ స్థితులులేని పద్ధతి వినినన్ । తిరిగిరాని పద్ధతి గనినన్ । భువిలో వానిసాటి బోల్ప నెవ్వరు లేరు అవిరాళ భక్తి నీ వారీతి నుండెడి పద్ధతి వినినన్ । తిరిగిరానిపద్ధతి గనినన్ ॥

ఓ, శిష్యుడా ! నిర్మలచిత్తముగల శిష్యుడు సవినయముగా సద్గురు సార్వ భౌముని శరణుపొంది వారు ప్రసాదించిన త్రివిధ ప్రసాదములను భవ నాశస్థితులు లేనిపద్ధతిని గ్రహించి (పుట్టుట, చచ్చుట, తిరిగిపుట్టుట లేని పద్ధతిని) విని తిరిగి జననమునకు రాని మార్గము నెరింగిన వానితో సమానము ఈభూమియందెవ్వరును లేరుగనుక నీవు పూర్ణమగు భక్తితో ఈ ప్రకారము తెలిసియుండుము యని భావము.

శి॥ త్రివిధ ప్రసాదము లనగా ఏవి?

గు॥ భవనాశస్థితులు లేనిపద్ధతి తెలియుట కొరకు శిష్యుడు శరణుజొచ్చి యున్నాడు గనుక పుట్టుక లేకపోవుటకు పరిపూర్ణ దర్శనమున మరణము లేక

పోవుటకు ఎరుక నిర్ణయమును తిరిగి పుట్టుక లేకపోవుటకు ఎరుక విడిచేవిధానము కనుక పరిపూర్ణ దర్శనము ఎరుక నిర్ణయము ఎరుకను విడిచేవిధానము త్రివిధ ప్రసాదములని నిర్ణయము. ఈ త్రివిధ ప్రసాదములు సద్గురువువలన తెలుసుకొని పుట్టుచావులు లేని పద్ధతి వినవలయును.

శి॥ తిరిగి జన్మమునకురాని పద్ధతి తెలియడము ఎట్లు?

గు॥ కర్మమునబుట్టు జంతువు అను న్యాయమున తిరిగి జన్మకలుగుటకు కర్మనే కారణము గనుక పరిపూర్ణ పరబయలును ఎరుకను సద్గురు కరుణచే తెలిసి కర్మసన్యాసము కర్మఫలత్యాగముగా కాక కర్తృత్వ రహిత కర్మాచరణగా కర్మ యొనర్చినవో తిరిగి జన్మకురాని పద్ధతి తనకు తెలియ గలదు. అనగా ఎరుక లేక సేవించదగునని నిర్ణయము.

శి॥ పరిపూర్ణబోధ పద్ధతి నెరింగిన వానితో సమానులీ భూమియందెవ్వరును ఎందుకు లేరు?

గు॥ బ్రహ్మ విష్ణు ఈశ్వరులగు త్రిమూర్తులు తమ యోగబలముచే సత్య లోక కైలాస వైకుంఠములవరకు వెళ్ళిరి. సనకసనందనాదులు జ్ఞానపద్ధతితో అధిష్ఠాన చైతన్య బ్రహ్మమగు ఎరుక మూలము వరకు వెళ్ళి అచ్చట ఆగిరి. సద్గురుకరుణవల్ల అచల పరిపూర్ణ పరబయలును దర్శించిన స్వచ్ఛందులు జన్మ రహిత పద్ధతిగా లేకపోదురు గనుక వీరితో సమానులు వీరేగాని ఇతరులు కాబో రని నిర్ణయము.

(౧౮౫.) ఉపనయనముగానిదె తా । నుపనయనము మీది చదువు । నూహను గొనినన్ । విపరీత మగును దానను చపలుడు బ్రాహ్మణుడు గాడు । వర్జించి చూడా । శూద్రుడు వాని యర్చించరేడా । ఉపమూవే బోధట్ల ఊహించినిక్కోటి కపటావిత్తుడు సాధుగణముతో సమమౌనె॥ వర్జించిమూడా । శూద్రుడు వాన్ని యర్చించరేడా॥

ఓ, శిష్యుడా ! ఒడుగు అయిన తదుపరి చదువదగిన వేదము, వడుగు కానివాడు తన ఊహచేత వేదము చదివినా అది విపరీతమగును. అట్టి చపల చిత్తుని వర్జించిమూడగా బ్రాహ్మణుడు కాడు శూద్రుడేయగును. అందువల్ల లోక ములో నెవ్వరు నతనిని గౌరవించి పూజింపరు అట్లె సద్గురునాశ్రయించి అచల పరిపూర్ణ పరబయలును ఎరుకను వస్తునిశ్చయముగా తెలుసుకొని ఎరుకను విడిచే విధానము తెలియక ఆ పారంపరులు వ్రాసిన గ్రంథమును చదివి వానికి కొన్ని

యుక్తులనుచేర్చి సాంప్రదాయకము మార్చి మాకును పరిపూర్ణబోధ తెలియునని లోకులను నమ్మించి బోధించెదరు. అట్టి కపటచిత్తుడు సద్గురు సార్వభౌమునితో సమానము కాజాలడని భావము.

(౧౮౮) మంత్రముచే సంతెట్లగు । తంత్రము లేకున్న కాదు । తంత్రము చేతన్ । మంత్రము లేకను వడుగిల । మంత్రము తంత్రంబు రెండు । మరి గూడుకోనీ । కార్యములన్ని జరిగించు పూనీ । మంత్రతంత్రములాలో మర్మాము గురుడెరుగు । మంత్ర తంత్రములాలో మరుగెరుగు గురునీచే । మరిగూడు కోనీ । కార్యములన్ని జరిగించుపూనీ ॥

ఓ, శిష్యుడా ! తంత్రము లేక మంత్రము చేతను, మంత్రము లేక తంత్రము చేతను కులమువాడని మరియు పుత్ర పౌత్ర పారంపర్యుడని చెప్ప బడడు. మంత్రమును తంత్రమును, నొక్కటిగా చేరుటచే కులమువాడని మరియు పుత్ర పౌత్ర పారంపర్యుడని చెప్పబడును. ఎట్లనగా లోకములో ఉపనయవ మునకు మంత్రమును తంత్రమును ఈ రెండు చేరియే పనులు జరుగుచుండును. ఈ మంత్ర తంత్రములయొక్క రహస్యము సద్గురునికి తెలుసు గనుక మంత్ర తంత్రముల రహస్యము సద్గురునిచే తెలుసుకొని పనులు నడిపించిన ఉభయు లకు ఫలము గలుగునని భావము

శి॥ సంతు అనగానేమి ? మంత్ర తంత్రములనగా నెటువంటివి ?

గు॥ పుత్ర పౌత్ర పారంపర్యుని మరియు కులమువాన్ని సంతు యని చెప్పబడును బ్రాహ్మణ వర్గమునందలి నిర్ణయమేమనగా భార్యాభర్తలు బ్రాహ్మణు లుగా యున్నను వారు కనిన సంతానమునకు వడుగు చేయనిది బంతిలో భోజనము పెట్టరు. ఎందుకనగా పూర్వజన్మమునందు ఏ కులముయందు వున్న వాడో కర్మవశాత్తు మన గర్భమునందు జన్మించినాడు గనుక ఉపనయనాది కర్మలచే శుద్ధిచేసి తమ సంతుగా చేసికొనెదరు. ఉపనయనాది సంస్కారము లేనపుడు తమ సంతు యనబడడు. ఉపనయనాది సంస్కారమునకు మంత్రము యుండవలయును. ఇహపరరూప ఉభయార్థ సాధకమైన ఉపాయమగు తంత్రము (యజ్ఞోపవీతము) యుండవలయును. ఈ రెంటిలో యొకటి యుండి యొకటి లేకపోయిన వంశీకుడని చెప్పుటకు వీలులేదు కనుక గాయిత్రీ మంత్రమును యజ్ఞోపవీతమగు తంత్రమును రెండు యున్నవారే ఇహపరాది సకల కార్యములు జరుపుదురు. అయినా గాయిత్రీ మంత్రము యందలి రహస్యమును యజ్ఞోప

పీతము నందలి తంత్రముయొక్క రహస్యము సద్గురుమూర్తి వలన తెలుసుకొని ఇహపరాది కార్యములు జపించిన అవి ఫలవంతములగును. వాటి రహస్యము తెలియక గాయిత్రీ మంత్రమును యజ్ఞోపవీతమగు తంత్రమును ధరించి ఏ కార్యము జరిపించినను నిష్ఫలములే యగునని నిర్ణయము

(౧౮౯) సకల జనుల సమ్మతిగా । నొకరైనను నడువలేరు. నుర్వీ స్థలిపై । మకరాంక జనని జనకా । ద్యకళంకులలోను నేనీ వననేమి గణనా । బోధందితర । జనులేమి గణనా । వికలా మానసుడవై వెతనొంద బోకు నీవ కుటిల భక్తుడవని । తెల్పితీ బోధ । నననేమి గణనా । బోధం దితరజను లేమి గణనా ॥

ఓ, శిష్యుడా ! ఈ భూమియందు సర్వజనులకు సమ్మతముగా మన్మధుని తల్లిదండ్రులైన లక్ష్మీనారాయణులు మొదలైనట్టి ఇంద్రాది దేవతలుగాని మరి ఎవ్వరైనగాని నడువజాలరు. ఇక నేను నీవు సకల జనుల సమ్మతముగా నడువ గలమా ? అదేవిధముగా నీ అచల పరిపూర్ణ బోధను సర్వజన్మ పుణ్య విశేషము గలవారు మెచ్చెదరు. ఇతరులు మెచ్చరు గనుక నీవు వారి మాటలను విని చంచల మనస్సు గలవాడవై సంకటములు పడకుము. నీవు కపటములేని భక్తుడవని నీకీ శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ పరిపూర్ణ బోధను తెలిపితినని భావము.

(౧౯౦) బలధన విద్యలు దుష్టుల కిలగలిగిన నొరుల నొంతురీర్ష్యము నన్ । బలధన విద్యలు శిష్టుల కిలగలిగిన నొరుల బ్రోతు । రెంతో మోదమునా । నీవీరెంటి నెరిగి మోదమునా । కలలోననైన దుష్టుల చెంత జేరకు మెఱమి శిష్టుల చెంత కలనైన వదలాకు యెంతో మోదమునా । నీవీ రెంటి నెరిగి మోదమునా ।

ఓ, శిష్యుడా ! ఈ భూమియందు దుర్మార్గులకు బలమును ధనమును విద్యయును గలిగినయెడల అసూయతచేత ఇతర మానవులకు అపకారము చేయు దురు. సన్మార్గులకు బలమును, ధనమును, విద్యను కలిగినయెడల సంతోష ముగ పరులకు ఉపకారము చేయుదురు. గనుక నీవిరువురి లక్షణములు తెలుసు కొని స్వప్నమునందైనను దుర్మార్గుల సాంగత్యము చేయకుము సన్మార్గుల సాంగత్యము విడువకుమని భావము.

(౧౯౧.) అందమగు స్వాతివర్ష పు । బిందువు లెటెటు బడునా పృథివిని త । ద్బిందువు లుపాధివశమున । జెందును తగు నామరూప చేష్టా

దికమునూ । అట్లనె నీవు । జెందే విన్నియనూ ॥ మందితో జతగూడి మాట్లాడి నంతలో । అందుకె సహవాస మరయాము తగుదాన్ని చేస్తాదికమునూ । అట్లనె నీవు 'జెందె విన్నియనూ ॥

ఓ, శిష్యుడా ! స్వాతి వర్ష మునందు కురిసిన వాన బిందువులు ఈ భూమి యం దెక్కడెక్కడ బడునో ఆయాస్థల మహాత్మ్యముచే యా బిందువులు నామ రూపములు జెందుచున్నవి. అదే ప్రకారము నీవు అనేక జన్మంబులు బొందు దువు అది యెట్టులనగా శ్రుతి ॥ సావాసదోషే గుణాభవంతు ॥ యను న్యాయ మున దుష్టులతో మాట్లాడి వారి సావాసము చేసినంతలో దుష్టుడవగుదువు. శిష్టులచే సావాసము చేసిన శిష్టుడవగుదువు గనుక మంచి చెడ్డలు విచారించి తెలుసుకొని సహవాసము చేయుమని భావము.

(౧౯౨) జారులకు లోకులందరు । జారులవలె తోచబడుట సహజ గుణంబౌ । చోరులకు సకల జనములు । చోరులని మదికి । దోచయునికి సహజమురా । అట్లనె । దుష్టాత్మునికి సహజమురా । సారములేని సం । సారాబ్ధి దాటించు వారిని తమవంటి వారిగ గనుటట్టి । వునికి సహజమురా । అట్లనె దుష్టాత్మునికి సహజమురా ॥

ఓ, శిష్యుడా ! వ్యభిచారులకు లోకమందు అందరు వ్యభిచారులుగనే తోచుచుందురు. ఇది వారి సహజ గుణము. దొంగలకు మానవులందరు దొంగలు గనే తోచుచుండును. ఇది వీరి సహజ గుణము. ఇదే ప్రకారము దుర్మార్గులకు ప్రపంచములోని జనులందరు దుర్మార్గులుగనే తోచుచుందురు. ఇది వారి స్వభావము. అట్లే అంతము లేని సంసార సముద్రమును దాటించు సద్గురు సార్వభౌముని పామర జనులు జూచి తమవంటి వారుగానే తలంచుదురు. ఇది వారి సహజ లక్షణమని భావము.

(౧౯౩) గురుడు నరుడనుచు దలచిన గురుమంత్రము మరచియున్న గురుపుత్రుల నా । దరణ మొనర్చక యుండిన । గురువును విడనాడి రెండో । గురుని జేరిననూ । సద్గురుబోధ । నెరిగీ దూరిననూ । యెరుక మహాత్మ్యము యెరిగీన యిటువంటి । నరునాకు దప్పాదు నరకాము నిజమింకో । గురుని జేరిననూ । సద్గురుబోధ నెరిగి దూరిననూ ॥

ఓ, శిష్యుడా ! సద్గురుని మానవునిగా తలంచినను సద్గురు మంత్రము మరచి యుండినను సద్గురు సాంప్రదాయము విడచి మత గురువులను ఆశ్ర

యించి ఎరుక ప్రభావము తెలిసి సద్గురుబోధను దూషించినను ఇటువంటి వారికి నరకము తప్పక లభించునని భావము.

(౧౬౪.) మలయాద్రి చెంత చెంచుల । కిల చందన । భూరుహములె యింధనమట మి । క్కిలి గలుగబట్టి యట్లనె । చులుకన సుమి యింటగలుగు । సూరి భూషణుడూ । బహు మాన్యుడూ : దూరస్తుడెపుడూ । తెలియాని వారికి తెలిసేది కఠినాము తెలిపీచె దెలిసీతె । తెలియా జేసును బోధ । సూరిభూష ణుడూ । బహూమాన్యుడూ దూరస్తుడెపుడూ॥

ఓ, శిష్యుడా ! మలయ పర్వతమువద్ద నివసించెడి చెంచులకు అచట గంధము చెట్లు అధికముగా వుండుటచేత వాటిని వారలు వంటచెరకులుగా వాడెదరు. అటువలెనే సూరిజనులచేత పూజింపదగు సద్గురుడు గృహమునందు గృహస్థుడుగా యుండినయెడల అలక్ష్యముగా చూచెదరు. కాషాయ వస్త్రములు ధరించి సన్యాసిగాయుండి దూరమునుండి వచ్చిన వానిని మిక్కిలి మన్ననతో జూతురు గనుక సద్గురు సార్వభౌములను తెలియని వారికి తెలిసేది కఠినము. వారినడి నుడిభావనజూచి తెలివిచే తెలుసుకుంటే జనన మరణ భ్రాంతిరహిత పరిపూర్ణ ప్రబోధ తెలియజేయు ని భావము.

(౧౬౫) చూచిమది దెలిసి శిష్యుని । యాశయమును తగినబోధ । నతనికి దెలియన్ । జేటి ముదమంద జేసెటి । దేశికుడే ముఖ్యుడనుచూ । తెలుసుకోవోయీ । కనియతగాణ్ణి । కలుసుకోవోయీ । చేసేను దయతో నీయాశ నంపూర్తిట్లు । వ్రాసైతె వేసుకో చూచేవు తార్కాణ తెలుసుకోవోయీ । కని యతగాణ్ణి । కలుసుకోవోయీ ॥

ఓ, శిష్యుడా ! తన యొద్దకు వచ్చిన శిష్యుని మనస్సును తెలుసుకొని శిష్యుని అభిప్రాయమునకు తగినబోధ నతనికెరిగించి సంతోషము కలుగు నటులజేసెడి సద్గురుడే శ్రేష్టుడు, కావున అటువంటి సద్గురుని విచారించి తెలుసుకొని సేవింపుము. అట్లు నీవు చేసినయెడల ఆ సద్గురుడు దయతో నీ కోరికను నెరవేర్చును. గనుకనే చెప్పిన ఈ విషయము హృదయఫలక మందు వ్రాసి యుంచుము. తర్వాత దాని నిదర్శనము చూచెదవని భావము.

శి॥ కర్మభక్తిజ్ఞాన యోగపద్ధతులయందు ప్రీతిగల భక్తులకు పరిపూర్ణ ప్రబోధ యెట్లు చేయవలయును ?

గు॥ కర్మయందు ప్రీతిగల వారలకు కర్మపద్ధతి యందే పరిపూర్ణ ప్రబోధ బోధించవలయును. భక్తియందు ప్రీతిగలవారికి భక్తిపద్ధతియందే

పరిపూర్ణప్రబోధ బోధించవలయును అదేపద్ధతిగా వారివారి ఆశయమునననుసరించి పరిపూర్ణప్రబోధ జేయునట్టి గురువులే సద్గురు సార్వభౌములని నిర్ణయము.

(౧౯౬). తన భార్య రూపురేఖలు । తన పుత్రుల సద్గుణములు తన సంపదయన్ । తన పెరటి మందుచెట్లులు । తన గ్రామపు సాధుజనములు తనకు మెప్పైనా యీ యిలలో యెం । తటి వారికైన । వినలేదె నీ వాహల్యను జూచి మోహించె । ఘనవాహనుండు చక్కని భార్యగలిగిగుండ । తనకు మెప్పైనా యీ యిలలో యెం । తటి వారికైనా ॥

ఓ, శిష్యుడా ! తనభార్య చక్కదనమును తనకుమారుని మంచితనమును తన ఐశ్వర్యమును తన పెరడుయందున్న మందుచెట్టును తన గ్రామముయందు యుండు సాధుజనులును ఈ భూమియందు ఎవ్వరికిని మెప్పుగా వుండవు. ఎందు కనగా వినుము ఐరావతము అను తెల్లటి ఏనుగు ఎక్కి ఇంద్రుడు శచీదేవియను అతిసుందరవతి భార్యయుండగా గౌతమఋషి భార్యయగు అహల్యను మోహించి యున్నాడని భావము.

(౧౯౭) విననేర్చి చెప్పనేర్చిన । మనుజులకే దీనిలోని మర్మముదెలసున్ వినజెప్ప నేరకుండిన । మనుజులు యీ బోధలోని । మర్మామెరిగేరా । దీనం దుండే । ధర్మామెరిగేరా । జనులె కొబ్బరికాయ తిననేర్చుగలవారు । తిననేర్చునా కోతి । తనకా కాయచ్చిన మర్మామెరిగేరా । దీనందుండె । ధర్మమెరిగేరా ॥

ఓ, శిష్యుడా ! సద్గురువువలన శక్తిద్వయ నిరాసకంబైన అచలపరిపూర్ణ ప్రబోధ విననేర్చిన అధికారులకు చెప్పనేర్చిన సాధువులకు ఈ బోధలో యుండే ధర్మమర్మములు తెలుసును. సద్గురుమూర్తిచే పరిపూర్ణబోధ వినక ఇతరులకు చెప్పనేరని పామరులకు ఈ బోధలోయుండే మర్మధర్మములు తెలియజాలవు. ఎట్టులనగా మనుష్యుడే టెంకాయ పగలుకొట్టుకొని తిననేర్చుగలవాడు కాని కోతికి టెంకాయ లభించినయెడల పగులగొట్టి తిననేరదని భావము.

శి॥ విననేర్పు యనగానేమి ! చెప్పనేర్పు అనగా ఎటువంటిది?

గు॥ శ్రోత్రము శబ్దము వినును. త్వక్కు స్పర్శ తెలియును. చక్షువు రూపము తెలియును. జిహ్వ రసము తెలియును. ఘ్రాణము గంధము తెలియును. వీటికి ఆశ్రయము సంకల్పరూపమగు మనస్సు నిశ్చయపద్ధతిగల బుద్ధి మరియు జ్ఞానము ఎరుక రూప పరిణామము. లే గనుక ఎరుక రహిత పద్ధతియందుశక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ అచలపరిపూర్ణ ప్రబోధ విననేర్పు శిష్యునికి యుండ

వలయును. స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ శరీరములు లేక కైవల్య శరీర పద్ధతిగా క్షరాక్షర స్పర్శలులేక పురుషోత్తమ నిర్ణయ నేర్పుగలిగి సద్గురు సార్వభౌముడు అచలపరిపూర్ణ ప్రబోధ బోధింపవలయును ఈ పద్ధతివిని చెప్పనేర్పుగలవారికే ఈబోధ వాని ధర్మమర్మములు తెలియును. జనన మరణములు అవలీలగా తొలగును. ఈపద్ధతి తెలియక పరిపూర్ణబోధ విన్నను ఇతరులకు చెప్పినను కోతికి కొబ్బరికాయ దొరికినపద్ధతి యగునని నిర్ణయము.

(౧౯౮) నేనెంత లెస్స జదివిన । దీనిని దెలియంగ గలరెదేశికవర్యున్ । పూని సేవించకుండిన । మానవులది యెట్లనన్నా మరివినవోయి । నామాటందు । మనసుంచవోయీ । వా. కాలములోని వర్షాము వొకబిందు। వైనమిట్టును నిల్వ । దది నిశ్చయమెకద । మరివినవోయి । నామాటందు మనసుంచవోయీ ॥

ఓ, శిష్యుడా ! సద్గురు నాజ్ఞానుసారము త్రికరణశుద్ధిగా ప్రవర్తించని పామరజనమందు నేను ఎంతచక్కగా ఈ అచలబోధను చదివినా వారలు దీనిని ఎరుగజాలరు అది ఎట్లనగా నేనుచెప్పిన దృష్టాంతము వినుము. నిజము విచారించి చూచినచో వర్షకాలములోని వర్షబిందువులు మిట్టపైన ఒక బొట్టైనా నిలువని విధానము యని భావము.

(౧౯౯) రతికొరకు గాదెసతిపతి । కతిహితియుగ సేవజేయు నటువలె బోధ । స్థితినీకు కుదురుటకు । సమ్మతితో గురుసేవ జేయుమా । నీతివంతా । అభిమానాము । పోని నీచంతా । అతనీకి దయవస్తె అగనిమిషమున బోధ । స్థితి నీకు కుదిరించు సిగ్గు । విడచి కొల్వుమా । నీతివంతా । అభిమానాము పోని నీచంతా ॥

మిక్కిలి నీతిగల ఓ, శిష్యుడా ! సంభోగము కొరకు ఆశించి భార్య భర్తకు మిక్కిలి ప్రేమతో కూడుకున్న మనస్సుతో పరిచర్య చేయును. అదే పద్ధతిగా నీవును అచలపరిపూర్ణబోధ స్థితికుదురుట కొరకు సద్గురుమూర్తికి శుశ్రూషలు చేయుము. నీకుగల సందేహములన్ని విడచిపెట్టుము. ఆ సద్గురుమూర్తికి కరుణ కలిగిన యెడల అరనిమిషము లోపల పరిపూర్ణ స్థితిని కలిగించ గలడు గనుక నీ మనో సంకోచములు విడిచి చతుర్విధ శుశ్రూషలు యొనర్చుమనిభావము.

శ్రీ భార్యభర్తతో రతికోరడం ఎందుకు ?

గు॥ అగ్నిసాక్షిగా వివాహమాడిన భర్తతో రతిసలిపి సంతానము కనిన స్త్రీవంశాభివృద్ధి యొనర్చిన మాతృదేవియగును. గృహలక్ష్మియని కీర్తింపఁబడును. గనుక రతికొరకు భార్య భర్తకు ప్రేమతో సేవజేయును.

శి॥ పరిపూర్ణస్థితి కుదురుటకొరకు సచ్ఛిష్యుడు సద్గురునకు చతుర్విధ శుశ్రూషలు వేట్లు యొనర్చవలయును ?

గు॥ త్రికరణశుద్ధి ఆచరణ ఆత్మ అంగస్థానభావ శుశ్రూషవల్ల గురుమూర్తికి దయకలిగి పరిపూర్ణబోధస్థితి కలిగించగలడు. అందువల్ల శిష్యునికి ప్రపంచమునకీర్తి పారమార్థమున జననమరణ రహితపద్ధతి కలుగును. గనుక సచ్ఛిష్యుడు సద్గురుమూర్తి నిర్ణయానుసారము చతుర్విధ శుశ్రూషలు త్రికరణశుద్ధి ప్రవర్తన సంతోషముతో యొనర్చవలయును.

(౧౦౦.) పెత్తనమున యేనుంగిల । చెత్తన దినవలసె చీమ చిన్నతనము నన్ । హత్తుకొని తినును చక్కెర । యిత్తరి యారెంట్లో నీకు । యిష్టమేదైతె । చేకొనుమదె । స్పష్టాపిు దైతే । పెత్తనమున చేటెపెంపొందు చుండూను । విత్తాములో దెలియ । చిన్నతనమె మేలు । యిష్టమేదైతే । చేకొనుమిదె । స్పష్టమిదైతే ॥

ఓ, శిష్యుడా ! ఈ భూమియందు పెద్దదనిపించుకొను ఏనుగు చెత్త తిను చుండును. చిన్నదను చీమ చక్కెర తినుచుండును ఈ రెంటిలో నీకేదియిష్టమో అది స్పష్టముగా నిర్ణయించుకొనుము. విచారించగా పెద్దతనముచేత కీడు అధికమగును. చిన్నతనముచేత మేలుకలుగు చుండునని భావము.

శి॥ పెద్దతనమున కీడు అధికమగుట ఎట్లు చిన్నతనమున మేలుకలుగుట ఎట్లు ?

గు॥ దుర్యోధనుడు పెద్దతనమున పాండవులను అజ్ఞాతవాసము పంపి తాను వంశముతో నశించినాడు. శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు రథసారథ్యము చేసి జగత్పూజ్యుడైనాడు. గనుక పెద్దతనమునచేటు పెంపగును చిన్నతనమున పూజనీయు లగుదురని నిర్ణయము.

(౧౦౧) ఇవి వినుమనిసను సుజనులు । చెవియొగ్గిద రివియు స్పష్టజేసి కృతికిబల్ । చవిబుట్టింతు రదెట్లన । శివుడు కళానిధిని చక్క । జేసెనలేదా । నీమదిశంకా । వాసేనలేదా । అవనిలో శ్రీరాముడవగుణినాహల్య । నెవరేమియన । కుండ । పవరించి సుగుణిగ జేసేన లేదా । నీమది శంకా । బాసేనలేదా ॥

ఓ, శిష్యుడా ! ఈ గ్రంథమును వినుమని జెప్పినాను సజ్జనులగువారు దీనిని శ్రద్ధగావిని కృతినిర్మాణము చక్కగా మెరుగులుదిద్ది రసవంతముగా జేసెదరు. ఎట్లనగా శివుడు చంద్రుని తనశిరమున ధరించి దోషములను హరించి చక్కదిద్దినట్లును ఇదిగాక శ్రీరామచంద్రుడు రాతిగాపడియున్న అహల్యను చక్కజేసి సుగుణములుగల దానిని జేసినట్లుయని తెలుసుకోమని భావము.

(౨౦౨) పుట్టింట బిడ్డ బహుగా । దిట్టయుండినను యెవరు । దిట్టరు భువిలో । పుట్టింటివారుకోడలు । దిట్టైనను **అత్త**వారు । దిట్టేరుసుమ్మీ। **చేతుల** కొద్ది । కొట్టేరు సుమ్మీ। అట్టుంబలెనె బహు దిట్టైన శిష్యుని **తిట్టారు గురుమూర్తి** పట్టి వారుజూస్తె తిట్టేరు సుమ్మీ । చేతులకొద్ది । కొట్టేరు సుమ్మీ ॥

ఓ, శిష్యుడా ! పుట్టింటియందుయుండు నట్టియాడు బిడ్డ సామర్ధ్యముగా ప్రవర్తించినను ఎవ్వరు తిట్టరు, కొట్టరు, కోడలుగా యున్నది, సామర్ధ్యముగా ప్రవర్తించినచో అత్తవారు నోటితో తిట్టెదరు. చేతితో కొట్టెదరు. అట్లే సామర్ధ్యము గల శిష్యుని సద్గురుమూర్తి తిట్టడు. ఇతర మానవులు చూచి నోటితో తిట్టెదరు చేతులతో కొట్టెదరుయని భావము.

శి॥ సామర్థ్యముతో ప్రవర్తించు ఆడబిడ్డను పుట్టింటివారు తిట్టికొట్టక పోవడము అత్తవారు తిట్టి కొట్టడమునకు కారణమేమైయుండును ?

గు॥ ఆడుబిడ్డ యుక్తవయసు రావడముతోటే ఆమెను తగువైన **వరు**నకు ఇచ్చి కన్యాధారము పోసి తల్లి దండ్రులు ఆమెపైన గల తమ **కర్తృత్వము** వదులుకొంటుయున్నారు. అప్పట్లో ఆ బిడ్డ అత్తగారే తల్లి మామగారే తండ్రి. భర్తనే దైవమని నిర్ణయించుకొని ప్రవర్తించిన యెడల అది పుట్టిల్లేయగును. **అత్త**గారిఇల్లు యనునది యుండదు అందువల్ల తనను తిట్టేవారు కొట్టేవారు యుండరు. పుట్టిల్లుగా యెనర్చుకోలేక నేను వచ్చినది అత్తవారిల్లు నేను పుట్టిన తల్లిగారిల్లు వేరుగా యున్నదని భేదభావము ప్రవర్తించిన తిట్టేవారు కొట్టేవారు యుందురు. అదే పద్ధతిగా శిష్యుడు వసుధైకకుటుంబముగా బ్రహ్మాండమే తన గృహముగా మానవ లోకకల్యాణప్రదమైన మానవ సౌభ్రాతృత్వము, అన్యోన్య సహకారము ఐహికా ముష్మిక పురోభివృద్ధిగా ప్రవర్తించిన తిట్టేవారు కొట్టేవారు యుండరు. వ్యష్టిపద్ధతిగా స్వార్థముతో ప్రవర్తించిన శిష్యుని లోకులందరు తిట్టెదరు. చేతుల కొద్ది కొట్టెదరని నిర్ణయము.

(౨౦౩) అందముగ ఘనులు మెచ్చెద ! రెందుకు మెచ్చెదరు దీన్ని యితర జనంబుల్ ! చందురు డుదయం బందిన ! సింధువు చెలరేగినట్లు చెల గూనె చెర్లూ ॥ కోనేర్లు నూ ! తులు బావుచేర్లూ ! మందయానల [పొందు మగ వారె నుతిజేతు ॥ రెందూకు నుతిజేతూ రిలషంఢపురుషూలు ! చెలగూనె చెర్లూ! కోనేర్లూ నూ ! తులు బావులెర్లూ ॥

ఓ, శిష్యుడా ! ఈ గ్రంథమును సంతోషముతో గొప్పవారు మెచ్చెదరు గాని అల్పులు మెచ్చరు యెట్లనగా చంద్రోదయము కాగానే సముద్రముప్పొంగి నట్లు బావులు కోనేర్లు చెరువులు నదులు ఉప్పొంగవు. అట్లే స్త్రీలయొక్క కూడిక పురుషులు స్తుతియించెదరుకాని నపుంసకులు స్తుతి చేయరు యని భావము.

(౨౦౪) కాకంబులు సంపూర్ణ ! తటాకస్థ జలంబు లెట్లు తాగక తృషచే ! గై కొనునో కుంభజల మ ట్లే కలియుగమందు దుష్ట లింపు మీరగనూ! నిల్వరు బోధ ! కంపూ బారిననూ ! మీకు దీనికెలంకె మాకేల యిట్టి ! చీకాకు కొక్కోక మైతే గై కొందు మందూరు ! యింపు మీరగనూ! నిల్వరుబోధ!కంపుబారిననూ!

ఓ, శిష్యుడా! కాకులు దప్పి తీర్చుకొనుటకు పరిశుద్ధముగా నిండియున్న చెరువునీరును పానము చేయక కుండలో నిండియున్న మురికి నీరును యెట్లు పానము చేయునో అట్లు ఈ యుగమునందు వుండు పామరులగు దుష్టమానవు లీ పరిపూర్ణబోధ సంతోషముతో వినక నీ బోధస్పర్శ వినినను దూరముగా తొలగిపోవుదురు. యెందుకనగా ఈ మార్గము మీకు రుచించును కనుక దానికి మీకును సరిపోవును. అది మాకు పనికిరాదు. కొక్కోక శాస్త్రము వినిపించినను సంతోషముతో వినెదమని భావము.

(౨౦౫) కుచ్చితమతి యగు పురుషుని ! మెచ్చెర వినుమనుచు జదువ శిష్టు లవలె తా మిచ్చట పాటుగ వినడివి ! కుమ్మల కుళ్ళాయికుక్క ! కూన కెందు కురా ! పిడుదుకు దుగ్ధ ! పాన మెందుకురా ! హెచ్చైన ముత్యాలు పచ్చాల పతకాము ! గ్రుచ్చి పేరుగజేసి తెచ్చి వేశితెకోతి ! కూన కెందుకురా పిడుదుకు దుగ్ధపాన మెందుకురా ॥

ఓ శిష్యుడా ! దుష్టబుద్ధి గలవార్ని గ్రంథము వినుమని యతని ముందు చదివినవో కోరికతో శిష్యులవలె వినరు. ఎట్లనగా పిడుదుకు క్షీరపానము అవ సరము లేనట్లు కోతికి పచ్చలపతకము పొదిగిన ముత్యాలహారము వేసిన అది కొరికి పారవేసినట్లు కుక్క పిల్లకు కుమ్మల కుళ్ళాయి పెట్టినచో అది లాగి నోటితో చింపివేయునట్లేయని భావము.

(౨౦౬) అక్షయ బోధస్థితగల । లక్షణవేత్తలకు మెప్పులైన కృతులలో । కక్షకు తప్పులు కుమతి । పరీక్షింపుచునుండు నెన్నో । రీతూల వినుమీ । తద్భావమీ । రీతీదికనుమీ మక్షిక మెప్పుడు మాని సుగంధాదులీక్షించు వ్రణము ప్రత్యక్షమెకద । యెన్నోరీతుల వినుమీ । తద్భావమీ రీతీదిగనుమీ

ఓ, శిష్యుడా ! శాశ్వతమగు అచల పరిపూర్ణ స్థితిగల స్వచ్ఛందులు మెచ్చెదరు. కృతులలో దుష్టుడగువాడు పలుమారు తప్పులు వెదుకుచుండును. ఎటులనగా ఈగ పరిమళ ద్రవ్యములను విడచి చీము నెత్తురు యుండు వ్రణమును చూచే విధము యని భావము.

(౨౦౭) రమ్మని పిలువనిదే । పద్యమ్ములు । జదువంగ వచ్చి యతినిందించున్ । సమ్మతిగాక కుమతి విని । యిమ్మహి యది యెట్లనన్న । నిట్లానె వినుమీ వాని బుద్ధీ నట్లానె కనుమీ । బొమ్మలాటలో దిచ్చు బొమ్మతా నొకటి ఛీ । హొమ్మనియని నా హాస్యమ్మొనర్చెదెపోక నిట్లానె వినుమీ । వాని బుద్ధీ నట్లానె కనుమీ ॥

ఓ, శిష్యుడా! దయచేయుమని పిలువనిదే దుష్టుడగువాడు తనంతటతానే వచ్చి పద్యములు చదువునప్పుడు విని ఇష్టపడక చిక్కులిగా దూషించును ఎటులనగా ముందు చెప్పబోవు దృష్టాంత పద్ధతి వినుము. వాని బుద్ధి యట్టిదని తెలుసుకొనుము. బొమ్మలాటలయందు కేతిగాడను బొమ్మ తనంతటతానే వచ్చి హాస్య మొనర్చును. అందరు వానిని ఛీ కొట్టి తొలగి పొమ్మనిను తొలగిపోక కొంత హాస్యమొనర్చి తనంతట తానే పోవునని భావము.

(౨౦౮) వటియించిన చన్నులుగల । కుటిలాలకి నిందజేయు గుత్తపు రవికెన్ । యెటువలె తన తప్పెరుగక । నటువలె గ్రంధమును మెచ్చ । దతి దుర్జనుండూ । లేనిదెతప్పు । వెతకూచునుండూ । యిటువంటి బోధనే నెరిగెదెట్లనుకోక । కటువాక్యలు బల్కి ఘనుల గాసిలజేయు । నతి దుర్జనుండూ । లేనిదె తప్పు వెతుకూనుండూ ॥

ఓ, శిష్యుడా! శుష్కించిన చన్నులుగల స్త్రీ తాను తొడుగు రవిక చిగ్గరగా లేదని తన శుష్కతనము తెలియక రవికెను ఎట్లు నిందించునో అటులనే దుర్మార్గులు తమ తప్పును తెలుసుకోలేక ఈ గ్రంధమును నిందింతురు. జనన మరణ ప్రవాహమును ఇనికింప జేయునట్టి శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ పరిపూర్ణబోధ ఏ రీతిగా తెలుసుకోగలననే యోచన లేక కఠిన వాక్యములు పలికి సాధు జనులను బాధ పెట్టెదరని భావము.

## —(గు రు కృ ప)—

(౨౦౯) అపరోక్షమౌనె మనుజుల । కుపరోక్షంబైన బయలు గురుకృప లేకన్ । అపరోక్షమౌను మనుజుల । కుపరోక్షంబైన బయలు గురుకృప గలుగా ! కీలిదెలేని । యెరుకాతా తొలుగా ॥ విపరీతమౌ బుద్ధివిడిచి నీవెప్పుడు ఉపచారములుచేయు చుండూము గురునికీ । గురు కృపగలుగా ! కీలిదెలేని యెరుకతా తొలుగా ॥

ఓ, శిష్యుడా ! సద్గురు కరుణగలుగనిచో తన కంటె వేరుగ నున్నట్లు తెలియుచున్న అచల పరిపూర్ణ పరబయలు తెలియబడదు. సద్గురుమూర్తి కరుణ కలిగినచో తన కంటె వేరుగా నున్నట్లు తెలియుచున్న అచల పరిపూర్ణ పర బయలు తెలియబడుచున్నది.అచల పరిపూర్ణపరబయలు తెలియుటయేలేని ఎరుక తొలుగుటకు కీలుగనుక పరిపరివిధముల పోవునట్టి బుద్ధిని విడిచిపెట్టి సద్గురు కరుణా కటాక్షము కలుగునటుల త్రికరణ శుద్ధి ప్రవర్తన చతుర్విధ శుశ్రూషలు చేయుచుండుము. అతనికి నీ యందు దయకలుగగనే నీకీ రహస్యమును వస్తు నిశ్చయముగా తెలియజేయునని భావము.

శి॥ ప్ర. మనసైవానుద్రష్టవ్యమ్ బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్. బ్రహ్మ తత్వము బుద్ధిగ్రాహ్య మనుటను శ్రుతి స్మృతులు నిర్ధారణ నేసినవి అందు దోషమేమి?

గు॥ మనసైవాను ద్రష్టవ్యమ్ బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్, అని నిర్ధారణ చేసినవి కాని తైత్రీరీయోపనిషత్తుయందు శ్రు యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసాసహా, అనగా వాక్కు మనస్సుకూడా ఆ పరిపూర్ణ పరబయలును విషయ ముగా చేసుకొనలేక వెనుకకు మరలును. అని దాని అర్థము. ఈ శ్రుతినిబట్టి పరిపూర్ణ పరబ్రహ్మము మనస్సునకు విషయము కాదనుట సుస్పష్టము. అందుచే శ్రు॥ మనసైవాను ద్రష్టవ్యమ్ బుద్ధిగ్రాహ మతీంద్రియమ్. అనునది ఈశ్రుతికి విరుద్ధమగును, అంతేకాదు యుక్తికికూడ అది విరుద్ధమే.

అంతఃకరణము బ్రహ్మవిషయమున జడము జడమునకు చైతన్యము విషయముకాదు. కావున బ్రహ్మము బుద్ధి గ్రాహ్యమనుటలో "వ్యాఘాత"దోషము గలుగును. ఆ దోషము పట్టకుండుటకు అంతఃకరణము ద్వారా ఆత్మజ్ఞానము ఆత్మకే కలుగునని చెప్పినచో "ఆత్మాశ్రయ దోషము" పట్టును.

అద్దమునందు తన ముఖమును చూచినట్లు అంతఃకరణము ద్వారా ఆత్మ ఆత్మనుచూచును అని చెప్పవచ్చును. కాని అద్దములో తాను తన ముఖమును చూచుట వాస్తవము కాదు. అచ్చట బింబము ప్రతిబింబమును చూచును. బింబమును చూచుటలేదు. కావున అంతఃకరణము ద్వారా ఆత్మజ్ఞానము ఆత్మకు కలుగును. అన్నచో

ఆత్మ అంతఃకరణము ఒకరి నొకరు తెలుసు కొనగలరని చెప్పినచో "అన్యోన్యాశ్రయ" దోషము కలుగును.

ఈ దోషమును పరిహరించుటకు ఆత్మ, అంతఃకరణములకు మద్య చిదాభాసమును మూడవ దానిని అంగీకరించినచో "చక్రక" దోషము పట్టును.

చిదాభాసము తన అస్తిత్వమునకు అంతఃకరణము నపేక్షించును.

అంతఃకరణము స్వాధిష్ఠానమగు కూటస్థుని అపేక్షించును. కూటస్థుడు తన ప్రకాశమునకు చిదాభాసము నపేక్షించును. ఇట్లు చిదాభాసము అంతఃకరణమును అంతఃకరణము కూటస్థుని కూటస్థుడు చిదాభాసమును అపేక్షించుటలో "చక్రక" దోషము కలుగును.

దీనిని నివారించుటకు ప్రయత్నించిన "అనవస్థా" దోషము పట్టును. కావున బుద్ధి గ్రాహ్యమనునది యుక్తికి విరుద్ధమగుచున్నది గనుక.

తన కంటె వేరుగ నున్నట్లు తెలియుచున్న అచలపరిపూర్ణ పరబయలు తెలియుటకు సద్గురు కరుణనే ముఖ్యము.

(౨౧౦.) ఎరుగననేటిది యెరుకే । యెరుగుదునని తనను పరుల నెరిగే దెరుకే । యెరుగ నెరుంగుదు ననుచా । న్నెరుగుచునుండేటిదెరుకే । నిరుపామ బుద్ధీ । నీవెరుగిది నిగమప్రసిద్ధీ । గురుమంత్రమనియేటి గృద్దాలి తోటియా । యెరుకా కూకుడువేరు। నెరిగి త్రవ్వితెచాలు । నిరుపామ బుద్ధీ । నీవెరుగిది । నిగమ ప్రసిద్ధీ ॥

సాటిలేని బుద్ధిగల ఓ, శిష్యుడా! ఎరుగనని చెప్పునది ఎరుకనే ఎరిగెదనని తనను పరులను ఎరుగునట్టిది ఎరుకనే ఇట్లు ఎరుగుదును అట్లు ఎరుగను అని చెప్పు రెంటిని ఎరుగునట్టిది ఎరుకనే ఈ ఎరుకను వేద శిరస్సులగు ఉపనిషత్తులందు ప్రసిద్ధమైనదని నిర్ణయించి యున్నది గనుక దీనిని నీవు చక్కగా తెలుసు కొనుము. సద్గురుమంత్రమనే గృద్దలి తోటి ఎరుక యొక్క కూకటివేళ్ళను తెలిసి త్రవ్వి తీసివేసితె చాలునని భావము.

శి॥ ఎరుక ఎరుగనని చెప్పునది ఏది ?

గు॥ పంచన్మాత్ర స్వరూప స్వభావములు లేనిది అచల పరిపూర్ణ పర బాహ్యము గనుక పరిపూర్ణ పరబయలును నేను ఎరుగనని చెప్పును.

శి॥ ఎరిగెదనని తనను పరులను ఎరిగి ఎట్లు చెప్పును ?

గు॥ పిండము బ్రహ్మాండము జీవుడు ఈశ్వరుడు కూడియున్న ప్రత్యక్ష పూర్ణము తన స్వరూపమే గనుక తనను పరులను నేను ఎరుగుదునని చెప్పును.

శి॥ అటు ఎరుగను ఇట్లు ఎరుగుదును యని చెప్పు ఎరుకను ఉపనిషత్తుల యందు ప్రసిద్ధముగా ఎట్లు సిద్ధాంతము చేసియున్నారు ?

గు॥ మహా వాక్యముల నిర్ణయానుసారము శ్రవణాదులు యొనర్చి వార్తిక నిర్ణయానుసారము శ్రవణాదులు నిరసించగా సర్వం బ్రహ్మమే యని ఉపని షత్తులయందు ప్రసిద్ధముగా నున్నది.

శి॥ ఎరుక కూకటి వేల్లు ఎరిగి తవ్వేదెట్లు ?

గు॥ అచల పరిపూర్ణ పరబాహ్యమునందు ఎరుకకు మూలము కాని నిలి చేందుకు స్థానము కాని లేదని గురుమూర్తితో తెలుసుకొని కర్తృత్వ రహిత కర్మాచరణ యొనర్చినచో ఎరుక తనంతటతానే లేకపోవును.

(౨౧౧) ఎరుకే కోశములై దెరు । గెరుకే భూతముల నెరుగు నెరుగును సర్వం । వెరుకే యెరుక నెరుంగును । యెరుకను గుర్తెరుగ వేరే । యెరుక వున్నదా । వున్నదంటే । నరకామె కాదా । నిరతాము గురుసేవ పరతంత్రు లగుచు । తత్కరుణాకు పాత్రులై । యెరుకమాలిన వారీ కెరుకావున్నాదా । వున్నదంటె నరకామెకాదా ॥

ఓ, శిష్యుడా ! ఎరుకయే పంచకోశములను పంచభూతములను సకల చరాచర ప్రపంచము నంతను ఎరుకయగు తనను ఎరుగునది నా ఎరుకయే. ఎరుకను ఎరుగుటకు వేరొక ఎరుక ఎచ్చటయులేదు. ఈ ఎరుకను గుర్తెరుగుటకు నింకొక ఎరుక యున్నదని చెప్పిన యెడల నరకము సంభవించును. ఎల్లప్పుడు సద్గురు సేవయందు వర్తించుచు వారియొక్క కృపకు పాత్రుడై ఎరుకను విడ చిన పరమసాధువునకు ఎరుకయే లేదు. వారికి కూడ ఎరుకయున్నదను వారికి నరకము తప్పదు యని భావము.

(౨౧౨) గురుమంత్రముచే నిలువని । యెరుకను పరిపూర్ణమనుచు ఎరిగి నిరతమునే । యెరుకై యుండిన వారల । తెరువిక నీకేల వట్టిదీజోలిమానా ।

యెరుకలేని ' యాజోలి బూనూ ' గురునీచే పరిపూర్ణ మరసియూ తెలసీన ' యెరుక నన్నెటికినీవెరుగాకు మిదివట్టి । దీజోలిమానూ ' యెరుకచేని యాజోలి బూనూ ॥

ఓ, శిష్యుడా ! సద్గురుడు తెలిపిన పరిపూర్ణ పరబయలునందు నిలువని ఎరుకను పరిపూర్ణ మని నమ్మి ఎల్లప్పుడు యెరుకై యున్నపామరుల యొక్క మార్గము నీకు యెందులకు? అది భ్రాంతి లక్షణము గనుక ఆ జోలి విడువుము. ఎరుకలేనట్టి అచల పరిపూర్ణ పద్ధతి ననుసరించుము. సద్గురుమూర్తిచే పరిపూర్ణ పరబాహ్యము నెరిగి తర్వాత యెరిగిన యెరుకను యెప్పుడూ యెరుగకు మని భావము.

(౨౧౩.) గురుతను కలలోనారీ । నరులూరికె వచ్చిపొంది నయముగ సుతులం వరకన్నియలన గాంచియు । గురువరుచే మేలుకొంటె ' గురుతుండ దన్నా ' ఆపైమాట । నెరిగెదేదన్నా। యెరుకొక్కటుంటెనే యేర్పాటులుండూను యెరుకొక్కటేగితె యేర్పాటు జేసేటి । గురుతుండదన్నా ' ఆపైమాట నెరిగేదే దన్నా ॥

ఓ శిష్యుడా ! గురుతుయనెడి కలలో స్త్రీలు,పురుషులు యథేచ్ఛగా వచ్చి కూడి సంసారముచేసి కొమాళ్ళను, కొమార్తెలనుగని సుఖదుఃఖముల ననుభవించుచు సద్గురు కరుణాకటాక్షముచే మేలుకచెందిన యెడల ఆ గుర్తు యనెడి కలయుండదు. గుర్తు యనెడి కలయున్నప్పుడే సుఖదుఃఖములు యుండును. యా గుర్తు తెరిగిడి యెరుకలేనప్పుడు యెరిగే వారెవరుండరని భావము.

(౨౧౪.) నినునను నిపుకలగాంతువు । నినునను కలలోనగాంతు ' నేనొక వేళ్లన్ । నినునను నీవు నేననునిను గనుగొనగా గలమె' మేలు కనినామీదటనూ గురుబోధట్లా । వినినమీదటను ' మునుపూ । గలిగిన యెరుక మొదటికే నిలువాదు' నినునన్ను నేనన్ను నినునీవెరుగుటమెట్లు కనినా మీదటనూ గురుబోధట్లా వినిన మీదటనూ ॥

ఓ, శిష్యుడా! ఒకప్పుడు నిన్నును, నన్నును నీవు కలలో చూచెదవు. అట్లే యొకప్పుడు నన్నును నిన్నును నేను కలలో చూచుచున్నాను. ఆ కలనుండి మేలుకొనిన పిదప నిన్ను నన్ను నీవు, నన్ను నిన్ను నేను చూడనేరము కదా ! అదేప్రకారము సద్గురుబోధ వినిన తరువాత ముందు యుండిన ఎరుక మొదటికే నిలువదు గనుక నిన్నును నన్నును నే. నన్నును నిన్నును నీవు తెలుసుకొనలే మని భావము.

(౨౧౫) లేదులేదనుచు యెందరు । వాదించిన లేకపోదు పరిపూర్ణము దా । పోదుపోదనుచునిల్పిన । పోదని యనుకోకు । యెరుకపోనెపోతుందీ । గట్టిగలేచి పోనె పోతుందీ । వాదభేదములేనివారిచెయెరుకాది । పాదూ పెకిలించేటి పద్ధతి నెరగితె । పేనెపోతుందీ గట్టిగలేచి పోనెపోతుందీ ॥

ఓ, శిష్యుడా! అచల పరిపూర్ణ పరబయలు లేదులేదని యెందరు వాదించినను అది లేకపోదు. అది శాశ్వతముగానే యుండును. ఎరుకను పోదుపోదని నిలువుకొన్నను గట్టిగా అది పోనేపోవును. గనుక అది అశాశ్వతమని తెలుసుకొనుము. వాదభేదము లేని సద్గురు కరుణాకటాక్షముచే ఎరుక మూలము నశింపజేయు పద్ధతి తెలుసుకొనిన యెడల ఎరుక తనకుతానే లేకపోతుందని భావము.

(౨౧౬) మే నెరుకల రెంట్లోనొక । దానిని యెడబాసిచేయ తరమాపను లన్ । మేనికి యెరుకకు గావున । మేనన యెరుకెరుక యనిన । మేనాని యెరుగూ । యీ రెంట్నీ నీవు నేనాని యెరుగూ యెరిగి వీట్లతో బయలు నెరిగి మే నెరుకాల । తిరిగి చూడకు చూస్తె గురుని పాదము లాన మేనాని యెరుగూ । యీరెంట్నీ । నీవు నేనాని యెరుగూ॥

ఓ, శిష్యుడా! తనువు యెరుక ఈ రెంటిలో తనువు విడిచి యెరుకయు యెరుకను విడిచి తనువును నివి ఏ కార్యములు చేయజాలవు కనుకనే తనువు యెరుక రెండు ఒక్కటే తనువనినా యెరుకయనినా తనువని తెలుసుకొనుము. ఈ రెంటిని నీవు నేను యని తెలుసుకొనుము. తరువాత వీటిచే శక్తిద్వయ నిరాసకంబైన అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకొని తనువు యెరుకల రెండింటిని మరల చూడకుము. చూచినయెడల సద్గురు పాదముల సాక్షిని తప్పినవాడ వగుదువేయని భావము.

(౨౧౭) మరుపు సుషుప్తియు మూర్ఛయు । మరణంబు సమాధి యనుచు మానవు లెరుకన్ । దొరిగిన నొరుని శరీరము । నెరుగెదరానరుడు । మేను నెరుగడోయన్నా । తననైనతా । నెరుగడోయన్నా । యెరుగకుండితేయేమి తిరిగి పుట్టుచునుండు । తిరిగి పుట్టుచువాడె । గురుబోధ గలిగితె । యెరుగడోయన్నా । తననైన తా నెరుగడోయన్నా ॥

ఓ, శిష్యుడా! మరుపు సుషుప్తి మూర్ఛ మరణము సమాధియను యవస్థలు మోక్షము నిచ్చునని మానవులు యా యవస్థలయందు ఒరుగుదురు. ఆ సమయమున ఇతరులనిగాని తన శరీరముగాని తన్నుగాని ఎరుగుటలేదు. అటుల

ఎరుగకపోయినను వారు ఇతరులవలెనే జనన మరణములు జెందుచుందురు. వారు సద్గురు కరుణచే అచల పరిపూర్ణ ప్రబోధ జెందిన యెడల వారు జనన మరణములు జెందరని భావము.

శి॥ తననుతాను ఎరుగక ఇతరులను యెరుగక యున్నవాడు తిరిగి జన్మాదులకు ఎట్లు వచ్చును ?

1. గు॥ ఎరుకనగా యెరిగేటిది. మరుపనగా యెరుక తనను మరచుట యను న్యాయమున మరుపు యనగా శాంభవీ ముద్రయందు తెలియు ప్రకాశము సకల వ్యవహారంబును శూన్యముగా యుండును. అట్టి లక్షణమున యున్నవానిని మరుపు జెందిన వాడని చెప్పబడును.

2. సుషుప్తి యనగా ఖేచరి ముద్రయందు తెలియు ప్రకాశము యిందు ఇంద్రియముల వ్యవహారము యుండదు. గనుక అది సుషుప్తియని నిర్ణయము.

3. మూర్ఛ యనగా జాగ్రదావస్థయందు సుషుప్తి యొక్క స్థితి మూర్ఛ యని నిర్ణయము. ఎట్లులనగా జ్ఞానేంద్రియములు హృదయమునందు సహజము గానే జేరునది సుషుప్తావస్థ గనుక జాగ్రదావస్థయందు సుషుప్తి పద్ధతి కలగటము మూర్ఛయని నిర్ణయము.

4. మరణ మనగా స్థావరజంగమ జీవోపాధులయందు అంత్యజన్మ మానవోపాధి గనుక దాని మరణమే మోక్షమని నిర్ణయము మరియు పంచ ప్రాణంబులు ఏకముజేసి కుంభించి బ్రహ్మదండి ద్వారా భ్రూమధ్యమునకు తెచ్చి అచటనే నిలిపియుండుటము మరణావస్థ యని నిర్ణయము.

5. సమాధి యనగా సవికల్ప సమాధి, నిర్వికల్ప సమాధి యని రెండు విధములు.

(1) సవికల్ప సమాధి యనగా సాధన సంపన్నుడైన అధికారి గురు ముఖంబున వేదాంతవాక్య శ్రవణాదులు చేయుచు, తాను బ్రహ్మమేనని భావించుట సవికల్పసమాధి యనబడును.

(2) నిర్వికల్పసమాధి యనగా బ్రాహ్మణుడు తాను ఏ పనులు చేయు చున్నను తాను బ్రాహ్మణుడనే యని నిశ్చయముగా యున్నట్లు తాను బ్రహ్మమే కాని ఇతరము కాదనే నిశ్చయము నిర్వికల్ప సమాధి యని నిర్ణయము.

ఈ సర్వలక్షణములయందు తన్నుతాను తెలుసుకోకయున్న ఇతరము తెలుసుకోకయున్నా వీరు తిరిగి పుట్టుచునే యుందురు. ఎట్టులనగా

వీరు తెలియునట్టి సర్వము ఎరుకయొక్క మరపు చిత్రములే అనగా ఎరుకకు గల మరపునందే వీరలు మగ్నత చెందుచున్నారు. గాని ఎరుక మరుపుల రహితమును వీరికి తెలియడములేదు. ఉపాదికి కారణమైన యెరుక రూపమే మరుపు గనుక వీరలు తిరిగి పుట్టుచునే యుందురు. అచల పరిపూర్ణ పరబయలు నందు యెరుకకు మూలముగాని నిలిచేందుకు స్థానము గాని లేనేలేదని వస్తు నిశ్చయముగా తెలుసుకున్న సూరి జనులు తిరిగి పుట్టరని నిర్ణయము.

(౨౨౮) పరిపూర్ణ మెరుకలివియని । యెరుగని బయలందులేని యెరుక తనకుదా । నరుదెంచిట గురుశిష్యుల । తెరుగున మాట్లాడి రెంట్ని । దెలిసితా జననూ । ఆ పైమాటా । పలికె దేదికనూ । అరమరలేకనే నెరిగించినట్టియా । గురుబోధ పాత్రూల నెరుగాక తెలిసేవు । తెలిసితా జననూ । ఆ పైమాట । పలికెదేదికనూ ॥

ఓ, శిష్యుడా ! ఇది పరిపూర్ణము ఇది యెరుకయని యెరుగని అచల పరిపూర్ణ పరబయలునందు లేని యెరుక తనకు తానే వచ్చి గురు శిష్యన్యాయ ముగా సంభాషణచేసి పరిపూర్ణమును యెరుకను ఈ రెంటిని యెరిగి యెరుక తన లేమిని తెలుసుకొని తనకుతానే లేకపోవును. అటు తర్వాత నచల పరిపూర్ణ పరబయలు ఇట్టిది యట్టిది యని జెప్పువారులేరు. గనుక అనుమానము లేక వస్తు నిశ్చయముగా నేను తెలుపునట్టి అచల పరిపూర్ణ ప్రబోధను త్రికరణ శుద్ధిగా చతుర్విధ శుశ్రూషలుచేయని నధికారులకు చెప్పకూడదని భావము.

(౨౨౯) స్థిరమగు పరిపూర్ణమున । స్థిరమగు యీ యెరుకనెరుక దెలియు జగములన్ । యెరిగిన దెరుకేకద స । ద్గురు కృపచే యెరుకబోతె । గురుశిష్య లేరీ । నోరెత్తాక । మరివినరోరి । గురుని పాదములాన గురుతు లేనటువంటి । పరిపూర్ణ మొకటుండు పలుకరాదట్లుంటె గురుశిష్యులేరీ । నోరెత్తాక । మరి విననోరీ ॥

ఓ, శిష్యుడా ! స్థిరమైన అచల పరిపూర్ణ పరబయలును అస్థిరమైన ఎరుకను యెరుకనే యెరుగునట్టి ప్రపంచమును యెరుగునట్టిది యెరుకనే కదా ! సద్గురు కటాక్షముచే యెరుకబోయిన యెడల గురువును శిష్యుడును యెరుకతోనే లేకపోదురు. గనుక నీవు నోరుకదల్పక నేను చెప్పినది వినుము. సద్గురు పాదార విందముల సాక్షిగా గుర్తుయనెడి యెరుక లేనటువంటి అచలపరిపూర్ణ పరబయలు మాత్రముండును. ఎరుక లేనందున దాని నెరుగునది గాని ఇట్టి దట్టిదని చెప్ప నట్టిదిగాని లేదని భావము.

(౨౨౦) బయలెరుకలు శిష్యునకున్ । దయతో గురుడెరుకజేసి తరువాతను సం । దియమేమి లేకయెరుకన్ । నయమున విడిపించు గురుడూ । నయశాలి గాదా । నీ మదికిది నాటేన లేదా । భయభక్తి । గురుసార్వ, భౌమునిసేవ । నిశ్చయముగా జేసితే జయమందెదవు గురుడు । నయశాలిగాదా । నీ మదికిది నాటేనలేదా ।

ఓ, శిష్యుడా ! సద్గురుడు సత్శిష్యునకు అచల పరిపూర్ణ పరబయలును యెరుకను ఈ రెంటిని వస్తు నిశ్చయముగా దయతో నెరిగించిన తదుపరి ఏసంది యములులేక అనాయాసముగా యెరుకను విడిపింపజేయునట్టి సద్గురుడే ఉత్తముడు ఈ విషయమును నీ మనంబున బాగుగా నాటించుకొని భయభక్తి చే దేశిక చక్ర వర్తికి సేవలు సలిపితివేని యెరుక తనంతటతానే లేకపోవును. జయప్రదము గల్గునని భావము.

(౨౨౧) పదిరెండక్షరములుగల పదముల మంత్రార్థ మెరిగి । సద్గురు కృపచే । పదియారక్షములుగల । యది యెట్టిదో తెలిసెనేని । యతడే సద్గు రుడూ యివి రెండెరుగ । నతడేడీ గురుడూ । మొదటిది పరిపూర్ణము ను దెల్పు వెరుకాను । తదనంతరపుని బోధనుజేయు నివి దెలిసి ।నతడే సద్గురుడూ ।యివి రెండెరుగ । నతడేడి గురుడూ ॥

ఓ, శిష్యుడా ! సద్గురు కరుణచే స్వచ్ఛమైన ద్వాదశాక్షరి మంత్రమును తెలుసుకొని షోడశాక్షరి మంత్రమును యెరిగిన యెడల అతడే సద్గురుడని చెప్ప తగును. ఈ రెండు మహామంత్రంబులు తెలియనివాడు సద్గురువు కాదు. ఎందు కనగా మొదటిది ద్వాదశాక్షరి అచల పరిపూర్ణ పరబాహ్యమును సూచించును రెండవదగు షోడశాక్షరి లేని యెరుకను లేదని యెరిగించునని భావము.

(౨౨౨) పరిపూర్ణ మిదుగో । యెరుకను చూపించి లేని । యెరుకనులేదం చెరిగించిన గురుడేసరి । యెరుకను నిల్చేటిగురుడు యెందుకోయన్నా । తద్బోధ నీ కెందుకోయన్నా । శరణన్నవారి మస్తక మందు చై పెట్టి । తిరమూగయెరు కాను తీసివెయ్యనివాడు । యెందుకో యన్నా । తద్బోధ నీ కెందుకోయన్నా ॥

ఓ, యన్నా ! ఇదిగో అచల పరిపూర్ణ పరబయలు యని ఇదిగో మూలము లేని యెరుకయని ఈ రెంటిని జూపించి లేని యెరుకను లేదని తెలిపినట్టి సద్గురుడే మంచివాడని తెలియును. యెరుకను పరిపూర్ణ పరబయలని తెలియజేయు ఇతర గురువులు వారి బోధలు నీకు ఎందుకు ? శరణని ఆశ్రయించిన శిష్యుని హస్త

మస్తక సంయోగము గావించి స్థిరముగా యెరుకను తీసివేయని గురుడు సద్గురుడు కాడని భావము.

(౨౨౩) ఎరుక భ్రమగల్గు శిష్యుని । పరితాపము మాన్పినట్టి పండితుడెవడో గురుడతడేకాని గురువులే । గురువులమని । పొట్టకొరకు గొలిగేవారెల్లా । వారికీ బోధ తెలియూటకల్లా । పరిపూర్ణమును లేని యెరుకనేర్పడ దెల్పి । యెరుకాను విడిపించ నెరుగాక । గురువులై గొలిగేవారెల్లా । వారికీబోధ । తెలియుట కల్లా ॥

ఓ, శిష్యుడా ! యెరుకయనెడి నామరూపకుల గోత్రవర్ణ ఆశ్రమములగు షడ్భ్రమ వికారములు గలిగినట్టియొక్క శిష్యుని పశ్చాత్తాపమును పోగొట్టునట్టి పండితుడే సద్గురుడు కాని పొట్టకొరకు మేము గురువులము మేము గురువులము యనుచు గొణుగుచుండువారు గురువులుకారు. వారికి ఈ అచల పరిపూర్ణబోధ తెలియుటము దుస్తరము. పరిపూర్ణమును లేని యెరుకను వస్తు నిశ్చయముగా ఈ రెంటిని ఏర్పాటుచేసి లేని ఎరుకను విడిపింపనేరక గురువులమని గొణుగు చుందురు. వారు మాయయగు యెరుక వాదులు సద్గురువులు కారని భావము.

## (శుశ్రూష విధానము)

(౨౨౪) గురుశుశ్రూష నొనర్చుట । నెరిగించెద నెట్లననివ యేర్పడ వినుమా । నరులిష్టదైవములకున్ పరిచర్య యొనర్చునట్లు । భక్తితోడు తనూ గురుమూర్తికి । త్యక్తితోడు తనూ । నిరతామరవరరేక నీవు సల్పితివేని । గురుబోధమరుగు । సద్గురునీవె దెలిసేపు । భక్తితోడుతనూ । గురుమూర్తికి త్యక్తి తోడుతనూ ॥

ఓ, శిష్యుడా ! సద్గురు వాజ్ఞానుసారము యొనర్చునట్టి శుశ్రూష పద్ధతి వివరముగా తెలిపెదను శ్రద్ధగా వినుము. మానవులు తమతమ ఇష్ట దేవతలకు భక్తి యుక్తులచే పరిచర్య ఎట్లు చేయుదురో అటువలెనే సద్గురుమూర్తి ఎల్లప్పుడును భయభక్తి పూర్వకముగా చతుర్విధ శుశ్రూషలు సల్పినచో ఆ సద్గురు కరుణచేత గురుబోధ యొక్క మర్మమును యెరిగెదరని భావము.

శి॥ మానవులు తమతమ ఇష్టదైవమునకు భక్తియుక్తులచే పరిచర్య ఎట్లు చేయుదురు.

గు॥ శివుని యందు భక్తిగల శైవమతస్థులు శివరాత్రివ్రతము ఉపవాసాది జాగరణక్రియలు తాము యొనర్చి పుణ్యాత్ములమని సంతోషించెదరు. శివభక్తులమని ఆరూఢత జెందెదరు. అందువల్ల కైలాస ప్రాప్తి శివుడు వారికి ప్రసాదించును.

విష్ణువు యందు భక్తిగల వైష్ణవ మతస్థులు వైకుంఠ ఏకాదశిరోజు ఏకాదశి వ్రతము ఉపవాసాది క్రియలు విష్ణనామసంకీర్తన తాము యొనర్చి పుణ్యాత్ములమని తాము సంతోషించెదరు. విష్ణుభక్తులమని ఆరూఢత జెందెదరు అందువల్ల విష్ణుమూర్తి సంతోషించి వారికి వైకుంఠ ప్రాప్తి నిచ్చును.

అదేపద్ధతిగా గురుని యందు భక్తిగల గురుభక్తుడు త్రికరణ శుద్ధియను ప్రవర్తన యను గురుభక్తి చతుర్విధ శుశ్రూషవ్రతము గురుసేవ కర్తృత్వ రహిత కర్మాచరణ గురునిష్టయను నిర్ణయములు అనగా గురుభక్తి గురుసేవ గురునిష్ట ఆచరించిన భక్తుని మెచ్చి సద్గురుడు అచల పరిపూర్ణ పరబయలు మర్మము తెలియజేయునని నిర్ణయము.

## ( గురుమంత్ర నిర్ణయము )

(౨౨౫) మరుపు సుషుప్తి మరణముల్ । పరిపూర్ణంబునకు సాటిపరచి యెరుకకున్ । మరి యాది మేలుక పుట్టువు । నిరుదెరుగుల నెరిగి యెరుక నెగర జిమ్మోయీ । అపై నుండె । దెరిగె దెట్లోయీ । గురుమంత్రమిదెసుమ్మి మరువాక యేప్రొద్దు । స్మరణజేసితివేని తిరిగి పుట్టవు నీ వి। ట్లెగరజిమ్మోయీ । ఆ పైనుండె దెరిగె దెట్లోయీ ॥

ఓ, శిష్యుడా ! పరిపూర్ణ పరబయలుకు మరుపు సుషుప్తి మరణము అనునవి మరియు ఎరుకకు యాదియును, మేలుకయును, పుట్టుకయును సమముచేసి రెండు విధముల తెలుసుకొని యెరుకను యెగర జిమ్మిన యెడల యెరుక మరుపుయను ద్వంద్వ లక్షణములుగల యెరుక లేకపోవును. అపైన నిలిచియున్న పరిపూర్ణ పరబయలును తెలుసు కొనజాలము. ఇదియే సద్గురు మహామంత్ర నిర్ణయము. ఈ పద్ధతి మరువక ఎల్లప్పుడు జపము జేసినచో మరణ జననములు జెందవని భావము.

(౨౨౬) అమంత్రయుగము దెల్పెద । నేమముతో దలుపుముత్త దీబట్ట బయల్ । యేమీలేదని పలికిన । యీమంత్రమెద్వాదశాక్ష । రింకోటి వినుమీ । యెప్పుడునోట యివి మదువకనుమీ యీ మూలములేని గుర్తెరిగె శరీరాము । యేమిలేదనియంటె । యిదె షోడశాక్షరి । యింకోటి । వినుమీ । యెప్పుడునోట యిదుమరువ కనుమీ ॥

ఓ, శిష్యుడా ! ఈ రెండు మంత్రములను తెలిపెదను. వాని నిర్ణయాను సారము స్మరించుము. నవి ఏవి యనగా మొదటిది యీ ఉత్త జట్టబయలు ఏమి లేదు అనునది ద్వాదశాక్షరి మహామంత్రము రెండవది మూలము లేని యీ గుర్తెరిగె శరీరం ఏమిలేదు. అనునది షోడశాక్షరి మహామంత్రము. వీటి నిర్ణయము సద్గురువుచే విని ఆ నిర్ణయాను సారము స్మరించుమని భావము.

## — (గురు మంత్రార్థము) —

(౨-౨౩) తొలుమంత్రపర్థ మెక్కడ । కలదోయని వెదుకనేల కల దంతటయా । వలిమంత్ర పర్థమెక్కడ । కలదోయని. చూడనేల । కాదా చూచేదీ । వినేది యనేది తినేది । అల తొలుత దాన్ని నీవవలోకనము జేసి । కలకాల మెరుకాలు గలదాని విడువెరుక । గాదా చూచేదీ । వినేదీ యనేదీ తినేదీ ॥

ఓ, శిష్యుడా ! మొదటి మంత్రార్థ మెచటనో యున్నదని వెతక వలసిన పనిలేదు. అది యెరుక మరుపు యనునది లేక సర్వత్ర నిండి నిబిడీకృతముగా మల్లు గుచ్ఛ సందులేక యున్నది. రెండవ మంత్రార్థ మెచట నున్నది యని విచారించవలసిన పనిలేదు. అదేకదా చూచునదియు, వినునదియు, తినునదియు గనుక ఇందు మొదటి మంత్రార్థమగు అచల పరిపూర్ణ పరబయలును దర్శించి ఎరుక మరుపు యను ద్వంద్వపద్ధతిగల యెరుకను కలకాలము విడిచియుండుమని భావము.

## — (గురు మంత్ర జపము) —

(౨-౨౮) రానిది పోనిది బయలని । లేనిది యీయెరుక యనుచు తెప్పగ దృఢమౌ ! దానుక నీవీమంత్రము । మానక జపియింపుచుండు । మానీతిశాలీ । లేనిదిలేదు । మరువాకీజోలి । లేనదిలేదాని పూని నిశ్చయమైతె । తానొక్క టుండును గాని యెట్లనవిను । మా నీతిశాలి । లేనిదిలేదు । మరువా కీజోలి ॥

ఓ, నీతివంతుడైన శిష్యుడా ! అచల పరిపూర్ణ పరబయలు రాకడ పోకడ లేనిదనియును నామరూప నటనాత్మకమగు యెరుక లేనిది గనుక ఇహప రాదులయందు ఎచ్చటను లేనేలేని దనియు వస్తునిశ్చయముగా నీ మనంబునకు దృఢమయ్యేవరకు నీవు ఈ మంత్ర నిర్ణయరహస్యమును మరువక మననము చేయుచుండుము. యెరుకలేనిది గనుక లేకపోవును. ఈ నిర్ణయము మరువ వలదు.

లేని యెరుక లేనేలేదని నీకు నిశ్చయమైన యెడల అచల పరిపూర్ణ పరబయలు వుండును గాని దానిని యెరిగే వారు యెవరు వుండరని భావము.

### — (మంత్ర రహిత నిర్ణయము) —

(౨౨౯) ఇదిదప్ప యేమిలేదని। మొదటిది మొరబెట్టుచుండు మదమున వినుమా। యిదియేమి లేదు హొమ్మని। వదలక రెండోదిలెన్స। వదరూచుండు నురా। బయలెరుకాల నిదినిశ్చయమురా। అదిగాన నీరెంటి నరసి నీవిపూర్వాడు। విదితాముగా రెంట్ని। విడరా మంత్రము లిట్లు। వదరూచుండునురా। బయలెరు కాల। యిది నిశ్చయమురా॥

ఓ, శిష్యుడా! సంతోషముగా వినుము. మొదటి మంత్రమగు ద్వాదశాక్షరి అచల పరిపూర్ణ పరబయలు మాత్రమేయున్నది. దానికంటె వేరుగా నేమియు లేదని ధ్వనిరూపకముగా మొరపెట్టుచున్నది రెండవ మంత్రమగు షోడశాక్షరి మూలంలేని గుర్తెరిగే శరీరం యేమిలేదు హొమ్మని స్పష్టముగా వున్నది ఉన్నట్లు వదురుచున్నది గనుక అచల పరిపూర్ణ పరబయలు మూలము లేక తోచుచున్న యెరుక వస్తు నిశ్చయము నెరిగి యీ రెంటిని యెరిగిన యెరుకను విడిచి పెట్టుమని భావము.

### — (బోధమనన విధానము) —

(౨౩౦.) ఉన్నది పరిపూర్ణము లేం। దెన్నటికీ యెరుక యనుచు నిది దృఢ మౌదా। కెన్నము నేబోధించిన। తిన్నని యీబోధ। శిష్యతిలకా మరువకుమీ। సుజనులమ్రోల। పలుకా వెరువకుమీ। నిన్ను కుమతులు వచ్చి నీలో తడిగితె వారికెన్ని। విధములనీ। వెరిగింప కిరశిష్యతిలకా మరువకుమీ। సుజనులమ్రోల। పలుకా వెరువకుమీ॥

ఓ, శిష్యతిలకమా! అచల పరిపూర్ణ పరబయలు ఎల్లప్పుడు వుండునని మూలములేక తోచుచున్న యెరుక లేనిదని నీ మనంబున దృఢముగు వరకు నేను బోధించిన పరిపూర్ణ బోధను స్మరించుచుండుము. దానిని మరువ గూడదు. దీనిని సుజనుల ఎదుట చెప్పుటకు నీవు ఎంత మాత్రము భయపడవద్దు. దుష్టులు నీ వద్దకువచ్చి అనేక విధముల ప్రయత్నముజేసి యీ భావము యడిగినను వారికి యీ పవిత్రమైన పరిపూర్ణ బోధ చెప్పగూడదని భావము.

## —( ఫల నిర్ణయము )—

(౨౩౧) పరిపూర్ణ బోధనెరిగిన । గురువరుచే బోధగొన్న । గొప్పఫలంబో। పరిపూర్ణ బోధనెరుగని। గురువనుచే బోధగొన్న గొప్పఫలమౌనా । అది యెట్లన్న కూడి రతిలోనా । పురుషునిచే సంతు పొలతి బడయును బడయ । తర మౌన వారిచే। తనవంటి వారికే । గొప్పా ఫలమౌనా । అదియెట్లన్న । కూడి రతిలోనా ॥

ఓ, శిష్యుడా! శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ పరిపూర్ణప్రబోధ నెరిగిన సద్గురు సార్వభౌములవలన పరిపూర్ణబోధ వినినచో జనన మరణాది సంసార భ్రాంతి నివృత్తి రూప గొప్పఫలము లభించును గాని యెరుక భ్రాంతిగల యల్ప గురుబోధలను వినినచో జనన మరణ సంసారభ్రాంతి యభివృద్ధియై నానా దుఃఖములను గలిగించును. ఎట్లనగా స్త్రీ పురుషునితో గూడిన సంతానవతి యగును. తనవంటి మరియొక స్త్రీతో గూడిన సంతానము గలుగనట్లు అదేపద్ధ తిగా జనన మరణములు పొందని అచల పరిపూర్ణ పరబాహ్యమును జనన మరణ ములు పొందునట్టి యెరుక తెలుసుకొనినచో తాను లేకపోవును. జనన మరణ ములు కలిగిన యెరుక తన నిర్ణయ సచ్చిదానంద స్వరూప లక్షణము తెలుసు కొని అయమాత్మ బ్రహ్మమని తెలిసి యున్నచో అనేక జన్మభ్రాంతులకు లోనగు నని భావము.

## — (పూర్ణ గురువు యొక్క అవసరము) —

(౨౩౨.) పరిపూర్ణ బోధనెరుగని । గురుశిష్యులు బోధకొరకు కోరపని బడున్ । గురువర్యు నొకని మరలను। హరువరమున బుట్టినట్టి యా శిఖండికినీ । భార్యైనట్టి । యబల తండ్రికినీ । వరులనిద్దరిని దేవలెనీ । అల్లుడునేను । వరి యింతుమని చెప్ప । వనితనంపినయట్లు । యాశిఖండికినీ భార్యైనట్టి । యబల తండ్రికినీ ॥

ఓ శిష్యుడా ! శక్తిద్వయ నిరాసంబైన అచల పరిపూర్ణ ప్రబోధ నెరుగని గురువును అతనివల్ల బోధము పొందిన శిష్యుడును వీరిరువురు అచల పరిపూర్ణ ప్రబోధ కొరకు పూర్ణ గురుసార్వభౌముని ఆశ్రయించి వారివల్ల శక్తిద్వయ నిరాసకంబైన పరిపూర్ణ ప్రబోధ పొందవలయును. అదెట్లనగా శివుని వరమున బుట్టిన శిఖండికి భార్యయైన యబల తన తండ్రికి నీ యల్లుడనూ నేనూ వరించు టకు ఇద్దరు పురుషులను తీసికొని రావలయునని చెప్పుటకు వెలికత్తెను పంపు నట్లు యెరుగుమని భావము.

## ( గురు కృపా విశేషము )

(౨౩౩.) గురుమూర్తి కెదురహంకృతి । దొరకొన్నను దొంగత్రోవత్రొక్కిన వెవులన్ । గురునింద వినిన జేసిన। నరునకు పరిపూర్ణ బోధ। నలవీయె తెలియా కూడదువాన్ని । తెలియాక కలియా। గురుడు దెల్పని పుస్తకరీతిని పూర్ణ। మర సీతి మనియెంతో మురసీన యీబోధ। నలవీయె తెలియా। కూడదుదాన్ని తెలియాక కలియా ॥

ఓ, శిష్యుడా! సద్గురుమూర్తి ఎదుట అహంకారము అవలంభించినను ఎరుక నిర్మిత భ్రాంతి మార్గములయందు ప్రవర్తించినను ఎవ్వరైన తన గురువును నిందించుచుండినచో దానిని వినువానికినీ తాను స్వయముగా సద్గురువును నిందించిననూ పరిపూర్ణ బోధ తెలుసుకొనుటకు సాధ్యము గాదు గనుక ఇటువంటి వారి హృదయము తెలుసుకొని వానితో సహవాసము ఎన్నటికిని చేయరాదు సద్గురుమూర్తి తనకు పరిపూర్ణ బోధ సూచించనిదే యీ అచలబోధ గ్రంథములో యున్న ప్రకారము పరిపూర్ణ పరబాహ్యమును నేనెరింగితినని తాను ఎంత సంతోషించినను నీ అచల పరిపూర్ణ బోధ నెరుంగుటకు ఎంత వారికి సాధ్యపడదని భావము.

(౨౩౪.) జనులందరు గురుబోధను । గనిరా జనులందు నేను గలియక యున్నన్ । ననుమన్నింతురె వారని । మనమున దలపోసై బోధ మర్మా మబ్బీనా । అబ్బినవారి । ధర్మా మబ్బీనా । జనన మరణము లేని ఘనమైన త్రోవనే । గనసైతి ననిబోధ గనకున్న యీబోధ। మర్మామబ్బీనా । అబ్బినవారి ధర్మామబ్బీనా ॥

ఓ. శిష్యుడా ! పామరుడగువాడు లోకములో మానవులందరును సద్గురు బోధను తెలుసుకొనిరి. అట్టివారితో నేను చేరక యుండిన నన్ను మన్నన చేతురా అని మనంబున తలంచి తాను అచల పరిపూర్ణ బోధ తెలిసిన వాని విధమున నటియించుచుండును అట్లు నటించినంత మాత్రమున వానికా బోధ మర్మము తెలియదు. అయినా వారి సంభాషణవలన వారు రచించిన గ్రంథ పఠనవలన బోధ మర్మము తెలుసుకున్నను జనన మరణ రహితమునకు వారు ప్రవర్తించే కర్మ ధర్మములు వీనికి తెలియవు. అప్పట్లో యీ పామరజనుడు జనన మరణ ములులేని రాజమార్గమును నేను తెలుసుకొనైతినని విచారము జెందును గనుక శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ అచల పరిపూర్ణ ప్రబోధ సద్గురుమూర్తిచే హొందిన వారికే యీబోధ యొక్క ధర్మ మర్మములు తెలియునని భావము.

(౨౩౫) మంతనమున గురుబోధను । యెంతో వింతనుచు నమ్మి తింతేకద । యేవింతలు గనరావని, దా । వంతము నొందేటి వాని । బ్రతుకెంత కంతే । వింతలు లేని । గతి గానడింతే । అంతకంతకు వాని కతిబాధస్తమెకానీ । సంతకూటముతోటి సంభాషించడువాని । బ్రతు కెంతకంతే । వింతలులేని గతిగానడింతే ॥

ఓ శిష్యుడా ! కుటిలాత్ముడగువాడు సద్గురు బోధను ఎంతో బోధ్యమని మనంబున నమ్మి యుండినికాని తుదకు ఏమిలేదు. యీ బోధ ఇంతమాత్రమే గదా. యీ అచల పరిపూర్ణ బోధయందు ఏ వింతలులేవు యని తన మనంబును కుంచపరచు కొనునట్టివారి కర్మ ఫలము ఎంతకు నంతగానే యుండును. జనన మరణ రహితమగు అచల పరిపూర్ణ ఆరూఢ స్థితి నెరుగడు. అంతకంతకు వానికి యెరుక భ్రమ హెచ్చుగానే యగును గాని సద్గురు సార్వభౌములతో మాటలాడక వైరాగ్యము బూని యుండునని భావము.

## —(గురుకృపా విహీనుల అనధికారత్వము)—

(౨౩౬) ఏ పురుషుడ గురువర్యుని। శ్రీపాదము బట్టలేడో। సెలుగనాతం। డీపుస్తకమును జూచిన । యేపట్టున నిలువకేగు । నిది నిజమయ్యా । నరులార మీ । మది దెలియరయ్యా । యీ పరమ గోప్యము యెవరెరుగరోయయ్య । నాపలుకు మదిలోన నాటిన వారికే । యిది నిజమయ్యా । నరులార । మీమది దెలియరయ్యా ॥

ఓ, శిష్యుడా ! యెవ్వడైనను సద్గురుమూర్తి శ్రీపాదారవిందములను చక్కగా నాశ్రయించలేదో వాడు యీ గ్రంథమును చదివినను ఇతరులు చదువుచున్న వినినను దాని నిర్ణయము తెలుసుకో లేక వెళ్ళిపోవును. ఇది సత్యమని మనంబున దెలియ వలయును. యీ పరమ రహస్యమగు శక్తి ద్వయ నిరాసకంబైన అచల పరిపూర్ణ ప్రబోధను ఎవ్వరు యెరుంగజాలరు. నా మాటనమ్మి సద్గురుని పాదపద్మముల ననుసరించి వారివలన అచల పరిపూర్ణ పరబయలును యెరుకను వస్తునిశ్చయముగా తెలుసుకొని యెరుకను విడిచేపద్ధతి విని తాను స్వయముగా యీ గ్రంథమును చదువుకొనిన వారికి దీనిలోని పరమ రహస్యము తెలియగలదు. ఇతరులకు తెలియబడదని భావము.

## —(గురువాజ్ఞాను వర్తన)—

(౨౩౭) పరిపూర్ణము నెరుకను నే । నెరిగించితి నీవు రెంటి నెరిగితివి గదా । యెరుకను గురుదక్షిణగా । మరి వేగిరమివ్వు వటే । మాట లేమి

టికీ । యెరుకతో యింక కూటమేమిటికి । పరులునేనని యేటి భావము భావమై । నిరతాము వొకరీతి నిలచుండు మిక వట్టిమాటలేమిటికి యెరుకతో యింక కూటమేమిటికి ॥

ఓ, శిష్యుడా ! జనన మరణములేని అచల పరిపూర్ణ పరబాహ్యమును జనన మరణములు కలిగియున్న యెరుకను ఈ రెంటిని నేనీకు తెలిపితిని. నీ వారెంట నిర్ణయము చక్కగా ఉన్నది యున్నట్లు నెరింగితివి గదా । ఆ యెరిగిన యెరుకను త్వరగా గురుదక్షిణ ఇమ్ము, వట్టిమాటలు ఎందుకు ఇంక యెరుక సాంగత్యము చేయకూడదు. పరులనీ నేనని భావము లేక ఎల్లప్పుడు ఒక్క విధముగా నిలివియుండుము యని భావము.

౨౩౮. నేమొదట నిన్ను గనుగొని । యేముక్కలు నీదువెవులో నిమిడిస్తినో । నీవాముక్కల మూడింటిని । యేమాత్రము మరువకుండ । యీ బోధనిస్తీ । అంతకెయింతగా బోధజేస్తి । ప్రేమతో జదువు మిదేమార కెప్పుడు । కామితార్థము నిచ్చు । పోమీ యింటికి । దీవించీ బోధనిస్తి అంతకెయింత । గా బోధజేస్తి ॥

ఓ, శిష్యుడా ! పరిపూర్ణ మొకట లేనెరుక యొకటి యీ రెంటిని ఎరిగి ఎరిగిన ఎరుకను విడువుమని యీ మూడు వాక్యములు ఆదిలో నేను నిన్ను జూచినప్పుడు నీ చెవిలో నాటునట్లు చెప్పియున్నాను. ఆ మూడు వాక్యంబులు మరువక యుండునట్లు వస్తునిశ్చయము తెలియజేసి ఇంతగా బోధజేసితిని. దీనిని సదా మరువక చదివిన యెడల నీ కోరిక ప్రాప్తింప జేయును గనుక ఆశీర్వచన పూర్వకముగా యీ బోధ నీకు ఇచ్చినాను ఇక నీ ఇంటికి నీవు వెళ్ళవలయునని భావము.

౨౩౯. జతనముగ దాచి చదువుము । రతనంబుల హారమిదియు రసికులగళమా యతనము దీనికినే బహు । యతనము గావించి తెచ్చి । యిస్తిరనేడూ । బోధకు బందో । బస్తారచూడూ । రతనాలెట్లవు రాళ్లు । రతనాలంచని యంటె । రతనాలీ పద్యాలే రసికులెరిగెద రివినీ । కిస్తిరనేడూ । బోధకు బందో బస్తార చూడూ ॥

ఓ, శిష్యుడా ! శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణతత్వ కందార్థ హారము రసజ్ఞుల కంఠమందుండు రత్నముల యొక్క హారము ఇది. దీనిని అంతఃకరణముయందు భద్రపరచి చదువుము. ఇది యత్నపూర్వకముగా

ప్రయత్నముజేసి తెచ్చి ఇచ్చినాను. అచల పరిపూర్ణ ప్రబోధకు ఇది బందోబస్తు యగును. విచారించి చూడుము. రాళ్ళు రత్నములని చెప్పిన యెడల రత్నములు ఎట్లగును. ? యీ పద్యములే రత్నములు అయినా వీటిని రసజ్ఞులు. తెలుసుకో గలరని భావము.

(౨౪౦) నన్నాశ్రయించినావని । యన్నా యీ బోధనీకు ' అతుకుట కొరకై । యెన్నో యుక్తుల జెప్పితి । విన్నావాదీన్ని నీవు ' విడువకెప్పటికీ । నాయాజ్ఞాను । గడువ కెప్పటికీ । ననునీవు నిన్ను నేగన్నా వేళ్ళెట్టిదో ' నను। నీవు విడలేవు ' నిన్ను నే విడలేను ' విడువ కెప్పటికీ । నాయాజ్ఞను గడువ కెప్పటికీ ॥

ఓ, శిష్యుడా ! నన్ను నీవు ఆశ్రయించియున్నావని యీ అచల పరిపూర్ణ బోధను నీ మనంబున దృఢపడుటకై అనేక యుక్తులు జెప్పితిని. నీవు విన్నావు గదా. దీని నీవు ఎప్పటికి మరువవద్దు. నా యాజ్ఞను నీవు నతిక్రమించ గూడదు. నన్ను నీవు నిన్ను నేను జూచిన సమయము ఎటువంటిదో నన్ను నీవు విడలేవు. నిన్ను నేను విడలేనని భావము.

(౨౪౧) నీమానసమున సంశయ । మేమాత్రము నిల్పబోకు' మికనాతోడే । నామాట నిశ్చయమునే' నేమాత్రము దాచలేదు। నీతోడు సుమ్మీ। యింతకుమిక్కి । లికలేదు లెమ్మీ' నామీద తలపుంచు ననుమరువకిక నేను। నీమీద దయవుంతు। నిజమిందుకిదె వొట్టు ' నీతోడు సుమ్మీ । యింతకుమిక్కి లికలేదులెమ్మీ ॥

ఓ, శిష్యుడా ! నా సాక్షిగా నీమనంబున సందియము వుంచకుము. నేను చెప్పిన అచల పరిపూర్ణ ప్రబోధ నిజమైనది. నీసాక్షిగా యీ బోధయందు ఏలాటి మరుగువుంచలేదు. జనన మరణ భ్రాంతిరహిత విధానమునకు అధికమైన మార్గము ఎచ్చటలేదు గనుక లెమ్ము. ఇక నన్ను మరువక నాయందు ధ్యానము యుంచుము. సత్యముగా నీపైన కరుణ యుంచెదను. ఇందుకు ఇదే ప్రమాణము యని భావము.

(౨౪౨) నీగురుబోధను నీచే । బాగుగవిని నిందజేయు భ్రష్టుల మాటల్ ' లోగొని విడిచేపెది । నీకేగురు డీలాటిబోధ । నెరిగింపడో యీ ' యెరుకలోదె యెరిగించునో యీ ॥ ఆ గురుబోధల నన్నినే దెలిసుండి ' నాగురు బోధ । నేనయముగ నీకిస్తి । యెరిగించ డోయీ । యెరుకలోదె యెరిగించు నోయీ ॥

ఓ, శిష్యుడా ! నీ సద్గురు బోధను నీవల్ల చక్కగావిని దూషణచేయునట్టి భ్రష్టుల మాటలను విని యీ పరిపూర్ణబోధను విడిచేవుసుమా : ఎటువంటి గుర్వు

డై ననూ నీకు ఇటువంటి రాజమార్గము తెలుపడు. జనన మరణ రూపమగు ఎరుక మార్గములే తెలుపును. అటువంటి గురువుల మార్గములు అన్నీ నేను ఎరిగుండి నా సద్గురుమూర్తి తెలిపిన శక్తి ద్వయ నిరాసకంబైన సద్ద నిర్గుణ అచల పరిపూర్ణ ప్రబోధ నీకు చెప్పినాను యని భావము.

(౨౪౩) నిక్కము గ టీరపీచుల చిక్కనుమీ విచ్చరాదు ఫ యీ యెరుకన్ మక్కువ నేబోధించిన చక్కని బోధాగ్ని చేత । సాధించుపోరా । విచ్చేచింత । చాలించుకోరా । బోక్కామౌ యీ బోధ । కెక్కక యిడాను ! తక్కిన బోధల దిక్కు చూడక దీని । సాధించు పోరా । విచ్చేచింత చాలించుకోరా ॥

ఓ, శిష్యుశా ! యీ ఎరుక నిర్ణయము బీరకాయ పీచువలె చిక్కుగా యుండును. గనుక ఎరుకను విడదీయరాదు విడదీసితే లేకపోదు గనుక నీయని దానియందలి భ్రాంతివిడిచి నేను బోధించిన అచలబోధాగ్ని చేత సాధించుకొనుము. అనగా కాల్చివేయము. ఎరుకను విడదీయు తలంపు విడువుము, స్వల్పమైన ఈ పరిపూర్ణ బోధకు సమానమైనవి ఏ మార్గములు లేవు గనుక ఇతర బోధలను తలంచకుమని భావము.

(౨౪౪) పెద్దల నిందయొనర్చుకు। పెద్దల సేవించుకొరకు పిరిదివియకుమే। పెద్దలతో వాదించకు । పెద్దలు జెప్పేటి సుద్ది । పెద చెవుల వినకూ । పెద్దలు నడిచే । నడక నేమనకూ । పెద్దలకన్న నే పెద్దనంచను కోకు। పెద్దల గనుగొన్న ప్రియముతో మ్రొక్కుము । పెద చెవుల వినకూ, పెద్దలు నడిచే। నడకనేమనకూ

ఓ, శిష్యుడా ! పెద్దలను దూషించకుము, పెద్దల సేవించుటకై వెనుదీయకుము. ఏ పెద్దలతోటి వాదించకుము. పెద్దలు జెప్పెడి వాక్యములు అశ్రద్దతో వినకుము. పెద్దలు నడిచే నడక నేమనకుము. పెద్దలకంటె నేనే పెద్దననే గర్వము పొందకుము. పెద్దలను జూచిన యెడల వారికి ప్రేమతో నమస్కరింపుమని భావము.

(౨౪౫) తనకు శరవణన్న వారల మనసెట్టిదో । తరచిచూచి మరి తెల్పద గున్ । వినువారికి తగినట్టిది । యని రిట్లు మహానుభావు । లతిచాతుర్యమునా । వినికని నీమన సతిచార్యమునా । ఘనమైన యీ బోధ కరుణిస్తి దీన్ని । చచ్చి నదాక । నిదుర వచ్చినదాక । మరువాకు । మతి చాతుర్యామునా । వినికనినీ । మనసతిచాతుర్యమున.

ఓ, శిష్యుడా! తనకు శరణని సాష్టాంగ నమస్కారము గావించిన వారల మనోభావము ఎటువంటిదో విచారించి చూచి వారికి వినుటకు తగువైన బోధను

ప్రబోధించవలయునని అచల ఋషులగు స్వచ్ఛందులు నిర్ణయించినారు గనుక నీ మనోభావమును విని కని మిక్కిలి నేర్పుతో ఈ అచల పరిపూర్ణబోధను దయ జేస్తిని. దీనిని నీవు చచ్చేవరకు అనగా అహంపదార్థ రహితస్థితి కలిగేవరకు నిద్రవచ్చేవరకు మరువగూడదని భావము.

(౧౯౬) చెప్పదగు గురుడు బోధను। చెప్పినపనిజేసెనేని శిష్యాగ్రణికిన్। చెప్పదగదు చెప్పినపని। తప్పనివాదించెనేని దయదల్చి బోధా। యిద్దరికుండ దగు నిట్టి మేధ। చెప్పిముందుగ బోధచెప్పెడి పనులన్న। చెప్పగూడదువాన్ని తిప్పలబెట్టాక దయదల్చి బోధ। యిద్దరికుండ దగునిట్టి మేధా॥

ఓ, శిష్యుడా ! చెప్పినపని చేయునట్టి శిష్యునకు సద్గురుడు అచల పరిపూర్ణ బోధను చెప్పవలయును. చెప్పినపని తప్పని వాదించే శిష్యునకు యీ అచల పరి పూర్ణబోధ చెప్పగూడదు గనుక గురుశిష్యుల కిరువురికి ఇటువంటి నిర్ణయము వుండవలయును. సద్గురుడు శిష్యునికి ముందు పనులుజెప్పి తదుపరి అచల పరి పూర్ణబోధ చెప్పవలయును. శిష్యుని శ్రమలు పెట్టక ఈ పరిపూర్ణబోధ చెప్ప గూడదు అని భావము.

శి॥ సద్గురుడు శిష్యునికి ఏమి పనులు చెప్పును ? ఆ పనులు తప్పని శిష్యుడు ఏల నిర్ణయించును ?

గు॥ పరిపూర్ణబోధ వినుటకు ప్రథమ సాధనము త్రికరణశుద్ధి ప్రవర్తన **ఆత్మ, అంగ, స్థాన, భావ, శుశ్రూషలు అవసరము. ఈ** పద్ధతి స్థిరపడిన వారికే పరిపూర్ణబోధ చెప్పవలయును. ఈ నిర్ణయము స్థిరపడని వారికి పరిపూర్ణబోధ చెప్పగూడదని సిద్ధాంతము గనుక త్రికరణ శుద్ధి ప్రవర్తన **ఆత్మ అంగభావ** శుశ్రూష ప్రవర్తన పనులు ముందు ప్రబోధించి చేయించవలయును. **వేదాంత** ప్రబోధ సాధనచతుష్టయములు గలవారికి మనో బ్రహ్మపాద చతుష్టయము **అకాశ** బ్రహ్మపాద చతుష్టయము, అవాంతరవాక్య చతుష్టయము, మహావాక్యచతుష్ట యము ద్వారా వార్త్రికనిర్ణయము ప్రబోధించ వలయును మీరు బోధించు త్రికరణ శుద్ధి **ఆత్మ**అంగభావ శుశ్రూషపద్ధతి ప్రకృతి జన్యము గనుక **ఆ** పద్ధతి తప్పు. **అయినా** పరిపూర్ణ పరబయలు ఏదో **అది** నాకు ముందుగా **తెలియచేయండి. తదుపరి** మీరు నిర్ణయించిన పనులు ఆచరించెదనని వాదించు శిష్యునికి త్రికరణశుద్ధి చతు ర్విధ శుశ్రూషలు అలవడునంతవరకు పరిపూర్ణసూచన చేయకూడదని నిర్ణయము.

(౨౪౭) నాలుగు శుశ్రూషణములు । లోలత గావించుకొనుచు లోకాతీతం । బాలోకి పే గ దురి చే । యాలోకపు జోలవిడువు । మింతెచాలన్నా నీతోగూడ । యిది మరువకన్నా । కీలు దెలియని చదువు చాలాజదివెందుకు । చాలించి నీవిట్టి కీలు దెలిసితివేని । యింతెచాలన్నా । నీతో గూడ యిది మరువకన్నా ॥

ఓ. శిష్యుడా ! సద్గురుని అజ్ఞానుసారము చతుర్విధ శుశ్రూషలు యొనర్చి సద్గురుమూర్తిచే ప్రపంచాతీతమైన అచల పరిపూర్ణ పరబాహ్యమును అవలోకనము చేసి యీ ప్రపంచముయొక్క జోలిని నీతో కూడ విడిచిపెట్టుము. నీకు యింతే చాలును. యీపద్ధతి మరువకుము మర్మమెరుగని చదువులు అధికముగా చదువుట వలన ప్రయోజనములేదు. గనుక ఆ చదువులను చాలించి సద్గురునివలన మర్మము తెలిసిన చాలునని భావము

శి॥ శుశ్రూషాచతుష్టయము యొనర్చు విధానమెట్లు ?

గు॥ ఇతర విధము లగు శాస్త్రజ్ఞానము లెన్ని యున్నా గురునిర్ణయాత్మ జ్ఞానమునకు సరిపోవు అది కేవలము గురుగోప్యముగా నున్నది. ఆత్మయను రత్నము దేనినుండి చేజిక్కునో వేదాంత సిద్ధాంతమునందు ఏది ప్రౌఢముగా వర్ణింపబడి యున్నదో దేని ప్రఖ్యాతి ప్రపంచమందంతటా వ్యాపించియున్నదో, దేని ప్రకాశమువల్ల మనోబుద్ధ్యాది ఇంద్రియములు విషయగ్రహణ గావింప సమర్ధవంతము లగుచున్నవో, దేనిద్వారా అచల పరిపూర్ణపరబయలు గుర్తింప శక్యమగునో అది ఆత్మజ్ఞానమని నిర్ణయము. ఇట్టి ఆత్మజ్ఞానము పొందుటకు ఆత్మ అంగస్థానభావ శుశ్రూషలు లోలంగావించు కొనువారు పరిపూర్ణ బోధకు ముఖ్యాధికారులు వారే లక్షణయుతులు.

ఈ ఆత్మజ్ఞానమనే నేత్రమునకు గురుమూర్తి అనుగ్రహమువలన పరిపూర్ణబోధయనే కాటుక లభించిన యెడల ఆత్మయొక్క అస్తిక నాస్తిక పద్ధతి నశించును. అనగా పరిపూర్ణమున్నది ఎరుక లేనిది యని తెలిసికున్న తెలివి నశించును.

(౨౪౮) గురుసూచనైన నరులను మరిసురి వినుసునుచుజదువు మాపద్యములన్ । గురుసూచన యెరుగనియా । నరులను వినుమనుచు జదువ । నగుబాట వుగదరా । అది యెట్లన్న యిదుగో దెల్పెదరా । పురుషా సంగతిలేని పొలతి కొక్కోకకాన్త్ర । మరసిమెచ్చునెదాన్ని । యతిప్రౌఢ సతివలె । నగుబాటవుగ దరా అదియెట్లన్న । యిదిగో దెల్పెదరా ॥

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ పరబయలు సూచన అయినట్టి సజ్జను లను మా పద్యములు వినుమని పలుమారు చదువుము. సద్గురువు సూచన తెలియని వానిని ఈ పద్యములు వినుమని చదవడము పరిహాసమగును. ఎట్లనగా పురుష సాంగత్యము లేని స్త్రీ కళాశాస్త్రము చూసి ప్రౌఢస్త్రీవలె ఆనందించదని భావము

(౨౪౯.) ఎవరుంటె యేమిభయముర । సవరింతురు తప్పులుంటె సాధులు విన్నన్ । సవరించ నివ్వుమిదివిని । యవనీతులు నిందజేస్తె । అయ్యేదేమోయీ అందులో మనది పొయ్యేదేమోయీ । భవనాశ స్థితిలేని పద్ధాతి యీ బోధ । చౌరంగ వినిపించు చాటేల మాటేల । అయ్యేదేమోయీ । అందులో మనది, పొయ్యేదేమోయీ ॥

ఓ, శిష్యుడా ! పండితులుండిన సభలయందుగాని పామరులుండిన సభలయందుగాని ఎలాటి భీతిలేక ఈ కందార్థములు చదివి దీనియందలి భావమువినిపింపుము. ఇందులో దోషములను సజ్జనులుసవరింప దలచినచో సవ రింపనిమ్ము. అడ్డుపరచకుము దుర్జనులు నిందించినచో మనది పొయ్యేదేమీలేదు యీ గొప్పదగు అచలపరిపూర్ణబోధ జనన మరణ ప్రవాహమును ఇంకింపజేయు నది గావున నీవు చాటుమాటు లేకుండ సర్వజనులకు వినిపింపుమని భావము.

(౨౫౦) నాబుద్ధికి సరిపడ్డదె । నీబుద్ధేనానియెన్ని నేర్పుగనిలన్ । వీబద్ధుల యాబుద్ధులు । నాబుద్ధికి మెప్పురావు నాతండ్రివినరా । శాబాసు నిన్నే తండ్రిగనెరా యీబుద్ధి నికమాన కేబుద్ధి బూనాకు । యేబుద్ధి బూనీక । నీ బుద్ధి చెడిపోవు । నాతండ్రి వినరా । శాబాసు నిన్నేతండ్రి గనెరా ॥

ఓ, శిష్యుడా! యోచించి చూచినను నాబుద్ధికి సరిపడ్డది నీబుద్ధికాని మతాభి మానములో బంధింపబడిన బద్ధులయొక్క బుద్ధులు ఓ నాబుద్ధికి మెప్పుగావు నా తండ్రి వినుము. శభాష్ నిన్నేతండ్రి కన్నాడో ! ఇక యీబుద్ధి విడువకుము. ఏ బుద్ధి పట్టకుము ఏ బుద్ధి పట్టినను నీ బుద్ధి చెడిపోవునని భావము.

(౨౫౧) కొట్టితి తిట్టితి శ్రమలన్ । బెట్టితి నీమనవి చెవులబెట్టక పెడచె బెట్టితి మొట్టితి వెడలన్ గొట్టితి నీమనసుదెలియ కోపము లేకా । సరెతెలిసెనీ వోపికపోకా । పట్టుమిచ్చెద యింక వట్టేమి యని దయ । బుట్టియిచ్చితి బోధ, గట్టి వాడవురోరి । కోపాము లేకా। సరె తెలిసె నీ। వోపికపోకా ॥

ఓ. శిష్యుడా ! నీమానసమును ఎరుగుటకు కోపము లేకనే నిన్ను కొట్టితిని కష్టములు బెట్టితిని. నీయొక్క విజ్ఞాపన చెవినిచ్చి విననైతిని. తలపైన మొట్టితిని ఆశ్రమము నుండి బయటకు వెళ్ళగొట్టితిని అయితే నీపట్టుదల నాకు సంతోషము

కలిగించినది. కావున నీమీద నాకు పూర్ణమైన దయగలిగి నీకు పరిపూర్ణబోధ నిచ్చితిని. నీవు చాల గట్టివాడవని భావము.

(౨౩౨) నీవెంత కొట్టితిట్టిన। నేవిడిచేవాడగాను నీ చరణంబుల్। చావై నను పెండ్లై నను। నేవిడువ నటంటి వట్టి నిజభ క్తుడవెరా। నేగనుగొంటి। నీ నిష్ఠ నౌరా। కావున నీకిట్టి ఘనమైన యాబోధ వేవేగ దయజేస్తి। నీవిది విడువాకు। నిజభ క్తుడవెరా। నేగనుగొంటి నీనిష్ఠనౌరా॥

ఓ, శిష్యుడా! నీవు కొట్టినను, తిట్టినను నీపాదములు వదిలేవాడనుగాను చచ్చినను, వివాహమైనను నీ పాదారవిందముల వద్దనే కావలయును. మిమ్ములను వదిలేవాడను కాను. అనునట్టి సద్భ క్తుడవు సుమా! నీయొక్క నిష్ఠను నేను తెలుసుకొంటిని గనుక నీకు ఇటువంటి శ్రేష్ఠమైన అచల పరిపూర్ణబోధ. నేను అను గ్రహించితిని దీనిని నీవు విడువకూడదని భావము.

(౨౩౩) నానోటి మాటవెంబడి। తానెప్పుడు సంచరించె తగనీచిత్తం। చేనదిగనియీబోధ నిదానమునీకిస్తి దీన్ని। దాచుకోసుమ్మీ। నిత్యము నీవు చూచు కోనిమ్మీ। యేవరుడైనన్నీ బోధనడిగితె। వాని మనసరయాక వానికి జూపేవు। దాచుకో సుమ్మీ। నిత్యము నీవు। చూచుకోనిమ్మీ॥

ఓ, శిష్యుడా! నేను చెప్పిన మాట ప్రకారము నీచిత్తము సదా వర్తించడం నేను గురైరింగి శక్తిద్వయ నిరాసకంబైన ఈ అచల పరిపూర్ణబోధను నీకు ఇచ్చితిని దీనిని నీవు అంతఃకరణము నందు భద్రపరచుకొని ప్రతిదినము విశ్వాసముతో చూచుకొనుము. ఎవరైనను ఈ బోధను అడిగిన ఎడల వాని మానసమును గుర్తించక ఈ శక్తిద్వయ నిరాసకంబైన అచల పరిపూర్ణబోధ వానికి జూపగూడదని భావము.

## —(దృష్ట ద్రాష్టాంతములు)—

(౨౩౪) దృష్టాంత మెరుకకేదని। యోష్టము గదిలించగానె యొరులు కలనుచున్। ద్రాష్టాంతమడుగబోధకు। స్పష్టముగా కర్పూరము। దీపము జూప వోయీ। యీయుక్తిలో। పము జేయకోయీ తుష్టినొందెదరిట్లు దోచిచెప్పితివేని। శ్రేష్ఠామౌ యీబోధ చేకొన్నవారు దీపముజూపవోయీ। యీయుక్తిలోపము జేయకోయీ।

ఓ, శిష్యుడా! ఎరుకకు దృష్టాంతరము ఏది అని ఇతరులు నిన్ను విచారించగానే సురస్వప్నమనియు ఈ బోధకు ద్రాష్టాంతమేది యని యడుగ

గనే శక్తిద్వయ నిరసనమగు కర్పూరదీపమును జూపుము. ఈ యుక్తియందు తక్కువచేసి చెప్పకుము. ఈ ప్రకారము తెలిసి చెప్పిన యెడల ప్రశస్తమైన ఈ అవల పరిపూర్ణబోధ గైకొన్న స్వచ్ఛందులు సంతుష్టిచెందెదరని భావము.

## —(నిజశిష్య నిర్ణయము)—

(౨౪౫) జలము నెడబాయనొల్లని । జలచరముల రీతిబూని । సచ్ఛిష్యుడు। హృజ్జలజంబను పీఠముపై । నిలిపితరముమాని । సద్గురునే కొల్చుసుమ్మీ । తదూక్తుల । నే తల్చునమ్మీ । కలకాలమీరీతి గడుపూచునేప్రొద్దు । తలిదండ్రి దొరదాత దైవమనుచు గురువు । నేకొల్చుసుమ్మీ । తదూక్తుల నేతల్చునమ్మీ ॥

ఓ, శిష్యుడా ! నీటియందు నివసించు జలచరములగు చేపలు నీటిని విడిచి వుండేందుకు ఇష్టపడనట్లుగా సచ్ఛిష్యుడు తన హృదయపద్మమున సద్గురునినిల్పి ఇతర భ్రాంతులు విడిచిపెట్టి ఆ సద్గురుమూర్తినే సేవించుచు సద్గురుడు తెలిపిన యుక్తులను తలంచుచుండును. ఈ విధముగా సద్గురువ్రతము సర్వకాలము జరుపుచు నతడే తల్లిదండ్రి దొరదాత దైవమని సేవించును.

నీటిని విడిచిపెట్టిన చేపలకు మరణము కల్గుననే భీతి ఎట్లుకల్గునో అట్లు సద్గురుధ్యానము విడిచిన శిష్యునికి మరణము కల్గును. అందువల్ల పునర్జన్మ కల్గును అనే భీతి యుండునని భావము.

(౨౪౬) సతి పొరుగూరికి బోయిన । పతిరాకడకోరినట్లు భావములోనం। మతిమంతుడు సచ్ఛిష్యుడు । సతతముగురు రాకగోరు సత్యాము వినరా । వాని తోటి సాటెవ్వరనరా । హితుని రాకడను స్నేహితుడు గోరినయట్లు । అతి దరిద్రుడు ద్రవ్య తతిరాగోరినయట్లు । సత్యాము వినరా । వానితోటి । సాటెవ్వరనరా ॥

ఓ, శిష్యుడా ! పరదేశము పోయిన తన భర్తరాకను భార్య నిరంతరము కోరుచుండునట్లును బుద్ధిమంతుడైన సచ్ఛిష్యుడు ఎల్లప్పుడు సద్గురు రాకనే కోరుచుండును. ఇది సత్యము. వానితోటి సమానులు ఎవ్వరుకారు. ఇదియుగాక అన్యోన్య స్నేహితులు దూరదేశమునందున్న స్నేహితుని రాకడను గోరుచున్నట్లు అతిదరిద్రుడైనవాడు ద్రవ్యమునే రాగోరుచున్నట్లు అని భావము.

(౨౪౭) అతివెలరతిచతురతలా యతివలచే వారి తంత్రపు । అరయరనుచు। తత్పతులరయరె రతినట్లనె । మతిమంతుడు గురుడుబోధ । మానీనగానీ । తద్బోధతా । మానాడు పూనీ । అతి దరిద్రునిచే విద్యార్జించి నతగాడు । చతురుడై విత్తమార్జనజేయు పంతాలు । మానీనగానీ । తద్బోధతా మానాడు పూనీ ॥

ఓ, శిష్యుడా ! స్త్రీలయొక్క రతినేర్పు ఆ స్త్రీలయొక్క తండ్రులు ఎరుగరు గానీ వారి భర్తలు ఎరుగుదురు. అట్లే సద్గురుడు పరిపూర్ణ పరబయలును సూచనజేసి మానివేసినను బుద్ధిమంతుడగు శిష్యుడు బోధమానక తన చతురతచేత బోధించుచునే యుండును. ఎట్లనగా మిక్కిలి దరిద్రుడైన పంతులువే విద్య నేర్చుకున్న విద్యార్థి తన నేర్పుచేత ధనము సంపాదించునట్లు అనగా పంతులు సంపాదన విడిచినను విద్యార్థి విడువనట్లు గురుమూర్తి బోధాభివృద్ధి విడిచినను శిష్యుడు విడువక అభివృద్ధి చేయునని భావము.

(౨౫౮) దేశికుని చరణతీర్థము । కాశీ గంగయని । గురుని గనుగొన్నను విశ్వేశుడని యతడు తని కుపదేశించొనరించి నట్టిదే । తారకమనీ। మనసందుతా। నీతీరునగనీ । యేసీమ యందున్న కాశి ప్రయాగ రామేశుని పురమై । ప్రకాశించు నాసీమ । దేతారకమనీ । మనసందుతా । నేతీరునగనీ ॥

ఓ, శిష్యుడా ! దేశికుని పాదతీర్థమే కాశీగంగ యనియు సద్గురుని దర్శనమే విశ్వేశ్వరుని దర్శనమనియు తనకు వుపదేశించిన మంత్రము తారకమనియు మనంబున ఈ ప్రకారము తెలుసుకొనిన సూరిజనులు ఏదేశమందు యుండినను ఆదేశము కాశిగాను, ప్రయాగగాను, రామేశ్వరముగాను ప్రకాశించునని భావము.

శి॥ పరుని దర్శనము విశ్వేశ్వరుని దర్శనముగా భావించుటకు కారణమేమై యుండును.

గు॥ అనంతకోటి బ్రహ్మాండములను నిర్మించినవాడు ఆదిపురుషుడు. అతనినే సృష్టికారకుడనియు, బ్రహ్మయనియు చెప్పుచున్నారు. ప్రపంచములో సృష్టించిన వానిని పోషించినవాడు విష్ణువనబడుచున్నాడు. సంహార కారకుడు రుద్రుడనబడుచున్నాడు అనగా దుఃఖములు నశింపజేయువాడు రుద్రుడనబడుచున్నాడని నిర్ణయము.

పరమశివుడు దాక్షాయిణీదేవిని వివాహమాడి ధర్మశాస్త్ర సమ్మతముగా గృహస్థ ధర్మమును చక్కగా నిర్వర్తించెను. అతడు అంతటికి ప్రభువు గనుక ఈశ్వరుడని సార్థక నామధేయు డయ్యెను. అందువలన పరమేశ్వరుడని ప్రఖ్యాతి బడసెను.

ఆ కాలమున తండ్రి యవమానముచే సతీదేవి యోగాగ్నియందు శరీరము వదలి పర్వతరాజగు హిమవంతునికి పార్వతియై జన్మించెను.

పురహంతుడగు మహేశ్వరుడు దక్షుని యజ్ఞము నాశన మొనర్చి దక్షిణామూర్తి స్వరూపముతో వైరాగ్యము నొంది జటావర్గములు ధరించినవాడై వట వృక్షమూలమున స్వస్తికాసనమున కూర్చుండెను.

అష్టమూర్తులలో నొకటియగు మహాగ్నిహోత్రమును నియతితో నర్చన మొనర్చెను. మహావేద మహాబంధముల ధరించి నిర్వాణమౌన ముద్రధారియై ఆ పరమశివుడు అష్టాంగయోగముల నభ్యసించి యోగాగ్నుడై తపోనిష్ఠను నొనర్చెగాని ఆత్మస్థితి లెస్సగా నాలోచించి అంతయు నశాశ్వత మని గుర్తించి పరబ్రహ్మ మొక్కటిమాత్రము అనంతమై అచలమై యున్నది. అది యొక్కటియై శాశ్వతమై యున్నదని మనస్సులో ధరించి యీ మార్గము నంతయు స్థితి కారకు డగు విష్ణునకు ప్రబోధించి యున్నాడు గనుక అట్టి ప్రబోధను బోధించే గురు దేవుల పాదతీర్థము గంగా జలమని వారు విశ్వేశ్వరుడని వారు నివసించు స్థానము కాశీ, ప్రయాగ, రామేశ్వరమని నిర్ణయము.

(అవ) గురు చరణజలము ! గోదావరి యని । గురుమూర్తి రామభద్రుం డని । తత్పురమును భద్రాచలమని ; గురు మంత్రమె తారకమని గురిగలిగినట్టీ తిరిగిరాని । మరుగెరిగినట్టీ । నరుడున్నచోటె సుందర శేషగిరిభద్ర । గిరి రంగ నాయక పురమాన దగియుండు । గురుగల్గినట్టీ । తిరిగిరాని మరుగెరిగినట్టి॥

ఓ, శిష్యుడా ! సద్గురు పాదతీర్థమే గోదావరి యనియు సద్గురు మూర్తియే రామభద్రుండనియు, అతనుండు ప్రదేశమే భద్రాచలమనియు సద్గురుడు వుప దేశించిన మంత్రము తారకమని గురెరిగి తిరిగి జన్మకురాని మర్మము తెలిసిన స్వచ్ఛందుడు యుండునట్టి ప్రదేశమే శేషాచలమని, భద్రాచలమని, శ్రీరంగమని నిర్ణయమని భావము.

శి॥ సద్గురుమూర్తి రామభద్రుండని పాదతీర్థము గోదావరి యని నిర్ణ యించుటకు కారణ మేమైయుండును?

గు॥ దక్షిణామూర్తి యగు పరమశివుడు తెలిపిన అచల పరిపూర్ణ పర బ్రహ్మమును తన ఆత్మస్థితిని గూర్చి స్థితికారకుడగు విష్ణువు విచారించి చూడగా ఈ లోకములకు లోకేశ్వరులకు నేను స్థితికారకుడను, వరదుడను, భక్తుల వాంఛల నెరవేర్చువాడను అట్లయ్యు నా ఆత్మనుగూర్చి విచారించగా ఇది యంతయు అసద్రూపమనియు, అవాసురమనియు, అశాశ్వతమనియు ఏనుగు తొండమువలె జీవితము చంచలమనియు దీని రహితమగు ఈ పూర్ణాచలమార్గ

మొక్కటే శాశ్వతమని తెలుసుకొని పరమశివుడు తెలిపిన అచలపరిపూర్ణ పర బాహ్య నిర్ణయమే సత్యమైనదని తిరిగి జన్మకురానిది ఇదేయనియు నిర్ణయించు కొని లోకబాంధవుడగు సూర్యునికి అచల పరిపూర్ణ ప్రబోధ బోధించినాడు గనుక ఇట్టి పరిపూర్ణబోధ బోధించు సద్గురుల పాదోదకమే గోదావరియని ఆ సద్గురు మూర్తి యే రామభద్రుడని అతడుండు ప్రదేశమే శేషాచలమని, భద్రాచలమని, శ్రీరంగమని నిర్ణయము.

(౯౭౦) శాంగితము నెరిగి సద్గురు । పుంగవుచే నరుడు భుక్తి । ముక్తి క్రియలన్ । సంగాసంగము లెడలిన । శృంగారమె వానివేష్ట చూచేవారలకూ । వాడున్నట్లు తోచేవారలకూ । మంగళసూత్రమే భంగి శృంగారమొ । శృంగార వతికి । యశృంగార వతికిట్లు చూచేవారలకూ వాడున్నట్లు । తోచేవారలకూ ॥

ఓ, శిష్యుడా ! సద్గురుమూర్తి చే శక్తిద్వయ నిరాసకంబైన అచలపరిపూర్ణ పరబయలును దర్శించినవాని భుక్తి ముక్తి క్రియలయొక్క సంయోగ వియోగము అనగా పట్టు విడుపులయొక్క నడతలు చూచేవారలకు వారున్నట్లు తోచెడి వారందరికి శృంగారముగా యుండును అవి యెట్లనగా మంగళసూత్రము యొక్క శృంగారము సౌందర్యవతి యసౌందర్యవతికి ఎట్లు శృంగారము కలుగు చున్నదో అట్లు సచ్ఛిష్యులయొక్క శృంగారము లోకులకు తనవారలకు శృంగార ముగా యుండునని భావము.

(౯౭౧) దూరమునసుండి విన్నను జేరును సజ్జనుడు । గురుని చెంతకు బోధం। గోరి దుర్జనుడు గోరడు దూరస్థుడుగాక గురునితో గూడియుండి। యెట్లని యన్న । దూరాన నుండీ । కోరీతుమ్మెదతమ్మి । జేరితేనియ గ్రోలు । యన్న । నారీతి నెరుగావు। చేరి కప్పలుతమ్మి। తోగూడి యుండీ। యెట్లని దూరాననుండీ ॥

ఓ, శిష్యుడా! మంచివాడు దూరముగాయుండి సద్గురుని లక్షణము విన్నను ఆ సద్గురుని ఆశ్రయించి అచల పరిపూర్ణబోధ తెలుసుకొనును. చెడ్డవారు సద్గురు సమీపము యందున్నను అచల పరిపూర్ణ ప్రబోధ యపేక్షింపడు. అనగా తెలుసుకోడు. ఎట్లనగా భ్రమరము దూరముగాయుండి మధువును అపేక్షించి తామరకమలము వద్దకు పోయి మధువును గ్రహించును. కప్పలు తామర కమ లముయొక్క సమీపమున యున్నను ఆ తామరకమలము నందున్న మధువును తెలుసుకొనలేవు, గ్రహించలేవు యని భావము.

(౯౭౨) తన గురుబోధను తాజదివిన విను జనవితతిమదికి వింతై యీ బోధను నేర్వకున్న వ్యర్థము । జననంబని తోచిశరణు । శరణానెటట్టూ। వెంటనె

వాండ్లూ । దరిజేరెటట్టూ । ఘనమైన యుక్తి జేసిన వాడెశిష్యుడు । అనుమాన మేమిందు గనరాదు। వినవోయి శరణానెటట్టూ। వెంటనెవాండ్లు । దరిజేరేటట్టూ॥

ఓ, శిష్యుడా ! తన గురుబోధను తాను జదివినప్పుడు జనులందరికి ఆశ్చర్యము జనించి శక్తిద్వయ నిరాసకంబైన అచల పరిపూర్ణ ప్రబోధ తెలియ కుండిన యెడల ఈ మానవజన్మము ప్రయోజనము లేదని నిర్ణయించుకొని వారు వెంటనే సద్గురుని యాశ్రయించి శరణు శరణు యనునట్లు చేయవలయును అట్లు చేసినవాడే మానవ లోకకల్యాణ మొనర్చు నిజమైన శిష్యుడు. ఇందనుమాన మెంతమాత్రము లేదని భావము.

## —(గురు స్తవము :—

(౨౬౩) గురువర మీనాసందున। యెరుకను తెరగలిగి యుండె। యిన్నాళ్ళ గొలెన్ । కరుణా రసేక్షణములన్ । తెరదీశితి రెరుక మాటా । దీరెనిక్కడికీ । బాలుబోధ దూరేదెక్కడికీ పరిపూర్ణమును లేని యెరుకాను జూపించి యెరుకలేదని యంత్రియెరుకే లేదాయెను । తీరెనిక్కడికీ బాలుబోధ । దూరేదెక్కడికీ ॥

ఓ, సద్గురు శ్రేష్టుడా మీయొక్క నాయొక్క మధ్యన ఎరుక యనెడి తెర గలిగి యుండెను. ఇన్నిదినములు సేవజేయగా దయారసముచే క్షణములో ఎరుక యనే తెర దీసివేసితిరి. ఇంతటితో ఎరుకమాట తీరినది. గనుక శక్తిద్వయ నిరాసకంబైన అచల పరిపూర్ణ ప్రబోధ బాలును. ఇక చెప్పవలనసి పనిలేదు. యెందుకనగా అచల పరిపూర్ణపరబయలును లేని ఎరుకను వస్తునిశ్చయముగా చూపించి ఎరుక లేనిదని చెప్పితిరి. ఆతీరుగనేలేని యెరుక లేకుండా పోయెను గాని ఈ ఎరుక పరిపూర్ణమునందు దూరకపోయెనని భావము.

(౨౬౪) ధారుణి కొంత జరించి । విచారించితిగాని యీవిచారమునే నెవ్వారలు జెప్పగవినలే । దారయమీనోట విన్నానయ్యా గురుమూర్తి । నాతర మానుతి జెయ్యా మీకీర్తి । సారాసనయన పురారి నీరజ బృందారక ముఖులైన నేరారు మిముదెలియ నయ్యా గురుమూర్తి । నాతరమానుతి జెయ్యా మీకీర్తి॥ *

ఓ, అయ్యా సద్గురుమూర్తి ! జనన మరణ సంసారభ్రాంతి తొలుగు పద్ధతి తెలుసుకొనుటకు ఈ భూమియందు కొంతపట్టుకు సంచరించి విచారించితినిగాని ఇట్టి శక్తిద్వయ నిరాసకంబైన అచల పరిపూర్ణ ప్రబోధయొక్క విచారము ఎవ్వరు చెప్పగా వినలేదు. తమ నోటితోనే వింటిని గనుక తమ స్థితిని స్తుతించు టకు హరిహర బ్రహ్మాది దేవతలకు తరముగాదు గనుక మిమ్ములను స్తుతించుటకు నా తరముగాదు అని భావము.

(౨౬౫) ఘటమెదుట బెట్టిజూపిన । యటువలె బయలుండజూపి । యతి మాయలచే । నటియింపుచున్న యెనుకను । తృటిలో విడిపిస్తిరిపుడు ! దీరె మచ్ఛంకా । యిక బుట్టాదు యేరీతి శంకా । యెటుదోచ కిలువెళ్ళి యిటుమిమ్ము జూచిన। వ్పటినుంచీ దయజేసిప్పటిదాక బోధిస్తే తీరెమచ్ఛంకా। యిక బుట్టాదు యేరీతిశంకా॥

ఓ, సద్గురుమూర్తి ! కుండ యెదటబెట్టి జూపినటుల అచల పరిపూర్ణ పర బయలును వృంతజూపి అనేక మాయలచే నటియించుచుండెడి ఎరుకను క్షణములో విడిపించితిరిగనుక ఇప్పుడు నా సంశయము తొలిగినది. ఇక ఎటువంటి సంశయము పుట్టదు. జనన మరణ సంసారరహిత పద్ధతికి ముందుచేసిన కృషియందు నిర్ణయము తెలియక ఎటుతోచక ఇల్లువిడిచి ఇచ్చట నిమ్ము దర్శించినప్పటినుండి తమరు నన్ను కరుణించి ఇప్పటివరకు శక్తిద్వయ నిరాసకంబైన అచల పరిపూర్ణబోధ తెల్పితిరి గనుక నా సంశయము తొలగినదని భావము.

## —(గురుశిష్యోభయ నిర్ణయము)—

(౨౬౬) హృదయగ్రంధి విడుటకై సదమల యీ బోధదెల్ప జనదా గురుడై। వదలక చిత్తములో। గురుపదయుగళము దలపవలదే। భక్తుడైనపుడూ। భ్రాంతిరహితా సక్తుడైనపుడూ । కుదురాదు యివి రెండు గురుశిష్యులకు లేక । కదిలీకే లేనట్టి । ఘనబోధోక్త స్థితి । భక్తుడైనపుడూ । భ్రాంతి రహితాసక్తుడైనపుడూ॥

ఓ, శిష్యుడా ! సద్గురుడైనందుకు శిష్యుని హృదయ ముడిని విడిపించుటకు శక్తిద్వయ నిరాసకంబైన ఈ అచల పరిపూర్ణబోధ దయతో ఎరిగించవలయును. జననమరణరహిత ఆసక్తిగల శిష్యుడైనందుకు సద్గురు పాదపద్మంబులు మనంబున విడువక దలంచవలయును. ఈ రెండు పద్ధతులు గురుశిష్యులకు లేనియెడల పరిపూర్ణస్థితి వారలకు కుదురదని భావము.

(౨౬౭) గురుడాస వదలకుండిన । మరి శిష్యుడు । ద్రవ్యలోభమగ్నుండైనన్ । మరియాద దక్కదిరువుర కెరిగిండుము వీరలతి విహీనులోయన్నా । గట్టిగ దురభిమానులోయన్నా । గురుడు శిష్యుని కన్నకొడుకూగ గనకున్న। గురునిపై శిష్యా । డాగురి నిల్పత్తుండిన । హీనులోయన్నా । గట్టిగదురభి । మానులోయన్నా ॥

ఓ, శిష్యుడా ! సద్గురుడు ద్రవ్యాశగలవాడుగా యుండినను శిష్యుడు ద్రవ్య లోభము గలవాడుగా యుండినను ఉభయులకు మర్యాదగా నుండనేరదని తెలుసుకొనుము. సద్గురుమూర్తి సచ్ఛిష్యుని కన్న కుమారునిగా చూడకున్నను సచ్ఛిష్యుడు సద్గురుని తన తండ్రిగా చూడకున్నను వాస్తవముగా వీరిరువురును దురభిమానులును నీచులని భావము.

(౨౬౭) పతియైనను సతియైనను । సతిసాహస పరులుగాక యాంతర్యము నన్ । రతివేళ్ళ లజ్జపడ సంతతి గలుగదు చూడుపట్ల తగదు లజ్జింబా। గురు శిష్యాలు తగు లజ్జనొంబా । మతిని నీ విట్లు సమ్మతిజేసియేయే । సంగతి నన్నడుగుము బోధ । స్థితి నీకు దృఢపరతు తగదు లజ్జింబా । గురుశిష్యాలు । తగు లజ్జనొంబా॥

ఓ, శిష్యుడా ! పురుషుడైనను, స్త్రీయైనను రతికాలమందు సమానపరులు గాక సిగ్గుపడినయెడల సంతానము కలుగదు. అదేపద్ధతిగా గురుశిష్యులు ప్రబోధ సమయమునందు మనోసంకల్పములు వదలి సమర్థులై పరిపూర్ణబోధ విని కన వలయును. గనుక నీ మనంబున ఈ ప్రకారము యనుకూలపర్చుకొని ఏఏ విష యము తెలుసుకోవలసి యున్నవో అడుగుము. నీకు వస్తు నిశ్చయముగా తెలియ జేసి పరిపూర్ణస్థితి కలుగజేసెదనని భావము.

(౨౬౮) అడవి ఫుసిరికైయు జలనిధి । బొడమిన లవణంబటంచు బొగడిన రీతిం ! పుడమిని యీ స్థలమందున । కడువేడుక నీవునేను । గలుసూటవినరా । నీనాప్రేమ ! కలిసెకనుగొనగా । విడలేవు నీవునిన్ను విడలేను నే నన్ను । పొడ జూచినీవు నేనెక్కడబోక నిలిచిట్లు । కలుసూట వినరా నీ నా ప్రేమ ! గలసె గనుగొనరా॥

ఓ, శిష్యుడా ! అడవిలోగాచిన వుసిరికాయ సముద్రజలమున గలిగిన ఉప్పు నొకచోటికి జేరి ఎటువలె రుచి పుట్టించునో అటువలెనే ఈ భూమియందు ఎక్కడనో పుట్టిన నీవును, ఎక్కడో పుట్టిన నేనును ఈ స్థలమునందు కలిసి శ్రీ కృత్రిమ నిరాసకంపైన పరిపూర్ణ బోధవల్ల కడువేడుకగా నున్నది జనన మరణ రహిత పద్ధతియందు నీనా ప్రేమలు కలిసిపోయినవి. వానిని విడ దీయుట కెవరితరముగాదు అందువలన నీవు నన్ను విడిచియుండలేవు. నేనును నిన్ను విడిచి యుండలేను. నిన్ను నన్ను చూచుకొనునప్పటినుండి ఇప్పటివరకు ఎచ్చటికి పోక ఇచ్చటనే యున్నాము అని భావము.

(౨౨౦) కూడి గురుశిష్యు లిద్దరు । వేడుకతో బయలువున్న విధ మెరిగెరుకన్ । వీడిరిది లేనిదని మాటాడుటకిక యేమిదోచ । దది యేమోకాని। వింటిరెమీరలది । యిందులోని। జాడ మీకెరుకాని వేడీతి వినుమంచు। యీడీకి సరిము । చ్చటాడూట కికదోచ । దదియేమో కాని । వింటిరెమీర । లిదియిందు లోని ॥

ఓ, శిష్యుడా! గురువును శిష్యుడును ఇరువురును ఒకచోటజేరి సంతోష ముతో అచలపరిపూర్ణ పరబయలును తెలుసుకొని లేని ఎరుకను లేదని విడివిరి కనుక ఇక పలుకుటకు ఏదియును తోచదు. అదియేమో అయినను ఈ గ్రంథ ములో యున్న పద్ధతి మీరు వింటిరిగదా అయితే ఆ జాడ మీకు తెలుసునని ఈ గ్రంథము వినుమని ప్రార్థించితిని. ఇంతటితో సరిపాయను ఇక మాటలాడు టకు తోచదని భావము.

## —(కపటశిష్య నిర్ణయంము)—

(౨౨౧) పరిపూర్ణబోధ దెల్పే పరియంతము సేవజేసి । బహునమ్మికగా । గురుమూర్తికి తరువాతను । మరి కన్నుల గననివాని । మార్గము ఛీ ఛీ తలచ రాదా మాట ఛీ ఛీ ఛీ । గురువాజ్ఞ యివనీదే గురువై శిష్యుల గూర్చి । గురుబోధ దెల్పేటి గురువంచకుని యొక్క । మార్గాము ఛీ ఛీ । తలచరాదామాట ఛీ ఛీ ఛీ॥

ఓ, శిష్యుడా ! సద్గురుడు తనకు అచల పరిపూర్ణబోధ ఎరిగించిన దాక మిక్కిలి నమ్మికతో సేవలుజేసి ఆ బోధను గైకొని తదుపరి ఆ సద్గురుని కన్ను లతో జూడనివాని నడకలు ఛీ ఛీ సరికావు. అటువంటి వాని మాటలు ముమ్మాటికి వినకూడదు. సద్గురుడు వానికి ఆజ్ఞ ఇవ్వనిదే వారు గురువై శిష్యులనుజేర్చి పరిపూర్ణబోధ నొనరించు గురుద్రోహి నడతలు సరియైనవికావు వాటిని ముమ్మా టికి తిరస్కరించవలయునని భావము.

(౨౨౨) తన శిష్యులు విని తనపతి । వినయంబున గొల్చుకొరకు వినుతి యొనర్చున్ తన గురువును। గురుడింటికి జనుదెంచిన జావి శుశ్రూషొనర్చ కుండూ । లేమినిదెల్పి । చనుమానుచుండూ । వినుము కుచ్చిత శిష్యాగ్రణివీడు వీడెట్లు ఘనబోధోక్తస్థితి కనుగొను గురునకు శుశ్రూషొనర్చకుండూ। లేమినిదెల్పి చనుమానుచుండూ ॥

ఓ, శిష్యుడా ! తన శిష్యుడు తనకు వినయపూర్వకముగా సేవలు జేయుట కొరకు తన గురువు సమీపమున లేని సమయమున తన గురువును తన

లోకమని స్థావరజంగమ జీవుల నివాసము మర్త్యమని, అధఃభాగము పాతాళ మని నిర్ణయించి యున్నందున హిరణ్మయ కోశమగు ప్రత్యగాత్మను, ఆయా లోక నివాసమునకు తగుకర్మ యొనర్చును. మరియు ప్రజ్ఞానంబ్రహ్మ అహం బ్రహ్మాస్మి, తత్వమసిబ్రహ్మ, అయమాత్మ బ్రహ్మయను, నిర్ణయ పద్ధతుల ద్వారా కూటస్థ బ్రహ్మములో ఏకత్వసిద్ధికి ప్రయత్నించును. లోకంబులు, లోకేశులు, ప్రళయము పొందినట్లు, అయమాత్మ బ్రహ్మయని నిర్ణయించుకొన్న తాను విషయవాసనలో మరణించి ఆయా కర్మ ఫలములు క్షీణించగనే జన్మాదులు పొందెదరు.

శి॥ పుట్టిచచ్చేలోపల, పరబయలు వున్నట్లు తెలిపితే, ఎరుక యేలోక మున నిల్వజాలక ఎట్లు పోవును ?

గు॥ ఎరుక స్వరూపములగు, జ్ఞాతజ్ఞాన జ్ఞేయములు దృక్కు దృశ్యము, ద్రష్ట, కర్త, కర్మక్రియలు, యనునట్టి త్రిపుటి ద్విపుటులు కూటస్థ ఎరుకయందు (అయమాత్మబ్రహ్మ) యను పద్ధతిగా లీనమైననూ, అనగా, (నీటిని వస్త్రగాలి తము పట్టి దానినుండి తరంగములు వేరుజేయుటకు వీలుకాని పద్ధతిగా) కూటస్థ బ్రహ్మమునుండి త్రిపుటులను వేరుజేయుటకు వీలుగాకున్ననూ, పరబయలుకు ఎరుకకు యేలాటి సంబంధము లేనందున ఎరుక తన వునికిని అశాశ్వితమని తెలుసుకొని, యేలోకమున లేకుండా పోవును.

శి॥ పరబయలును తెలియని ఎరుక, పుట్టుచావులు కలిగియుండుటకు కారణమేమై యుండును ?

గు॥ వేదనిర్మితమగు కర్మ ఫలభ్రాంతి. వేదాంత నిర్మితమగు జ్ఞానఫల భ్రాంతిలో చిక్కుకొని జన్మాదులు పొందుచుండును.

(౭౯) వినుమూర్ఖనాభి ! తాబుట్టిన మీదట సృజనచేయు ! దినము హరించున్ ! ఘనమగు పటశతకోట్లను । తనలోపలి దారమునను । తానట్టె జనును । అట్లనెయెరుక తాబుట్టికననూ । పనిబూని బ్రహ్మాండ భాండానంతము లాను । క్షణములోపల ద్రుంచి । కనరాక వేవేగ ! తానట్టె చనునూ । అట్లనె యెరుక తాబుట్టికనునూ !

ఓ, శిష్యుడా ! శ్రద్ధతో వినుము. సాలెపురుగు పుట్టినపిదప తనలోపల నున్న జిగురులో అనంతములగు పటముల నల్లుచూ, దానియందు చిక్కియున్న మసకముల దినుచూ, ఆనందముతో యుండునుగాని, పుట్టినమండి ప్రతిదినము,

## (బోధానర్హులు)

(౨౨౫.) జ్ఞానవైరాగ్యభక్త్య । సమాన నదీస్నాన దేవమంత్రపఠన తథ్యాన మఖ తంత్రములు పర । మానిని రతి గోరునట్టి । మనుజా సంఘముకూ బోధను దెల్పు మనిన వారలకూ । తాను బోధించుట తగదు బోధించితే । తాను నేనను భ్రాంతి తలగేదేలాగట్టి । మనుజా । సంఘముకూ । బోధనుదెల్పు మనిన వారలకూ ॥

ఓ, శిష్యుడా ! జ్ఞానము, వైరాగ్యము, భక్తి వాటితో సమానమగు నదీ స్నానము దేవతామంత్ర పఠనము వాని కనుకూలమైన ధ్యానమును యజ్ఞమును తంత్రములును మోక్షము నిచ్చునవియని భ్రాంతితో ఆచరించేవారు అచలబోధ నెరిగించుమని కోరినను వారికి బోధ చేయకూడదు ఎందుకనగా అట్టివారికి ఈ అచలబోధ దెల్పినయెడల మోక్షాపేక్షయను ద్వంద్వభ్రాంతి నశించదని భావము.

## (అశరీర పద్ధతి)

(౨౨౬.) ఒంటుకుదాపల బిందోయిం । ట్లంటించిన కొలది లెక్క యధికంబగు నా । వొంటుకు వలపలబిందోయిక । టంటించిన లెక్క ఉత్కయ్యో గదనోయీ । వొంటుండి లేం దొగదనోయీ । తంటాతీరును జూడు దానివలెనే యెరుక । కంటెబయలును తాను గలిగుండి తనకుత్కయ్యోగదనోయీ । వొంటుండీ లేం । దొగదనోయీ॥

ఓ, శిష్యుడా ! ఒకటియను అంకెను వేసి దానికి ఎడమ ప్రక్కన సున్నలుగాని, అంకెలుగాని వేయుచున్న కొలది లెక్క అధికమగుచుండును. ఆ ఒకటికి కుడిపక్క సున్న పెట్టినవో లెక్క ఉత్తదియగును గనుక ఒంటు వుండి లేనిదేయగును. అటువలెనే సకల సృష్టికి కారణమైన ఎరుకయొక్క మూలము అచల పరిపూర్ణ పరబయలుయందు లేదని తెలిసిన ఎరుక శూన్య మగును. అయినా ఎరుక వున్నట్టు తోచిన ఒకటి లేనిదగునట్లు ఎరుకలేనిదే యగునని భావము.

(౨౨౭.) నీ కలలో నిను నన్నును । లోకుల లోకముల జూచి లోపలి భ్రమచే । నాకరుణబడసి మేలుక చేకొని కలకల్లజేసి । చేరేదవెటకో । సర్వము నీతో చేరినీయెటకో । ప్రాకాటముగా బట్టబయ లెరుకలీ రీతి । నీకు దెలిసినమీద నిలువాక వేవేగ । చేరేదవెటకో ! సర్వమునీతో చేరి నీయటకో ।

ఓ శిష్యుడా ! ఎరుకయను ఈ కలలో నిన్నును నన్నును లోకులును లోకములను నీలోపలి భ్రమచేత కనుగొని నా కరుణాకటాక్షము బొంది అచల పరిపూర్ణ బయలుయను మెలుకువ గైకొని ఎరుకయను కలను కల్లగాజేసి నీవు ఎప్పటికి పోవుదువో అపటికి నీతో సర్వము పోవును. ఈ ప్రకారముగా అచల పరిపూర్ణపరబయలు మూలములేని ఎరుక స్పష్టముగా నీకు తెలిసిన యెడల నీవు నిల్వకపోవుదువని భావము.

(౨౫౮) కలనెడబాసిన మనుజులు । కలలోపలి పనులు చేయ కలవా రసనా । కలవారుగారు వారల । వలె యెరుకను గురుని చేత । వదలెరుక లోనా । గలపని చేయ వలదెరుకలోనా । కలవారంచని నోట పలుకూట మర యాక । పలికినవారికి తొలగాదు పాపాము । వదలెరుకలోనా । గలపని చేయ । వలదెరుకలోనా ॥

ఓ శిష్యుడా ! ఎరుకయను కలను విడిచి పరిపూర్ణ పరబయలున మేలుక జెందియున్న స్వచ్ఛందులు ఎరుకపద్ధతులగు కలకార్యములు చేయుచున్నను వారు కలవారు కారు. సద్గురు కరుణచే నెరుకను విడిచి పరిపూర్ణ స్థితి కలిగి యున్న సూరిజనుల యునికి నెఱుగక వారుకూడ నెరుకలోనివారేయని నిర్ణయించు వారలకు అంతఃకరణ దోషము అనుభవింపక తప్పదనిభావము.

(౨౫౯) క్షితిలోన నరుడు పక్వాన్న । తతిని దిని కక్కిమరల నాకునె యతిసంస్కృతి విడిచి తిరిగి పూనునె । వితరణ శాలిచ్చినట్టి । విత్తాముడిగీనె । సత్యావాదీ । సత్యాముడిగీనె । ప్రతిలేనిగురుబోధ స్థితిజెంది యెరుకాని । గతి సంగ్రహించువాడు । కృతకృత్యుడిచ్చిన విత్తాముడిగీనే సత్యావాది సత్యముడిగీనే॥

ఓ. శిష్యుడా ! ప్రపంచమునందు ఏ మానవుడైనను భక్ష్యభోజ్య చోష్య లేహములనెడి పక్వాన్నములు భుజించి కక్కి మరల నాకడు. యతి సంసారమును విడిచి తిరిగి పూనడు. దాత ఇచ్చిన ధనము మరల గ్రహించడు. సత్యవంతుడు సత్యము తప్పడు. అటువలెనే బయలులేనట్టి పరిపూర్ణ పరబయలును మూలము లేని ఎరుకను విడిచిన ఏ శిష్యుడు ఎరుకభ్రాంతిని గ్రహించడని భావము.

(౨౬౦) జగము వలన సంకల్పము । జగమా సంకల్పమునను జనియిం చునువే। రగుపడదు జన్మమందిర । మగుపడ వెడబాసి నిల్వ । వా రెండెన్నటికీ బయలును గనినీ । వీరెండెన్నటికీ । యిక దల్పబోకూము యివిబుట్టుటుళ్ళక్కి మృగజలమగుపడ్డ మిధ్యంచెరిగిన మాడ్కి । యా రెండెన్నటికీ ॥

ఓ, శిష్యుడా ! జగమువలన సంకల్పము. సంకల్పము వలన జగము కల్గుచున్నది. ఈ రెండు పుట్టుటకు వేరుగా నొక జన్మస్థాన మగుపడదు. ఏ కాలమందైనను జగమును విడిచి సంకల్పము, సంకల్పమును విడిచి జగముండదు. గనుక అచల పరిపూర్ణ పరబయలును ఇంద్రజాలి ఈ ప్రపంచ సంకల్పంబుల రెంటిని ఎప్పటికి తెలువకూడదు. అట్లు చేసిన యెడల వాటి ఉపాధి లేక పోవును. అయినా ఎండమావులయందు నీళ్ళు వున్నట్లు అగుపడినను మిధ్యేయని యెరిగిన విధమున యని భావము.

(౨౮౧) గురుడవల చలములను తన ! కెరిగించిన శిష్యుడెరిగియెరుకై యుండన్! యెరుకను నిల్పకుమనినను ! యెరుకను విడనాడి శిష్యు! డెట్లుండు నంటె అట్లనె నే నింకెట్లుండు నంటే! పురుషుడు లేనట్టి పొలతి సౌందర్యాము!మరి మరి కలిగుండిమరి లేనట్లనియంట! యెట్లుండునంటే! అట్లనెనే నింకెట్లుండునంటే॥

ఓ, శిష్యుడా ! సద్గురుడు సచ్ఛిష్యునకు అచల పరిపూర్ణ పరబయలునుచలనము కలిగి తెలియుచున్న ఎరుకను తెలియజేయగా శిష్యుడు రెంటి లక్షణములు తెలిసికొని యుండెను. చలనము కలిగి మూలము లేక తెలియుచున్న ఎరుకను కర్మసన్యాసము కర్మఫలత్యాగ పద్ధతిగాగాక కర్తృత్వ రహిత కర్మాచరణ పద్ధతిగా విడువుమని సద్గురుమూర్తి తెలుపగా తెలుసుకొని ఎరుకను విడనాడినశిష్యుడు అంతవరకు అతడు తెలుసుకున్న ఆయమాత్మ బ్రహ్మయను నేను ఎట్లుండుననగా పురుషుడులేని స్త్రీ మహాసౌందర్యవతిగా యున్నను అది లేనిదే యని భావము.

శి॥ పురుషుడు లేనట్టి స్త్రీని మహా సౌందర్యవతి యని నిర్ణయించి తదుపరి లేదనుటకు కారణమేమై యుండును ?

గు॥ వేదము అపౌరుషేయము గనుక వేదమాతను పురుషుడు లేనిస్త్రీ యని నిర్ణయము. ధర్మాధర్మములు తెలియజేయునది వేదమాతగా యున్నందున వేదమాతను మహా సౌందర్యవతి యని నిర్ణయము. ధర్మాధర్మ నిర్ణయముగల శబ్ద ప్రపంచమునకు అచల పరిపూర్ణ పరబాహ్యము యందు మూలము లేనందున మహా సౌందర్యము గలిగియున్న వేదమాత లేనిదే యని సిద్ధాంతము గనుక ఎరుకను విడిచిన శిష్యుడు యొనర్చు కర్మాచరణలు మానవ లోకకళ్యాణముగా యుండును. స్వార్థముగా యుండవని నిర్ణయము.

(౨౮౨) ఎరుకను విడనాడినయా ! పురుషుని స్థితి యెట్టిదనిన పొందుగ వినమా ! సరిపడు సరిపడదనకను ! సరిగా వర్తింపుచుండు సమరస బుద్ధిన్,

కార్యములందు । సహజ ప్రవృద్ధిన్ । పరిపారి విధమూల పరువూలు బెట్టాడు. మరి వైరాగ్యము చేత మానుకోనుండాడు । సమరస బుద్ధిన్ । కార్యములందు । సహజ ప్రవృద్ధిన్ ॥

ఓ, శిష్యుడా ! ఎరుకను విడిచిన పురుషుస్థితి ఏ విధముగా యుండునో చెప్పెద చక్కగా వినుము. సమరసబుద్ధితో సకల కార్యములు జేయునుగనుక ఇది సరిపడుననియు ఇది సరిపడదనియు చెప్పడు. చేయవలసిన సకల కార్యములు చేయుచుండును. స్వార్థముకొరకు ఏ పనులు చేయడు. వైరాగ్యము బూని చేయవలసిన పనులు మానడు యని భావము.

(౨౮౩) అనహంకారుడని మిషు । గనుకనె విశ్వంబనేటి కలగానదహం బనువాడు సనిముషుడు గా । వున విశ్వంబనేటి స్వ । ప్నోదో । గాము బూని, చేయుచు। యా వుద్యోగాము మానీ। యను నీ స్వప్నోద్యోగమునకు నేకారణమని తాననిషుడెన్నడనుకోడ మాటానుదో।గాను బూని చేయుచుయావుదో।గాముమాన్నీ॥

ఓ, శిష్యుడా ః అహం బ్రహ్మాస్మి యను అహంకారము లేనివాడు విశ్వమనే ప్రపంచమును జూడడు. అహం బ్రహ్మాస్మియను అహంకారం యున్నవాడు విశ్వము యనే స్వప్న ప్రపంచము గనుచున్నాడు. తను యొనర్చుకార్యములన్నియు సత్యములను భ్రాంతితో తానే కారణమని నిర్ణయించుకొని జననమరణ సంసారబాధల అనుభవించుచున్నాడు. అహంకారము లేనివాడు ఈ విశ్వమనే ప్రపంచమున వ్యవహరించుచున్నను ఈ స్వప్నప్రపంచమునకు కారణకార్యములకు నేను కర్తననిగాని, భోక్తననిగాని తలంపడని భావము.

(౨౮౪) కల మేలుకొన్న పురుషుడు । కలలోపలి బాములెరుక గలిగుండగనే । తిలకింపలేవు గురుకృప తెలిపొందిన వానికింక । తిప్పాలున్నావే। తెల్పరకొద్ది గొప్పలున్నావే । తలిదండ్రి దొరదాత కులదైవమాప్తులు । కలబాంధవులు దేశికులని నమ్మితె యింక । తిప్పాలున్నావే । తెల్పర । కొద్దిగొప్పాలున్నావే॥

ఓ, శిష్యుడా ! కలగని మేలుకొనినవాడు కలలో కనుగొనిన సుఖదుఃఖముల తెలియచున్నను నవి చూడలేనట్లు సద్గురు కటాక్షము పొందిన స్వచ్ఛందులకు ఎరుకయందు తెలుయుచున్న సుఖదుఃఖములు పొందుచున్నట్లు తెలియుచున్నను నవి లేనివేయని తెలియును. ఇట్టి స్థితిగలవారికి ఇది గొప్పతనము ఇది చిన్నతనము యనే నిర్ణయమేమైనా యుండునా నీవే ఆలోచించి చెప్పుము. అటు

వంటి ఏ లక్షణములు యుండబోవు గనుకనే సద్గురుడే తల్లియని, తండ్రియని, దొరయని, దాతయని, కులదైవమని, మిత్రుడని, బంధువని నమ్మినయెడల ఏ సంకటములు వుండవని భావము.

శి॥ కలయందు యొనర్చినపనులు మేలుకజెందిన తదుపరి జ్ఞాపకమునకు వచ్చినను వాటి కర్మానుభవము ఎందుకు వుండదు ?

గు॥ స్వప్నమునందు చేయుచున్న సకలకర్మలు సంకల్ప రూపంబులు కాని క్రియపద్ధతులుగావు కనుక క్రియానుభవముగల మేలుకయందు జ్ఞాపకమునకు వచ్చి తెలియుచున్నను నివి లేనివే యగును.

శి॥ పరిపూర్ణబోధ తెలుసుకున్న స్వచ్ఛందులు జాగ్రతావస్థ యగు మెలుకువయందే సుఖదుఃఖములు అనుభవించుచున్నట్లు తెలియుచున్న విగదా అది స్వప్నమనే నిర్ణయ మెట్లు సరిపోవును ?

గు॥ అచల పరిపూర్ణ పరబయలునందు ఎరుకకు స్థానముగాని మూలము గాని లేనందున ఎరుకను కలయని చెప్పనగును. ఎరుక నిర్మితులకు ఎరుక యందు తెలియుచున్న సుఖదుఃఖానుభవము తెలియును గాని ఎరుకను విడిచిన స్వచ్ఛందులకు అనగా పరిపూర్ణ స్థితి గలవారికి ఎరుకయొక్క కలిమి లేములు తెలియవని భావము.

(రాగ) ఈ రీతి స్థితి గలిగిన । నేరుపుగాలితర జనులనిందా స్తుతులన్ । తారేగివేయ డెన్నరు । వారలు మరి జేసిరేని వలదానియనడూ । చెవియొగ్గి । కావలెనాని వినడూ । వారు మీవారు మావారు వీరనుకొంచు । పొరేకు వీధిలో పోరాడేవారిని । వలదాని యనడూ । చెవియొగ్గి । కావలెనాని వినడూ ॥

ఓ, శిష్యుడా ! పరిపూర్ణ స్థితిగల సూరిజనులు పరులయొద్దకుబోయి భూషణయు, దూషణయు జేయరు. ఒకవేళ వారు తనను దూషణయు భూష ణయు చేయుచున్నను వలదని చెప్పరు కావలయునని చెవియొగ్గి వినడు. మరి యును వారు మీవారని మీరు మావారని చెప్పుకొనుచు పలుమారు వీధులలో పొరాడుచుండేవారిని కూడదని చెప్పడు యని భావము.

(రాగ) ధ్వని మొదలగు తన్మాత్రలు । కనుగొనగా లేశమైన గాన్పించ నివో । టుసు బట్టబయలు గాగని । ధ్వని ముఖతన్మాత్రలున్న దాన్నె యెరుగ కనూ । గనియూరెంట్లో దేన్ని యెరుగకనూ । వునికి గలిగినయట్టి । ఘనుని సన్నుతి జేయ । జనులకు శక్యమంచనరాదు వినరాదు । దాన్నె యెరుగకను గని యూరెంట్లో దేన్ని యెరుగకనూ ॥

ఓ, శిష్యుడా ! పంచతన్మాత్రలగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ ములు తెలుసుకొనుటకు కొంచమైనను అగుపడనటువంటి ప్రదేశమును అచల పరిపూర్ణ పరబయలని ఎరిగి పంచతన్మాత్రలు ఎరిగియున్న మూలం లేని ఎరుక లేనిది కనుక ఉన్నట్లు ఎరుగక మరియును బట్టబయలును మూలంలేని ఎరుకను రెంటిని తెలుసుకొన్నది లేని ఎరుకనే గనుక ఈ రెంటిని తెలుసుకొనక అచల బోధ స్థితిగలవారలను స్తుతిజేయుటకు ఇతర జనులకు సాధ్యముగునని తాను జెప్పరాదు. ఇతరులు జెప్పిన తాను వినరాదని భావము.

(౨౮౭) హాటమున కుటిలాత్మనిజం । ఫుటకై భటకోటి కాజ్ఞభూపతి యిడినన్ । భటులవలె జేసెటిలో । పటికుటిలుడు బడినపాట్లు । పాటించికనునా । అట్లనెగురుని । నోటతావినెనా । యిటువంటి బోధాను యెటువంటి నరుడైన । ఆటువెనక తనచేష్ట లెటువంటివో వాట్ని । పాటించి కనునా । అట్లనె గురువి నోటతావినెనా॥

ఓ, శిష్యుడా ! రాజు కపటాత్ముని జంపవలయునని పట్టుదలతో భటుల కాజ్ఞాపించినప్పుడు ఆ భటులు కపటాత్ముని చంపులోపల ఆ కపటాత్ముడు అనుభవించు పనులు గమనింపజాలనట్లు సద్గురు ముఖాంతరముగా శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ పరిపూర్ణబోధను విని అచల పరిపూర్ణ స్థితిగల వారెవరైయుండినను ఎరుక ప్రభావమును పాటించి చూడడని భావము.

(౨౮౮) తనుమన ధనములు గురునకు । వినయ మున ధారబోసి వేడ్క గురునిచే । అనువైన బోధవడసిన । ఘనమతిమంతునకు సాటిగలదా యీభువినీ లోకులు మ్రొక్క । వలదా చెవులవినీ । తన నితరులనె తాననక యేమాటను । వినక పరిపూర్ణత దరువానికి సాటిగలదా యీభువినీ । లోకులుమ్రొక్క । వరదా చెవులవినీ॥

ఓ శిష్యుడా ! సద్గురునకు సచ్ఛిష్యుడు తను, మనః ధనములు యను త్రికరణంబులు సవినయపూర్వకముగా ధారబోసి జనన మరణ భ్రాంతి రహిత మునకు తగువైన అచల పరిపూర్ణ బోధను సంతోషము తో సద్గురువువలన విని నీవు నేనను భేదభావములేక అచల పరిపూర్ణ లక్షణముగా ప్రవర్తించే అశరీరు లతో సరియైనవారు ఈ భూమియందు లేరు. అటువంటి ఉత్తమ పురుషుడు ఎచ్చట అగుపడినను లోకులు నమస్కారము చేయవలయునని భావము

(౨౮౯) గురు గురుబోధలచేతను । పరిపూర్ణము నెరిగియెరుక బాసిన యతనిన్ । గురుతెరుగ నొరులశక్యమె । యెరిగిన నరులిట్టిబోధ । నెరిగేరో

యన్నా । వారెరుగాని । మరుగుండదన్నా । విరుతపాపని రీతి మరిపైశాచము భాతి । తిరుగూచునందు వెక్కిరుమాడ్కి గురుడెట్లు । యెరిగేరోయన్నా । వారెరుగాని । మరుగుండదన్నా ॥

ఓ, యన్నా! గురువులకు గురువగు సద్గురుమూర్తి బోధించెడి శక్తిద్వయ నిరావరకంబైన శుద్ధ నిర్గుణతత్వ పరిపూర్ణబోధ క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత పరమతత్వ అచల పరిపూర్ణ ప్రబోధ తెలుసుకొని లేని ఎరుకను విడిచి ప్రవర్తించే ఉత్తమ పురుషులను పామరజనులు గుర్తెరుగజాలరు. వారికి తెలియని రహస్య మేది యుండదు. ఆ సద్గురువు బాలునివలె, ఉన్మత్తునివలె, పిశాచము వలె, జడునివలె వుండునని భావము.

గు॥ చంటిపిల్లవానికి తల్లిదండ్రులు తమ ప్రీతికొరకు వెండి బంగారు నగలు పెట్టుదురు. దొంగలు నవి దోచుకొని పోవుదురు. ఈ రెండు పద్ధతులు తెలియక బాలుడు ఏవిధముగా యుండునో ఆ పద్ధతిగా 'ధనమూల మిదంజగత్' అనగా జగత్తుకు మూలమగు ధనము వున్నను పోయినను ఉత్తమ పురుషుడు బాలునివలె యుండునని నిర్ణయము.

ఉన్మత్త స్థితి యనగా జాగ్రదావస్థయందు జరిగించు సకల వ్యవహారముల యందు స్వసంకల్పము లేక చేతనా చేతనములందు సమానపద్ధతిగా ప్రవర్తించుట ఉన్మత్త స్థితి యనబడును.

పిశాచపద్ధతి యనగా ఎరుక మహాత్మ్యము ఎరిగించేవారలను నిరసించుదురు. గనుక పిశాచమురీతి యని నిర్ణయము.

జడపద్ధతి యనగా జనన మరణ ప్రవాహామునందు యుండి దానితో ప్రవహించక అనగా అందులో పడి కొట్టుకుపోక పరిపూర్ణ స్థితి కలిగి యుందురు గనుక జడరూపుడని నిర్ణయము,

## (ముఖ్యాధికారి యారూఢత)

(౨౮౦) దేశాటనంబు జేసితి । వ్రాసితి గ్రంథములుకొన్ని వరగురుశిష్యుల్ । జేసేటి చర్చవింటిని । రోసితి మోక్షాద్యపేక్ష । రూఢీగ వినుమీ । నీవిట్టి యా । రూఢాతగనుమీ । దేశికు దయబుట్టజేసి శుశ్రూషోప । దేశాముగొని యుపదేశా మిచ్చితి మెచ్చి రూఢీగ వినుమీ । నీవిట్టియా । రూఢాతగనుమీ ॥

ఓ, శిష్యుడా ! సకలదేశములు తిరిగితిని. అచట గురుశిష్యులు చేయు వేదాంత చర్చలను వింటిని. కొన్ని వేదాంత గ్రంథములను వ్రాసితిని. తుదకు

మోక్షముయొక్క కోరికను విడచితిని. ఈ విషయము నీవు నిజముగా వినుము. ఇటువంటి ఆరూఢస్థితి నీవు పొందుము. సద్గురుస్వామి కటాక్షము కల్గునటుల వారి అజ్ఞానుసారము చతుర్విధ శుశ్రూషలుచేసి వారివలన దృష్ట ద్రాష్టాంతము లచే ద్వాదశి షోడశి మంత్రములను నుపదేశము పొందితిని. అట్టి మంత్రోప దేశము నీయొక్క ప్రవర్తనకు మెచ్చి ఇచ్చితినని భావము.

## (గ్రంథ పూర్తి)

(౨౯౧) శరశాస్త్ర స్వరహిమకర (౧౮౨౫) పరిమితమైనట్టి శాలివాహన శకమం। దరయగ శోభకృదనువ। త్సర మార్గశిరంబు కృష్ణ। చవితినాటి కినీ। పద్యాల్పదిదక్కువ మున్నూటికినీ। మురయీాచు జేస్తి నెవ్వరువిన్న చదివీన। పరిపూర్ణమెరుకై లేనెరుక లేకుండూనీ। చవితినాటికినీ। పద్యాల్పది దక్కువ। మున్నూటికినీ ॥

ఓ, శిష్యుడా ! ఐదు బాణంబులు, ఆరు శాస్త్రంబులు, ఏడు స్వరములు, ఒక చంద్రుడు ఈ యన్నిటిని చేర్చగా ౧౮౨౫ ఇట్లు పరిమితముగా వున్న శాలివాహనశకమునకు సరియగు శోభకృతునామ సంవత్సర మార్గశిర బహుళ చవితినాటికీ పది తక్కువ (౨౯౦) మున్నూరు పద్యములు సంతోషముతో వ్రాసితిని. వీని నెవ్వరు వినినను లేక స్వయముగా చదువుకొనినను వారికి శక్తి ద్వయ నిరాసకంబైన అచల పరిపూర్ణ పరబయలు జనన మరణములు లేనిదని తెలిసి జనన మరణములు కలిగి మూలములేక తోచుచున్న ఎరుకలేక పోవునని భావము.

## (గ్రంథ సమాప్తి)

(౨౯౨) ఎరుక నెఱుంగని బయలులో। గురుడును శిష్యుండు వారి గొడవయునేమీ। కెరిగించినవన్నియు మీారెరిగిన వన్నియును మీార లేమను ళ్ళక్కీ। వుళ్ళక్కితా। నెప్పూడుళ్ళక్కీ। మరి యింక మాటాడ మాటెలే। దాయాను సరిపాయ। సరిపోతె సరిపాయ సరిమీర లేనుమళ్ళక్కీ। ఉళ్ళక్కితా। నెప్పూడుళ్ళక్కీ ॥

ఓ, జనులారా ! మూలములేని ఎరుకను దెలియని అచల పరిపూర్ణ పర బయలునందు గురువును, శిష్యుడును వారిరువురియొక్క సంవాదమును నేనుమీాకు తెలిపిన వన్నియు మీారు తెలుసుకొన్న వన్నియును మీారును నేనును మూలంలేని

ఎరుకలేని వార మగుటచే ఎప్పుడును లేనివారమే గనుక మాటాడుటకు పరప శ్యంతి మధ్యమవై ఖరియను ఏమాటలు లేకపాయను. జననమరణ రహిత విధా నము నెరిపాయను పరిపోతే సర్వము ఉశ్కక్కియని భావము.

ఇది శ్రీమద్రాజాధిరాజ మహారాజ రాజయోగీంద్ర చంద్రులగు శ్రీమద్భా గవతుల కృష్ణదేశిక ప్రభువు విరచిత శక్తిద్వయ నిరాపకంబైన శుద్ధ నిర్గుణ తత్వ కందార్థ దరువులకు శ్రీమదచలఋషి రామడగు శివరామ దీక్షిత అవల గురు పీఠాధిపతులు శ్రీమదచలఋషి దయానంద హెన్నాల రాజయోగీంద్రుల వారిచే వ్రాయబడిన భావార్థ గురుశిష్యసంవాద సహిత ప్రబోధ చూడామణి సమాప్తము.

కందార్థములు సంపూర్ణము.

ఓం

శ్రీ గురుభ్యోనమః

# ప్రబోధ చూడామణి యను క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత పరమతత్వ కందములు

## స భా వి జ్ఞా ప న

కం॥ ఈకల కందములనువిను । డోకల నరులార మీకు। నొప్పిదమైనన్।
నే కలగనుక రచించితి । యాకల మోక్షమును జెందనగునివి
వినినన్ ॥ 1

ఓ, జనులారా ! శ్రుతి॥ "సర్వం వికారజాతం మాయామాత్రం" అనగా నామరూప వికారములు గలిగి ఉద్భవించిన సమస్తమును మాయా స్వరూప మైనది. లేనిదేయను నిర్ణయానుసారముగా అచల పరిపూర్ణ పరబయలునందు మూలముగాని నిలిచేందుకు స్థానముగాని లేక తోచుచున్న ఎరుక కలయని నిర్ణయము. కల స్వరూపుడగు నేను కలయగు శబ్దముచే కందపద్యములు రచించి నాను. మీరు కూడ కలయను ఎరుకస్వరూపములే గనుక సమ్మతముగా ఈపద్యములు విన్నయెడల ఎరుకయగు కలలేక పోవును గనుక ఇష్టము యున్నవారు వినవలయునని భావము.

కం॥ మాటలేనట్టి బయలున । మాటగలిగె ననుటవినుట । మాయగదయ్యా।
మాట మాయైతె మానెను । మాటను మాటాడి మనము । మానుద
మవలన్ ॥ 2

ఓ, అయ్యలారా ! మాటలేనట్టి అచల పరిపూర్ణ పరబయలునందు మాట కలిగినదని అనడము వినడము మాయయని నిర్ణయము, ఉన్నను దాని విధి విధానము తెలుసుకొనక యుండిన ప్రయోజనము లేదు. ఎందుకనగా వశిష్ఠ విశ్వామిత్రాది మహామునులు మాటలచేతనే వొకరినొకరు శాపములు విమోచనములు

పొందియున్నారు. గనుక అది ఎట్లు మాయనో దాని విధి విధానము మాట్లాడి తెలుసుకొని మానడము ప్రయోజనము యని భావము.

కం॥ ఏకందము కాకందమె। మాకందఫలరస రుచిని మరిపింప రుచిన్। మీకందములై నను విను। ఢీకంద ములన్ని న। త్కవీంద్రుల్లారా॥ (3)

ఓ, సత్కవులారా! కందపద్యముల కవనసిర్ణయము లక్షణయుతముగా తెలియమన్నను దానియందు నిర్ణయఫల స్వరూపము తమ మతముల మితపద్ధతుల ననుసరించి ఇహపరలోక భ్రాంతుల రసరుచి కలిగియుండును. మాకంద ఫలరసము ఆ రసరుచులను మరిపించే రుచిగాగలిగి యుండును. గనుక ఈ పద్యములన్నియు ఆ విధముగా వినవలయునని భావము.

కం॥ నేఛందము జదివెరుగను। నాఛందంబిదియు గురుని। నమ్మి రచిస్తిన్। యీ ఛందపు పద్యములను। చూచందరు నగకదిద్ద జొరుడీ సుకవుల్॥ (4)

ఓ, సుకవులారా! నేను ఇతర అభిప్రాయము చెప్పెడు ఛందస్సు శాస్త్రములను చదివి తెలుసుకొనలేదు. నా సద్గురుమూర్తిని మనంబున స్థిరపరచి ఈ అభిప్రాయము కందపద్య లక్షణముగా చెప్పినాను గనుక మీరు వీటిని చూచి అపహసించక దిద్దవలయునని భావము.

కం॥ కథగాదు జననమరణ। వ్యథమానుటకై రచిస్తి వరకవులారా। మదియించి చూచిదిద్దుడీ। పదమేసూత్రంబు దప్పి। పారక యుండన్॥ (5)

ఓ, వరకవీశ్వరులారా! నేను జెప్పినట్టి అభిప్రాయము కథగాదు. జనన మరణ భ్రాంతిరహితమునకు రచియించిన ఈ భావమందు మీ మనస్సు యుంచి పదముల చేరిక సంపూర్ణముగా యున్నది, లేనిచో చూచి దిద్దవలయునని భావము.

కం॥ తక్కువ పాండిత్యముచే। నిక్కేపండితులు మెచ్చ। నేరరు వీటిన్ యెక్కువ పాండిత్యముగల। చక్కని పండితులు మెచ్చి। సరెనన్నట్లన్॥ (6)

ఓ, కవులారా! భావార్థము తెలియని చదువు ఎంత చదివినా ప్రయోజనము లేదుగనుక వారిని తక్కువ పండితులని చెప్పనగును. అట్టివారు ఈపద్యములను మెచ్చుకొనరు. భావార్థము తెలిసినవారు స్థిరపండితులు. చక్కని వారు గనుక

ఈ పద్యమునందలి భావార్థము తెలుసుకొని సరిగా యున్నదని మెచ్చుకొనెద రని భావము.

కం॥ సూరిజనులె యీ గ్రంథపు। సారము గనువారుగాని సంసారమహా।
ఘోరవారాసి జేరిన। వారలు విని దీన్ని జూచి। వచియింపుదురే॥ (7)

ఓ, జనులారా! మానవులయందు తమోగుణ ప్రధానులని, రజోగుణ ప్రధానులని, సత్వగుణ ప్రధానులని, గుణాతీతులని చతుర్విధ లక్షణములు కల వారుగా యుందురు అందు సత్వరజ తమోగుణములు గలవారు జనన మరణ సంసార ప్రవాహమునందు ప్రవాహించేవారలు గనుక ఈ గ్రంథము నందలి సారమును తెలుసుకోలేరు. గుణాతీతులగు సూరిజనులు ఈ గ్రంథము నందలి సారము తాము తెలుసుకోగలరు ఇతరులకు తెలియునట్లు ప్రబోధించగలరు యని భావము

కం॥ గొప్ప ప్రతిష్ఠకు మిక్కిలి। తిప్పలబడు వృత్తికెపుడు దీరదు వినవే। యొప్పుల కుప్పగు బోధను। తప్పక నామాటనమ్ము। దగుతప్పనకన్॥ (8)

ఓ, జనులారా! అధిష్ఠాన చైతన్య బ్రహ్మమునందు ప్రత్యగాత్మ రూపు డైన తాను ఐక్యము పొంది శాశ్వతముగా యుండుటకు మహావాక్య వార్తిక పద్ధతుల ద్వారా ప్రయత్నము చేయువారికి అచల పరిపూర్ణస్థితి తెలుసుకొనుటకు వారికి తీరికసమయము దొరుకదని నేను చెప్పినది తప్పనక నమ్మవలయునని దీని భావము.

శి॥ మహావాక్య వార్తికపద్ధతులయందు కృషిచేయువారికి పరిపూర్ణ బోధ వినుటకు ఎందుకు తీరిక గలుగదు ?

గు॥ శ్రుతి॥ "బ్రహ్మసత్యం జగన్మిథ్య"యను న్యాయమున మిథ్యా జగత్తును విడిచి సత్యబ్రహ్మమునందు ఐక్యము పొందుటకు మనోబ్రహ్మ పాదచతుష్టయము, ఆకాశబ్రహ్మ పాదచతుష్టయము, ప్రణవపాద చతుష్టయము, ఆత్మ పాద చతుష్టయము, బ్రహ్మపాద చతుష్టయము, అవాంతర వాక్య చతుష్టయము ద్వారా చైతన్యబ్రహ్మము తనకు పరోక్షముగా యున్నదని నిర్ణయించి మహా వాక్యనిర్ణయ లక్షణత్రయములద్వారా భాగత్యాగ మొనర్చి శ్రవణ మననాదుల ద్వారా తనకు అపరోక్ష మొనర్చుకొనిన తదుపరి వార్తిక నిర్ణయానుసారము శ్రవణాదులు నిరసించి తైలధారవలె ఎడతెగక బ్రహ్మముగా యుండవలయును.

గనుక అయమాత్మ బ్రహ్మయను గొప్ప ప్రతిష్ఠకు ప్రయత్నించువారికి భ్రాంతి రహితమగు పరిపూర్ణబోధ వినుటకు తీరదని నిర్ణయము. ఈ వాక్యము నేను చెప్పినది తప్పనక మీ అందరు నిజమని నమ్మవలయును.

కం॥ మెప్పైన బోధగలమా । యప్పలు తప్పుంటె దిద్దు ' డదినాకిష్టం '
విప్పగిది కందములనే । జెప్పితి యీ కవిత జూచి ' కిడిముడి పడకన్ ॥ (9)

ఓ, అయ్యలారా ! జనన మరణ భ్రాంతిరహితమునకు ఈ కందములను నేను జెప్పినాను ఇట్టి భావము తెలిసినవారు ఇందుల తప్పులుంటె దిద్దడము నాకు ఇష్టమే. కాని కవనముయొక్క లక్షణమునందు చీకాకు పడగూడదని భావము.

కం॥ ఒకసారియైన వినకన్ । వికవికనవ్వేటి కుకవివే త్తల్లారా । ప్రకటించక
మీశౌర్యం బికదాచుట మీకుమాకు హితమై యొప్పున్ । 10

ఓ, కుకవివే త్తల్లారా ! ఈ గ్రంథమును ఒక్కసారియైనా వినకుండా గొప్పశబ్దము గలిగేటట్లు నవ్వుతూ తామే తెలిసినవారలుగా నటించెదరు. అట్టి నటనలు నా యెదుట నటించిన ప్రయోజనము యుండబోదు. గనుక ఆ లక్షణము మీ యందే నణచివేయుటము మీకుమాకు మేలుకలుగునని భావము.

కం॥ స్వచ్ఛాన్వయ గుచ్ఛములని । పృచ్ఛ యొనర్చెదరు కవులు పృథు
యశులారా । యిచ్ఛ జనించిన జదువుడి ' యచ్ఛా పద్యంబుల్వి
యాసాంతముగాన్ ॥ 11

ఈ పృథ్వియందుగల కీర్తివంతులారా ! ఈ కందపద్యములు నిర్మలమైన పరమును తెలిపే పదసమూహములని ఈర్ష్యచే కవులు లేనిపోని ప్రశ్నలు చేయుదురు గనుక వారిలక్షణము విడచి మీకు ఇష్టమైయున్న యెడల ఈ స్వచ్ఛమైన పద్యములను ఆసాంతముగా వినవలయునని భావము.

కం॥ తక్కిన బోధలపలెనిది । చిక్కులుగల బోధగాదు । చేపట్ట దగున్ ।
మక్కువతో మీ మనువటి । చిక్కుల బోధలను మార్చి చెక్కు
ముదమునన్ ॥ 12

ఓ, జనులారా ! జనన మరణ భ్రాంతిరహితమునకు నిర్ణయించిన ఇతర మార్గములు చిక్కులు గలవి ప్రయోజన హీనములు గనుక నవి చూరుచ చెక్కు సంతోషముతో క్షరాక్షరోపాధిద్వయ దోషరహిత పరమతత్వ మార్గము అవలంబింప వలయునని భావము,

కం॥ సకలకార్య ప్రయుక్త । జనకమగు వస్తువునుబట్టి నలచివై చదీ ।
న్నొకసారి వినిన జదివిన । నిక నింతకు యెక్కువైన । వేబోధ
లయా ॥ (13)

ఓ, జనులారా ! ఈ గ్రంథము ఒక్కసారి విని చదివినటులైన సకలో పాధులకు కారణ కార్యములకు మూలమైన ఉపాధియగు దానిని నలగజేయును గనుక ఇంతకన్న ఎక్కువైన ఏబోధలు లేవని భావము.

కం॥ కేరుచు మిము వినుమనినే సారెకు మీచుట్టు దిరిగి! సన్నుతి జేసే ।
తోరపు బోధకు మూలం బైరెవ్వరో వార్నిదలచి । వరుసను
తింతున్ ॥ (14)

ఓ, జనులారా! ఎల్లప్పుడు మీచుట్టుతిరిగి ప్రేమతో ఏ బోధను వినుమని చెప్పుచున్నానో అట్టి బోధకు మూలమైన వారిని నీకు తెలుపుటకు నేను నుతి జేసె దనని భావము.

కం॥ ఈక్షితి శివరామాహ్వాం ! దీక్షితులకు బోధజేసి । దిద్దినసామ్యా ।
దక్షుని శ్రీధరమూర్తి ని । నిక్షేపము గాదలంచి । నేవినుతింతున్ (15)

ఓ, జనులారా : ఈ పృథ్వియందు రామడుగు శివరామ దీక్షితుల వారికి క్షరాక్షరోపాధి ద్వయదోష రహిత పరమతత్వ ప్రబోధజేసి జనన మరణ భ్రాంతి రహిత పరచిన ప్రభువగు శ్రీ ధరస్వాములవారిని నా హృదయమునందు దాచిన ధనముగా నిడుకొని స్తోత్రము చేయుచుందునని భావము.

శి॥ శ్రీధరస్వాముల వారిని దాచిన ధనముగా నిర్ణయించుటకు కారణ మేమై యుండును ?

గు॥ స్థితికారకుడగు విష్ణువు తనవునికి విచారించిచూడగా ఈ లోకము లకు లోకేశ్వరులకు నేను స్థితికారకుడను వరదుడను, భక్తుల వాంఛలను నెర వేర్చు వాడను. అట్లయ్యు నా ఆత్మను గూర్చి విచారించగా అచల పరిపూర్ణ పర బాహ్యమునందు కలయికగాని నిలిచేందుకు స్థానముగాని ఆత్మకు లేనందునఏనుగు తొండమువలె నిలకడలేక ఆత్మ జనన మరణములు పొందుచున్నది దీని రహి తమునకు అచల పరిపూర్ణ పరబాహ్య దర్శనము మినహా ఇతర మార్గము లేదని నిర్ణయించి లోకబాంధవుడగు సూర్యునికి ప్రబోధించినందున సూర్యుడు యాజ్ఞ వల్క్యాది మహాఋషులకు ప్రబోధించి యున్నారు గనుక క్షరాక్షరోపాధి ద్వయ దోషరహిత పరమతత్వ ప్రబోధయే జనన మరణ రహితమునకు సరియైన మార్గ

మని శ్రీధరస్వామి శివరామదీక్షితులకు ప్రబోధి వియున్నాడు గనుక జననమరణ భ్రాంతి రహితమునకు క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత ప్రబోధయే దావి యుంచిన ధనమని నిర్ణయము.

కం॥ దక్షిణామూర్తి యనదగు నీక్షితి శివరామ నామ దీక్షితులమున్ ।
వీక్షింతురార్యు లతని క । పేక్షను దండములు బెట్టి ప్రేమ నుతింతున్ ॥ (16)

ఓ, జనులారా ! రామడగు శివరామ దీక్షితులవారిని సుజనులగు **ఆర్యులు** దక్షిణామూర్తితో సమముగా ప్రేమతో చూచుచుందురు, వారి కరుణాకటాక్షము నాయందు కల్గుటకు స్తోత్రము చేసెదనని భావము.

కం॥ ఆదీక్షితుల కృపకుదా । పాదైయప్పయ్య మంత్రి పఠియించెను యీ । మేదిని తద్బోధనతని । పాదములకు నతులొనర్చి ప్రార్థింతు మదిన్ ॥ (17)

ఓ, సుజనులారా ! రామడుగు శివరామదీక్షితుల కృపయందు నిలకడ గలిగి **అప్పయ్య** మంత్రియనువారు **ఈ అచల** పరిపూర్ణబోధను పఠన మొనర్చెను. గనుక వారి పాదంబులకు సాష్టాంగ నమస్కారముజేసి మనస్సు యందు వేడు కొనెదనని భావము.

కం॥ నుతిజేసెద నప్పయ్యన్ । గతికై కొల్చకడుబోధ గనెనో నేనా ।
ప్రతిలేని పరశు రామా । క్షితిసుర వంశమణియైన । సీతా పతికిన్ (18)

ఓ, జనులారా ! పృథ్వియందు పరశరామ వంశమణి పండితవంశము నకు రత్నమనదగు సీతారామస్వామి తన జనన మరణ భ్రాంతిరహితమునకు **అప్పయ్య** మంత్రి యాజ్ఞానుసారము చతుర్విధ శుశ్రూషలుచేసి క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత **అచల** పరిపూర్ణబోధ **తెలుసుకొన్నాడు** గనుక వారిని నేను స్తోత్రము చేసెదనని భావము.

కం॥ బుచ్చి వెంకమ్మ తల్లిని । పచ్చెర పెండ్లాడి కాశి సేతువదాకన్ ।
విచ్చలవిడి । యెగజల్లెను । సచ్చరితుల కవలబోధ సాకల్యము గాన్ ॥ (19)

ఓ, జనులారా ! పరశరామ సీతారామస్వామి యనువారు బుచ్చి వెంకమ్మ యనే కులకాంతను వివాహమాడి గృహస్థాశ్రమము యందే

యుండి ఆసేతు సీతానగరము అనగా కాశీరామేశ్వరము వరకు ఈఅచల పరిపూర్ణ బోధ సుజన బృందమునకు తెలిపియున్నాడని భావము.

కం॥ ఆ సీతాపతి నతివి । జ్ఞానమునం గొల్చికొంటి సర్వేశ్వరుడున్
చీనదోషదను తేటగ । జేసితినివి సకలజనులు చెవియొగ్గివినన్॥ (20)

ఓ, జనులారా! పరసరామ సీతారామస్వామియే నా కులదైవముగా నిర్ణయించుకొని ఎల్లప్పుడు సేవించుకొనుచు ఈఅచల పరిపూర్ణబోధ సకల జనులు చెవి ఇచ్చి వినేలాగా తేటగా జేసినానని భావము.

## — (గ్రంథకర్త వంశావళి) —

కం॥ భాగవత వంశభవుడను । భాగవతోత్తముల పాద పద్మంబులకున్
సాగిలి మ్రొక్కేవాడను । బాగుగ నను జనులు కృష్ణ భట్లందురిలన్ ॥　　21

ఓ, జనులారా! నేను భాగవత వంశమునందు పుట్టినవాడను ఉత్తమ భాగవతుల పాదంబులకు సాష్టాంగ నమస్కారము చేసేవాడను. ఈ భూమియందు జనులు నన్ను కృష్ణభట్టు అని పిలిచెదరని భావము.

కం॥ ధారుణ్యత్రనసూయలు వీరేయని జనులు పొగడ । వెలసినవారల్ ।
నారాయణ జానకి యను వారిరువురు గన్న యట్టి వాడను సుమ్మీ॥ 22

ఓ, జనులారా ! భూమియందు అత్రిమహాముని వారి సతీమణియగు అనసూయ అంతటివారలు వీరేయని జనులు పొగడేటి ప్రవర్తనగల భాగవతుల నారాయణభట్టుకు జానకమ్మ యనేడి భార్యకు వీరిరువురు కన్నయట్టి కుమారుణ్ణి నేను యని భావము.

## — (గ్రంథ విషయము) —

కం॥ అనేనొర్చినవాడను । యీ నిజకందముల గ్రంథ మెప్పుడు దీనన్ ।
వీనులవిని కన్నులగని । రేనట్టి జనంబులెవ్వనే ? నేననుచున్॥ 23

ఓ, జనులారా ! ముందు చెప్పబోయే కందపద్యముల గ్రంథము నేను చేసినాను. ఎల్లప్పుడు దీనిని చెవులతో విని విన్నవిషయము వస్తు నిశ్చయముగా కన్నులతో జూచెదరో అట్టివారు నేను బ్రహ్మముయని చెప్పరని భావము.

కం॥ చిల్లర బోధలనన్నిటి । నొల్లరు నిజబోధ దెలిసి యొప్పెటి పెద్దల్ ।
పొల్లని యందుకె నేనని వల్లక యీ బోధయందు । వరిస్తి జామీ 24

ఓ, జనులారా ! దుర్లభమైన మానవోపాధికి వచ్చిన స్వచ్ఛందులు చిన్న చిన్న భ్రాంతి మార్గములయందు ప్రవేశించక జనన మరణ భ్రాంతిరహితమునకు క్షరాక్షరోపాధిద్వయదోషరహితమగు రాజమార్గముయందే ప్రవేశించెదరు గనుక అట్టి భావమును నేను తెలుసుకొని నిజమగు ఈ మార్గమునందే ప్రవేశించినానని భావము.

కం॥ గురుశిష్యుల మాటలవలె । పరిపూర్ణపు బోధ కంద పద్యపణితిచే
విరచిసి వినుడిముందర ।జరిగే ముచ్చట్లుమీకు నహ్యాంబ్రైనన్ ॥25

ఓ, జనులారా ! పరిపూర్ణబోధ గురుశిష్యసంవాద రూపమున రచించినాము. ముందు జరిగే ముచ్చట్లు మీకు యిష్టమైన యెడల వినవలయునని భావము.

కం॥ సకల నిగమాగమాది ప్రకరమహా నారికేళ ఫలసారము । దీసొక
గ్రంథము జేసితి లౌకిక జనులోకవేళ్ళగొన్న। కీడు దొలంగున్॥ 26

ఓ, జనులారా ! సకల వేదశాస్త్ర పురాణ, ఉపనిషత్తుల ఇతిహాసాది గ్రంథములు వాటి పీఠికల యందలి యభిప్రాయములు తెలుసుకొని ద్రాక్షాపాకము కదళీపాకముగా కాక నారికేళపాకముగా ఈ గ్రంథమును రచియించినాము గనుక జనన మరణములచే బాధ నొందేవారు ఇది విన్నయెడల వారల జనన మరణములవి కీడు తొలగి పోవునని భావము.

## — (గురుశిష్య అన్యోన్య దర్శనము) —

కం॥ తనకు దావచ్చి సచ్ఛోధనుదెఱ్ఱు మటంచు మొక్కు తన శిష్యునకున్ ।
వినజెప్పదొడగె నొకగురు। డనుమానించక సువాని కతిదయతోడన్॥ 27

శిష్యుని శంక ॥ శక్తిద్వయ నిరాసకంబై నఅచల పరిపూర్ణ పరబయలు నందు ఎరుకకు మూలముగాని నిలిచేందుకు స్థానముగాని లేదని సద్గురుమూర్తి యనుగ్రహమువలన తెలుసుకొన్నాను గనుక ఎరుక ఎల్లప్పుడు లేనిదేయని నిర్ణయము అయినా నా పుట్టుక ఎరుకవల్ల గలుగుచున్నది. ఎరుకతో పోవు చున్నది గనుక ఎరుక వుత్పత్తి స్థితి, లయ, విస్తీర్ణ ఆకర్షణముల నుండి నేను లేకపోవడము యొక్క విధానము తెలుసుకోవడము సద్బోధ యనదగును గాని అచల పరిపూర్ణ బయలునందు ఎరుకకు మూలముగాని నిలిచేందుకు స్థానముగాని లేదని తెలుసుకున్నంత మాత్రమున జన్మభ్రాంతి కలగబోదని నిర్ణయించుకొని తన సద్గురుమూర్తిని దర్శించి మనవి చేయగా ఏలాటి అనుమానములు లేక తన శిష్యునికి క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత అచల పరిపూర్ణ బోధ దయతో ప్రబోధించెనని భావము.

కం॥ పరమ పురుషుడునా। లేనిది యెరుకయుగల దరశిలేనియెరుకను విడుమం!
వెరిగించిన శిష్యుడు గురువరు నడిగెను మ్రొక్కి రెంటి వర్తన లపుడున్॥

ఓ, శిష్యుడా ! పరమ పురుషుడును లేని ఎరుకయును గలదు. ఈ రెంటిని వస్తునిశ్చయముగా తెలుసుకొని లేని ఎరుకను విడువుమని సద్గురుమూర్తి తెలియ జేసినందున సచ్ఛిష్యుడు సద్గురుమూర్తికి సాష్టాంగ నమస్కారము జేసి ఈ రెంటి వర్తనలు ఎటువంటివో తెలుపవలయునని ప్రార్ధన పూర్వకముగా అడిగెనని భావము.

(శిష్యప్రశ్నావళి) —

కం॥ పరమపురుషుడనెవ్వడొ యెరుకెట్టిదొ తెల్పియవల యెరుకను విడిచే।
తెరువెట్టిదొ యిన్నియు నాకెరిగించు మటంచు బల్కు నిట్లనె గురుడున్॥ (29)

ఓ, సద్గురుమూర్తీ ! పరమపురుషుడనగా ఎటువంటివాడు? ఎరుకనగా ఎటు వంటిది? ఎరుకను విడిచేమార్గము ఎట్లు? ఈరీతియంతయు నాకు తెలియజేయ వలయు ననగా సద్గురుమూర్తి అట్లాగేయని ప్రబోధించెనని భావము.

కం॥ నేపెద్దలచే విన్నది । నీపై దయబుట్టిచెప్పనే । బూనితినీ । కావద్దతి నంతయు విని । యేపద్దతి కాశపడకు మిదివిడువకుమీ ॥ 30

ఓ, శిష్యుడా ! నేను పెద్దలచే వినినపద్దతి నంతయు నీకు జెప్పెదను. ఆ పద్దతి నంతయు వినిన ఎడల ఇతర ఏ పద్దతి వినవలయుననే ఆశ వుండదు అయినా ఈ పద్దతి విడువక ఆచరించవలయునని భావము.

శి॥ ఇతర పద్దతులకు ఆశపడకపోవుటకు కారణమేమై యుండును ?

గు॥ దుర్లభమైన మానవోపాధికి వచ్చి జనన మరణ రహితమునకు సద్గురుమూర్తి అనుగ్రహమువలన అతి దుర్లభమైన క్షరాక్షరోపాధి ద్వయ దోష రహిత పరిపూర్ణప్రబోధ తెలుసుకొని మానవజన్మ ఫలము పొందిన వారికి ఇతర ఫలాపేక్ష లేవీ యుండవని భావము.

కం॥ కదలడట పరమ పురుషుడు । కదలిక మాయయట । యిట్టి కదలిక కేదో । మొదలన పెద్దలు బల్కిరి । కదలనిదే కలదు - లేదు కదలిక యనుచున్ ॥ (31)

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ పరమపురుషుని విషయము శ్రుతి॥ "అచలో౽యం సనాతనః" అను న్యాయమున కదలక యుండునట్టిది అచల పరిపూర్ణ పరబయలు సనాతనము. శాశ్వతము యని పెద్దలు నిర్ణయించినారు.

కదలికగల మాయావిషయము శ్రుతి॥ "సర్వం వికారజాతం మాయామాత్రమ్ వాచారంభణం వికారోనామధేయః" అనగా నామరూప వికారములు గల్గి ఉద్భవించిన సమస్తము మాయాస్వరూప మయినది. లేనిదేయని నిర్ణయించినారు గనుక

నామరూప నటనలుగల ఎరుకయను మాయచే కల్పింపబడిన ఈ జగత్తు లేదు ఎరుకయగు మాయయును లేదు. గనుక ఎరుకమూలము లేనిదని చెప్పుటకు ఏలాటి భయము లేదు. ఇదియుగాక అయమాత్మ బ్రహ్మయని శ్రవణమనన నిధి ధ్యానలు యొనర్చుటకు మనస్సు లేదని భావము గనుక కదలని పరిపూర్ణ పర బయలే కలదుగాని కదలికగలిగి తెలియుచున్న ఎరుక ఎప్పుడూ లేనేలేదని సిద్ధాంతము.

కం॥ పురుగుక్కు స్తంభంబును । గొరికినదన వీతిహొత్రు గొని మ్రింగె చదల్ । ధరననినను మాయాసతి । హరిని వికారుగా యొనర్చె నన వినదగునే ॥ (32)

ఓ, శిష్యుడా ! ఉక్కుస్తంభమును పురుగు తొల్చినదని, అగ్నికి చదలు పట్టినదని పృథ్వియందు నిజమైన యెడల అచల పరిపూర్ణ పరబయలగు పరమ పురుషుని మూలప్రకృతి గ్రహించి ఉపాధికి తెచ్చి కర్మానుభవమున జన్మాదులు పొందించుచున్నదనే నిర్ణయము నమ్మవచ్చునని భావము.

కం॥ హరియందు దోచు విశ్వము । నర స్వప్నము వంటిదనిరి నానాజన ముల్ సురస్వప్నము వంటిదియనె । స్థిరమతి శివరామ నామ దీక్షితులు ధరన్ ॥ (33)

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ పరబయలుకన్న ఇతరము ఇంకొక్కటి గలదని విశ్వసింపబడు దానిని విశ్వమని చెప్పబడును ఈ విశ్వము నరస్వప్నము వంటిదని మతములవారు నిర్ణయించి చెప్పియున్నారు. దానిని శ్రీ శివరామ దీక్షితులవారు సురస్వప్నము వంటిదియని స్థిరముతో సిద్ధాంతముచేసి యున్నారని భావము.

శి॥ నరస్వప్నమునకు, సురస్వప్నమునకు, భేదమేమై యుండును?

గు॥ అచల పరిపూర్ణ పరబయలుకన్న ఇతరము ఇంకొక్కటి కలదని విశ్వసింపబడు దానిని విశ్వమని చెప్పబడును ఆ విశ్వమును సృష్టిజేయువాడు బ్రహ్మ. పోషించువాడు విష్ణువు. లయము చేయువాడు రుద్రుడనే నియమిత దేవ

తలు గలరు. వారలచే సృష్టింపబడిన విశ్వము మానవుని స్వప్నావస్థతో సమమై నదని నిర్ణయించిన విధానము నమ్మదగినది కాదు. ఎందుకనగా తన సృష్టికి కారణమైన విశ్వము తన స్వప్నము వంటిది ఎట్లగును ? అయినా జాగ్రతా వస్థ ననుసరించి వచ్చునది స్వప్నముగాని ఇతరత్రా కలుగునది కాదు. మరియు జాగ్రతావస్థ ఎట్లు కర్మానుభవము గలదో స్వప్నావస్థ గూడా కర్మానుభవము కలదే గనుక విశ్వము పరస్వప్నము వంటిదియని నిర్ణయించుట సరికాదు. ఈ పద్ధతివలన జన్మ భ్రాంతి అధికమగును.

సురులనగా అచలపరిపూర్ణ పరబయలునందు ఎరుకకు మూలముగాని నిలిచేందుకు స్థానముగాని లేదని సద్గురుమూర్తి వలన వస్తునిశ్చయముగా తెలుసు కున్నవారు గనుక ఇట్టివారికి విశ్వము స్వప్నమువంటిదని నిర్ణయము ఈ పద్ధతి వలన జన్మభ్రాంతి నశించిపోవును

కం॥ సురలందు దోచు స్వప్నను । హరియందున దోచువిశ్వ మానురల హరిన్ । యెరిగిన కలవిశ్వము । తామరుగని తమ లేమి నెరిగి యతి విడియమునన్ ॥ (34)

ఓ, శిష్యుడా ! అశరీరులగు సురులకు దోచు స్వప్నము అచల పరిపూర్ణ పరబయలుయందు దోచు విశ్వమును అశరీరులగు సురులను అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకున్న యెడల కలయను విశ్వమును తమవునికిని అశాశ్వత మని తెలిసి అనగా ప్రత్యగాత్మ పరమాత్మ క్షరాక్షర పురుష నిర్మితము శాశ్వత మని నిర్ణయించుకున్న విధానమునకు సిగ్గుజెంది లేక పోవునని భావము.

కం॥ కదలనిది కదలదెన్నడు । కదలికగల దనినదాని కగుపడదుమొదల్ కదలిక లేదని గావున । యిది పరమరహస్య । మెవ్వరెరుగరు దీనిన్ ॥ (35)

ఓ, శిష్యుడా ! పరబయలు అచలము పరిపూర్ణము గనుక అది ఏకాల మందుకూడ కదలదని తెలియుము. చలన రూపమయిన ఎరుక వున్నట్లు తోచు చున్నను దాని ఉపాధికి మూలము లేదు కనుక ఎరుక లేనిదని నిర్ణయము ఇదియే పరమ రహస్యము సూరిజనులకు అశరీరులకు తప్ప ఇతరులకు తెలియ దని భావము.

కం॥ కదలనిది కదిలెనన్నను । ముదమున వినదగదువారి । ముచ్చట నెపుడున్ । కదలిన కదలనిదెట్లగు । నదిగావున, కదలదనుచు నమ్ము దగుజుమీ ॥ (36)

ఓ, శిష్యుడా ! కదలని పరిపూర్ణ అచల పరబయలు త్రిగుణసామ్య ప్రకృతియందు కదులుచున్నదని ఎవరి నిర్ణయములయందు నిర్ణయించి యున్నదో అట్టినిర్ణయ పద్ధతులను సంతోషముతో వినదగ్గ మాటలుకావు ఎందుకనగా కదలిక కలిగియున్నట్లు తెలియుచున్నట్టి ఎరుక ఏకాలమందైనా అచల పరిపూర్ణ పరబయలు కాదోయ. కదలికగల ఎరుక కదలని అచల పరిపూర్ణ పరబయలు అన్యము అనగా వేరువేరు గనుక అచల పరిపూర్ణ పరబాహ్యము కదలదని నమ్ముమని భావము.

కం॥ నిను మేనును ప్రకృతి ద్వయమని ! నినునీమేను మృషనిమానిరి నీజోలిని పెద్దలు నీవెరుగకనినను నీవొక కొండనంటె నిజమామాటా॥ 37

ఓ, శిష్యుడా ! స్థితికారకుడగు శ్రీ మహావిష్ణువు లోకబాంధవుడగు సూర్యుడు మొదలగు అచల ఋషులు, నిరంజన ఋషులు నేనను ఎరుక పరా ప్రకృతియని మేనగు శరీరము అపరాకృతియని పర అపరయనే ద్వంద్వ రూపముగా తోచే నేను మేనులు భ్రాంతి జన్యంబులు లేనివేయని శక్తి ద్వయ నిరసనగా క్షరాక్షరోపాధి ద్వయదోషరహితముగా వాటి సంబంధములు మాని నారు. అట్టి విషయము నీవు తెలుసుకోనక అల్పసాంప్రదాయకులు నిర్ణయించిన నిర్ణయముల వలన నిన్ను నీవు గొప్పవని అచలుడనని యనుకొనిన యామాటలు నిజము కావని భావము.

శి॥ నన్ను మేనును ప్రకృతిద్వయమని నిర్ణయించుటకు కారణమేమై యుండును ?

గు॥ అరూప భూతములనుండి కలిగిన ప్రాణమనంబులు పరాప్రకృతియని ఆత్మయని నిర్ణయము సరూప భూతములనుండి కలిగిన స్థూలమును అపరా ప్రకృతియని, అనాత్మయని నిర్ణయము.

శి॥ అరూపముగా యున్నను సరూపముగా యున్నను భూతసముదాయము ఏకమేగదా. ఇందు ప్రకృతి ద్వయమని నిర్ణయించుటకు కారణమేమై యుండును?

గు॥ జీవేశ్వర జగదోపాధులకు తెలియుచున్న స్థూలశరీరంబులు కర్మ ముల ననుసరించి మారుచుండును గనుక అపరాప్రకృతియని నిర్ణయము సకల వుపాధులయందు సూక్ష్మరూపమగు ప్రాణమనంబులు ఏకమే గనుక ప్రాణమనం బుల ఏకైకరూపమగు ఆత్మ పరాప్రకృతియని నిర్ణయము.

కం॥ పేరచలమనుచు బయలని ! పేరెప్పుడు లేదు మనము చెట్టుట వాతన్ పేరాయె బయలుకిప్పుడు! పోరానివు నేను మృషని పోతేజాలున్॥ 38

ఓ, శిష్యుడా! అచలము పరిపూర్ణము బయలు యని పలుకు నామములు మన నిర్మితములే కాని మనము లేకముందు పరిపూర్ణ పరబయలుకు ఏ పేర్లు లేవు గనుక అచలమునకు నిర్ణయించిన నామములు తాను పెట్టుకొని ఆనందించుటకు బదులుగా తనకు అచల పరిపూర్ణ పరబయలునందు నిలిచేందుకు స్థానముగాని, మూలముగాని లేదని గురుమూర్తి చేత వున్నది వున్నట్లు తెలుసుకొని తాను లేకపోతే జనన మరణ భ్రాంతి రహితమునకు బాలునని భావము.

శి॥ ఎరుక పరబయలుకు నామము ఎందుకు నిర్ణయించినది ?

గు॥ ఎరుగునట్టి లక్షణము పరిపూర్ణ పరబయలుకు లేదు గనుక అది ఏ నామములు నిర్ణయింపదు. ఎరుక ఎరుగగలటువంటిది కనుక అన్ని నామములు అదే నిర్ణయించును, అయినా దాని రూప క్రియలకు నామ నిర్ణయములు చేసుకొనక పర బయలుకు ఏల చేసినదని యనెదవేమో.

1. ఎరుక నామరూప క్రియాత్మకము గనుక పరబయలు నామ రూప క్రియలు లేనిది.

2. ఎరుక చలనము గనుక పరబయలు అచలమని

3. ఎరుక అపూర్ణము గనుక పరబయలు పూర్ణమని

4. ఎరుక అశాశ్వతము గనుక పరబయలు శాశ్వతమని నిర్ణయించినది. ఆ నామనిర్మితములు ఎరుకకేయని భ్రాంతిగలవారు తమ ఆత్మకు నిర్ణయించుకొని జన్మాదులు పొందుచున్నారు.

కం॥ పరమపురుషుడీ బయలని । గురు డెరిగించినను జూచి । గొప్పకురుచలై । యెరిగెటినినునే మృషనని । యెరిగరుగుము నీవె మాయయిక బుట్టవిలన్ । 39

ఓ, శిష్యుడా! అచల పరిపూర్ణ పరబయలును పరమపురుషుడని సద్గురుమూర్తి తెలియజేయగా నచ్ఛిష్యుడు తెలుసుకొని ప్రత్యగాత్మ పరమాత్మగా తెలియుచున్న క్షరాక్షర పురుషుల స్పర్శ అశాశ్వతము భ్రాంతి జన్యమని తెలిసి లేనిది లేదని నిశ్చయముగా వున్నచో తిరిగి పుట్టవని భావము.

శి॥ అచల పరిపూర్ణ పరబయలును పరమపురుషుడని సంబోధించుటకు కారణమేమై యుండును ?

గు॥ అన్నమయాదికోశములకు అంతరముగా నుండువాడు క్షర పురుషుడు సమిష్టికోశములకు అంతరముగా నుండువాడు అక్షర పురుషుడుగా నిర్ణయము

యున్నందున క్షరాక్షర స్పర్శలకు అందకయున్నట్టి అచల పరిపూర్ణ పరబయ లును శిష్యుని రహితముకొరకు పరమపురుషుడీ బయలని సంబోధించినారు.

కం॥ అయమాత్మ యనినరీతిగ నయముగ యీ బట్టబయలు నదుగో యనుటల్ । అయమియ మనియనుటుళ్ళ క్కయినను ననవలసె నీదుకీడుడుగుటకై ॥ 40

ఓ, శిష్యుడా! మహావాక్య నిర్ణయానుసారము ఈ ఆత్మనే బ్రహ్మమని చెప్పే పద్ధతిగా ఈ పరబయలు అచలము పరిపూర్ణము అది ఎరుక ఇది పరి పూర్ణము అని నిర్ణయించి చెప్పడము భ్రాంతిరూప యెరుక పద్ధతులు అశాశ్వతమై నను జనన మరణము లనే కీడు దొలగుటకై చెప్పవలసి వచ్చినదని భావము.

కం॥ లేని నేనీవులేని స్థానంబును కారణంబు సర్వమునకధిష్ఠానంబు సాక్షిసత్య జ్ఞానానందబులనిన సత్యములగునే ॥ 41

ఓ, శిష్యుడా! నీవు నేను యనెడి వ్యవహారమునకు కారణమయిన యెరుక భ్రాంతిజన్యము గనుక లేనిదని నిర్ణయము. లేని ఎరుక వుపాధికి అచల పరిపూర్ణ పరబయలు కారణమని యెరుక వ్యవహారంబులు సర్వము అచల పరిపూర్ణ పర బయలు వలననే జరుగుచున్నవి గనుక అచల పరిపూర్ణ పరబయలు అధిష్ఠానము యని లేని యెరుక పద్ధతులు చూచునది పరిపూర్ణ పరబయలే గనుక సాక్షియని సత్యజ్ఞానంద స్వరూపమని చెప్పినయెడల నవిసత్యము లెట్లగునని భావము.

కం॥ అట్టిది యిట్టిదియనరా నట్టిది బయలనుచుదెలిసి యామీదట నీవట్టిది యిట్టిది యనరానట్టిది బయలనినదాని నరయకు మెపుడున్॥ 42

ఓ. శిష్యుడా! అటువంటిది యనగా పరమాత్మ వంటిదియని ఇటువంటిది యనగా ప్రత్యగాత్మ వంటిదియని యనుటకు వీలుకానటువంటి అచల పరిపూర్ణ పరబయలును తెలిసిననీవు ఇటువంటిది అటువంటిదియని యనుటకు వీలుకానటు వంటిది పరిపూర్ణ పరబయలని తెలుసుకొనిననిన్ను నీవు ఎప్పటికైనను చూచు కొనకు మని భావము.

శి॥ నన్ను నేను చూడక యుండడము ఎట్లు?

గు॥ "దృశ్యమానస్య సర్వస్య జగతస్తత్వమీర్యతే బ్రహ్మశబ్దేన తత్ బ్రహ్మ స్వప్రకాశాత్మ రూపకమ్" జగత్తున కధిష్ఠానమైనది బ్రహ్మము. అదియే తన యందారోపింపబడిన జగత్తులో ప్రవేశించి ప్రత్యగాత్మ యనబడెను. ప్రత్య గాత్మ బ్రహ్మనొక్కటియె వేరుగావయని నిర్ణయము యున్నందున మహావాక్య

వార్తీకపద్ధతి ననుసరించి బ్రహ్మానుభవమున నున్నవారలు బ్రహ్మానుభవమున జన్మాదులు హొందుదురు. జగదధిష్ఠాన బ్రహ్మమునకు అచల పరిపూర్ణపరబయలు నందు మూలముగాని నిలిచేందుకు స్థానముగాని లేదని సద్గురుమూర్తి చేత తెలుసుకొన్న నీవు నిన్ను చూడకుమని నిర్ణయము.

కం॥ అది ఇది యంచని యనరానిది బయలని తెలిసినీవు। యిది యది యనరానిది బయలని తెలిసిన నినువదలుండుము లేనటంచు వరగుణవంత ॥ 43

విశేష సద్గుణములుగల ఓ. శిష్యుడా ! అది ఇది యంచరానిది పరిపూర్ణ అచల పరబయలని తెలిసిననీవు ఇది యదియని యనకూడనిది అచల పరిపూర్ణ పర బయలని తెలిసిన నిన్ను లేనివాడనని వదిలుండుము యని భావము.

శి॥ లేని నన్ను నేను వదిలుండడము ఎట్లు ?

గు॥ శ్రుతి॥ "సంకల్పమాత్ర సంభవో బంధః" అను న్యాయమున కేవలము సంకల్పము గలుగుటయే బంధము యని నిర్ణయము గనుక

1. కర్మ సన్యాసము సంకల్పరూపమే.
2. కర్మ ఫలత్యాగము సంకల్పరూపమే.
3. కర్తృత్వరహిత కర్మాచరణవల్ల సంకల్పరూప మనస్సు వుండదు గనుక నీయందు నీవు లేకపోవుదువని నిర్ణయము.

కం॥ కలనీకు జగముకంతట। గలబయలుకు గలిగియున్న ఘనమగు తిప్పల్। కలయగని మేలుకొని యాకలవలె మేలుకనుజూచి కదలుముశ్శిక్క ॥ 44

ఓ. శిష్యుడా ! శ్రుతి॥ "అహం పదార్థరహితః" యను న్యాయమున అచల పరిపూర్ణ పరబయలు యందు చైతన్యబ్రహ్మమునకు ఏలాటి కలయిక లేనందున చైతన్య బ్రహ్మను కలయని చెప్పబడును. అచల పరిపూర్ణ పరబయలుకు చైతన్య బ్రహ్మమునకు కలయిక యున్నయెడల అహంకార లక్షణమైన జనన మరణంబులు ఎల్లకాలము ఎడతెగక శాశ్వతము గానే వుండును. అహమునకు తరుణోపాయమే యుండదు. అట్లుగాక శ్రుతి॥ "అచలోయం సనాతనః రహస్యమ్ ఏత దుత్తమమ్" యను న్యాయమున అచల పరిపూర్ణ పరబయలు శాశ్వతము. శ్రుతి॥ "బ్రహ్మవిశ్వం ద్వయం మిథ్య" యను న్యాయమున చైతన్య బ్రహ్మము దానినుండి తెలియుచున్న విశ్వము లేనిది కలయని నిర్ణయము అహమను చైతన్య

బ్రహ్మమునకు అచల పరిపూర్ణ పరబయలునందు కలయికలేదని సద్గురుమూర్తి చేత తెలియడము చైతన్య బ్రహ్మయను కలకు మెలుకువ యని సిద్ధాంతము.

చైతన్య బ్రహ్మమను తాను లేనిస్థితియే మెలుకువ గనుక అచల పరిపూర్ణ పరబయలు వున్నదని గాని తను ఆ బయలునందు లేననే జ్ఞాప్తి గాని లేకపోవల యును. ఇదియే కలవలె మేలుకను జూచి కదులుము యని నిర్ణయము.

కం॥ కలనేన్గు సింహమును కన్నులగన మృతి జెందినట్లు । యుళ్ళ
క్కగుచీవలగురు కృపచే బయలుం । దెలసూరికె యుంటివేని
తీరును మాటా ॥ 45

ఓ, శిష్యుడా ! ఏనుగుకు ముందుచూపే గాని వెనుకజూపు యుండదు. ఆ పద్ధతి ననుసరించి తాను ముందుకు నడిచి వెళ్ళవలయునని కాలు పైకెత్తి అడుగు పెట్టే సమయమున సింహము లంఘించి ఏనుగు కుంభస్థలమును చీల్చి చంపును. ఆ సమయమునందు ఏనుగు దృష్టి ముందుకు వెళ్ళవలయుననే వుండును గాని సింహము తన కుంభస్థలము చీల్చి చంపుచున్నదనే నిర్ణయము యుండ నట్లు అచల పరిపూర్ణ పరబయలునందు చైతన్యబ్రహ్మ యగు ఎరుకకు మూలము గాని నిలిచేందుకు స్థానముగాని లేదని సద్గురుమూర్తి చే వస్తు నిశ్చయముగా తెలుసు కొని తాను వున్నాననే నిర్ణయము లేక వుంటే జనన మరణ రహిత పద్ధతికి చాలు నని భావము.

కం॥ ఎప్పటికి యొక్కరీతిగ । తప్పక నిలుచున్నదాని దయతో
గురుడుం జెప్పినగని యగణితమగు । తిప్పలుగల నిన్నునీవు ।
దీసితెనరిరా॥ 46

ఓ, శిష్యుడా ! ఎప్పుడూ ఏలాటి మాట లేక యుండునట్టి అచల పరిపూర్ణ పరబయలును సద్గురుమూర్తి దయతో చెప్పి చూపించినదాన్ని చూచి లెక్కకు రానట్టి జనన మరణ తిప్పలుగల నిన్ను నీకు నిశ్చయము యుండిన చాలును అనగా జనన మరణ భ్రాంతిరహితమునకు సరిపోవునని భావము.

కం॥ నీ వున్నచోట నుండును। నీ వివిధ విచిత్రజగము నీతోగూడన్। నీవు
లేనట్టిచోటను । నీ వివిధ విచిత్రజగము నిలువదుకుర్రా ॥ 47

ఓ, బాలకా ! బీజవృక్ష న్యాయమున నీవు యున్నచోటున నీ జగ ద్రూపము నీతో కూడయుండును. నీవు లేనట్టి అచల పరిపూర్ణ పరబయలు యందు నీవు నీతో నున్న చిత్ర జగము నిలుచుటకు చోటు లేదని భావము.

కం॥ నానావికారములుగల నానావిధ నామరూప నటనలు గలయా ' నీనా
దశదిశలనుగ । దీనందేలేకషనము తిరుగుటమప్పా ॥ 48

ఓ, శిష్యుడా ! చైతన్యబ్రహ్మ మగు ఎరుక అనేక వికారములుగాను, అనేక రూపములుగాను, అనేక పేరులతోను, అనేక విధముల ప్రవర్తనలతోను నీకున్ను నాకున్ను దశ దిక్కులయందు నిండి నిబిడీకృతముగా నున్న అచల పరిపూర్ణ పరబయలు నందు లేకనే సంచరించుచున్నదని భావము.

శి॥ చైతన్య బ్రహ్మయను ఎరుక ఏ ఆధారములు లేక ఎట్లు సంచరించును ?

గు॥ వ్యాపారనిమిత్తము ఓడను నిర్మించి అందు సరుకులు నింపి సముద్రమునకు తెరచాప గట్టి పైకి లాగగా గాలి ఒత్తిడి చేత నీటిపైన కదలిపోవును. ఇందు దేని కేది ఆధారమో నిర్ణయింపుటకు వీలు లేనట్లు చైతన్య బ్రహ్మయను ఎరుకకు ఆధారము నిర్ణయించుటకు వీలులేదు. అయినా దానికి అదే ఆధారము, దానికి అదే అనాధారము గనుక లేనిదియని నిర్ణయము.

కం॥ అబ్బీ యీ బయలున్నది దబ్బనగురుడెరుకజేయ దబ్బర నమచున్ ।
దెబ్బకు మాయముగాకను కబ్బముజెప్ప టకు నిల్వగలవే నీవున్॥ (49)

ఓ, కుమారా ! అచల పరిపూర్ణ పరబయలు వున్న విధానము సద్గురుమూర్తి శీఘ్రముగా తెలియజేసిన యెడల జీవేశ్వర ఐక్యమనే సౌఖ్యము అయమాత్మ బ్రహ్మయను అనందము ఇటువంటిదని నిర్ణయించి చెప్పుటకు ఎరుకనిల్చి చెప్పగలదా. అచల పరిపూర్ణ దర్శన మాత్రమున ఎరుక లేకపోవును గనుక ఏ నిర్ణయము చేయలేదని భావము.

కం॥ మూలము లేకనె వచ్చిన । నీ లీలలు జూచుకోని నీవెమురుతువీ ।
బయలున్న దనుచు దోచితె నీలేమిని నీవెరింగి నిలువవు కుర్రా ॥ 50

ఓ, కుమారా నీ వుపాధికి మూలము లేకనే యున్నావు యందలి అవస్తలు నీవే చూచుకొని సంతోషించుచున్నావు అచల పరిపూర్ణ పరబయలువున్న విధానము నీకు తెలియగనే నీ యశాశ్వతము నీకు తెలిసి ఇహపరాదుల యందు ఎచటగూడ నిలువలేక పోవుదువని భావము.

కం॥ జ్ఞానకర్మ స్వరూపముగాని బయల్ నదుగోమాచి । కలకాలము
యీ జ్ఞానకర్మ స్వరూపంబో । నిను నీ వెరిగి మృషని పవి
వినవోయీ ॥ (51)

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ పరబయలు జ్ఞానస్వరూపము కర్మ స్వరూపము కానిది అదుగో చూడుము. జనన మరణములుగా దోచుచు ఎల్లకాలము జ్ఞాన, కర్మ స్వరూపమగు నిన్ను నీవు తెలుసుకొని నీ ఉనికిని అబద్ధమని తెలియుటయే నీవు దుర్లభమైన మనవోపాధికి వచ్చి చేయవలసిన పనియని భావము.

శి॥ జ్ఞాన స్వరూపము కర్మ స్వరూపము కాని బయలు ఏ పద్ధతిగా యుండును ?

గు॥ జ్ఞానేంద్రియము చేత విషయ పంచకము తెలుసుకొని కర్మేంద్రియము చేత కర్మ నాచరించి కర్మ ఫలములు పొందువారు క్షర పురుషులు.

కర్మ ఫలానుభవము పొందక సంకల్పరూపమున పిండబ్రహ్మాండంబులు సృష్టి, స్థితిలయ, విస్తీర్ణ, ఆకర్షణ యొనర్చువారు అక్షర పురుషులు.

తన్ను తాను తెలుసుకొనక క్షరాక్షర పురుష స్పర్శ తెలియక సర్వకాల పర్వావస్థలయందు చలించక పరిపూర్ణముగా యుండునది పరమ పురుషుడు పర బయలని నిర్ణయము.

కం॥ ఈ నిర్మలమౌ బయలున । నానాగమ నిగమకల్ప నాయన
టంటె । యే నరులు నమ్మరిందుకు । నానీయందున నటంటే
నమ్మిన మాడ్కిన్ ॥ 52

ఓ, శిష్యుడా ! పరమ పురుషుడగు అచల పరిపూర్ణ పరబయలు వలన వేదశాస్త్ర పురాణ ఇతిహాసాదులు నిర్మింపబడిన వనిన ఎవ్వరు నమ్మరు. నీవు నేను యని వ్యవహరించు ఎరుకయగు చైతన్య బ్రహ్మమువల్ల నిర్ణయింపబడ్డవని చెప్పిన యెడల ఏ సంశయము లేక నమ్ముదురు యని భావము.

కం॥ నేనీవనని మహాత్మ్ముని ; కీనిగ మాగమవిచార మిష్టతియౌనా ।
నేనీవని యీ పల్కే నానీకే యిష్టతౌర నానాయన్నా ॥ 53

ఓ, శిష్యుడా ! కర్మ జ్ఞాన నిర్మితములగు వేదశాస్త్ర పురాణ ఇతిహాసములు అహం బ్రహ్మాస్మి యని నీకు నాకు ఇష్టముగా యుండును గాని నేనీవనే ఎరుక రహిత అచల పరిపూర్ణ పరబయలు దర్శించిన సూరిజనులకు ఇష్టము యుండదు యని భావము.

శి॥ కర్మ జ్ఞాన నిర్మిత వేదశాస్త్రంబులు ఎందుకుఇష్టము కావు?

గు॥ వర్ణముల ననుసరించి కర్మ జ్ఞాన పద్ధతులు, నిర్ణయములు. అనగా బ్రాహ్మణకర్మ, క్షత్రియకర్మ, వైశ్యకర్మ, శూద్రకర్మ యని కర్మ నిర్మి

తములు వేరువేరుగా యుండును. జ్ఞానానుభవమునకు పరిచయ వేదంబులు బ్రాహ్మణులు చదువవచ్చును చెప్పవచ్చును. క్షత్రియులు చదువ వచ్చును గాని చెప్ప రాదు. వైశ్యులు వినవలయునుగాని చదువకూడదు శూద్రులు వినకూడదు అని నిర్ణయాలు యున్నందున సద్గురు నిర్ణయ కర్మ జ్ఞానంబులే సూరిజనులు అను సరించెదరు గాని వేదశాస్త్ర, నిర్ణయ కర్మ జ్ఞాన నిర్మితములు ఇష్టపడరు ఆచరించరు.

శి॥ సద్గురు కర్మనిర్ణయ జ్ఞాననిర్ణయ పద్ధతులు ఏ నిర్ణయముగా యుండును ?

గు॥ సద్గురుకర్మ నిర్ణయములు కర్మ సన్యాసముగా కాక కర్మ ఫలత్యాగ ముగా కాక కర్తృత్వ రహిత కర్మాచరణగా యుండును.

సద్గురు నిర్ణయ కర్మ జ్ఞాన ఆచరణ విధానమున మానవ లోకకల్యాణ మగు మానవ సౌభ్రాతృత్వము, అన్యోన్య సహకారము, ఐహికాముష్మిక పురో భివృద్ధి చేకూరును.

కం॥ కలవేళ్ళను యీ మేల్కను । గల యీ బయలుండజూచి కలమేల్కలలో । గలలేని నిన్ను నీమేనుల లేవని నీవుదెలిసి యుండుము చాలున్ ॥ 54

ఓ శిష్యుడా ! కలసమయము నందునను ఈ మెలకువ యందునను అచల పరిపూర్ణ పరబయలు శాశ్వతముగా యున్నది జూచి కల మేలుకల యందు లేక యున్నట్టి లేని నిన్ను నీ మేనులను లేవని తెలిసి యుండుము. జనన మరణ రహితమునకు ఈ లక్షణము చాలుయని భావము.

శి॥ కల సమయమునకు ఈ మేలుక యందునను అచల పరిపూర్ణ పర బయలు యుండుట ఎట్లు? కల మేలుకున్న ఎరుక లేకపోవుట ఎట్లు ?

గు॥ ఎరుక వుపాధికి మూలము లేనందున ప్రవేశించుటకు స్థానము లేనందున ఎరుకను కలయని నిర్ణయము. కలయగు ఎరుకయందు జీవతను చతుష్ట యము ఈశ్వరతను చతుష్టయమును నిర్ణయించుకున్నను అవియు ఎరుకయగుకల స్వరూపమును సద్గురుమూర్తి అనుగ్రహమువల్ల అచల పరిపూర్ణ పరబయలు దర్శనమున కలయగు ఎరుక లేకపోవుచున్నది గనుక కలయగు ఎరుక లేకపోవ డము ఈ మేలుకయని నిర్ణయము. ఈ రెండు లక్షణాలు అనగా కలమేలుకలు రెండు లేకపోవును అచల పరిపూర్ణ పరబయలు శాశ్వతముగా యుండునని నిర్ణ యము.

కం॥ మేనుజడ మజడమనినను । నేనును యీ రెండు గలిసి నే ననబడు ।
స్వప్నానందమె మదవస్థగు నేనేనను మృషని తెలియ నేమృష
నౌచున్ ॥ 55

ఓ, శిష్యుడా ! చైతన్య రహితమగు ప్రాణము జడమని చెప్పబడును. చైతన్య సహితమగు ప్రాణము అజడమగు నేనని చెప్పబడును. జడ చేతనముల రెంటి చేరికను అహమగు నేనని నిర్ణయము. నాయవస్థ స్వప్నానందము యని నిర్ణయము గనుక నేనేనన్ను అశాశ్వతమని తెలియగనే నేను లేకపోదునని భావము

శి॥ నా యవస్థ స్వప్నానందము యనుటకు కారణమేమై యుండును ?

గు॥ జడచేతనముల చేరిక అహమగు నేనని నిర్ణయము. నేనను అహము నకు అచల పరిపూర్ణ పరబయలునందు కలిసేందుకు సందుగాని నిలిచేందుకు చోటుగాని లేనందున నేనగు అహము స్వప్నమని లేనిదని చెప్పబడును.

స్వప్నమగు నన్ను మహావాక్య నిర్ణయానుసారము తత్వమసి బ్రహ్మ అహం బ్రహ్మాస్మి అయమాత్మ బ్రహ్మ ప్రజ్ఞానం బ్రహ్మయను నిర్ణయాను సారము శ్రవణాదులు యొనర్చి వార్తిక నిర్ణయానుసారము శ్రవణాదులు నిర సించి బ్రహ్మానందముగా నున్నను అదిలేనిదే గనుక స్వప్నానందము యని నిర్ణయము.

శి॥ నేను నన్ను అసత్యమని తెలియడము ఎట్లు ?

గు॥ అహం బ్రహ్మాస్మి యను నిర్ణయమునకు అచల పరిపూర్ణ పరబయలు నందు ప్రవేశించుటకు సందుగాని నిలిచేందుకు చోటుగాని లేదని సద్గురుమూర్తి యనుగ్రహమున తెలుసుకోవడమే నిన్ను నీవు అసత్యమని తెలియడము.

కం॥ నేనెతానైతె నావలె । యీ నేలేనట్టి బ్రహ్మ నేననుకున్నే నేనందు
నేనులేనిదె । మేనుజగత్తులై దోచి మృషనౌ చుందున్ ॥ 56

ఓ, శిష్యుడా ! నేను నేనుయని ఎరిగే ఎరుక అచల పరిపూర్ణ పర బయలుగా అయేట్టులైన యెడల పరిపూర్ణ పరబయలు కూడా నేను నేనని ఎరుక పద్ధతి కలిగి యుండెడిది. అచల పరిపూర్ణ పరబయలు తనను తాను గుర్తెరు గదు. యెరుకవున్న విధానము గుర్తెరుగదు గనుకనే నేను దానియందు లేకనే మేను జగత్తులుదాతోచి లేకపోవుచున్నాను యని భావము.

కం కానరావారు మతములు । నానాగమ నిగమసమితి । నామము రూపం
బేను లేనపుడు నాకై నేనరుదెంచినను వెంటనే యవివమ్మన్॥ 57

ఓ, శిష్యుడా! నా వునికి లేనప్పుడు వైష్ణవము, శైవము, శాక్తము, గాణా పత్యము, సౌరము, కాపాలికము అగు షణ్మతములు కర్మనిర్మితమగు పూర్వ మీమాంసము జ్ఞాననిర్మితమగు ఉత్తర మీమాంసము వేదోపనిషత్తుల సమూ హము నామరూప నటనలు అగుపడవు. నావునికి వున్నట్లు తెలియగనే అగమ నిగమాదులు బీజవృక్ష న్యాయముగా సర్వము నావెంటనే వచ్చునని భావము.

కం॥ నామీది ప్రేమచేతను । యీమనుజులు నిలపదలచి యెన్నో యుక్తుల్ ।
తామొనరించిన నిల్తునె । నేమృష, మృష నిల్వగలదె । నిశ్చయము వలెన్ ॥ 58

ఓ, శిష్యుడా ! నాయందుగల ప్రేమాభిమానులచే నన్ను శాశ్వతముగా వుంచదలచి మానవులు ఎన్నియో శాస్త్రములు నిర్మించినారు. అయినా నేను లేక తోచే పద్ధతిగలవాడను గనుక అచల పరిపూర్ణ పరబయలు రీతి వుండగలనా ? ఉండబోనని భావము

శి॥ అశాశ్వతమగు నన్ను ప్రేమాభిమానములచే శాశ్వితుడనని ఎట్లు నిర్ణ యించినారు ?

గు॥ భగవచ్ఛబ్దార్థ షడ్గుణైశ్వర్యములు శ్లో॥ ఉత్పత్తించ వినాశంచ భూతానామగతిం గతిన్వేతి విద్యామవిద్యాంచ షణ్ణాం భగవతిరి తా॥ 1. పుట్టుట 2. గిట్టుట, 3. ప్రాణుల రాకడను, 4. ప్రాణము పోకడను. 5. విద్యను. 6. అవిద్యను ఎరుంగుట గలవాడు ప్రకాశించు పరమాత్ముడు బ్రహ్మము భగవంతు డని నిర్ణయము యున్నందున నా పైన ప్రేమ విడువలేక ఈ షడ్గుణ యుక్తుం డైన భగవంతుని సద్గురూ క్తముగా తెలియుటకు కర్మ జ్ఞాననిర్ణయ వేద వేదాంత పద్ధతులు అసనముద్ర లక్ష్యసాంఖ్య తారక అమనస్క మహావాక్య వార్తీక పద్ధతులు నిర్ణయించినారు.

కం॥ నీతండ్రి తాతలవలే । నీ తనయులు నీవు జనుట నిశ్చయము కదా!
మీతోటి రాదుగద బయలీ తెరగెరిగినపుడు శూన్యమేదో గనరా॥ 59

ఓ, శిష్యుడా ! నీ తండ్రి తాతలు చనిపోయినట్టులనే నీవు నీకుమారులు చనిపోవుట నిశ్చయమే గదా ! అచల పరిపూర్ణ పరబయలు నీతో వచ్చిపోవు నట్టిదికాదు గదా. ఈ రెంటిని వుండజూచి లేనిది లేనట్లు ఉన్నది యున్నట్లు విచారించి లేనట్టిది ఏదో కనుగొని నిశ్చయముగా యుంటె చాలునని భావము.

## — (బయలు లక్షణము) —

కం॥ బయలెపుడు పుట్టి గిట్టదు । బయలెప్పుడు ముట్టుకోదు । బ్రహ్మాండంబుల్ । బయలెపుడు నన్నెరుంగదు । బయలెప్పుడు జేయబోదు । పనులెవ్వైవన్॥ 60

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ పరబయలు ఏకాలమందు పుట్టదు చావదు పుట్టి చచ్చే ఈ బ్రహ్మాండమును అంటియుండదు. అహం బ్రహ్మాయను నన్ను ఉన్నదనిగాని.లేదనిగాని ఎరుగబోదు. సమిష్టిరూపములైన సర్వజ్ఞత్వ కర్మలలో ఏ కర్మకూడ చేయునట్టిది కాదని భావము.

శి॥ సమిష్టికర్మ యనగా వ్యష్టికర్మ యనగా యేది ?

గు॥ అక్షర పురుషుడు యొనర్చునట్టి ఉత్పత్తి, స్థితి, లయ, విస్తీర్ణ ఆకర్షణంబులు సమిష్టి కర్మయని, క్షర పురుషుడు జ్ఞానేంద్రియములచే విషయ పంచకము తెలుసుకొని కర్మేంద్రియములతో కర్మ అచరించడము వ్యష్టికర్మ యని నిర్ణయము.

కం॥ బయలనిన నిత్యవస్తువు । బయలన నొకరీతి నుండు బ్రహ్మాండములో బయలనిన కండ్లబడనిది । బయలన బ్రహ్మాండ మవల బరగెడిది సుమీ॥ 61

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ పరబయలు శాశ్వతమైనది. కాలత్రయములతో బ్రహ్మాండము మార్పుజెందునట్లు (ప్రళయము పొందునట్లు) మార్పుజెందక ఇటువంటిదెయని చెప్పుటకు వీలుకాక ఆది మధ్యాంతములు లేక నిండి నిబిడీకృతముగా బ్రహ్మాండము లోపల బయట అచల పరిపూర్ణ పరబయలు యుండును. అచల పరిపూర్ణ పరబయలు కన్నులయందు ప్రవేశించదు వెళ్ళిపోదు. గనుక అది కన్నులకు అగుపడదు. అచల పరిపూర్ణ పరబయలు బ్రహ్మాండమును అంటుకొనదు గనుక బ్రహ్మాండమునకు అవతల యుండునది యని భావము.

కం॥ బయలనిన నేనులేనిది । బయలనిన నుపాధిగాన బడనిది యెపుడున్ । బయలనిన పలుకులేనిది బయలిట్టిది యనుచు తెలియబడదెవ్వరికన్ ॥ 62

ఓ, శిష్యుడా ! అహంబ్రహ్మయను నేను లేనిది అచల పరిపూర్ణ బరబయలు-బుట్టుట యనునది లేనిది అచల పరిపూర్ణ పరబయలు ధ్వన్యాత్మకము

పర పశ్యంతి మధ్యమ వైఖరియను వర్ణాత్మకము లేనిది అచల పరిపూర్ణ పరబయలు. కర్మయోగ జ్ఞానవిర్మితములగు మహాపురుషులగు అచల పరిపూర్ణ పరబయలు ఇట్టిదని చెప్పుటకు సాధ్యముకాదని భావము.

కం॥ చెప్పి చూపించరానిది । యప్పా యల్లమగొచూడు మని నేనీకున్
చెప్పి చూపిస్తి మరువకు । యెప్పటికిది నమ్మి లేనియెరుకను
విడరా ॥ 63

శ్రుతి॥ "యతో వాచ నివర్తంతే అప్రాప్యమనసా సహ" యను న్యాయ మున అవాఙ్మానస గోచరమగు అచల పరిపూర్ణ పరబయలు ఇట్టిదని చెప్పి చూపింపుటకు సాధ్యము కానిదైనను నీకు చూపించినాను అచల పరిపూర్ణ పర బయలు సర్వకాల సర్వావస్థలయందు శాశ్వతముగా యుండునది యని మరువక దృఢపరచుకొని లేనట్టి నిన్ను కర్తృత్వ రహిత కర్మ పద్ధతిగా విడిచిపెట్టుమని భావము.

కం॥ ఉన్నదిగద నేజెప్పిన । దన్నా దాన్నుండజూచి తలగుము
మృషయౌ । నిన్నంటి యున్న సంపద । లన్నిటిగొని నీవు వచ్చి ।
నట్లు మృషగుచున్ ॥ 64

ఓ, శిష్యుడా ! నేను అచల పరిపూర్ణ పరబయలును నీకు చూపించినాను. దానిని సర్వకాల సర్వావస్థలయందు శాశ్వతముగా యుండినట్టిదియా యుండనట్టి దియా బాగుగా తెలుసుకొని అచల పరిపూర్ణ పరబయలునందు నీ వునికి లేవిది గనుక నీవు లేనని తెలియుము. నీ లేనిస్థితి నీకు యెప్పుడైతే దృఢమైనదో అప్పుడే నీయందు తోచబడే ఇహపర సంపదలు సర్వము నీతో గూడ అప్పుడే లేనివగునని భావము.

కం॥ పంచకోశముల నందును । మించినదీ యెరుక యనుట । మేలా
బయలం । చెంచినదగు నా ముచ్చట అంచిత సద్భక్తి యుక్త
అమితాసక్తా ॥ 65

ఎడతెగని భక్తి గలిగి యోగ్యమైన శ్రద్ధగల ఓ, శిష్యుడా ! అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ అను పంచకోశంబులు వేరికను మించినది హిరణ్మయ కోశమగు ఎరుకయని నిర్ణయించినందున జనన మరణ రహిత శుభము గలుగగలదా, జననమరణములు లేని అచల పరిపూర్ణ పరబయలు కోశములకు అతీతమని నిర్ణయించిన యెడల జన్మ రహితమునకు తగినదని న్యాయమైనదని తెప్పనగునని భావము.

కం॥ లేని నేనను శరీరము । లోనబయట గలిగినట్టి లోకసమితికిన్ ।
లోన బయట గల బయలిది దీనందేలేక మనము తిరుగుట మనఘా॥ 66

ఓ, శిష్యుడా ! మూలములేని గుర్తెరిగే శరీరంలోన బయట యున్నట్టి లోకసమూహముయొక్క లోపల బయట వున్నది ఈ అచల పరిపూర్ణ పర బయలు గనుక ఈ పరబయలునందు లేకనే మనము రమ్యముగా జననమరణ ప్రవాహమున తిరుగుచున్నామని భావము.

శి॥ మూలములేని గుర్తెరిగే శరీరము లోపల బయటనున్న లోక సమితి ఏమిటై యుండును ?

గు॥ జ్ఞానేంద్రియములచే విషయపంచకము తెలుసుకొని కర్మేంద్రియ ములచే కర్మ యొనర్పగా వచ్చిన ఫలంబులు గుర్తెరిగే శరీరము లోపల యుండును. వాటి ఫలానుభవమునకు నిర్మించిన సత్యలోక కైలాస వైకుంఠ రౌరవాది నరకలోకంబులు గుర్తెరిగే శరీరమునకు బయట యుండును, గనుక జననమరణ ప్రవాహమునందు ప్రవహించు వారమని నిర్ణయము.

కం॥ ముడిబడి కర్మము జ్ఞానము । విడువక నా రెండు వెలసె । విశ్వ మనసదే । కడువేడ్క బయలుగనెనా । ఘడియైనను నిల్వలేక కల్తై పోవున్ ॥ 67

ఓ, శిష్యుడా ! కర్మజ్ఞానముల యొక్క చేరిక విడువక ప్రవహించును. విశ్వము అదే పద్ధతిగా ప్రవహించును గనుక దీని నిర్ణయము తెలిసినందున జనన మరణంబులు తొలగబోవని సంతోషముతో మూలము లేని గుర్తెరిగే శరీ రము విడచి సద్గురుమూర్తి ఆశ్రయించి అచల పరిపూర్ణ పరబయలును తెలుసు కొన్న యెడల గడియకాలమైనా ఎరుక నిలువలేక పోవునని భావము.

శి॥ మూలంలేని గుర్తెరిగే శరీరమును సంతోషముతో ఎట్లు విడువవలెను ?

సద్గురు కరుణవలన అచల పరిపూర్ణ పరబయలు దర్శన భాగ్యము కలు గును. అందువలన ఎరుకకు మూలము లేదని తెలియును ఎరుకకు మూలము లేదనే నిశ్చయము పైన త్రికరణములను ఆత్మ అంగస్థాన భావ శుశ్రూషలకు భంగము కలిగేలాగ ప్రవర్తించిన వారికి పునర్జన్మ తప్పదు గనుక అచల పరి పూర్ణ పరబయలునందు ఎరుకకు మూలము లేకపోయిన నీ కర్మాచరణ ప్రవర్తన సద్గురు నిర్ణయ జ్ఞానపద్ధతి ననుసరించి నుండవలయును. అటువంటి ప్రవర్తన మానవ సౌభ్రాతృత్వము అన్యోన్య సహకారము ఐహికాముష్మిక పురోభివృద్ధి కలిగి సంతోషముతో యుండురు.

కం॥ సకలంబులేని బయలున । సకలములేని దిటకొచ్చి చనెవాలేనం । మ
కనితా లేవిపోయిన । నిక నిలిచే బయలు నెరుగ నేదుండునురా ॥68

ఓ, శిష్యుడా ! నామరూప రహితమగు అచల పరిపూర్ణ పరబయలు
వందు లేకనే యున్నట్లుగా తెలియుచున్న ఈ నామరూపనటనలుగల ఎరుక
తన లేమిని తాను తెలుసుకొని తాను లేకపోయిన పిమ్మట అచల పరిపూర్ణ పర
బయలు వున్నదని తెలియుటకు ఎవ్వరు యుండబోరని భావము.

కం॥ ఉన్నలేనేమొ యనకన్ । వున్నది బయలనుచు యేమొ వుంటిని
లేనం । చెన్ను లేనట్టి నిన్నను । పన్నుగగని లేనినీవు ।
పరుగిడవోయీ ॥ 69

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ పరబయలు వున్నాననిగాని లేననిగాని
గుర్తులేకయున్నది. దానియందు లేనట్టి ఎరుక వున్నట్టు తోచడమే గాని నిజముగా
లేదు యనే నిశ్చయము నీకు దృఢముగా తెలిసిన యెడల లేకపోవుదువు. అనగా
అయమాత్మ బ్రహ్మయను యెరుక భ్రాంతి వుండబోదు. భ్రాంతి రాహిత్యమే
జన్మరాహిత్యమని భావము.

కం॥ రెండు వస్తువుల నడుమ । నఖండంబదె కానుపించు గద దీనిని
నీవుండి గనుగొని చనందగు మండిత సత్కీర్తి సాంద్ర । మానవ
చంద్రా ॥ 70

మనుజులలో శ్రేష్ఠమై ప్రకాశమానమై గొప్ప ప్రతిష్ఠగల ఓ, శిష్యుడా!
క్షరాక్షరముల రెంటి మధ్యమున అఖండముగా యుండునది అచల పరిపూర్ణ పర
బయలుగదా దానియందు నీవు యుండి అచల పరిపూర్ణ పరబయలు శాశ్వతమని
తెలిసి నీవు లేకపోయిన జనన మరణంబులు లేకపోవునని భావము.

కం॥ ఉన్నదానందు నిజముగ । నెన్నడు లేనట్టి మనము యేతెంచిట
యీ । తిన్నని ముచ్చటలాడితి । మిన్నియుకన్ వనము బోతె ।
యేదిరమాటా ॥ 71

ఓ, శిష్యుడా ! శాశ్వతమగు అచల పరిపూర్ణ పరబయలునందు ఏ కాలము
లేని మనము మనయందు మనము యున్నట్టుగా తలంచి జననమరణ భ్రాంతి
రహితమునకు అచల ఋషులు, నిరంజన ఋషులు నిర్ణయించిన శక్తిద్వయ
నిరాసకంబైన శుద్ధ నిర్గుణ పద్ధతి క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత
పరమతత్వ నిర్ణయ ప్రబోధము ఇంతవరకు మాటలరూపకముగా

మాట్లాడితిమి. ఈ పద్ధతిగా మనము లేకపోయిన యెడల ఇహపరాదుల నిర్ణయ వాచ్యవాచ్యార్థ లక్ష్యలక్ష్యార్థములు ఎచ్చట కూడ నిలువక పోవునని భావము.

కం॥ ఓ పాప రూపబయలే । పరమాత్మనుచునమ్మి । లేనట్టినినున్ ।
ఆపోజ్యోతి యనుచు దెలిసీ పట్లనె లేనటంచు చేరుముశక్కి ॥ 72

ఓ, శిష్యుడా! కంటి నల్లగుడ్డులోని ప్రతిఫలనము అనగా కంటిపాపవల్ల తెలియుచున్నది. నీ స్వరూపము గనుక అచల పరిపూర్ణ పరబయలు పరమాత్మ యనినమ్మి లేనట్టి నిన్ను ఆపోజ్యోతిననుచు తెలిసి ఎరుకయగు నీవు లేనని నిశ్చ యించి ఇప్పుడే అశాశ్వత పద్ధతినందు చేరుముయని భావము.

శి॥ కంటిపాపవల్ల తెలియుచున్న నా స్వరూపము లేనిదని నిర్ణయించుటకు కారణమేమై యుండును ?

గు॥ దారిద్ర్యుని నుండి చక్రవర్తి వరకు భక్తునినుండి బ్రహ్మవేత్త వరకు తెలియునట్టి స్వరూపంబులు కంటిపాపవల్లనే తెలియును గనుక అశాశ్వతములని లేనివని నిర్ణయము.

కం॥ ఇచ్ఛారాహిత్యంబనె స్వచ్ఛంబగు బోధయనుచు । సజ్జనులనిరీ ।
యిచ్ఛనె కూడని దనిరా । స్వచ్ఛందుల మాటలన్ని సత్యము
వినరా ॥ 73

ఓ, శిష్యుడా ! శృతి॥ "సంకల్పమాత్ర సంభవోబంధః" యని అక్షర పురుష నిర్ణయము. "మోక్షాపేక్షా సంకల్పోబంధః" యని క్షరపురుష నిర్ణయ ముగా నున్నందున కోరికరహితమైన మార్గము శ్రేష్ఠమని స్వచ్ఛందులగు సత్పురుషులు నిర్ణయించినారు. ఇచ్ఛవలననే జనన మరణాదులు కలుగు చున్నవి. గనుక కోరిక మంచిదికాదని అశాశ్వతమని నిర్మల హృదయుల నిర్మల వాక్యం బులు సత్యమైనవని భావము.

కం॥ ఏయాపేక్ష జనించిన॥ నాయాపేక్షలెల్ల మాయ। యని తెలియదగున్
ఆయాసమౌను దానను । ధీయని యవి విడువదగును । క్షేమము
కొరకై ॥ 74

ఓ, శిష్యుడా ! ప్రపంచ పారమార్థ కోరికలు మాయనే గనుక జన్మబంధ మని నిర్ణయము. అందువలన జనన మరణ రూపశ్రమ అధికమగును గనుక నీక్షేమము కొరకు సకల కోరికలు కర్తృత్వరహిత కర్మాచరణ పద్ధతిగా విడువు మని భావము.

కం॥ మనమీ బయలున లేనిదె। మనకు మనమె వచ్చి । నిల్చి మనమేగినా।
నేమనక మనజోలి గొనకన్ । తనకై తానుండియున్న దదుగో
కనరా ॥ 75

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ పరబయలునందు మనము లేనిదే మనం తట మనము పుట్టి మనంతట మనము పెరిగి మనంతట మనము పోయినను మన సంగతి తెలుసుకొనక ఇది మంచిది ఇది చెడ్డదియని ఏమి యనక తను అంతటా పరిపూర్ణ పరబయలుగా నిండియున్నది. అదుగో అచల పరిపూర్ణ పర బయలును చూడమని భావము.

## — (ఎరుక లక్షణము) —

కం॥ లేని నీకలిమి వంధ్యా। సూనునివలె పుష్కర ప్రసూనముపలె।స్వప్నా
నందమువలె। గంధర్వా నీకస్థానమువలె । నని తెలియదగున్ । 76

ఓ, శిష్యుడా ! లేకనే నీవు వున్నావను కొనుచున్నావు. నీ వునికి ఎటువంటి దనగా గొడ్రాలు బిడ్డవలెను, ఆకాశ పుష్పమువలెను, స్వప్నమునందు పొందిన ఆనందము వలెను, గంధర్వాదులు నివసించు నగరాదులవలె నున్నదని నిశ్చయించుకోమని భావము.

1. గొడ్రాలు బిడ్డ యనగా బిడ్డలు కనని ఆడుది. ఇతరుల బిడ్డలను స్వీకారము చేసుకొని తన సంతానమని ఆనందించుట.

2. ఆకాశపుష్ప మనగా ఆకాశమునందు తెలియు ఇంద్ర ధనుస్సుచూచి సంతోషించుట.

3. స్వప్నానందము అనగా కంటితో వస్తువుచూచి ఆనందించుట.

4. గంధర్వానీక స్థానమనగా పాటపాడువాడు నివసించు స్థానము అనగా తాళ మృదంగాది వీణ వాయిద్యాదుల వలన కలిగిన ఆనందము పాటపాడిన వరకే నుండి పాట ముగించగనే ఆనందము లేకపోవునట్లు ఎరుక లేకపోవునని నిర్ణయము.

కం॥ నీతండ్రి జనిన మొదట । నీ తనయుడు రాక మునుపు । నీవున్న
పుడున్ । యేతత్వ మంతనుటగల । దాతృత్వము నరసి మ్మనని
తలపుము మిమ్మన్ ॥ 77

ఓ. శిష్యుడా ! నీ తండ్రి చనిపోయినప్పుడు నీకు కుమారులు కలగక ముందు నీవు వున్నప్పుడు ఏ అచల పరిపూర్ణ పరబయలు అంతట నిండియున్నదో

దానిని సద్గురుమూర్తి అనుగ్రహమువలన తెలిసి నిన్ను సకల ఆనందములను అశాశ్వతములని విడువుమని భావము.

కం॥ నీవెసుమీ జీవశివుల్ । నీవెసుమీ మేనుజగము నీవే సుమ్మీ ।
జీవశివైక్యము బయలున నీవు గలుగలేదు, లేదు । నీమొద
లెచటన్ ॥ 78

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ పరబయలునందు కలియుటకు చోటుగాని నిలిచేందుకు స్థానముగాని నీకులేదు గనుకనే నీకు మూలము ఎచటను కూడ లేనిదని భావము. ప్రాణమనంబుల చేరికవలన తెలియుచున్న నీ యందుననే మేను జగములు జీవేశ్వరులు జీవేశ్వరైక్యమని నిర్ణయము గనుక ఈ సకలము భ్రాంతి జన్యమని భావము.

కం॥ కదిలీనా మెదిలినా । కదలని యీబయలు నిన్ను । గనలేదు గదా ।
మొదలెక్కడ గనరాదిక । కదలుము నీకలి ముళ్ళక్కిగా దలచి
సుతా ॥ 79

ఓ, కుమారా ! నీవు అంతఃకరణ రూపమున ప్రజ్ఞానం బ్రహ్మయని అహం బ్రహ్మాస్మి యని, తత్వమసి బ్రహ్మయని, అయమాత్మ బ్రహ్మయని కనినా జ్ఞానేంద్రియములచే విషయపంచకము తెలుసుకొని కర్మేంద్రియములచే నిత్య నైమిత్తిక కర్మలు యొనర్చినా నీ విషయము అచల పరిపూర్ణ పరబయలు తెలుసుకొన బోదుగదా ! నీయంతట నిన్ను నీవు విచారించి చూచుకొనినను నీకు మూలముగాని నిలిచేందుకు స్థానముగాని ఎప్పట అగుపడని విషయము నిజమని తెలుసుకొని నీవు తెలియునట్టి యునికి అశాశ్వతమని నిర్ణయించుకొని నీవు లేక పోవడమే నిజమైన పద్ధతి యని భావము.

కం॥ మేనని నను దెలిసినగతి । నేననినది బయలుగాను । నీవెరుగోయీ ।
నేననినది నేననదని । నేనను నేనరయ మృషని । నేమ్మష
నాదున్ ॥ 80

ఓ, శిష్యుడా ! మేను తెలియగనే నేను గుర్తింపబడిన రీతిగా మేను నేను రెండు ఒక్కటే నేను మేనును గుర్తెరుగనిది అచల పరిపూర్ణ పరబయలని నీవు తెలుసుకొని అచల పరిపూర్ణ పరబయలు ఏకాలమందైనా నేను యని యనదు గనుక దానియందు తనకు ఉనికి లేనిదని తెలుసుకొనిన యెడల తనంతట తానే లేకపోవునని భావము.

కం॥ మేనొక్కటి నేనొక్కటి । నేనీ మాటలను విడిచి నిను నీ తనువున్ ।
నేనేనని యచలముగని । నేనను నీవేగవోయి నేమ్మష ననుచున్॥ 81

ఓ, శిష్యుడా ! శరీరము వేరు యనే ద్వంద్వబుద్ధిని విడిచి శరీరము నీవు ఏకము యని నిశ్చయము గలిగి అచల పరిపూర్ణ పరబయలు తెలుసుకొని తదుపరి నిన్ను నీవు తెలుసుకొన్న యెడల నీకు నీవు అశాశ్వతమని తెలియును గనుక ఆ నిశ్చయమే నీవు కలిగి యుండుమని భావము.

కం॥ దేహమున కొంత నిజమని । మోహంబున నిల్పుకొనుటె మోసంబు
గురు । ద్రోహమగు గాన విడువుము మోహంబును మేల్కొనకల
మునిగినరీతిన్ । 82

ఓ, శిష్యుడా ! స్థూల సూక్ష్మకారణ మహాకారణ దేహములందు స్థూల దేహము అశాశ్వతమని దానియందలి మహాకారణ దేహము శాశ్వతమని శ్రుతి॥ "బుద్ధి గాహ్యా మతీంద్రియమ్" అను న్యాయమున నిశ్చయించి దానియందు శాశ్వత బుద్ధి కలిగియున్న యెడల ప్రమాదమగును మరియు సద్గురు నిశ్చయ జ్ఞానము తప్పు తలంపు గలవాడవగుదువు గనుకనే దేహదేహాంబులు ఏకమనే నిశ్చయమున వాటిని విడిచిన యెడల సురస్వప్నమునందు ఎరుక జగంబులు లేకపోయినట్లు మోహపద్ధతులు లేకపోవునని భావము

శి॥ సద్గురు నిశ్చయజ్ఞానము తప్పు తలంపువాడు ఎట్లగును ?

గు॥ మానవ లోకకల్యాణంగు మానవ సౌభ్రాతృత్వము అన్యోన్య సహకారము ఐహికాముష్మిక పురోభివృద్ధికి నిర్ణయించిన విధానము ఈ వేదము కర్మ కాండ యని వేదాంతము జ్ఞానకాండ యని కర్మ జ్ఞానరహిత పద్ధతి సిద్ధాంతమని సద్గురువులు శాంతి పద్ధతులద్వారా నిర్ణయించి యున్నారు. ఆ పద్ధతి తెలియక ప్రవర్తించువారు వేద ధర్మము వుల్లంఘించిన వారు యని సద్గురు నిశ్చయ జ్ఞానమును వుల్లంఘించినవారని నిర్ణయము.

కం॥ చలన మన నీవు సుమ్మీ । చలనరహిత మనిన బయలు చలనమె
కలయా । చలనము చలన రహితము । గలదని కని తొలగ మేలు
కగునోయప్పా॥ 83

ఓ, తండ్రీ ! చలనమనగా నీవు నేను యను ఎరుక యని తెలియుము. చలన రహితమనగా అచల పరిపూర్ణ పరబయలని ఎరుగుము చలనమగు నిన్ను కలయని పరిపూర్ణ పరబయలునందు లేనిదని తెలుసుకొనుము. చలనమగు నీవు

అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకొని నీవు లేనటువంటి స్థితే నీకు మేలు కయని భావము.

శి॥ నేను లేనట్టి స్థితి నాకు మేలుక ఎట్లగును ?

గు॥ కర్మ సన్యాసము కర్మఫలత్యాగమునకాక కర్తృత్వరహిత కర్మాచరణ యందు నీవు లేకపోదువు గనుక నీవు లేకపోవడమే జనన మరణములనుండి మేలుకున్నావని నిర్ణయము.

కం॥ ఈ గుర్తెరిగే మేనును । బాగుగ విడిచుండుమిందు । బట్టకు దేనిన్ ।
అగడమౌ దానను విని । త్యాగము నీకుంటె మంచిదౌరావోరీ । 84

ఓ, శిష్యుడా ! ఈ గుర్తెరిగే శరీరమగు నిన్ను నీవు ఏలాటి సంశయము లేక విడువుము. దీని పరిణామావస్థలయందు జ్ఞానమని, కూటస్థుడని, సాక్షియని, చైతన్యమని, ప్రత్యగాత్మయని, పరమాత్మయని, చిదాభాసమని, సత్యజ్ఞానానంద స్వరూపమని అంతఃకరణ చతుష్టయము మనస్సు, బుద్ధి, చిత్తము అహంకారముయని యెన్నియో నామంబులు కలవు. ఇందు ప్రతినామ రూపములు వాటి వల్ల జరిగే క్రియలు శ్రేష్టమని నమ్మియున్నవారు ప్రపంచమున అనేకులుగలరు. అట్టివారి సాంగత్యమున వారుచేయు పనులు నమ్మియున్న యెడల నీకు జనన మరణకీడు తొలగదు, గనుక నేను చెప్పినట్టి లక్షణము విని సర్వసంగ పరిత్యాగమగు అస్పర్శయోగముగాయున్న యెడల జనన మరణ భ్రాంతిరహితమగును. మానవజన్మ ఫలమగు మోక్షము చేకూరునని భావము.

కం॥ వలదెక్కువ ముచ్చట్లిక । చలనము లేనట్టి బయలు । చందముగని
యీ । చలనమగు నీకునీవే తలిదండ్రులటంచు దెలిసి తలగుము
చాలున్ ॥ 85

ఓ, శిష్యుడా ! అధికమైన మాటలచేత మనకు ప్రయోజనములేదు. వేదమునందలి సిద్ధాంత పద్ధతి ఉన్నది యన్నట్లు విచారించి అచల పరిపూర్ణ పరబయలు వున్న విధానము తెలుసుకొని ఈ చలనమును నీకునీవే తలిదండ్రులని నిర్ణయము తెలుసుకొని నీవు లేకపోయిన జనన మరణ రహితమునకు చాలునని భావము.

కం॥ బ్రహ్మందులేక కలిగిన । బ్రహ్మను నేననెడి మాయ ప్రబలె జగంబై
బ్రహ్మమగని తానేగుటె । బ్రహ్మననే మాయకుపని । బ్రహ్మందు
జామీ ॥ 86

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ పరబ్రహ్మమునందు లేనటువంటి అహం బ్రహ్మమను ఎరుక జగత్తు రూపముగా ప్రబలి యున్నది గనుక అచల పరిపూర్ణ పరబ్రహ్మము తెలుసుకొని దానియందు లేననే నిశ్చయమున తాను లేకపోవడమే అచల పరిపూర్ణ బ్రహ్మమునందులేని ఎరుకపని అనగా ఎరుక ఆచరించు విధానము. ఈ పద్ధతి ఎరుగక ప్రజ్ఞానం బ్రహ్మ అహం బ్రహ్మాస్మి తత్వమసి బ్రహ్మ అయమాత్మ బ్రహ్మ యని శ్రవణాదులు యొనర్చి శ్రవణాదులు నిరసించి బ్రహ్మనిర్ణయానుసారము యున్నను జననమరణములు తొలగవని భావము.

కం॥ నిరుపాధికమగు బయలున । మరిలేకనే కలిగినట్టి మారుతమునకే ।
పరియాయ నామములగు । కరువలియన యెరుక యనిన । కోరుమాయ యనన్॥ 87

ఓ, శిష్యుడా ! జనన మరణములు లేని అచల పరిపూర్ణ పరబయలునందు లేక కలిగినట్టి (గాలి) ప్రాణమునకు చైతన్య సహిత ప్రాణము ఎరుకయని చైతన్య రహిత ప్రాణము మాయయని పర్యాయ నామంబులు నిర్ణయించినారని భావము.

కం॥ మానసము దేహి జీవుం । డానందము సత్తు చిత్తు లహముజగ । దధి ష్ఠానంబు సాక్షి సత్య । జ్ఞానము ద్రష్టనిన నీవె సత్యము సుజ్ఞా॥ 88

యోగ్యమైన జ్ఞానము గల ఓ, శిష్యుడా! మనస్సు యనినను, దేహియనినను, జీవుడనినను, ఆనందము యనినను, సత్తు యనినను, చిత్తు యనినను, అహము యనినను, జగత్తుకు అధిష్టానము యనినను, సాక్షి యనినను, సత్యమనినను, జ్ఞానమనినను, ద్రష్టయనినను నిజముగా ఎరుకయొక్క పర్యాయపదంబులే యని తెలుసుకొనుమని భావము.

కం॥ జ్ఞానాజ్ఞానంబులు యీ జ్ఞానంబువె కాని వేరు గావెన్నటికీ । జ్ఞానా జ్ఞానానికీ పని జ్ఞానాతీతమునుగాంచి । వసుటయు నుమ్మీ । 89

ఓ, శిష్యుడా! తెలివియును తెలివిలేనితనమును ఈ రెండు తెలివి యగు జ్ఞానములేకాని వేరుకావు గనుక జ్ఞానాజ్ఞానంబులు జ్ఞానాతీతమైన అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకొని జ్ఞానాజ్ఞానస్వరూపమగు తాను లేకపోవడమే తనయొక్క పని యని భావము.

కం॥ స్థిరముగ నిర్చేద్వైతే । పరుగెత్తక భ్రాంతి నిల్వ బడదాఘపటో ।
నరులు విమర్శించిన తా । మరుకుట మదియందు కోప మూహను కనరా ॥ 90

ఓ, శిష్యుడా ! భ్రాంతి నిర్మితమగు ఎరుక స్థిరముగా నిలుచునదైనయెడల (పారిపోక) ఉత్పత్తి, స్థితి, లయములు పొందక నిల్చియుండును. పృధ్వియందు గల మానవులు విచారించి చూడగా పిపీలికాది బ్రహ్మ పర్యంతము సర్వము సృష్టి స్థితి, లయ, విస్తీర్ణ ఆకర్షణ అశాశ్వత పద్ధతిగా తెలియుట మెందుకో నీయందు నీవు ఊహించి తెలుసుకోమని భావము.

## — (ఎరుక వుత్పత్తి లక్షణము) —

కం॥ జలమందు మొదలు లేకనె। జలచరములు బుట్టి పెరిగి సమసినరీతిన్ ।
అచల పరిపూర్ణములో నీవిలసజ్జననంబు స్థితియు। విలయములౌరా॥91

ఓ, శిష్యుడా ! నీటియందు మొదలు లేనిదే జలచరములు పుట్టిపెరిగినశించిన విధమున అచల పరిపూర్ణ పరబయలునందు లేనిదే ఆత్మ, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృధ్వి పుట్టి పెరిగి లయము పొందుచున్నవి యని భావము.

కం॥ అచలమున మొదలు లేకనె। సచరాచర । జంతునిశ్చయ జనన
మగు యప్పుచయమున లేని జలచర నిచయము జన్మించినట్లు ।
నిశ్చయము సుమీ ॥ 92

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ పరబయలునందు స్థావర జంగమ జీవో పాధులు, జడా జడంబులు చరాచర సమూహము పుట్టుచుండును. ఎట్లనగా శుద్ధ మైన నీటి సమూహమునందు మూలము లేకనే జలచర సమూహము జన్మించిన విధమునయని భావము.

కం॥ నీరందు చేపలేకనె। నీరున జన్మించి మించి నీల్గిరీతిన్ తోరమగు
బట్టబైటను । వారక గుర్తెరుగు మేను । వచ్చున్ బోవున్॥ 93

ఓ, శిష్యుడా ! నీరందు చేపలేకనే నీరున పుట్టి పెరిగి వచ్చిన విధమున అమితమగు అచల పరిపూర్ణ బయలునందు ఈ గుర్తెరిగే శరీరము ఎడతెగక జన్మాదులు పొందుచుండునని భావము.

కం॥ జలధి జలచరములోపల । గలదా జలరాశిలోని జలచరమువలెన్ ।
జలధి నిత్యం బనిత్యము । జలచర మట్లచల చలముల । సరణులు
గనుమీ॥ 94

ఓ, శిష్యుడా ! సముద్రమునందు జలచరములు యున్నట్లు జలచరముల యందు సముద్రము లేదు గనుక జలచరములు అశాశ్వతము. జలము శాశ్వతము యని ఎట్లు తెలియుచున్నదో ఆ విధముగనే చరాచరముయొక్క ఎరుక అచల పరిపూర్ణ పరబయలు నిర్ణయమని భావము.

కం॥ జలరాసికి బుట్టవుగద । జలచరములు వాటికవ్వె జనియించుగదా ।
కలకాలమిట్లు బయలెరుకల గాంచిన సంశయంబు! కడకేగుజుమీ॥95

ఓ, శిష్యుడా ! జలమునందు పుట్టి పెరిగి వశించే జలచరంబులు నీటికి పుట్ట కుండా వాటికవే పుట్టిపెరిగి నశించుచుండును గనుక ఈ విధముగా సర్వకాల సర్వావస్థలయందు అచల పరిపూర్ణ పరబయలును ఎరుకను తెలుసుకొను చుండిన సకల సంశయంబులు సమసిపోవునని భావము.

కం॥ పుట్టదు గిట్టదు నొకరిని । పుట్టించదు చంపబోదు భూమ యెరుకదా ।
పుట్టును గిట్టును నొకరిని। పుట్టించును నమయజేయు భూమకితరమై॥96

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ పరబయలు మతములేనిది గనుక తాను పుట్టదు చావదు. ఒకరిని పుట్టించదు చంపదు. ఎరుక తనంతట తాను అక్షర రూపమున పుట్టును. ప్రళయపద్ధతిగా చచ్చును. క్షరరూపమున కర్మానుగుణ్యముగా పుట్టును. కాలానుసారము చచ్చును. గనుక అచల పరిపూర్ణ పరబయలుకు ఎరుకకు ఏలాటిసంబంధము లేదని భావము.

కం॥ కలలోపల యేనుగుపై । గలదొర మేల్కనిన నిల్వ గలడాగురుడున్ ।
దెలిపి బయలు నీవు లేవిక దలపకుమన నీకునిల్వదరమాతలపన్॥97

ఓ, శిష్యుడా ! స్వప్నమునందు రాజ్యపరిపాలన జేయునట్టి రాజు ఏనుగు నెక్కి నూరేగు సమయమందున మెళకువ కలుగగానే స్వప్నస్థితి యుండబోదు గదా! అట్లు సద్గురుమూర్తి అచల పరిపూర్ణ పరబయలు స్థితి తెలిపి నిన్ను లేనట్టి లక్షణము నీకు తెలియపర్చగనే నీవు నిలిచేందుకు ఇహపరాదులయందు ఎచట నైనా అవకాశము యున్నదా విచారించి చూడుము యని భావము.

కం॥ ఎందరు లేదన్ననుతా । నెందుకు లేకుండు బయలు నేనీవనకన్ ।
యందరు కలదని యన్నను । యెందుకు కలిగిండు యెరుక నేనీ వనుచున్॥ 98

ఓ, శిష్యుడా ! నేనీవనక సర్వకాల సర్వావస్థలయందు యుండునట్టి అచల పరిపూర్ణ పరబయలు సద్గురు సూచనవల్ల తెలియనట్టివారు లేదని చెప్పినంత మాత్రమున పరబయలు లేకపోదు. నేనీవని ఎరిగే ఎరుక కలదని ఎందరు అని నను ఎట్లు కలిగియుండును యుండబోదని భావము.

శి॥ అచల పరిపూర్ణ పరబయలు లేదని ఎరుక కలదని ఎట్లు చెప్పెదరు?

గు॥ అచల పరిపూర్ణ పరబయలు అవాఙ్మానస గోచరము గనుక స్వాను భవము గాక గ్రంథపఠన పాఠన శ్రుతములవల్ల తెలియక సద్గురుమూర్తి సూచన వల్లనే తెలియనగును గనుక సద్గురు సూచన తెలియనివారు అచల పరిపూర్ణ పర బాహ్యమును శూన్యమని ఆకాశమని నిశ్చయించుదురు.

ఎరుక తన సకల వ్యవహారములు తెలియుచు తనకు తాను సాక్షి రూప ముగా యుండి సకల కర్మలు ఆచరించి అనుభవించును గనుక స్వానుభవముతో నైనా, గ్రంథావలోకనమునైనా తెలియునట్టిది గనుక భ్రాంతి పదులకు ఎరుక గోచర పద్ధతిగా తెలియును గనుక అగోచరము శూన్యమని గోచరముగా తెలియు ఎరుక శాశ్వతము యని నిర్ణయము.

కం॥ నీచ్చిరాని యూరున । నీకేగృహ మచ్చన్నట్లు నీవౌ మేనన్ ।
నీకచ్చిరాదు వివునిను । చేసుకొనుటయు మానవయ్య శ్రేయ
స్కామా॥ 99

ఓ, శిష్యుడా ! నీకు అచ్చిరాని గ్రామమున ఆ గ్రామమునందుగల గృహా రామ క్షేత్రాదులు ఏవిధముగా నీకు మేలు చేకూర్చనట్లు ఎరుకయగు నీవైయున్న శరీరము నీకు అచ్చిరాదు. అనగా జనన మరణ రహితము చేకూర్చబోదు గనుక జనన మరణ రహిత శ్రేయస్సుయందుగల నీవు ప్రజ్ఞానంబ్రహ్మ. అహం బ్రహ్మాస్మి, తత్వమసి బ్రహ్మ అయమాత్మ బ్రహ్మయను నిర్ణయము విడువు మని భావము.

కం॥ నీరాంశ మన్న గోదన । సారము రేతస్సురెంటి సమ్మి శ్రంబే ।
ధారుణి తనువై నిలుచును। నారీనర సంగమమున। నయగుణరత్నా 100

న్యాయగుణములయందు శ్రేష్ఠుడవగు ఓ, శిష్యుడా ! నీటియొక్క మధ్యాం శము శోణితము అన్నముయొక్క మధ్యసారము శుక్లము స్త్రీ పురుష సంయోగము వలన ఆ రెండుకూడి భూమియందు శరీరముగా నిల్చున్నదని భావము.

కం॥ మన సన్నపు సూక్ష్మాంశము । వినుజల సూక్ష్మాంశమునను వెలసెను
ప్రాణం । బును రెండుగలసి పిండం । బన బ్రహ్మాండంబనంగ
బరగును వత్సా ॥ 101

ఓ, శిష్యుడా! అన్నముయొక్క సూక్ష్మాంశంబు మనస్సు జలముయొక్క సూక్ష్మాంశము ప్రాణము ఈ రెండు గలసి పిండంబని బ్రహ్మాండంబని వాడ బడునని భావము.

కం॥ రెండురీతుల గనంబడు । చుండే యీమేనిచేత మాని బయలు నుద్ధం
డత దీని సుశ్వక్క్యని యుండుము దీనందు వాంఛ। నుందుకు శిష్యా ॥
102

ఓ, శిష్యుడా ! పిండ బ్రహ్మాండంబులు గాను మరియు ఎరుక మరుపులు గాను క్షరాక్షర పురుషులుగాను దేహీ దేహములుగాను ప్రకృతి పురుషులుగాను రెండు విధములుగా కానవచ్చుచున్న ఈ గుర్తెరిగే శరీరముచేత అచల పరిపూర్ణ పరబయలు తెలుసుకొని క్షరాక్షరములు ఏకమేయని నిశ్చయించి గుర్తెరిగే శరీరము అశాశ్వతమని నిర్ణయించి దీనియందు ఏలాటి భ్రాంతి జెందక ప్రవర్తించుమని భావము.

## — (మంతాల లక్షణవము) —

కం॥ అష్టాంగయోగముల నతి । కష్టించే ప్రజలవలెనే కష్టించక యీ ।
స్పష్టమగు బోధవినుమీ । కష్టము లన్నియును దొలగి । కడకేగు
సుమీ ॥
103

ఓ, శిష్యుడా ! యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి యనే అష్టవిధ యోగములచే జనులు అధికముగా కష్టముల పొందుచుందురు. వాటివల్ల వారికి మానవ జన్మఫలప్రాప్తి కలుగబోదుగనుక నీవు అటువంటి వృధాయాసము పొందక అనాయాసమగు ఈ బోధ వినినయెడల జనన మరణ రూప సంసార బాధ అంతమొందునని భావము.

కం॥ ఇదిగాదు బోధనే దెల్పెద రమ్మని నీకువేరే । పేరిడి యవలన్ ।
ముదముననే బ్రహ్మననుచు । వదరు మనిన వాడే మాయ వసుమతి
లోనన్ ॥
104

ఓ, శిష్యుడా ! నీవు తెలుసుకున్న అచల పరిపూర్ణ ప్రబోధ సరియయినది కాదు. నేను సరియగు మార్గము తెలిపెదను. మా సంఘమునందు చేరుమని చేర్చుకొని నీకు నీ తల్లిదండ్రి నిర్మించిన పేరు మార్చి గిరిపురీ భారతి వన్ తీర్థ పర్వత్ సరస్వతి అరణ్య సాగర్ హంస పరమహంస పురుష మహాపురుషయని నామంబులు నిర్ణయించి నీవు అహం బ్రహ్మాస్మి యని అనుకొమ్మని నిర్ణయించెదరు గనుక అట్టివారు ప్రపంచమున భ్రాంతి జన్యులని చెప్పదగునని భావము.

కం॥ మంత్ర యంత్రములు ముద్రలు । తంత్రంబులు నీకు దెల్పెదన
మడిగెడి యా । మంత్రజ్ఞుల మంత్రములకు యంత్రములకు తంత్ర
ములకు నీగకు కూనా ॥
105

ఓ, శిష్యుడా ! సప్తకోటి మంత్రములలో ఏదోయొక మంత్రమును అరువది నాలుగు యంత్రములలో ఏదోయొక యంత్రమును ఎనుబది నాలుగు ముద్రలలో ఏవోకొన్ని ముద్రలను ఇంద్రజాల మహేంద్రజాల తంత్రములలో ఏవో తంత్రంబులను నీకు తెలియజేసి అట్టి లక్షణంబుల వలన నీకు ప్రపంచ పారమార్థ సౌఖ్యంబులు కలుగునని భ్రాంతిలో యుంచి కొంత ధనము తనకు ఇవ్వవలయునని కోరుచుందురు గనుక అట్టివారల భ్రాంతిలో పడవలదు. అవి యన్నియు మోసములని భావము.

కం॥ దీపముగతి కన్నులలో । పాపవలెన్ । మెలగునిన్ను । పరమాత్ముడవం । వీ ప్రజలు దలతు రెరుగక । నిపాట్లెరిగుండి నేను నిను నమ్ముదునే ॥ 106

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ పరబయలు తెలియనివారు దీపము విధమున కన్నులలో చుక్కరీతిగా ప్రకాశించే జ్యోతియొక్క ఉపాధి లక్షణము తెలియక పరమాత్మయని నిర్ణయించుకొని నమ్ముదురు. ఉపాధి లక్షణము తెలిసినవారు ఆ జ్యోతి అశాశ్వతమని యవెదరని భావము.

కం॥ తర్జనుల వలన జూపును । నర్జున వర్ణగత నీలమని శిష్యులకున్ । దౌర్జన్య గురుడు నీవువి । సర్జింపు మసత్యమనుచు । సజ్జనతిలకా॥ 107

యోగ్యమైన జనులలో శ్రేష్ఠమైన ఓ, శిష్యుడా ! చూపు వేళ్ళతో కన్ను కొలుకులు నొక్కగా కనపడే తెలుపు రంగులో ఘనీభవించిన నీలిరంగు గలదే పరమాత్మయని శిష్యులకు ఉపదేశించే గురువే చెడ్డవాడనియు అతడు తెలియజేయు సర్వము అసత్యమని తెలిసికొని ఆ గురువును వదలుకోవలయునని భావము.

కం॥ పురుషోత్తముడని పూజలు। నరులొనరింపుదురు భువిని నానా చోట్లన్ ధరమొదలగు భూతములను । చిరుత శిశువులాడు కొనెడి । చేష్టల రీతిన్ ॥ 108

ఓ, శిష్యుడా ! ప్రపంచమున అనేక స్థలముల యందు పృధ్వ్యాది పంచ భూతములకు పురుషోత్తముడని పేరుపెట్టి పామర జనులు పూజించెదరు. వీరల లక్షణములు చూడగా చిన్న చిన్న పిల్లలు బొమ్మలచే ఆడుకొను నడతల విధముగా తెలియుచున్నది. ఎట్టులనగా అచల పరిపూర్ణ స్థితిగల శ్రీకృష్ణపరమాత్మ పురుషోత్తమ ప్రాప్తియోగమునందు క్షరాక్షర పురుషుల స్పర్శ యంటక అతీతముగా యుండువాడు పురుషోత్తముడని నిర్ణయించినాడు గనుక సూరిజనులగు

అచల పరిపూర్ణ భావజ్ఞులే పురుషోత్తములు గాని పంచభూతములు భూతసముదా యములందు తెలియుచున్న ఎరుక నిర్మితములగు విరాట్టు హిరణ్యగర్భ అవ్యా కృత ఈశ్వరులు పురుషోత్తములు కాదని భావము.

కం॥ రసమున దగనిది వస్తువ । బసవన్న కదెట్టు లెరుక ప్రభువుకు దెలు
సున్ । రసమైతె విసము సగుణము । వసిగాదా ముచ్చటంత । వెపుల
వినుటకై ॥ 109

ఓ, శిష్యుడా ! వీరశైవమతమునందు చెన్నయ్యయను గురువు యొక్క భక్తుడు బసవేశ్వరులనువారు గొప్ప గొప్ప మహత్తుగలవారు. అనగా అణిమాది అష్టసిద్ధులు శైవ సాంప్రదాయక లక్షణములయందు గొప్ప ప్రతిష్ఠ గలవాడు. సత్వగుణ సంపన్నుడు ఇతని చరిత్రలు శైవ పురాణములయందేకాక ప్రత్యేక ముగా బసవ పురాణమని ఒక గ్రంథము కలదు. ఈ పద్ధతుల వల్ల జన్మరహి తము కాదోవని తెలుసుకొని బసవేశ్వరుకు అల్లమా పభువు యగు అచల పరిపూర్ణ గురుని ఆశ్రయించి క్షరాక్షరోపాధి ద్వయ దోషరహిత అచల పరిపూర్ణ బోధ తెలుసుకొని కృతార్థుడైనట్లుచరిత్ర కలదు గనుక సత్వగుణమువల్ల కలిగే మహత్తు లన్నీ నీకు విసతుల్యము లగును. అనగా పునర్జన్మతో కారణములగును గనుక నది విషముతో సమానమని భావము.

శ్రుతి॥ "సత్వాస్సంజాయతే జ్ఞాన" మని యున్న "జ్ఞానేన జ్ఞేయ మా లోక్య పశ్చాత్‌జ్ఞానమ్ పరిత్యజేత్" అను నిర్ణయము వున్నది గనుక గుణాతీత మగు మార్గము శ్రేష్ఠమని భావము.

కం॥ ద్వైతా ద్వైత విశిష్టా । ద్వైతులమని కీచులాడు । దయ్యములవలెన్
ద్వైతా ద్వైత విశిష్టా ద్వైతుఃతో కీచులాడ । దగునేనీకున్॥ 110

ఓ శిష్యుడా ! అద్వైతులు జీవేశ్వరులు ఒక్కడే యనియు, ద్వైతులు జీవే శ్వరులు వేరనియు, విశిష్టాద్వైతులు జీవుడు ఈశ్వరుడు ప్రకృతి మూడు పదార్థ ములు శాశ్వతములనియు ఒకరి భావము ఒకరికి గిట్టక వున్నది యన్నట్లు విచా రించి తెలుసుకోక ఎవరి నిర్ణయము వారికే గొప్పయని అభిమాన యుతముగా పామరులవలె వాదించుకొను చుందురు గనుక అట్టివారలతో వాదించటము నీకు తగదు. ఎందుకనగా మానవ లోకకల్యాణమగు మానవ సౌభ్రాతృత్వము అన్యోన్య సహకారము ఐహికాముష్మిక పురోభివృద్ధి నిర్ణయించగు నీభావము, అభిమానయుతులగు వారికి సరిపడదని భావము.

కం॥ అనుభవ వేదాంతులమని । తినరాని పదార్థమెల్ల । తిను దుర్జనులన్।
కనబోకుము తద్బోధను! వినబోకుము యెన్నటికి వివేక విచారా॥ 111

వివేక పద్ధతిగల ఓ, శిష్యుడా ! అనుభవ వేదాంతులమని కొందరు నిషేధ వస్తువులను తినుచుందురు అట్టివారిని నీచులని చెప్పనగును కనుక వారలతో నీకు కలయికగాని వారల తత్వములు వినటముకాని ఎన్నటికి కూడదని భావము.

కం॥ జిహ్వోపస్థ విషయము । లెవ్విగలవొ వాటి విడువలేని గురువులన్।
యెవ్వరుజేరి కొలుతురో । యివ్వసుధను వారు జెడుదురిది నిజము
సుమీ ॥ 112

ఓ, శిష్యుడా ! జిహ్వా రుచులను ఆహార పదార్థములపైన కోరిక, ఉపస్థ రుచులగు సంతాన ఫలప్రాప్తి విడువలేని గురువులను ఆశ్రయించి వారు పర బ్రహ్మ స్వరూపులని ఎవ్వరు పూజించు చున్నారో ఈ ప్రపంచమున వారు ఇహపరాదులకు రెంటికి చెడిపోవుచున్నారని భావము.

కం॥ పాషండ మతము వారల । వేషంబులు జూచి శిష్య వితతి భ్రమిం
చున్ । యాషత్తిబోదెరుగక । దూషింతురు విన్నకన్న దుర్భా
షణలన్ ॥ 113

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ ప్రబోధ ఏ కొద్దిగైనా దెలియకయున్న శిష్య జనములు మతక ర్తలుజేసే వేషభాష అడంబరములు చూచి భ్రమించి అచల పరిపూర్ణ బోధకులను దూషింతురని భావము.

కం॥ నిజగురు బోధ నెరుంగక। గుజగుజ శిష్యులకుజెప్పు గురువులబోధల్।
భుజగ విషోపమ మిగుసుమి । సుజనౌఘము మెచ్చదట్టి । సుద్దిని
పట్టీ ॥ 114

ఓ, శిష్యుడా ! జనన మరణ రహితమునకు సిద్ధాంతీకరించిన అచల పరి పూర్ణ పద్ధతి తెలియక గురువులమని పేరు పెట్టుకొని జనన మరణ బాధచే పీడితు లగు శిష్యులకు భ్రాంతి మార్గములు బోధించుచున్నారు. అందువల్ల శిష్య జనం బులు అమృత పానమునకు బదులుగా పాము విషము తాగినట్లు అగుచున్నది గనుక సుజనులగు వారు నిజగురు ప్రబోధను తప్ప ఇతర మార్గంబులు మెచ్చ రని భావము.

కం॥ తనువును విడి బ్రహ్మనే । నను ముసుపటి నీవిచార । మటు కెట్టిపు
డున్ । నిను నీతనువుకు వేరని । యనకను పరిపూర్ణ మరసియవి
విడువదగున్ ॥ 115

ఓ, శిష్యుడా ! ప్రకృతియగు తనువు మాయయని పురుషుడగు ఎరుక యను నేను బ్రహ్మాయని ఇంతకుపూర్వము నీవు తెలుసుకున్న బోధ విడిచి పెట్టుము. నిన్ను నీ తనువును వేరని యనుకోక అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకొని తను వెరుకల రెంటిని కర్తృత్వ రహిత కర్మ పద్ధతిగా విడువుమని భావము.

కం॥ కొందరు వైరాగ్యంబున । కొందరు తీర్థాటనమున । కొందరు కర్మం బందున వ్రతజపతపముల । కొందరు నటియింతురిట్టి ' కొర్కెల మనుజుల్ ॥ (116)

ఓ, శిష్యుడా ! మోక్షమునందు ఆపేక్షగల మనుష్యులలో కొందరు వైరాగ్యము వల్ల కలుగునని, విరాగులగుచున్నారు. కొందరు నైమిత్తిక కర్మవల్ల అది కలుగునని తీర్థయాత్రలు సలుపుచున్నారు. మరికొందరు నిత్యకర్మలవల్ల కలుగునని సంధ్యా వందనాది కర్మలు యొనర్చుచున్నారు, మరియు అనేకవిధముల వ్రతములు, జపములు, తపములు కొందరు సలుపుచున్నారు యని భావము.

కం॥ కొందరు భక్తిత్రయమున । కొందరు యోగములయందు కొందరు జ్ఞానం। బందు రమింతురు వారల। కందరికీ బోధ యిష్టతౌనా తనయా॥(117)

ఓ, శిష్యుడా ! అనన్యభక్తి, ఏకాంతభక్తియగు భక్తిత్రయములయందు కొందరు; మంత్రలయ హఠరాజయోగమునందు కొందరు, మరికొందరు ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్వమసి బ్రహ్మ, అయమాత్మ బ్రహ్మాయను వార్తిక పద్ధతులయందు ఆనందింతురు. ఇటువంటివారలకు క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత అచల పరిపూర్ణ పరబయలు ప్రబోధ ఇష్టము కాబోదు. ఎందుకనగా భ్రాంతిపద్ధతిగలవారికి భ్రాంతియే బ్రహ్మమని తెలియును. ఎట్లులనగా-

పతివ్రత లక్షణము తెలియని స్త్రీ పతివ్రత లక్షణము తెలియని పురుషుడు డబ్బుకు దాసులై ఎన్నియో నీచపు పనులు చేయుదురు. వారికి డబ్బే ప్రధానముగాని వారివారి ధర్మాలు ప్రాధాన్యములుగావు. అదే పద్ధతిగా దుర్లభమైన మానవోపాధికివచ్చి అతి దుర్లభమైన అచల పరిపూర్ణ ప్రబోధవల్ల జన్మ రహిత పద్ధతి తెలుసుకోలేక జన్మ కారణమగు బ్రహ్మానందమునందు భ్రాంతిలో మునిగి యుందురని భావము.

## (అశరీర పద్ధతి)

కం॥ భ్రమ రహిత సహిత జనులను । సుమనసులను నరులసమము । జూచిన విశ్వం । బమరిలేకుండు నుండును । క్రమమున కలవంటి దగుచు । కడు నిజము సుమీ ॥ (118)

ఓ, శిష్యుడా ! భ్రమరహిత జనులనగా అచల పరిపూర్ణ భావజ్ఞులు భ్రమా సహిత జనులనగా మహావాక్య వార్తిక నిర్ణయానుసారము బ్రహ్మానుభవము కల వారు సుమనసులు అనగా సత్వగుణ ప్రధానులు నరులనగా తమోగుణప్రధానులు వీరందరు విశ్వాభిమానులుగా యున్నను భ్రమరహితులకు విశ్వము పుట్టనేలేదనియు భ్రమసహితులకు పరమాత్మ సంకల్పమువలన ప్రకృతిని పుట్టించి దానిచే విశ్వము సృష్టించినారనియు సత్వగుణులగు సుజనులకు విశ్వము కల వంటిదనియు తమోగుణులకు విశ్వము శాశ్వతమనియు నిర్ణయమని భావము.

కం॥ కలతనను లేనుకలనని । తలపోశెటివారిమాట । తమకే నిజమౌ ।
కలలేనివారు కలవారలు వీరలె యొకరి నొకరు । నర్గయ్య నిరువురున్॥ 119

ఓ, శిష్యుడా ! భ్రాంతియగు కల తనయందు తానులేనని మరియు తనయందు తాను కలనని ఎవ్వరు ఏ విధముగా తలచుకొనెదరో వారికి ఆ పద్ధతి గానే నిజమని ఎరుక తెలియును. గనుక ఎవ్వరి నిర్ణయము వారిదే. ఎరుకయను కలలేనివారు అచల పరిపూర్ణులు. ఎరుకయను కల కలవారు అయయమాత్మ బ్రహ్మ యను వార్తిక పద్ధతి కలవారు. సత్వగుణులు, తమోగుణులు, రజోగుణులు గనుక ఒకరి పద్ధతి ఒకరు తెలుసుకోలేరని భావము.

కం॥ కలవారికి మేలుకలో । గలవారికి జాగ్రతందు । కలహము గలదా ।
కలహించిరేని వారలు । కలవారలెగాని మేల్కొ। వారుగా రెన్నటికిన్॥ 120

ఓ, శిష్యుడా ! ఎరుకయను కలలో యున్నవారికి అనగా తమోగుణ, సత్వగుణ బ్రహ్మానుభవము గలవారికి యెరుకయగు కల అచల పరిపూర్ణ పర బయలందు మేలుకొన్నవారికి జాగ్రదావస్థయగు కర్మాచరణయందు ఏలాటి భేద ప్రవర్తన యుండదు. యెరుకలేని అశరీరులమని త్రికరణశుద్ధి ఆత్మ అంగస్థాన భావ శుశ్రూషలకు భంగము కలుగునట్లు ప్రవర్తించిన యెడల వారు యెరుక యగు కల లోపటివారే కాని అచల పరిపూర్ణ పరబయలునందు మేలుకున్నవారు కాలేరని భావము.

కం॥ సురలందు దోమకలవలె । నరుదెంచును బ్రహ్మయందు నఖిల జగంబుల్ । యరుదెంచి యజుని గన్గొని । బిరబిర తామేగునిల్వ బిడియంబునుమన్ ॥ 121

ఓ, శిష్యుడా! సూరిజనులకు తోచునట్టి స్వప్నవిధమున అచల పరిపూర్ణ పరబయలునందు లేనిదే యెరుకతోచి ప్రపంచమున తెలియుచున్నది. ప్రపంచమును తెలియు తెలివి అచల పరిపూర్ణ పరబయలును తెలియగనే తన వునికి అశాశ్వతమని సిగ్గుజెంది కర్తృత్వరహిత కర్మాచరణవల్ల శీఘ్రముగా తాను లేక పోవునని భావము.

కం॥ రోగపు చేష్టలు బోయిన । రోగము గలదనినపూర్తి । ద్రోయిక విన్నున్ । నీగురౌరుగుట మ్రగ్గిన । నేగలనన నీదుమాట నిశ్చయమటరా॥ (122)

ఓ. శిష్యుడా ! వ్యాధి లక్షణములు ఔషధ సేవానంతరము నశించిన తరువాత నవి యున్నట్లు గోచరించినను లోకబాధలు యుండునట్లు నీవనే గుర్తు నశించిన పిదప మనో సంకల్పాది విహ్నములు నీవు వున్నట్లు తెలియుచున్నను నీవు వున్నానని యనుకోవడము నీవు జనన మరణ బాధలు గలవని నిర్ణయించడము నిజము కాదని భావము.

## — (జ్ఞాన పద్ధతి) —

కం॥ ఎరుగుట జ్ఞానముదానను । జరిగేపని కర్మమనుచు । జనులెన్నిరియా । యెరుకయు కర్మము లేనిదె । పరిపూర్ణము వీటినీవు । బట్టకుమెపుడున్॥ (123)

ఓ. శిష్యుడా ! ఎరిగే ఎరుక జ్ఞానమని కర్మేంద్రియములచేత చేయునవులు కర్మయని జనులు నిర్ణయించినారు. యెరుకయగు జ్ఞానము కర్మేంద్రియములచేత జేయు కర్మములేనిదే అచల పరిపూర్ణ పరబయలు గనుక జ్ఞానకర్మ పద్ధతుల యందు అస్తిక నాస్తిక బుద్ధి నీకు అవసరములేదని భావము.

కం॥ జ్ఞానంబు సత్వగుణమను । దానికి జన్మించె ననుచు దామోదరుడా । మేనత్త కొడుకుతోననె । జ్ఞానమునకు జన్మ మొకటి గలిగెగదోయీ॥ 124

ఓ. శిష్యుడా ! "సత్వాత్ సంజాయతే జ్ఞానం" అనగా సత్వగుణోద్భవమైనది జ్ఞానమని శ్రీకృష్ణభగవానుడు అర్జునునికి ప్రబోధించి యున్నాడు గనుక జ్ఞానమునకు జన్మాదులు కలిగియున్నవని తెలుసుకోమని భావము.

కం॥ పుట్టింది గిట్టు జ్ఞానము । పుట్టెననుచు కృష్ణమూర్తి పురుహూతజుడా। నట్టి తన ముద్దుమరిదికి । గట్టిగ వినజెప్పె నింద । కలతేమోయీ ॥ (*) 125

ఓ. శిష్యుడా ! శ్రీకృష్ణపరమాత్మ జ్ఞానమునకు పుట్టుక కలదని అర్జునునికి దృఢముగా జెప్పియున్నాడు గనుక పుట్టిన జ్ఞానమునకు గిట్టుట యున్నదని యనడములో ఎలాటి సందేహము లేదు. పుట్టుకగల జ్ఞానమును ప్రజ్ఞానం బ్రహ్మయని, అహం బ్రహ్మాస్మియని, తత్వమసి బ్రహ్మయని, అయమాత్మ బ్రహ్మయని వార్తిక పద్ధతానుసారము బ్రహ్మమే తానని అనుకొనివంత మాత్రమున జనన మరణ భ్రాంతి తొలగబోదని భావము.

కం॥ జ్ఞానమగు నీవు జ్ఞేయంబైన బయలుగాంచి । జ్ఞానమగు నిను నీవే । లేనంమ తెలియుమని తానావరునకు వాసుదేవు డానతి యిచ్చెన్॥ (126)

ఓ, శిష్యుడా ! జ్ఞానమగు నీవు జ్ఞేయంబగు అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకొని తెలుసుకున్నది జ్ఞానమే గనుక జ్ఞానమగు నిన్ను నీవు లేనని తెలుసు కోమని "జ్ఞానేన జ్ఞేయమాలోక్య పశ్చాత్‌జ్ఞానమ్ పరిత్యజేత్" యనగా జ్ఞానము చేత జ్ఞేయమగు పరబయలును తెలుసుకొని జ్ఞానమగు నిన్ను నీవు విడిచి పెట్టు మని భావము.

కం॥ మనమచలమనదగు । తగదనుటయు మనమచలమునకు । తగవేరని రెండని । లేవు మనమచలమని వినుమనముళ్ళక్కి తెలియ విడువు మనము మనన్॥ 127

ఓ, శిష్యుడా ! జ్ఞేయము మనము యని తెలుసుకొనే జ్ఞానము అచల పరి పూర్ణ పరబయలుయని అనుకోవడము తగదు ఎందుకనగా అచల పరిపూర్ణ బయలునందు ఇంకొక వస్తువు వున్నదనిగాని లేదనిగాని ఆ పరిపూర్ణ పరబయ లుకు ఎరుకలేదు. అయినా మనము అచలమని చెప్పడముయొక్క లక్షణము ఏమనగా చలన రూపమయిన జ్ఞానస్వరూపమగు ఎరుక అచల పరిపూర్ణ పర బయలు యందు లేనిదని తెలియగనే తనను తాను వుళ్ళక్కియని తెలిసి నిలిచేం దుకు తావులేక అచల పరిపూర్ణ పరబయలు స్థితియందు కర్తృత్వరహిత కర్మా చరణ పద్ధతిగా తన్నుతాను విడిచి లేకపోవునని భావము.

కం॥ జ్ఞానము నేననునొక్కటె జ్ఞానము నే వేరటంచు । గనబోకుసుమీ । జ్ఞానము వచ్చును బోవును। జ్ఞానాతీతమును తాను । గాంచినదాకన్॥ 128

ఓ, శిష్యుడా ! జ్ఞానమనగా తెలుసుకునే తెలివియని మోక్ష విషయ బుద్ధి యని ఎరిగే ఎరుకయని చెప్పబడును గనుక నేనన్న జ్ఞానమన్న ఒక్కటే వేరు కాదు గనుక జ్ఞానమని యన్నా నేననియన్నా వేరేయని తెలియక ఒక్కటేయని తెలుసుకొనుము. జ్ఞానమునకు అతీతమగు అచల పరిపూర్ణ పరబయలును తెలు సుకొనునంతవరకు ఈ జ్ఞానమగు నేను పుట్టుచు గిట్టుచు యుండునని భావము.

కం॥ నీకలను వచ్చిపోయిన । లోకుల లోకములవలెనె । లోనిను గనుమీ । నీ కలను నీవు మేల్కని । యాకల నటువలెనె చూస్తె । యెటు నిల్చు వురా॥ 129

ఓ, శిష్యుడా ! నీ కలయందు నిన్నును లోకులను లోకంబులను, వచ్చి పోవుచున్నట్లు ఎట్లు చూచుచున్నావో అచల పరిపూర్ణ పరబయలు యందు ఎరుక యగు కల మెలుకువ జెందిన నీవు లోకులు లోకంబులు నిలువక అట్లు లేక పోవునని భావము.

కం॥ అందరికల నీకలెకద । అందరు నీకలను వచ్చి యగుపడిపోవన్ ।
కందువుగద విన్నట్లనె । మందమతీ కనగదోయి । మరిలేనటుచున్ ॥ (130)

ఓ, శిష్యుడా ! లోకులు స్వప్నావస్థ ఏ పద్ధతిగా పొందుచున్నారో నీవు పొందు స్వప్నావస్థ అదే విధము కదా నీతో సహా అందరు నీ కలలో వచ్చిపోవు విధము నీవు చూచుచున్నావు గదా ! వారలు నీ మేలుక యందు లేనట్లు నిన్ను నీవు లేనట్లుగా తెలుసుకుంటే చాలును గనుక ఓ, మందబుద్ధి గలవాడా ఈ లక్షణము తెలుసుకోమని భావము.

## (ఆకాశ లక్షణము) —

కం॥ చలియించనిదాకాశము । చలనంబే వాయువనుచు । సాటింపదగున్ ।
చలనమె విశ్వము నేనని । చలనమె తనువెరుకలనిన జగమనినసుతా ॥ (131)

ఓ, శిష్యుడా ! చలనము లేకయుండునది ఆకాశము. చలియించునట్టిది వాయువు యని ప్రకటనకు యుక్తముగా యున్నను విశ్వము నేను తనువు ఎరుక జగము యను సర్వము ఉత్పత్తి, స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణములు కలిగి యుండునవియే యని భావము.

కం॥ ఆకాశ మనిన శూన్యం । బాకాశంబనిన సగుణ మాకాశమనన్ । కాక్షి
వలె నల్లరూపుది । యాకాశము మితములోన నణగుండు సుమీ ॥ (132)

ఓ, శిష్యుడా ! ఆకాశ మనగా శూన్యమని. సగుణమని, నల్లరూపుదని మితము యందు అణగి యుండునదని భావము.

శి॥ ఆకాశమును శూన్యమనుటకు కారణమేమై యుండును ?

గు॥ శబ్దగుణము గలిగి యున్నందున ఆకాశము రూపము గలదని ఇతర వస్తువులతో కలియుటవలన భూతమని వ్యవహరింపబడుచున్నది. ఆ కారణమున నామరూపములు మిథ్య గనుక ఆకాశము లేనిదని నిర్ణయము.

శి॥ ఆకాశము సగుణమనుటకు కారణమేమై యుండును ?

గు॥ శ్రుతి॥ "సగుణ నిర్గుణ స్వరూపకమ్ బ్రహ్మ" యను న్యాయమున వ్యవహారదశయందు బ్రహ్మమే మాయోపాయకమై ఈశ్వరుడనబడి జగత్తు సృష్టి స్థితి, లయముల చేయుచుండుటచే సగుణ మనబడును. మాయలేని పరమార్థ దశ యందు నిర్గుణ మనబడును.

శి॥ ఆకాశము నల్లరూపుది యనుటకు కారణమేమై యుండును ?

గు॥ తెలివిలేని నిరుపురూపము గనుక నల్లరూపమని నిర్ణయము.

శి॥ ఆకాశము మితము యందు అణగియుండుటకు కారణమేమైయుండును?

గు॥ ఒక్క ఆకాశమే భూతాకాశమనియు, సూర్యాకాశమనియు, నిరవయాకాశమనియు, దహరాకాశమనియు, మహాకాశమనియు, హృదయా కాశమనియు, ఘటాకాశమనియు మఠాకాశమనియు చెప్పబడును గనుక **ఆకాశము** మితము గలిగి అణిగి యుండునని నిర్ణయము.

కం॥ *ఆకాశ మనినకాలం ॥ బాకాశంబనవిలంబ మాకాశమనన్ । లోకమున చంచలంగున । నాకాశము శబ్దరూపమగు వినవోయీ ॥* (133

ఓ. శిష్యుడా ! ఆకాశమనగా కాలరూపమని, విలంబమని, చంచలమని, శబ్దరూపమని భావము.

శి॥ **ఆకాశము** కాలరూపమనుటకు కారణమేమై యుండును ?

గు॥ **భూత, భవిష్యత్,** వ ర్తమాన కాలత్రయములను **తెలియజేయును** గనుక కాలస్వరూపమని నిర్ణయము

శి॥ **ఆకాశ**మున విలంబనమనుటకు కారణమేమై యుండును ?

గు॥ శూన్యపద్ధతిగా కలది గనుక విడువదగ్గదని నిర్ణయము.

శి॥ **ఆకాశ**ము చంచలరూప మనుటకు కారణమేమై యుండును ?

గు॥ ఆకాశభాగము జ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, **అహంకార** రూపములగు **అంత**రేంద్రియములు కామ, క్రోధ, లోభ, మోహ, భయములు నభో గుణములని నిర్ణయములు గనుక **ఆకాశ**ము చంచలమని నిర్ణయము.

శి॥ **ఆకాశ**ము శబ్దరూపమనుట ఎట్లు ?

గు॥ "ఆకాశస్య గుణశ్శబ్దొ" యను న్యాయమున శబ్దగుణము గలది **ఆ**కాశము గనుక వ్యాకరణ శిక్షితమైన మాట శబ్దరూపమని నిర్ణయము.

## — (అహముయొక్క నిర్ణయము) —

కం॥ **అహమేతనువే** విశ్వం । బహమే జీవేశ్వరులన । నహమేత దైక్యం । బహమే యహముకు మూల । బహమణగిన నణగు నన్ని యనఘ చరిత్రా॥134

నిర్మలమై స్వభావముగల ఓ శిష్యుడా ! శరీరమన్నను, విశ్వమనియన్నను **జీ**వుడని యన్నను, ఈశ్వరుడని జీవేశ్వర ఐక్యమని యన్నను **అహమే** యగును. అహంకారమే యగును. అహంకారమే అహంకారమునకు మూలము గనుక **అహ**ము నశించిన సర్వము నశించునని భావము.

శి॥ **అ**హము యను నిర్ణయము ఏమై యుండును ?

గు॥ (శ్రు॥ "అహమన్న మహమన్న మహమన్నన్ అహమన్నాదో హమన్నాదోహమన్నాదా" అనగా నేను భోజ్య స్వరూపమైన యన్నమును **నేను అన్నము**ను భక్షించు వాడను.

శ్రుతి॥ "అహమను రభవం సూర్యశ్చ అహమేవేదం సర్వమస్మామి"
నేను మనువును సూర్యుడను అయితిని. నేనే భోజ్య రూపమై దీని నంతను తినుచున్నాను.

శ్లో॥ యదాఫేన తరంగాది సముద్రాది స్థితంపునః
సముద్రేలీయతే తద్వత్ జ్ఞాన జగన్మయానురీయతే ॥

అనగా ఏ ప్రకారము సముద్రమునుండి పుట్టిన నురుగు కెరటము మొదలైనవి మరల సముద్రమునందు లయించుచున్నదో అట్లే నాయందు పుట్టిన జగత్తు నాయందు లయించుచున్నది గనుక సర్వము నశించునని నిర్ణయము.

— (భ్రమ నిర్ణయము) —

కం॥ భ్రమ యనిన పుట్టుకనినను । భ్రమ కేనానుంబు లిట్టి । భ్రమకే నీవుం । భ్రమయా మేను జగత్తులు । భ్రమయెరుకయు మరుపు రెండు భ్రమెభ్రమ వినరా ॥ (135)

ఓ, శిష్యుడా ! ఉన్నది లేనట్లు లేనిది యున్నట్లు తలంచు మిథ్యా మతిని భ్రమయని చెప్పబడును గనుక పుట్టుట యనడము నేనని చెప్పడము మేనని చెప్పడము జగత్తని చెప్పడము ఎరుక మరుపుయని నిర్ణయించడము భ్రాంతి యందు భ్రాంతి కల్పితములని భావము

— (ఎరుక నిర్ణయము) —

కం॥ ఎరుకసుమీ బ్రహ్మానినను, యెరుకసుమీ మాయయనిన యెరుకేజీవుం డెరుకసుమీ యీశ్వరుడన! యెరుకసుమీ నేను విశ్వ। మది సత్యమురా॥ (136)

ఓ, శిష్యుడా ! ఎరుక యనగా తెలివి, ప్రకాశము, దేహాత్మాది భేద జ్ఞానము, కాంతి, వికాసము యని నిర్ణయము. గనుక అధిష్ఠానచేతన బ్రహ్మాయని యనినను మాయ యనినను, జీవుడనినను, విశ్వమని యన్నను ఎరుకనేయని ఈ పద్ధతి నిజమని నమ్ముమని భావము.

శ్లో॥ స్వయం బ్రహ్మా స్వయం విష్ణుః । స్వయమింద్రం స్వయం శివాః
స్వయం విశ్వమిదం సర్వం స్మస్మాగమ్యం నకించినః ॥

అనగా ఎరుకయగు తానే బ్రహ్మము. ఎరుకయగు తానే విష్ణువు తానే ఇంద్రుడు తానే శివుడు, తానే ఈ సమస్తమైన జగత్తు ఎరుకకంటె ఇతరమైనది. ఏకొంచమైన లేదు. కంటి కగుపడునదంతా ఎరుకనే యని నిర్ణయము.

— (మాట నిర్ణయము) —

కం॥ మాటసుమీ నేననినను । మాట సుమీ మాయయనిన మరిజీవ శివుల్ మాటసుమీ బ్రహ్మానినను మాటసుమీ మేనుజగము మాటేసుమ్మీ॥ (137)

ఓ, శిష్యుడా ! అగ్నియొక్క సూక్ష్మాంశమగు శబ్దము ధ్వన్యాత్మక మన బడును. ఈ ధ్వన్యాత్మకమగు శబ్దము వ్యష్టిశరీరోపాధియందు వర్ణాత్మకముగా నిర్ణయించిన దానిని మాటయని చెప్పబడును ఈ మాటల సముదాయమే మాన వులచేత నిర్ణయించిన అపౌరుషేయము పౌరుషేయమగు వేదశాస్త్ర పురాణ ఇతి హాసాది సర్వశాస్త్రంబులు కనుక నేనన్నను మాయయన్నను, జీవుడన్నను, ఈశ్వరుడన్నను, బ్రహ్మమన్నను, మేను యనినను జగమనినను మాటలనిర్ణయమే కాని దానికి వస్తు నిర్ణయము లేదు గనుక ఇది మానవ నిర్మిత శబ్ద ప్రపంచమని ప్రతి॥ "సర్వం వికారజాతం మాయా మాత్రమ్" యని నిర్ణయము అనగా నామ రూపవికారములు గలిగి ఉద్భవించినది సమస్తమును మాయా స్వరూపమైనది గనుక లేనిదని భావము.

## — (ప్రతిబింబ నిర్ణయము) —

కం॥ ప్రకటమగు బింబమందున । ముకురము ముకుర స్థబింబములు
లేవెపుడున్ । ముకురంబు వలన బుట్టును । ముకురస్థము దానివలన
ముకురముదోచున్ ॥ (138)

ఓ, శిష్యుడా ! లోకబాంధవుడగు సూర్యునియందు అభిమాన పద్ధతి గల అంతఃకరణ రూప అద్దములేదు. అందు తెలియు లోక వ్యవహార ప్రతిబింబములు లేవు అంతఃకరణ రూప అద్దము ఎచ్చటయుండునో ఇహపరరూప లోక వ్యవ హార ప్రతిబింబములు అచట యుండునని భావము.

## — (కలమేలుకల నిర్ణయము) —

కం॥ లేనినీరాకడే స్వప్నా నందము నీకు గురుడు పరిపూర్ణంబున్। పూనితెల్పి
మేల్కొల్పిన । నేనవకను నీవుబోవ నీ మేల్కదిరా ॥ 139

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ పరబయలుయందు నీవునికిలేదు. నీవు అచల పరిపూర్ణ పరబయలుయొక్క ప్రతిబింబమున యని నిశ్చయించు కొన డము స్వప్నము నందలి ఆనందమని నిర్ణయము సచ్చందుడగు సద్గురుమూర్తిని। అచల పరిపూర్ణ పరబయలు యొక్క నిర్ణయము తెలిసి మేలుకున్నచో నేనను నీవు లేకపోదువు. అదే నీ మేలుకయని భావము.

కం॥ కలలో వానికి మేలుక । గలదని గురురుగ వశమెకల మేల్కనినన్
కలవాడు గలడె తెలియను । తలపోయుము నిన్ను నీవు తగనీరీతిన్॥ 140

ఓ, శిష్యుడా ! ఎరుకయను కలయందు యున్నవారికి అచల పరిపూర్ణ పరబయలుయను మేలుక యనునది యొకటి యున్నదని తెలియుటకు తరము

కాదు. అచలపరిపూర్ణపరబయలు యను మేలుక జెందిన వానికి ఎరుకయను కల యందలి తన లక్షణంబులు తెలియుటకు తానే లేడు గనుక అదివున్నట్టు తెలియదు. ఈ పద్ధతి నీయందు నీవు విచారించి తెలుసుకోమని భావము.

కం॥ కలవాడు వాని చదువులు గలవా ? తామేలుకనిన। గనుగొన మటులన్ ' కలనిన్ను నీదుచదువును। ఫలమేమిక చాలు పెక్కు । పలుకుల తండ్రీ ॥ (141)

ఓ, శిష్యుడా ! ఎరుకయను కల యందలి వారువారు చదువుకున్న వేద వేదాంతంబులు ద్వైతాద్వైత విశిష్టాద్వైత శాక్తేయగాణపత్యాది మతంబులు ఎరుక నిర్ణయంబులే కదా ! అచల పరిపూర్ణ పరబయలును సద్గురుని చేత తెలుసుకొని కలయగు తాను మేలుకొన్న యెడల ఎరుకయను కల నిర్మితములగు వేద వేదాంత సకల శాస్త్రంబులు నిలువగలవా ? ఎరుకతోనే పోవునది గనుక వేద వేదాంత పద్ధతులతో వాదింవక సిద్ధాంత పద్ధతి తెలిసితే చాలునని భావము.

కం॥ కలరాజు సకల సంపత్కలితుండై తానుమేలు కొనలేడెచటన్ । కలనిన్ను వాని విధమున। తలపుము దలచితివె చాలు। ధన్యచరిత్రా (142)

ఓ, శిష్యుడా ! కలయగు విశ్వమును పరిపాలించు విశ్వాభిమానియగు పరమేశ్వరుడు అష్టవిధై శ్వర్యముల వైభవములు పొందుచు అచల పరిపూర్ణ పరబయలునందు మేలుకున్న యెడల తన వైభవమున్ను తానున్ను ఇహపరాదుల యందు ఎచటను నిలిచియుండడు. గనుక కలయగు నిన్ను ఆ విశ్వభిమాని ఈశ్వరునిగా భావించుము. ఆ విధముగా భావించి అట్లు సేవించితివేని జనన మరణ రహితమునకు చాలునని భావము.

## — (అచల పరిపూర్ణ ప్రబోధ) —

కం॥ తనకుదా నొరులవనకిన ' ధ్వనిబుట్టని చోట బ్రహ్మ । తనుదా నొరులున్ । చనకిన ధ్వని గలచోటది । వినుమాయయు లేనిమాయ విడువలేననివన్ (143)

ఓ, శిష్యుడా ! తనకు తాను సంకల్పించుకొన్నను మరియు శ్రుతి "ఏకోహం బహుస్యాం" అనగా నే నొక్కడనే సర్వము కావలయునని పరమాత్మ సంకల్పించినను ధ్వని పుట్టనిచోటు ఏదో అది అచల పరిపూర్ణ పరబ్రహ్మమని తెలుసుకొనుము.

తనను తాను మరియు విశ్వసృష్టికి కారకుడైన విశ్వేశ్వరుడు సంకల్పించు చోట ధ్వనిగలచోటు గనుక అది మాయయని తెలుసుకొనుము. మాయలేనిది గనుక నీ వునికిలేనిదేయని నిన్ను నీవు విడువుమని భావము.

కం॥ మనసుకు వాక్కుకు దెలియని । ఘనవస్తువు బయలటంచు గనియా రెంటిన్। నినునను విశ్వముగాగని। వినుమూలము లేనివీటి విడవాశిష్యా॥ 144

ఓ, శిష్యుడా! అచల పరిపూర్ణ పరబయలు మనస్సుచేత తలంచరాక వాక్కుచే వచించుటకు అలవికాక ఆది, మధ్య,అంత్యరహితమైనదని నీవు తెలుసుకొని ఎరుక మరుపు యను ద్వంద్వ పద్ధతిగల క్షరాక్షర పురుషులను నిన్నునన్ను విశ్వమని నిశ్చయించి వీటికి అచల పరిపూర్ణ పరబయలునందు మూలంగాని నిలిచేందుకు స్థానముగాని లేదని తెలిసుకొని లేనిది లేనట్లు విడువుమని భావము.

కం॥ ఏ నిర్ణయమును జేయడు । నేననని మహాత్ముడెపుడు ! నేననువారే నానావిధాల వదరును నేనను తనవంటి వారి నెప్పుడు గనినన్॥ 145

ఓ, శిష్యుడా! అచల పరిపూర్ణపరబయలు నందు ఎరుకకు మూలము లేదని తెలుసుకున్న స్వచ్ఛందులు భుక్తి ముక్తి క్రియలకొరకు ఎలాటి నిర్ణయములు చేయరు. అహం బ్రహ్మాస్మి యనువారలు తమబోటి వారిని చూచి నానావిధ పద్ధతులు చెప్పచుందురని భావము.

శి॥ స్వచ్ఛందులు భుక్తి ముక్తి క్రియలు ఎందుకు నిర్ణయించరు ? అహం బ్రహ్మాస్మి యనువారు నిర్ణయించుటకు కారణమేమై యుండును ?

గు॥ భుక్తి ముక్తి యను రెంటికి భుక్తికి కర్మ, ముక్తికి జ్ఞానము నిర్ణయములుగా యున్నను మతకర్తలు కర్మజ్ఞాన పద్ధతులు వారి మత నిర్ణయ పద్ధతుల ననుసరించి అనేక విధములుగా నిర్ణయించియున్నారు. స్వచ్ఛందులగు అచల పరిపూర్ణ భావజ్ఞులు వారి పద్ధతుల ననుసరించక సద్గురు నిర్ణయకర్మ సద్గురుని నిర్ణయజ్ఞానమున వున్నది వున్నట్లు ప్రవర్తించెదరని నిర్ణయము.

కం॥ మలుకలు లేవీత్రోవను । పులకనగా దెలియవచ్చు । సుజనుల కెల్లన్ తలపదగు దీని నెప్పడు। మలకలత్రోవలకు బోకమాన్య చరిత్రా॥ 146

స్తోత్రింపదగిన ఓ, శిష్యుడా! జనన మరణ రహితమునకు నిర్ణయించిన మార్గములలో అచల పరిపూర్ణ ప్రబోధ పద్ధతియందు ఏలాటి మార్గాయాసములు లేవు. సూరిజనులగువారు సులభముగా తెలియవచ్చును. గనుక నీవు మార్గాయాసములుగల మతనిర్ణయముల ననుసరించక ఈ అచల పరిపూర్ణ పద్ధతిని వచ్చినదాక నిదుర వచ్చినదాక తలంచుకొనుము యని భావము.

కం॥ నామాట నమ్మవేమో । నీమానసమెరుగ కంటి నేనీమాటన్ । నామాట పథ్యమైనను । యేమారకు దీన్ని నీవి కెప్పటి వప్పా॥ 147

ఓ, తండ్రీ! నేను వుపదేశించిన పరిపూర్ణ అచల ప్రబోధ నీకు నమ్మిక కలిగినదో లేదో నీ మనోనిశ్చయము తెలియక ఈ మార్గము సులభమైనదనినీతో

చెప్పినాను. అయినా నా ప్రబోధయందు నీకు జనన మరణ భాధ తొలుగువనే నిశ్చయము యున్నయెడల ఈ మార్గము విడువక ఇతర ఏ మార్గంబులు నను సరించక ఎల్లప్పుడు ఈ మార్గముయందే యుండుమని భావము.

కం॥ సిద్ధాంతోక్తులు ఇవి । నీబుద్ధికి దెలియుండి చదువ బోకుమువీటిన్ ।
బుద్ధుల వినుమని వారలు । యుద్ధమునకు కాలుద్రవ్వ । ముందురు
పెలుమన్ ॥ 140

ఓ, శిష్యుడా ! వేదము వేదాంతము సిద్ధాంతము యను త్రివిధ పద్ధతుల యందు అచల పరిపూర్ణ ప్రబోధ సిద్ధాంత పద్ధతి కలది గనుక ఇందలి నిర్ణయ విధానము నీ బుద్ధికి తెలుసుకొని యుండుము. వేదవేదాంత పద్ధతిగా ప్రవర్తించు వారికి సిద్ధాంత పద్ధతి తెలిపిన యెడల వారు యుద్ధమునకు నీ పైకి కాలు దువ్వె దరని భావము.

శి॥ వేద వేదాంత పద్ధతులుగా ప్రవర్తించువానికి సిద్ధాంత పద్ధతగు అచల పరిపూర్ణ ప్రబోధ ఎందుకు చెప్పగూడదు? చెప్పినందున యుద్ధమునకు రావటము నకు కారణమేమై యుండును ?

గు॥ వేదపరులు కర్మబద్ధులుగాను, వేదాంతులు జ్ఞానబద్ధులుగాను యుండె దరు. వీరలకు కర్మజ్ఞాన రహిత అచల పరిపూర్ణ ప్రబోధక సిద్ధాంతము పద్ధతి బోధించిన యెడల అది వారికి గిట్టక యుద్ధమునకు పైకి వచ్చెదరని నిర్ణయము.

కం॥ ముద్దుగ యీ గ్రంథంబును । పెద్దలముందర వచింప విరుదివి
యకుమీ । దిద్దెదరు తప్పులున్నను ! వద్దనకను దిద్దనిమ్ము ।
నరకీర్తినిధీ ॥ 149

కీర్తింపగల ఓ, శిష్యుడా ! ఈ గ్రంథము పెద్దలయెదుట సంతోషముగా చదువుటకు వెనుకకు పోకు ఎందుకనగా ఇందులో తప్పులుయుంటే వారు దిద్దె దరు. వారు దిద్దే పద్ధతిగా వుంటే దిద్దనివ్వు వద్దని అటంకపరచవద్దని భావము.

కం॥ నేనుగల మేను లేదని । మేనున నీవుండియిట్లు । మిడుకుట మేలా ।
మేనును విడిచను వినియెద । మానుగ నీవనక యున్న । మాయవెసుమ్మీ 150

ఓ, శిష్యుడా ! నేనను ఎరుక శాశ్వతముగా యుండునది యని మేనగు శరీరము ప్రకృతి జన్యము మాయ గనుక లేనిదని ఈ శరీరము నీవు ఏకముగా యుండి అనుట న్యాయము కాదు. ఎట్లనగా నీవు శరీరమును విడిచి బయట ప్రదేశమున నిలిచి శరీరము అబద్ధము నేను నిజమని చెప్పిన యెడల న్యాయముగా యుండును. అట్లు చెప్పుటకు వీలులేనియెడల శరీరము యను తనువు ఎట్లు మాయనో నేనను ఎరుకయగు నీవు మాయయే యని భావము.

కం॥ కట్టెలు పిడుకలు లేకను । యెట్టుంబలె నిప్పునిల్వ । కేగునొ పుడమిన్ । అట్టుంబలెనే నీవును యిట్టి శరీరంబు లేక । నెందుందువురా॥ 151

ఓ, శిష్యుడా ! పృధ్వియందు కట్టెలు పేడముద్దలగు పిడకలులేనిది నిప్పు ఎట్లు నిలవక పోవుచున్నదో ఆ విధముగా శరీరము లేకనే నేను నీవుగాని ఎచట నిలువగలము ? ఇహపరాదులయందు ఎచట నిలువలేమని భావము.

కం॥ తనువునే గానన:టె । ఘనసుఖదుఃఖములు రెండు । గనుపడె నీవై గనుకతనువు నీవొక్కటె । వినరానామాటనిట్టె । వెర్రివబడకన్॥ 152

ఓ, శిష్యుడా ! నేను వేరు మేను వేరయని చెప్పే మతిభ్రమగల వారు చెప్పే వాక్యములు నమ్మక నా మాటనమ్ము. అది ఏమనగా తనువు నేనుకాను యనిన యెడల గొప్ప సుఖముగా గొప్ప దుఃఖముగా నీవుగానే తెలియుచున్నావు గనుక తనువు నీవు ఒక్కటె యని భావము.

శి॥ ఘన సుఖంబులనగా ఏవి ? ఆ రెండు నేను ఎట్లగుదును ?

గు॥ స్థావరజంగమ జీవోపాదులయందు శ్రుతి॥ "దుర్లభం మానుషందేహం" యను న్యాయమున మానవోపాదిగా పుట్టడముకన్న అధిక సుఖము ఏదిలేదు గనుక మానవ జన్మకు రావడమే గొప్ప సుఖముని నిర్ణయము.

దుర్లభమైన మానవోపాధికివచ్చి సద్గురులను ఆశ్రయించి అతి దుర్లభమైన అచల పరిపూర్ణ ప్రబోధ తెలుసుకొనక మరణించడమే గొప్ప దుఃఖమని నిర్ణయము గనుక ఈ సుఖదుఃఖ ద్వంద్వ పద్ధతులు క్షరాక్షర పురుష స్వరూపముల యందే తెలియుచున్నవి గనుక సుఖదుఃఖములగు చావు పుట్టులకు మూలము నీవే యన్ని నిర్ణయము.

కం॥ ఎరుకలేనట్టి బయలున । బిరబిర నరుదెంచి యెవరు । బిలువనిదే తా । నరసి పరిపూర్ణమున్నది । యెరుకేగితె వాలుచేని । దెరుకని లేకన్॥ 153

ఓ, శిష్యుడా ! యెరుకలేనట్టి అచల పరిపూర్ణ పరబయలునందు ఎవ్వరు కోరనిదే ఎరుక తనంతట తాను అతి త్వరితముగా వచ్చినది. అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకొని తాను లేకపోయితే చాలునని భావము.

కం॥ తనువునే గానననంటివి విను । సుఖదుఃఖములు నెవరివిరనాతోడన్ । వినజెప్పుము నేవినియెద । తనయా తప్పితివ నిన్ను । దండింతు జుమీ॥ 154

ఓ, కుమారా ! శరీరము వేరు నేను యని ఎరుకవేరు యనియంటివి. అయినా నేను చెప్పే విషయము విచారించి నాకు సమాధానము చెప్పవలయును. అట్లు చెప్పక పొరబడిన యెడల నిన్ను శిక్షించెదనని తెలుసుకొనుము. అది ఏమనగా సుఖదుఃఖములు నీకా శరీరమునకా విచారించి చెప్పవలయునని భావము.

కం॥ అందరిమాటలకురికే । వెందుకు నామాటనమ్మ మిదె చాలును। యా
యందరు లేని బయలుగని। యందున నీలేమి యెరిగి। యరగితెసరిరా॥ 155

ఓ, శిష్యుడా ! మతసాంప్రదాయకులు నిర్ణయించిన పద్దతులయందు నీ మనస్సు పరుగిడడము ఎందుకు? నేను చెప్పినట్టి అచల పరిపూర్ణ ప్రబోధయందు నిశ్చలబుద్ధి కలిగియుండుము. జనన మరణభ్రాంతి రహితమునకు అది చాలును. ఎట్టులనగా అచల పరిపూర్ణ పరబయలునందు క్షరాక్షర పురుష జగత్తు యను నవి ఏ కొంచెమైన పుట్టలేదు గనుక లేని సర్వమునందు క్షరాక్షర పురుషులులేని వేయని నిశ్చయము తెలియడము జన్మరహితమునకు సరియైన మార్గమనిభావము.

కం॥ నాబోతు రుచికిరుచినడు। నీబోధ నపేక్షతేత నేర్చిన వారిన్। యే
బాధలు బాధింపవు । బాబాయిది నీవునేర్చి । పఠియింపవే॥ 156

ఓ, శిష్యుడా ! పటికబెల్లము మరియు మిశ్రి యనునది తీసి పదార్థము. నాబోతు యని చెప్పబడును ఇది జిహ్వకు రుచికరముగా యున్నను వివిధ వ్యాధులు కలుగుజేయును అదే పద్ధతిగా బ్రహ్మవిద్యయందు "ఓం ఆపోజ్యోతి రసోమృతం బ్రహ్మ" యని మధు విద్య గలదు, అది పైకి బ్రహ్మ తత్వము పొందించినట్టిదిగా యున్నను అనేక జన్మ బాధలు కలిగించును. అచల పరిపూర్ణ బోధవిని పఠించు వారికి ఏలాటి బాధలు బాధించని రుచి ఈ బోధయందు యున్నదని భావము.

కం॥ తాము తమ తప్పునెరుగక । నామాటలు తప్పులనుచు నవ్వేజనముల్
సామాన్యులనుచు దెలియుము। నీ మానసమందు లెన్న । నిరుపమ
సుగుణా॥ 157

సుగుణ సంపత్తిగల ఓ, శిష్యుడా ! జనన మరణ భ్రాంతి రహితమునకు నిర్ణయించిన ఇతర మార్గేయులు తమ తప్పు తాము తెలుసుకోలేక నేను బోధించే మార్గమునందు తప్పుగలదని చెప్పే ఇతర మార్గేయులు సామాన్య జనులు అనగా భ్రాంతియందు బంధింపబడ్డ వారని నీవు తెలుసుకొని నీ మనంబున దృఢముగా నిశ్చయించుకొమ్మని భావము.

కం॥ దప్పయప్పున జనినట్లుగ । నిప్పున చలిబాసినట్లు । నిజమోగిరమున్
నొప్పుగ దిన్నప్పుడె క్షుధ। తప్పినగతి బోధవిన్న । దప్పనుబాధ॥ 158

ఓ, శిష్యుడా ! దప్పివేసినప్పుడు నీళ్ళు తాగిన దప్పితీరునట్టుల చలివేసి నప్పుడు నిప్పుసెగ కాచుకొనిన చలిపోయినట్టుగను, అన్నము తిన్నను ఆకలి

పోయినట్లుగాను, క్ష—క్షరోపాధి ద్వయదోషరహిత పరమతత్వ అచల పరిపూర్ణ ప్రబోధ వినగానే జనన మరణ బాధ అట్లు పోవునని భావము.

కం॥ సాధనలు జెప్పెశిష్యుల । బాధల బెట్టెటి సురుని । బాటవదిలియే ।
బాధలులేనీ బోధను । సాధుల సేవించి వినుము సద్గుణశాలీ॥ 159

యోగ్యమైన గుణముగల ఓ, శిష్యుడా ! అననముద్ర లక్ష్య జీవేశ్వరైక్య మహావాక్య వార్తీక సాధనంబులు చెప్పే గురువుల మార్గంబులు జన్మ బాధ కలుగజేయునే గాని జన్మ బాధల తొలుగజేయునవికావని అట్టి మార్గంబులు వదిలిపెట్టి సకల బాధలు రహిత మొనర్చు పరిపూర్ణ ప్రబోధను సాధు జనులగు సద్గురుల సేవలొనర్చి తెలుసుకొనుమని భావము.

కం॥ బోధల కెల్లను గురువగు । బోధనుమీ దీన్నినీకు । బోధిస్తిని యీ ।
బోధను వదలకు మెప్పుడు । సాధుజనస్తుతవివేక వతతాశోక ॥ 160

సాధు జనులచే స్తోత్రముజేయునట్టి జనన మరణములులేని ఓ, శిష్యుడా ! జనన మరణ భ్రాంతి రహితమునకు నిర్ణయించిన బోధలకు అచల పరిపూర్ణబోధ గొప్ప మార్గము గనుక గురుబోధ యని నిర్ణయము. అట్టి బోధ నీకు బోధించినాను గనుక ఈ మార్గము ఎల్లప్పుడు వదలబోకు మని భావము.

కం॥ నీమదికి నిజబోధను । ప్రేమతో నాటి-చదలచి । పెక్కువిధములన్ ।
నేమొదలుబెట్టి చెప్పితి । దేమా తము రాత్రిపగలు । యేమారకుమీ॥ 161

ఓ, శిష్యుడా ! జనన మరణ భ్రాంతి రహితమునకు అచల ఋషులు నిర్ణయించిన నిజమార్గము శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్వ క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత పరమతత్వమగు అచల పరిపూర్ణ పద్ధతి నీమదికి నాటునట్టుల ప్రేమ పూర్వకమైన లక్షణముతో వస్తు నిశ్చయముగా అనేక విధముల దృష్ట ద్రాష్టాంతములతో మొదటినుండి బోధించితిని, గనుక వచ్చిన దనుక నిదుర వచ్చిన దనుక. బోధస్థితియందు ఏమారక యుండుమని భావము.

కం॥ నేనీకుజెప్పబూనిన । యీ నిజసద్బోధ మనను । కిమిడిన వెనుకన్
నీనా పనిదీరునురా । వోనాముద్దుల కుమార వోనగధీరా ॥ 162

స్తుతింపగల ధైర్యముగల ఓ, శిష్యుడా ! నేను నేకు చెప్పుటకు పూనుకొనిన అచల పరిపూర్ణబోధ నీ మనస్సు యందు స్థిరపడిన తదుపరి నీవు నేను యని ఎరిగే ఎరుక యొక్క ప్రయోజనము తీరును. అనగా ఎరుక లేకుండా పోవుననిభావము.

కం॥ ఎన్నో గ్రంథజలధులను । తిన్నగ మధియించి చూస్తె । తేలెను
సారం । బున్నబయలుగని మృషయగు నిన్నున్ నీమేను మృషవని ।
నిలువకు మనుచున్ ॥ 163

ఓ, శిష్యుడా ! ఇహపర ప్రవర్తనల విషయములతో కూడుకొనిన కర్మ భక్తిజ్ఞాన వైరాగ్యతత్వ ముముక్షుత్వ పద్ధతుల సముద్రరూపమున యున్న గ్రంథ సమూహములను నిశ్చలబుద్ధితో తరిచిచూడగా తేలిన సారమేమనగా అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకొని అనిత్యమగు నిన్ను నీ మేనును అసత్యమని ఎచటకూడ లేకపోవలయుననే నిశ్చయము తెలియుచున్నదని భావము.

కం॥ కప్పురము నిప్పుగలసే। చొప్పున వెలి గవలకండ్ల । జూస్తుండ
గనే । తప్పున గనరాదట్లనె । యిప్పుడు నినునన్ను బోధ । నెరు
గుము బుద్ధిన్॥ 164

ఓ, శిష్యుడా ! కర్పూరమున్ను, నిప్పున్ను కలుసుకొని కొంతవరకు ప్రకాశించి తుదకు రెండు వస్తువులు అనగా కర్పూరము ప్రకాశము మనము చూచుచుండగనే ఎట్లు లేకపోవుచున్నవో అట్ల నీవు నేను యనేటి ఎరుకయగు కర్పూరము అచల పరిపూర్ణ ప్రబోధ యనెడి నిప్పు ఈ రెండు విచారణ రూపమైన ప్రకాశవంతమై నీవు ఎరుకయనే భ్రాంతి బోధరూపమగు అగ్ని యొక్క సూక్ష్మాంశమగు శబ్దము రెండు కూడలేక పోవుచున్నవి ఈ పద్ధతిగా నీవు నేను లేనివారమని నీ బుద్ధియందు నిశ్చయించుకోమని భావము.

కం॥ దీవించియిస్తినేనీ । సేవించిన సేవమెచ్చి । విత్తములోనన్ ।
కావించు మెపుడుగానము భావించిది ముఖ్యమనుచు । పావనశీలా॥ 165

పవిత్రమైన నీతిగల ఓ, శిష్యుడా! నీవు చేయుచున్నట్టి త్రికరణశుద్ధి ప్రవర్తన ఆత్మ అంగభావ శుశ్రూషలు మెచ్చి నా మనంబున సంతోషము జెంది నిన్ను ఆశీర్వదించి ఈ అచల పరిపూర్ణ ప్రబోధను ఉపదేశించినాను గనుక నీ జనన మరణ భ్రాంతి రహితమునకు ముఖ్యమైనదని నీ హృదయ కమలమునందు ఆరూఢతజెంది కర్తృత్వరహిత కార్యాచరణ విధముగా స్తోత్రము యొనర్చుమని భావము.

## — (హీనగురు శిష్యోభయ లక్షణము) —

కం॥ ఈవి కొరకు గురుడును । నావద్దొక కాసులేదు నన్నడుగకుపో ।
పోవయ్య యనెడి శిష్యుడు । కేవల హీనాత్ములనుచు । గీర్తింపదగున్॥ 166

ఓ, శిష్యుడా ! "ధర్మమూల మిదం జగత్" యను న్యాయముగా యున్నను దానిని ధనమ్ మూల మిదం జగత్తు యని మార్చి ధనమునకు ప్రాధాన్యము ఇచ్చే గురువును ధనముపైన ప్రేమకలిగి ధనసంపాదనయందే కృషి చేయుచు డబ్బు విషయము నన్ను అడుగకూడదు. అయినా నావద్ద ఒకరాగి

డబ్బుకూడ లేదు గనుక వెళ్ళిపోవలయును అని అభిమానరహితముగా మాట లాడునటువంటి శిష్యుడును వీరుభయులు హీన అంతఃకరణము గలవారని సకల లోకంబులలో చాటించి చెప్పవచ్చును యని భావము.

కం॥ దేవుడు తేతెమ్మనునా । జీవుడు లేదనుచుమదిని । కిడిముడిపడునా।
భావమున దెలిసి యిద్దరు। నావిధమున నడువవలయు। నందరుమెచ్చన్॥ (167)

ఓ, శిష్యుడా ! దేవుడుగా నిర్ణయించుకున్న ప్రతిమ సకల పదార్థంబులు నాకు తెచ్చి పెట్టవలయుననిచెప్పగలదా ! జీవోపాధిగాయున్న మానవుడు ఎల్ల ప్పుడు దైవారాధననేయని కోపపడునా! కోపపడడు. ఎందుకనగా దైవానుగ్రహ మువల్ల ధనకనక వస్తువాహనములు కల్గును అందులనుండి కొంతధనము దైవ ముపేర దానధర్మము దైవకార్య మొనర్పవలయును అట్లు చేయనిచో పాపము సంభవించును అనే భీతిచేత దైవకార్యములు చేయును గనుక ఇట్టి లక్షణము గురుశిష్యులు గ్రహించి లోకులందరు మెచ్చునటుల ప్రవర్తించవలయునని భావము.

కం॥ గురుశిష్యుల లక్షణములు । గురుశిష్యులబోధరీతి గురుగీతార్థం । జెరి గిన నరులకు మెప్పగు। నెరుగనియా మూఢనరుల కిష్టతియౌనే॥ (168)

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ ప్రబోధ బోధించునట్టి సద్గురు లక్షణం బులు బోధించుపద్ధతి పరిపూర్ణబోధ తెలుసుకొనగల ఇచ్చగల సచ్ఛిష్య లక్షణం బులు వినునట్టి పద్ధతి గురుగీతయను గ్రంథమునందు పరమేశ్వరుడు పార్వతికి ప్రబోధించినాడు గనుక ఆ నిర్ణయపద్ధతిగా తెలియనివారికి గురుశిష్య న్యాయము మెప్పుగాదని భావము.

## — (గురు శిష్యోభయుల లక్షణము) —

కం॥ తనసంతతి పైగలదయ । తనశిష్యుని మీదనుండదగు గురు డెపు డున్ । తనధనము మనసు తనువును । తనగురునివటంచు దల్ప ! దగుశిష్యునకున్ । 169

ఓ, శిష్యుడా ! సద్గురుడగువాడు తన సంతానముపైన ఎట్టి దయవుంచునో అట్టిదయ తన శిష్యునియందు యుంచవలయును శుభసంతతి యగు సద్గురు పుత్రులు తమ తను, మన, ధనములు నసను కన్నతండ్రివే యని నిశ్చయించు కొనునట్లు సచ్ఛిష్యుడు తన తను మన, ధనములు గురుమూర్తివేయని నిశ్చ యించుకోవలయునని భావము.

శి॥ శిష్యుని తను, మన ధనములు గురుమూర్తి వేయని ఎట్లు నిశ్చయించకో వలయును ?

గు॥ సద్గురుమూర్తి తన శిష్యునికి ప్రథమమున ఆశీర్వాద రక్షణ ఇచ్చును. అందువల్ల శిష్యునికి ఇహపరసాధనములకు తగిన ధనకనక వస్తు వాహనంబులు త్రికరణశుద్ధి ప్రవర్తన ఆత్మ అంగభావస్థాన బ్రహ్మాలు చేకూరును గనుక సచ్ఛిష్యునికిగల సర్వస్వము తన సద్గురువుదేయని నిర్ణయము.

## — (నీతిప్రబోధము) —

కం॥ కోటివిధంబుల జెప్పిన । చేటొదవెటి తనదు పూర్వ । చేష్టలు విడకన్ । వాటున నేటున ద్వివిధము । గాటనమొనరించు నతని । కతుకునె బోధా ॥ 170

ఓ, శిష్యుడా ! ప్రపంచ పారమార్థిక విషయములగు భుక్తి ముక్తి లక్షణములు దృష్ట ద్రాష్టాంతరములచేత సార్థక అసార్థక లక్షణంబులు ఎన్ని పర్యాయములు చెప్పినను ప్రమాదకరమగు తన నడతలు విడువకుండా సద్గురువు ఎదుట ఒక విధమున ప్రవర్తించేవారికి ఈ అచల పరిపూర్ణ మార్గము పట్టుబడదని భావము.

కం॥ బంగారువంటియీ । బోధాంగి కరణులనుజేరి యదివిని వారిన్ । భంగపరచ దలచెడియా । వెంగసులకు జెప్పకుమని వేడెద నిన్నున్॥ 171

ఓ, శిష్యుడా ! సప్తలోహంబులలో బంగారము ఎట్లు శ్రేష్ఠమో అట్లు జనన మరణ భ్రాంతిరహితమునకు నిర్ణయించిన మార్గములలో అచల పరిపూర్ణ మార్గము అనగా శక్తిద్వయ నిరాసకంబైన సద్ద నిర్గుణతత్వము క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత పరమతత్వ మార్గము శ్రేష్ఠమైనది. ఇట్టి శ్రేష్ఠమైన మార్గము నందు యున్నవారలవద్దకు మూర్ఖులుగాయున్న వారలు చేరి వారలవలన అచల పరిపూర్ణబోధను తెలుసుకొని సద్గురుమూర్తి నిర్ణయించిన త్రికరణశుద్ధి ఆత్మ అంగ స్థాన భావ బ్రహ్మపద్ధతిగా నడవకోక తమ ఇష్టానుసారముగా నడుచుకొని ఇదే పరిపూర్ణ సాంప్రదాయక ధర్మపద్ధతి యని నిజ సాంప్రదాయ పద్ధతులను భంగ పరిచే మూర్ఖలక్షణము కలవారికి ఈ అచల పరిపూర్ణ ప్రబోధ చెప్పకూడదని నిన్ను హెచ్చరించుచున్నానని భావము.

కం॥ ప్రాకటముగ నిద్దురయిక । యేకథలను వినినరాదు యీ బోధందున్। రాకుండదేమిచిత్రమొ । ప్రాకృత నరమూకకెల్ల పావన చరితా॥ 172

జనన మరణ భ్రాంతిరహితమునకు, అనుకూల పద్ధతిగల ఓ,శిష్యుడా! భారత భాగవత రామాయణాది కథలు వినుచున్నప్పుడు నిద్రావస్థ రాకుండ యుండును.

అచల పరిపూర్ణ ప్రబోధ వినుచుండగా నిద్రావస్థ తప్పక రాగలదని భావము.

శి॥ అచల పరిపూర్ణ ప్రబోధ వినునప్పుడు వచ్చే నిద్రావస్థ ఇతర కథలు వినునప్పుడు రాకపోవటానికి కారణమేమై యుండును ?

గు॥ ఇతర కథలయందలి విషయములు తాము ఆచరించు నిత్యకృత్యముల యందు చేయు విధానముగా యున్నందున శ్రద్ధగా సంతోష పూర్వకముగా వినుచుందురు. అందువల్ల వారికి నిద్రావస్థ రాదు. జనన మరణ భ్రాంతి రహితమునకు బోధించు పరిపూర్ణప్రబోధ వినువారలు పిండ బ్రహ్మాండమును జీవేశులను ఏకమొనర్చి అఖండ ఎరుకపద్ధతి అచల పరిపూర్ణమునందు లేనిస్థితి తెలిసి సంతోష పూర్వకముగా శ్రద్ధగా పరిపూర్ణ ప్రబోధ వినువారికి నిద్రావస్థ యుండదు. ఏ పద్ధతియందు మరుపు జెందరు. ఈ పద్ధతి తెలియని పామర జనులకు పరిపూర్ణబోధ బోధించు సమయములయందు నిద్దుర తప్పక వచ్చును. సకల మానవులను తెలుసుకొనుటకు ఇదే దృష్టాంతము యని భావము.

కం॥ క్రొత్త దంపతుల కూటమి । నెత్త రగునలేమలంత । నిదురలు బోకన్।
మొత్త ములై కనునటువలె। ఐత్త లదిరిగేటిచిన్ని బాలల కగునే॥ 173

ఓ, శిష్యుడా ! నూతన దంపతుల గృహప్రవేశమునందు తదసుభవనీయులు స్త్రీ జనంబులు మొత్తముగా గూడి నిద్రావస్థ పొందక ఎట్లు చూచుచుందురో అట్లు చూచుటకు అనుభవములేని పిల్లలు మెళకువగా యుండగా అట్టి కార్యమునందు అనుభవము లేక నిద్రావస్థ పొందుదురు ఆ రీతిగనే ఈ మార్గమునందు అనగా జనన మరణ భ్రాంతి రహిత స్థితియందు అనుభవము లేనివారు ఈ అచల పరిపూర్ణ ప్రబోధ బోధించుచుండగా భ్రాంతియగు సంసార సముద్రము యందు ప్రవహించే పామరజనంబులు పిల్లలు నిద్దుర జెందునట్లు జెందుచుందురని భావము.

కం॥ మనసరయక ప్రజలను విను మనిచదువకుబోధ బాధ । యనియిండ్లలో ।
పనులన్ని యాదిజేసుక। చనియెదరా సమయమంద। సహ్యామునసుతా॥ 174

ఓ, కుమారా ! ప్రజలయొక్క మనస్సుయందలి విషయమును ముందుగా తెలుసుకొనక ఈ అచల పరిపూర్ణబోధ విషయము వినుమని చెప్పవద్దు. ఎందుకనగా ఈ మార్గము దైవాంశ సంభూతులగు సూరిజనులకేగాని ఇతరులకు అయిష్టత బాధగా యుండును. అందువల్ల తమతమ గృహముల యందలి పనులు జ్ఞాపకము చేసుకొని వెళ్లుదురని భావము.

కం॥ వీనుల వినడీబోధను । నేనే బ్రహ్మనని నిక్కి । నీల్గెడి వాడున్ । ఘూనికముగానవచ్చిన దానిని రాయనుమ దలచు। తార్కికునిగతిన్॥ 175

ఓ, శిష్యుడా ! తర్కశాస్త్రము చదువుకున్న శాస్త్రవేత్తలకు రత్నముల యందు ఉత్తమమగు మానికము కానవచ్చిన దానిని రాయిగానే తలంచి విడిచి వెళ్ళుదురు. అదేపద్ధతిగా అహం బ్రహ్మాస్మి యను అద్వైత వార్తీకాదులు ఈ అచల పరిపూర్ణ ప్రబోధ బోధించుచున్నను విని ఇష్టపడక తమయందు తామే బ్రహ్మత్వము పొందియున్నామని గర్వించి వెళ్ళిపోవుదురని భావము.

కం॥ ఒకరువిని మెచ్చవలెనని । సకల పురాణములు వేదశాస్త్ర, శ్రౌత। ప్రక రమును నేర్పు విద్య । న్నికరంబీ బోధమెచ్చ నేర్చునె సుమతీ॥176

ఓ, శిష్యుడా ! నాలుగు వేదంబులు, ఆరు శాస్త్రంబులు, పదునెనిమిది పురాణంబులు, పదకొండువందల ఎనబది ఉపనిషత్తులు, ఐదు యజ్ఞములనుండి అశ్వమేధయాగము వరకు యుండు శ్రౌతకర్మలు నేర్చిన విద్వాంసులు ఇతరులు విని తమ పాండిత్యమును మెచ్చుకొని తమకు అగ్రహారాదులు ఇవ్వవలయుననే ఇచ్ఛతో నేర్చినవారికి ఈ అచల పరిపూర్ణ బోధ ఇష్టముగా యుండదు. దానిని మెచ్చుకొనరని భావము.

కం॥ సాధారణముగ దెల్పకు । మీధర మానవుల బిల్చి యీ బోధను । జల్ మేధానిధి యాచించిన। బోధించుమువద్దు లోభబుద్ధి సుబుద్ధీ॥ 177

ఓ, శిష్యుడా ! ఈ భూమియందుయున్న మానవులను పిల్చి అచల పరిపూర్ణ ప్రబోధ సాధారణముగా తెలియజేయకు. ఎందుకనగా అచలస్థితి వారి యంతఃకరణము యందు స్థిరముగా యుండదు. గొప్ప నీతిమంతుడగు బుద్ధిశాలి వచ్చి ఆశ్రయించిన యెలాటి లోభత్వము చేయక ఉన్నవి యున్నట్లు ప్రబోధించుము యని భావము.

శి॥ గొప్ప ధీమంతు డనగా ఎటువంటివాడు?

గు॥ బుద్ధి యనగా అంతఃకరణ వృత్తులు నాల్గింటిలో యొకటి ఇది.

1. పండా, 2. మేధా, 3. వార్ధ్వి, 4. చత్వ, 5. గృహీతి. 6. శ్రౌతి, 7. ప్రతిభయని ఏడు విధములుగా చెప్పబడును.

1. పండా యనగా తత్వమున యున్నది యున్నట్లు తెలుసుకో తగినబుద్ధి

2. మేధ యనగా విన్నవాటి నన్నింటిని మరువకయుండు బుద్ధి

3. వార్ధ్వి యనగా ఊహాపోహలయందు నేర్పగల బుద్ధి.

4. చత్వ యనగా విషయములను చక్కగా అడిగి విసుగులేక వినుట యందు ఓర్పుగల బుద్ధి

5. గృహీతి యనగా చెప్పినవాటిన్నటిని తప్పక గ్రహించుటయందుగలశక్తి

6. శ్రౌతి యనగా గురు శుశ్రూషల యందు సహనముగల బుద్ధి.

7. ప్రతిభ యనగా ఏదేని ఒక విషయమును పలుకదలచినప్పుడు వాగ్ధోరణిగలిగి సమయోచితముగా శ్రుతిస్మృతి ఇతిహాసానుభవములను పెక్కులుచూపి వినువారు ప్రశ్నలు వేయదోచకుండా విషయములను తెలుపుటయందు శక్తిగల బుద్ధి.

ఈ ఏడు విధములైన బుద్ధి పరిణామము గలవారిని గొప్ప ధీమంతులని చెప్పబడును. అట్టి వారువచ్చి అచల పరిపూర్ణబోధను ఆశించిరేని ఏలాటి లోభబుద్ధిచే పూనక వున్నది యున్నట్లు చెప్పవలయునని సామాన్య బుద్ధిగల వారికి చెప్పకూడదని నిర్ణయము.

కం॥ ఏబోధ శిష్యులకుగల । యా బాధల నణచివేయు నదెసద్బోధా । ఆ
బోధయేది యనినను । యీబోధే సుమ్మిదీన్ని యికవిడువకుమీ॥ 178

ఓ, శిష్యుడా ! ఏబోధ శిష్యజనంబులు తెలిసినట్లయుంటే వారల జనన మరణ బాధ లేకపోవునో అట్టిబోధనే యోగ్యమైన బోధయని చెప్పనగును గనుక అట్టి యోగ్యమైనబోధ ఏదియని విచారించగా ఈ అచల పరిపూర్ణ బోధనే యని నిర్ణయింపబడ్డది గనుక దీన్ని నీవు విడిచియుండ కూడదని భావము.

కం॥ హెచ్చైన బోధచెల్లే । సచ్చరితుల కియ్యలేరు జనులు ధనంబుల్ ।
గచ్చులు గొట్టేదిచ్చుల । కిచ్చిన క్రియనిట్టి నృతతి । నేమన
నోయీ ॥ 179

ఓ, శిష్యుడా ! జనన మరణ భ్రాంతిరహిత పరుమనట్టి గొప్ప మార్గమగు అచల పరిపూర్ణ ప్రబోధ బోధించునట్టి సద్గురువులకు జనులు దక్షిణ రూపమైన ధనమో వస్తువాహనంబులు ఇవ్వక భావదోషంబులుగల ప్రగల్భ వాక్యంబులు చెప్పే మాయగురువులకు ఇచ్చెదరు ఇట్టి అజ్ఞాన ప్రజలను ఏమని చెప్పనగునని భావము.

కం॥ కాకులవలె కూశలిడే । లోకులకీకలకు బెదిరి లోగుండ కటన్ ।
మూకత్వమూనుచాలు । వివేకుడవయ్యుంటివేని వినినామాటా॥ 180

ఓ, శిష్యుడా ! ఇతరులకు ఇష్టములేక యుండినను ఎవ్వరుకూడ అరువుమని చెప్పక యున్నను కాకులు ఎడతెగకుండా ఎట్లు అరుచుచుండునో అట్లు ఈ ప్రపంచము సత్యము శాశ్వతముయని లోకులు పలుకుచుందురు. వారి మాటలకు బీతిచెంది వారి మాటలు నమ్మి వారికి లోబడకు. నామాట నమ్మి నిజమని నీమనంబున నిశ్చయించుకొన్న వాడవై జనన మరణ భ్రాంతి రహిత పద్ధతి యందు ఏకలక్షణము కలిగి వారిమాటలు విన్న నీవు మాటాడక యుండుము నీ జనన మరణ భ్రాంతిరహిత స్థితికి ఈ లక్షణము పొలునని భావము.

కం॥ పెద్దలనెవరిని జూచిన ముద్దుగమాట్లాడివారు । ముదమున జెప్పే । సుద్దుల కడ్డము జెప్పక । వొద్దికతో మ్రొక్కివినుము । వోపుణ్యతమా॥ 181

ఓ, శిష్యుడా ! ఈ సాంప్రదాయకులగువారు నీకు అగుపడిన యెడల వారికి సాష్టాంగ నమస్కారము చేసి వారు ప్రేమపూర్వకముగా బోధలక్షణంబులు చెప్పినయెడల ఏ ఒక వాక్యమునకైనా ఎదురు చెప్పక ఓపికతో వినవలయునని భావము.

కం॥ తనహితమెరుగని మనుజుడు । వినడాప్త జనోక్తి దుష్టవృత్తి గలసుయోధనుడు । దశాననుడు - విహితజన వాక్యము వినక కాదె నమస్సిరి రుపురున్ ॥ 182

ఓ, శిష్యుడా ! ఈ పృథ్వియందు తనమేలు తాను తెలుసుకోలేనివారు స్నేహితులు చెప్పినను, బంధువులు చెప్పినను, గురువులు చెప్పినను వినరు. గనుక రారాజులగు చక్రవర్తులైనను, భక్తునినుండి బ్రహ్మవేత్తలైనను, ఎటువంటి వారలైనను చెడిపోవుచున్నారు ఎట్లులనగా సుయోధనుడనే దుర్యోధనుడు, దశాననుడనే రావణాసురుడు వీరలను బంధువులు, స్నేహితులు, గురువులు ఎంద రెన్ని విధముల తమ మేలుగోరి చెప్పినా వినక వంశాది సహితముగా నశించి పోయినారు గనుక నీ మేలుకోరి నీయందు ప్రేమచేత నీకు ఇతర వాక్యంబులు చెప్పెటివారికి నీవు అడ్డము చెప్పక అణుకువగలిగి యుండవలయునని అట్లు వినకపోయినవారు పైవారు పొందిన దుర్గతి పొందగలరని భావము.

కం॥ హద్దుసుమీ గురువాజ్ఞని । ముద్దుసుమీ గురునిసేవ । ముదమున జేయన్ । పద్దుసుమీ యిట్లుండుట । పద్దుసుమీ గురునితోటి । వాదించుటయున్॥ 183

ఓ, శిష్యుడా ! సద్గురుమూర్తి ఆజ్ఞ హద్దు కలిగియుండును. అనగా త్రికరణశుద్ధి ప్రవర్తన ఆత్మ, అంగ, స్థాన, భావ, సంభ్రమలుగా యుండునది ప్రతిజ్ఞ పూర్వకముగా శిష్యుడు ఆచరించుచుండిన దుర్లభమైన మానవోపాధికి వచ్చి అతి దుర్లభమైన అచల పరిపూర్ణ బోధను సద్గురుమూర్తి వలన విని జనన మరణ భ్రాంతిరహితుడ నైనానని సంతోషముతో యుండును. ప్రబోధ పద్ధతి యందు సద్గురుమూర్తితో ఎలాటి వాదోపవాదములు చేయకూడదని భావము.

కం॥ జంభాల పోతుగోరునె । సంభవ నాశములబాపు । చక్కని బోధన్ కుంభిని షండునకుండెనె। రంభాసంభోగవాంఛ రంభను గనినన్ ॥ 184

ఓ, శిష్యుడా! ఈ భూమియందు రంభయను స్త్రీని చూచినను దానితో సంభోగము జరుపవలయునని నపుంసకునకు ఎట్లు కోరిక జనించదో అట్లు త్రికరణశుద్ధి ప్రవర్తన ఆత్మ అంగస్థాన భావములచే సద్గురుమూర్తి సేవ చేయడము తెలియక డంబాచారి వాక్యంబులు చెప్పుచుండేవారికి జనన మరణ భ్రాంతి రహిత మొనర్చు అచల పరిపూర్ణ ప్రబోధ యున్నట్లు తెలియుచున్నను వారు కోరరని భావము.

కం॥ ఎందరు దూషించితె యేమందరు మనవారెకాని । యన్యులెసీవా । యందరితో వాదించక । నంధంబౌ నిట్టిబోధ నరయర తండ్రీ॥ 185

ఓ, శిష్యుడా! ఎందరు దూషించిన ఏమి ప్రయోజనము. అందరు మనవలెనే అన్యముకాదు ఎందుకనగా మానవలోకమునకు జనన మరణ భ్రాంతి రహితమునకు అచల పరిపూర్ణ ప్రబోధ నిజాభిప్రాయము చెప్పక కల్లబొల్లి మాటలు చెప్పి మానవులను మోసము చేయుచున్నారని వారిని మనము దూషించుచున్నాము. వేషభాష ఆడంబరములు లేక ప్రపంచమున కర్తృత్వరహితమని ప్రపంచ భ్రాంతి రహితులమని అన్నిపనులు చేయుచు మానవలోకమును మోసము చేయుచున్నారని వారు మనలను దూషించుచున్నారు. పరుషవాక్యములాడి ఒకరి నొకరు దూషించుకోవటమునందు సమానులమేగదా. ఇందు వేరుచేయువారు ఎవ్వరులేరు. గనుక నీవు వారలతో వాదించేపద్ధతికి పోక చక్కనైన అచల పరిపూర్ణ బోధను తెలుసుకోమని భావము.

కం॥ కోపమె పాపం బనబడు కోపమె హంకార మనుచుకొని యాడబడున్ । కోపమె తాపంబనబడు । కోపమె మృత్యువన బడును । కుటిల విరహితా॥ 186

కుటిలరహితమైన శిష్యుడా ! వాత, పిత్త, శ్లేష్మములలో పిత్తాతిశయమైన క్రోధము కోపమనబడును గనుక కోపమే పాపమనబడును. పాపమనగా దుష్టముగా చేయునట్టి కార్యఫలము, పాపమని చెప్పబడును. కోపమే అహంకారమనబడును. అహంకార మనగా జ్ఞానాధిష్టాన దేవత యగు కూటస్థుడు పృథ్వి గుణమగు గంధతన్మాత్రతో జేరినందున అహంకారమను అధ్యాత్మ కలుగును. దాని అధిభౌతికము అభిమానము మరియు గర్వము, అహం బ్రహ్మాస్మి యని ప్రేమయని అనేక లక్షణంబులు. కోపమే తాపమనబడును. తాపమనగా అధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవిక తాపత్రయంబులు మరియు దారిద్ర దుఃఖము. కోపమే మృత్యువు యనబడును చచ్చి తిరిగి పుట్టునది మృత్యువు యనబడునని భావము.

శి॥ పిత్తాతిశయము కోపమనుటకు కారణ మేమైయుండును ?

గు॥ అన్నము యొక్క మధ్యభాగము మాంసము. జలముయొక్క మధ్య భాగము రక్తము ఈ రెంటి సూక్ష్మభాగము పిత్తము మరియు పైత్యము యని చెప్పబడును. అన్నముయొక్క సూక్ష్మభాగము మనస్సు నీటియొక్క సూక్ష్మ భాగము ప్రాణము యని నిర్ణయము గనుక పిత్తమగు పైత్యమునకు ప్రాణమనం బులకు ఏకైక సంబంధము యుండును. అందువల్ల పిత్తము సమపద్ధతిగా యున్న ప్పుడు ప్రాణమనంబుల ఏకరూపమగు ఎరుక సమలక్షణముగా జ్ఞాన, విజ్ఞాన, ప్రజ్ఞాన పద్ధతిగా నుండును. అన్నపానాదుల మార్పువల్ల మరియు వాతావరణ మార్పువల్ల పిత్తము అధికముగానై మన ప్రాణమనంబుల చలనము అధికమై వాటి ఏకైకరూపమగు మనోరూపమైన ఎరుక చలనపద్ధతి గలిగి ఒక వస్తువును అనేక వస్తువులుగా చూచును. ఒక మనిషిని అనేక పద్ధతులుగా చూచును. మతి హీనముగా సంచరించును. పిత్తము క్షీణించిన యెడల ప్రాణ మనంబుల ఏకైక రూపమగు ఎరుక మరుపు రూపంబున అనగా ప్రాణరూపంబున యుం డును. గనుక మృత్యువు యని చెప్పబడును గనుక అన్నపానాదులవల్ల మాంస రక్తంబును మాంసరక్తంబువల్ల ఏకైక రూపపిత్తము. పిత్తము రజోగుణ రూప మని నిర్ణయము అన్నపానాదుల సూక్ష్మరూపమగు మనఃప్రాణంబుల ఏకైక రూపమగు ఎరుక సత్వగుణమని నిర్ణయము అన్నప్రాణాదులే మాంసరక్తంబులు మరియు పృథ్వి జలంబులు తమోగుణమని చెప్పబడును. గనుక ప్రాణమనంబుల ఏకైక రూపములగు ఎరుకయొక్క ఉపాధికి కారణము అన్నరసంబులే కాని అచల పరిపూర్ణ పరబయలు కాదని నిర్ణయము

> కం॥ చెప్పదొణంగెను మునుతా ! జెప్పని ముచ్చట్లుకొన్ని । సేమము
> కొరకై । యొప్పులకుప్పా ! వో మా ! యప్పాయని దువ్వుకొనుచు
> సతిదయతోడన్ ॥ (187)

శిష్యుని యందు కరుణ గలవాడై గురుమూర్తి శిష్యుని క్షేమము కొరకు ముందు చెప్పనట్టి కొన్ని లక్షణ ధర్మంబులు చెప్పుటకు మా తండ్రి! సుగుణము లకు రాశివంటివాడవనుచు వీపుపైన తన హస్తములతో స్పృశించుచు చెప్పుటకు ప్రారంభించినాడని భావము.

> కం॥ ఒప్పకుమీ పరబోధల । తప్పకుమీ బోధనెపుడు । దలచుట
> మదిలో । రొప్పకుమీ సచ్ఛిష్యుల । చెప్పకుమీ దీన్నిదుష్ట ।
> జెనటుల కెపుడున్ ॥ (188)

ఓ శిష్యుడా ! ఇతర ఏ మార్గంబులు ఒప్పగూడదు. సర్వకాలములందు నీ మనంబున ఈబోధ యొక్క లక్షణంబును తలంచు చుండుము. సద్గురు

సాంప్రదాయకులు ఎవ్వరైనా అగుపడిన యెడల వారలతో సంతోషపూర్వకముగా సంభాషించుము. కాని కోపముతో మాటలాడకుము. కపట ప్రవర్తన గల వారికి ఈ మార్గము ఎప్పుడు కూడ చెప్పకూడదని భావము.

కం॥ కూడకుమీ దుర్జనులను । వీడకుమీ సాధుమనుజ వితతి స్నేహం
బోడకుమీ గురుసేవకు। పాడకుమీ పరులనింద పాటలరీతిన్॥189

ఓ, శిష్యుడా ! దుష్టజనుల సాంగత్యము ఎంతటి ప్రేమపూర్వకముగా తెలుయుచున్నను నీవు చేయకుము. సద్గురు సాంప్రదాయమునందు ఎంతటి విపత్తు సంభవించినను విడువకుము. గురుసేవ యను త్రికరణ శుద్ధి ఆత్మ అంగ స్థాన భావ శుశ్రూషయందు ముందంజ వేయుము. వెనుదీయకుము. పరులను నిందించే పద్ధతిగా యున్న పాటలను పాడక గురుమూర్తిని స్తుతించే పాటలను పాడుమని భావము.

కం॥ మీరకుమీ గురువాజ్ఞను । చేరకుమీ దుష్టులంత । చేరినచోటన్,
దూరకుమీ బోధనువిని । ఏరకుమీ సాధుజనుల యందున తప్పుల్॥

ఓ, శిష్యుడా ! సద్గురుమూర్తి ఆజ్ఞానుసారము ప్రవర్తించుము. దుష్ట జనములు చేరియున్న చోటులయందు నీవు వెళ్ళి వారలతో చేరవద్దు. ఎవ్వరైనా ఏదైన విషయము బోధించినట్లైన విని ఊరకుండుము గాని వారిపై కోపపడకుము. సాధు జనంబుల లక్షణంబులుచూచి అందు తప్పు కలదని నిర్ణయించకుమని భావము.

కం॥ జనులవలె జరుపు జనులను । ననునిను పనవితతి దిట్ట నడువకు మెపుడున్।
నినునీవు బొగడుకోకుము। నినుబోలరటంచు జనుల। నిందించకుమీ॥191

ఓ, శిష్యుడా ! నన్ను నిన్ను తిట్టేటి వడతలు నడుచుకోక సకల జనులు ఏది నిశ్చయమని నిర్ణయించి నడుచుకొనెదరో ఆ నిర్ణయము ప్రకారమే నడుచుకోవలయును. ఇదియునుగాక నీవు గొప్పవాడవని ఇతరులతో చెప్పకొనవద్దు మరియు నీ సమానులు ప్రపంచమున ఎవ్వరుకూడ లేరని ఇతరులు మూర్ఖులని వారలను నిందలు చేయబోవకుమని భావము.

కం॥ శ్రద్ధబోధందునిలిపి। అశ్రద్ధను నీనేర్పుచేత ఖండించితివా। బద్ధత్వ
మంతబాయును । బుద్ధికి సరిపడితెదీన్ని । బూనగదోయీ ॥ 192

ఓ, శిష్యుడా ! ఈ జనన మరణ భ్రాంతి రహితమునకు అచల పరిపూర్ణ బోధనే సరియగునది యని నిశ్చయించుకొన్న యెడల ఇతర ఏ మార్గములు నీకు అంటవు. అందువల్ల సకల భ్రాంతి బంధములు నీతోకూడ లేకపోదువు గనుక

నీవు లేకపోవడమే దుర్లభమైన మానవోపాధికి నీవు వచ్చిన ఫలము అని నీకు నిశ్చయము వుంటే ఈ ధర్మపద్ధతిగా నడుచుకొనుము.

కం॥ సంశయమె జన్మహేతువు। సంశయమే గురుని మాట చవిగొననీ
యదీ। సంశయమె కీడునొదవును। సంశయ మెడబాస్తివేని!
బాలును వత్సా॥ 193

ఓ, శిష్యుడా ! సందేహము జన్మహేతువుకు కారణము. సందేహము గురుని వాక్యము యందలి నిశ్చయమునందు దృఢబుద్ధి యుండనీయదు గనుక ఏలాటి సందేహము యున్నా భ్రాంతి యనే కీడు వెంటనే వుంటు యున్నది గనుక సంశయమును సర్వకాలములందు వదలి యుండవలయునని భావము.

కం॥ నరులంత మెచ్చనడువను। హరిహర విధి శతమఖాను రాదులకైనన్।
తరముగాదనక మనకిక। తరమౌనన వశమెమూడు। ధాత్రిని పుత్రా॥ 194

ఓ, కుమారా ! జనులు అందరు మెచ్చేట్టుల నడచుకోవలయుననిన త్రిమూర్తులకు ఇంద్రాదిదేవతలకు సాధ్యము కాలేదు అనే నిర్ణయము వుండగా నీకు నాకు తరమౌనా విచారించి చూడగా తరము గాదని భావము.

కం॥ అందరిని చణుకు చుందురు। కొందరు దుర్మార్గవృత్తి। కుటిల జనంబుల్।
అందరినిగిచ్చి కరుచుచు। మందలవలె కోతులుండు। మాడ్కిని కుమారా॥ 195

ఓ, కుమారా ! మందలుగా యుండి కోతులు ఏ కారణము లేనిదే గిచ్చి కరుచునట్లు దుష్టలక్షణములయందు ప్రీతి గలవారు ఏకారణము లేనిదే దూషింపు చుందురని భావము.

## —(గురు నిర్ణయము)—

కం॥ సదమలగురు వెవరనినను। యిదిగోజనన మిదుగోలేని। యీ గురు తెరిగే।
బిదగు శరీరముదీనిని। వదులుమనుచు నీకు జెప్ప। వచ్చినవారే॥ 196

ఓ, శిష్యుడా ! జనన మరణ ప్రవాహమగు మలినము లేని సద్గురుమూర్తి ఎవ్వరనగా ఇదుగో జనన మరణములులేని అనల పరిపూర్ణ పరబ్రహ్మము అదుగో సకల భ్రాంతులకు మూలమై తనకు మూలము లేని గుర్తెరిగే శరీరమునే దీనిని విడువుమని చెప్పి విడిచే ప్రయత్నము తెలియజేయు వారని భావము.

కం॥ దిచ్చుతనువు శిష్యునిమది నొచ్చిన ధనమియ్యమనుచు। నూహించి మదిన్।
యిచ్చకములాడబోకను। చచ్చెర ఝాడించు వాన్ని। సద్గురుడై తే॥ 197

ఓ, శిష్యుడా ! మోసము చేయునట్టి చిత్త వృత్తిగల శిష్య లక్షణంబులు గురుమూర్తి చూచి వీటిని కోపగించిన యెడల వారివల్ల వచ్చే వస్తు వాహనంబులు రావు యని నిశ్చయించుకొని మన్నించక ప్రియవచనములు పలుకక సద్గురుడగు వాడు శీఘ్రముగా వానిని తిరస్కరించునని భావము.

## —( నిజశిష్య నిర్ణయపద్ధతి)—

కం॥ గురుడు తన నెంతమెచ్చిన । పరశిష్యుడు లొంగితిరుగవలయును మదిలో ।
మురశి భయభక్తి లేకను । తిరిగిన చేటొదవునిజము । తెలియగవోయీ॥ (198)

ఓ, శిష్యుడా ! సద్గురుమూర్తి తన శిష్యుని తన సంతతి కన్న ఎక్కువగా మెచ్చుకొన్నను జనన మరణ భ్రాంతి రహితమునకు యోగ్యమైన శిష్యుడు గురువు యెడల అధిక భయభక్తి కలిగి అణుకువగా యుండవలయును. గురుమూర్తి తనను అందరికన్న గొప్పగా మెచ్చుకొంటు యున్నాడనే గర్వము మనంబున నుంచుకొని భయభక్తి లేక నడుచుకొన్న యెడల ప్రత్యక్షమైన రౌరవాది నరకము కలుగునని భావము.

కం॥ శూరత్వమాత్మపనికై । వైరాగ్యము గురుని గొల్పు । వర్తన కెపుడున్ । యారీతి వృత్తిగలిగిన నారీనరులేగి చనరె । నరకము లోనన్ ॥ 199

ఓ, శిష్యుడా ! తమ స్వకార్య నిర్వాహకములయందు సాహసోపేతమైన శ్రద్ధ వహించి చేయుటయు, గురు ధర్మ ప్రచార సేవాది కార్యములయందు విరక్తి బొంది యుండడము యొక్క లక్షణము వల్ల స్త్రీలు గాని పురుషులు గాని విశేష కష్టములు అనుభవించి జనన మరణ బాధలు పొందెదరని భావము.

శి॥ ఆత్మ పనియందు శూరత్వము గురు పనియందు వైరాగ్యము ఎట్లు కలుగును ?

గు॥ తమ పోషణకొరకు మరియు ప్రపంచమునందు తన పేరు ప్రతిష్టలు కీర్తి ఆధిక్యత యుండవలయుననే సంకల్పము నందు పట్టుదల వహించి అందు వల్ల తనకు కలిగే సార్థక అనర్థకములు ఆలోచించక అధిక ధనము వ్యయ పరచుచు గొప్ప పట్టుదలతో అన్ని కష్ట నిష్ఠూరములకు ఓర్చి గొప్ప శూరునివలె ప్రవర్తించును.

గురుసేవా పద్ధతి తటస్థించిన యెడల అందుకు కొంత డబ్బుఖర్చు యగును. ఆ డబ్బు నేను ఎచటనుండి తెచ్చేది. ప్రస్తుతము నా వద్దనున్నడబ్బు

నేను బ్రతికి యుండువరకు పరిపోషలయును గనుక గురు కార్యమునకు డబ్బు ఇవ్వడము ఏమిటి ? తను, మన, ధనములు గురుమూర్తికి అర్పించినాను గనుక ప్రతిదినము నేను తినే అన్న పానాదులు గురునకు అర్పితము చేసి తింటు యున్నాను. కట్టు గుడ్డలు గురువార్పితము చేసే కట్టుకొనుచున్నాను ఇంతకు ఎక్కువ సేవజేయు గురుభక్తుడగు ఎవరు ? అయినా ఇంతకన్నా ఎక్కువైన గురుసేవ యుండబోదని వైరాగ్య పద్ధతి బూని వుండును. గనుక ఈ లక్షణ ములు గలవారు ఎంత భక్తివంతులమని యనుకొన్నను అచల పరిపూర్ణ స్థితి పరులనుకొన్నను భ్రాంతిరహిత పద్ధతికి వీరల ప్రవర్తన వ్యతిరేకము గనుక ఇట్టి లక్షణములు గలవారు ప్రపంచమున అనర్హులే గాక జనన మరణ ప్రవాహము నందు నీచ జన్మములు పొందుదురని భావము.

కం॥ మేలైన బోధవినుటకు । వాలా విఘ్నములు వచ్చి సమకూడి
యయే । లీలన్ విడుసచ్ఛిష్యుడు । వాలాయము బోధయందె ।
వర్తించుజుమీ ॥ (200)

ఓ, శిష్యుడా ! త్రికరణ శుద్ధి గలిగి సూరిజనులుగా జన్మించిన జనులు తమ జనన మరణ భ్రాంతిరహితమునకు అనుకూలమైన అచల పరిపూర్ణ ప్రబోధ వినుటకు ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవిక తాపంబులు ధనేషణ, దారేషణ, పుత్రేషణంబులచే ఎన్ని విఘ్నములు సంభవించినా ఈ అచల పరిపూర్ణ ప్రబోధ విడువక సర్వకాలములయందు బోధానుకూల ప్రవర్తన యందే ప్రవర్తింతెదరు. అనగా త్రికరణశుద్ధి ఆత్మ అంగస్థాన భావ శుశ్రూషలయందు మార్పులేక ప్రవర్తించెదరని భావము.

కం॥ గురుకనుసౌంజ్ఞను గనుగొని । పరిచర్య యొనర్చునుండు భక్తుడు
భక్తిన్ । పరిపూర్ణ బోధజెందును । పరమౌదారప్రచండ । బంగరు
కొండా ॥ (201)

అమిత ప్రకాశమైన బుద్ధిగల ఓ, శిష్యుడా ! గురుమూర్తి చూపునట్టి నిశ్చయ స్థలమును శిష్యుడు కనుగొని సద్గురు ఆజ్ఞానుసారముగా ప్రపంచ పార మార్గముల యందు ప్రవర్తించిన యెడల అచల పరిపూర్ణ ప్రబోధవల్ల పొందే ఫలము పొందగలడని భావము.

కం॥ కమలంబులున్న కొలనుకు। భ్రమరములేతెంచినట్లు బాగుగ బోధన్ ।
తమ మదిగోరి గురునిపద । కమలములను గొల్వ సుజన
గణమేతెంచున్ ॥ (202)

ఓ, శిష్యుడా ! తామర పద్మంబులున్న కొలనుకు తేనె నపేక్షించి తుమ్మెద లెట్లు చేరునో అట్లు జనన మరణ భ్రాంతిరహితమును అపేక్షించి సచ్ఛిష్య జనము సద్గురువు పాద పద్మములు ఆశ్రయించెదరని భావము.

కం॥ త్ర్యక్షుని నిందించినయా । దక్షునిగని ప్రాణమిడిన । త్ర్యక్ష పతి వలెన్ యాక్షితి తన దేశికుని నుపేక్షించిన జనులతా ను । పేక్షించ దగున్ ॥ (203)

ఓ, శిష్యుడా ! ఈశ్వరుని నిందించిన దక్షప్రజాపతిని జూచి ఈశ్వరుని భార్యయగు పార్వతి దక్షప్రజాపతి తన తండ్రిగా యున్నను, తన భర్తను దూషించినందున తండ్రియగు దక్షప్రజాపతి ముఖము చూచుటకు ఇష్టము లేక ప్రాణహాని చేసుకొనెను. అట్లు తన సద్గురుమూర్తి ని దూషించే వారల ముఖము కూడ చూడకూడదు. వారలు తల్లిగాయున్నను, తండ్రిగాయున్నను, బంధువులుగా యున్నను, దాతగా యున్నను వారల ముఖమును శిష్యుడైనవాడు చూడగూడదని భావము.

కం॥ గురుని కపరాధియగునా । నరనాథుని ద్రుపదునొంచు । నరుని విధమునన్ ధరసచ్ఛిష్యవరుడు తన గురుశత్రుని చేతనై తే । క్రొవ్వణచదగున్ ॥ (204)

ఓ, శిష్యుడా ! బాణవిద్యయందు అర్జునునికి గురువగు ద్రోణాచార్యులకు అపకారముచేసిన ద్రుపదమహారాజును అర్జునుడు వంచిన విధమున తన గురువకు శత్రువుని చేతనైనయెడల నిజశిష్యుడగువాడు వాని గర్వము అణిచివేయవలయు నని భావము.

కం॥ పతిభక్తి గల యువతివలె । సతతము గురుభక్తి గలిగి । సచ్ఛిష్యు డిలన్ । స్థితిగురుని సేవజేయును । ప్రతిరహితాద్భుతచరిత్ర పరమపవిత్రా ॥ (205)

ప్రతిలేని పావనచరితగల ఓ, శిష్యుడా ! పతివ్రతయగు స్త్రీ తన భర్త యందు ఏవిధమున భక్తిపూర్వకముగా యుండునో అదేవిధముగా సచ్ఛిష్యుడైన వాడు పరిపూర్ణస్థితి కుదురుటకు సద్గురు అజ్ఞానుసారము చతుర్విధ శుశ్రూషలు చేయవలయునని భావము.

## — (బోధకు అనధికారులు) —

కం॥ మనసున నొకటిదలచు । వాక్కున నొక్కటి బలుకుచుండు ।

కుటిలుడు మరితా । తనువున నొక్కటి జేయును । వినువానికి బోధ దెల్పు విహితమటోయీ ॥ (206)

ఓ, శిష్యుడా ! కపటవృత్తి గలవాడు మనంబున నొక విధముగా సంకల్పించును. నోటితో ఇంకొక విధమున చెప్పును. చేతులతో మరియొక విధమున చేయును కనుక ఇట్టి లక్షణములు గలవారలకు అచల పరిపూర్ణ ప్రబోధ బోధించడమువల్ల ఆ బోధయందలి ఫలమును ఎట్లు పొందగలడు ? పొందలేడని భావము.

శి॥ మనస్సున తలంచినట్లు వాక్కున ఎందుకు చెప్పరు ? చేతులతో ఎందుకు చేయరు ?

గు॥ మనసు, వాక్కు, శరీరము అనునవి త్రికరణము లనబడును. ఇందులో మనస్సు ప్రధానమైనది. ఈ ప్రధానమైన మనస్సునందు మల, విక్షేప, ఆవరణము లనే మూడు విధముల దోషము లుండును. సామాన్యు లగువారు ఈ దోషంబుల నణపలేక ఒక సమయమునయున్న మనోనిశ్చయము మరియొక సమయమునందు లేక ఒకప్పుడు చెప్పిన వాక్యము ఇంకొక సమయము యందు చెప్పక ఒకప్పుడు చేసినపని మరియొక సమయమునందు చేయక చంచల స్వభావముచే యుండేదరు. ఇట్టి స్వభావముకలవారికి అచల పరిపూర్ణబోధ తెలుప కూడదని భావము.

కం॥ గురుడు తనయాజ్ఞలోపల । చరియింపగ గోరునట్టి శిష్యున కెపుడున్। దురితంబు వృద్ధియైతా । నరకమునన్ గూలకున్నె నరనుతచరితా ॥ (207)

మానవలోకమున కీర్తింపదగు చరిత్రగల ఓ, శిష్యుడా ! తన గురుమూర్తిని తన యాజ్ఞలోపల ప్రవర్తింప విశ్చయించి ఒకప్పుడు ప్రవర్తింప చేసిన యెడల వారు తప్పక జనన మరణ ప్రవాహమగు నరకమున పడి ప్రవహించుదురని భావము.

కం॥ సురవరుడహల్యకోసము । మరులొందిన రీతి నెపుడు । మరుగు దురజ్ఞల్ । పొరుగూరు సాధులకుతమ । పురమునకల సాధులందు । బుద్ధినిలుపకన్ ॥ (208)

ఓ, శిష్యుడా ! దేవేంద్రుని భార్యయగు శచీదేవి మిక్కిలి సౌందర్య రాశిగా యున్నప్పటికి అహల్యయందు మోహము జెందినటుల నిశ్చలస్థితి లేని మానవులు తమ సమీపమునయున్న సద్గురునియందు స్థిరబుద్ధి యుంచలేక దూరదేశము

కం॥ ఈ యచల మొక్కటి బ్రహ్మని । మాయా మయమైన విశ్వమంతయు
నేనంచాయ మెరుంగక ననునరు । లీయెడ బ్రహ్మం బటంచు లెక్కిడ
నగుదున్ ॥ 245

ఓ, గురుదేవా ! అచల పరిపూర్ణ పరబయలు ఒక్కటి మాత్రమే శాశ్వత
మని విశ్వాభిమానియగు నన్ను విశ్వమును మాయయనే విషయము మానవులు
తెలుసుకోలేక నాయందు గల ప్రేమవల్ల ఈ మానవులు నన్ను శాశ్వత బ్రహ్మ
యని యనుకొన్నంత మాత్రమున నేను అచల పరిపూర్ణ పరబ్రహ్మ మగుదునా
కాదోనని భావము.

కం॥ భూమను భద్రాచలమని । రాములనుచు లేని । నన్న రక్షణమననే
మీమాట నెరిగుళ్ళక్కని । నామాటను మరమయునికి నయమని
తోచెన్ ॥ 246

ఓ గురుమూర్తి ! అచల పరిపూర్ణ పరబయలు యనునట్టి భూమ భద్రా
చలమని నిశ్చయించి అందు ప్రతిష్ఠింపబడి యున్నట్టి శ్రీరామచంద్రమూర్తి ని
లేనట్టి నన్నుగా నిశ్చయించి మీరు బోధించిన అచల పరిపూర్ణ ప్రబోధ లక్ష
ణానుసారముగా నేను అబద్ధమని నన్ను నేను విడిచి వుండుటనునే లక్షణము
అన్ని లక్షణముల కన్న న్యాయమైనదని నయమైనదని నాయొక్క విశ్చయమని
భావము.

కం॥ నా గురుడు నాకు దెల్పిన । ఈ గురుబోధంత మీకు యిప్పుడు
నేనున్ । బాగుగ వినజెప్పితిసుమి । యో గురువర్య యని శిష్యు
డూరకయున్నన్ ॥ 247

ఓ, గురుమూర్తి ! నాకు బోధించిన అచల పరిపూర్ణ బోధయందలి విష
యములన్ని నీ ముందు చక్కగా మనవి చేసుకున్నాను. గనుక సరియగునా
లేదా చూడవలసినది యని శిష్యుడు వూరక యున్నాడని భావము.

## —(గురుని హర్షము)—

కం॥ విని శిష్యుని వచనోక్తులు । మనమున హర్షించి గురుడు । మస్తక
మున జెయ్యునిచి తొడమీద జేర్చుక తన శిష్యుని మేనునిమిరి తానిట్ల
నియెన్ ॥ 248

శిష్యుడు ఒప్పజెప్పిన పరిపూర్ణ బోధ లక్షణము సద్గురుమూర్తి విని
మనంబున సంతోషము బొంది అస్త మస్తక సంయోగము జేసి తనతొడపైన

ఓ, శిష్యుడా ! సద్గురుమూర్తి క్షరాక్షర ద్వయదోషరహిత పరిపూర్ణబోధ ఈ ప్రకారము చెప్పగా సచ్ఛిష్యుడు విని సంతోషము పొంది ఉత్సాహముతో ఈ దిగువ చెప్పబోవురీతి మధురమైన వాక్యములు శిష్యుడు పల్కినాడని భావము.

కం॥ నాకొరకు కష్టపడితిరి । మీకై మీరిటకువచ్చి । మిముబొగడు టకా । కాకోదరేశుడోపం । డాకార్యము నాతరంబె యచల మనస్కా॥ (213)



జననమరణ భ్రాంతిరహితమగు మనోవృత్తిగల ఓ సద్గురుమూర్తి ఇచటికి మీయంతట మీరేవచ్చి నాజన్మ తరుణోపాయమునకు ఎంతయో శ్రమ జేస్తిరి గనుక మిమ్ము స్తోత్రముజేయుటకు వెయ్యిముఖములుయున్న ఆదిశేషుడనే వాసుకికే తరముగాదు. ఒక్క ముఖముగల నాకు ఎట్లు తరమగునని భావము.

కం॥ తల్లివి దండ్రివి దాతవు । వల్లభుడవు బాంధువుడవు। వసుధీశుడవున్ తెల్లమిగ దేవుడవు నీ వల్లగదా యిట్టిబోధ । వర్తనవినుటల్॥ (214)

ఓ, సద్గురుమూర్తి మీరు నాకు తల్లిదండ్రులు నన్ను పోషించే దాతలు ప్రియస్వరూపులు బంధువులు విశ్వమును పోషించే విశ్వేశ్వరులు సాక్షాత్ పర బ్రహ్మ స్వరూపులు గనుకనే మీవల్ల జనన మరణ భ్రాంతిరహిత లక్షణమగు ప్రవర్తన విన్నానని భావము.

—(గురుని కోరిక)—

కం॥ అని శిష్యుడన్న మాటకు మనమున హర్షించి గురుడు మరియిట్లని యెన్ । వినవోయి శిష్యరాయా ।వినినాకోరికనుదీర్ప వేడుక యైనన్ ॥ (215)

శిష్యుడు యనునట్టి వాక్యంబులకు సద్గురుమూర్తి తనమనంబున సంతోష పడి శిష్యజనంబులలో శ్రేష్ఠమైన ఓ, శిష్యుడా నేను నీకు తెలియజేసిన మార్గము వల్ల నీవు సంతోషచిత్తుడవై నట్టులుంటే నేనొక విషయము చెప్పెదను ఆరీతిగా నీవు జేసి నాకోర్కెను దీర్పవలయునని భావము.

కం॥ నేజెప్పినట్లు జెప్పర । నేజెప్పినబోధతెన్ను నీకతికుంటే । నేజూతు నీచమత్కృతి । రాజితసుగణైకసార ! రమ్యవిచారా॥ (216)

ఓ, శిష్యుడా ! నేనుచెప్పిన అచల పరిపూర్ణ ప్రబోధయొక్క యదార్థము తెలిసిన యెడల నేను చెప్పినట్లు చెప్పుము. నీ సామర్థ్యము ఏవిధముగా యున్నది నేను తెలిసికొనెదనని భావము.

## —(శిష్య ప్రబోధము)—

కం॥ అనిగురుడు తనను । బల్కిన । వినిశిష్యుడు లేచిమ్రొక్కి వినుతించి
ముదంబునజెప్ప దొణగె మునుతా। వినినట్లుగ గురునిమదికి ! వేడ్కక
దోపన్ ॥ (217)

శ్రీ సద్గురుస్వామి చెప్పినట్టి వాక్యంబులు వినిన శిష్యుడు సంతోషముతో సాష్టాంగ నమస్కారమువేసి సద్గురుమూర్తికి సంతోషము కలిగేట్టుగా తాను ముందు విన్నట్లుగా పరిపూర్ణ ప్రబోధ చెప్పబోవుచున్నాడని భావము.

కం॥ నేమొదలులేని మేనును । నాముచ్చట స్వప్నమనుచు । నమ్మదగు
సుమీ । నేమేలుకొన్న లేనని నాముచ్చట నేనునిల్వ । నరఘడి
యైనన్ ॥ (218)

ఓ, సద్గురుమూర్తీ నేననే గుర్తెరిగే శరీరమునకు అచల పరిపూర్ణ పర బయలునందు మూలముగాని నిలిచేందుకు స్థానముగాని లేనందున వారి పరిణామ రూపమైన జీవేశ్వర జగత్త్రయను నావృత్తాంతము లేనిదని సుర స్వప్నమని నిర్ణయించనై నది. అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకొని కలయగు నేను మేలుకున్న యెడల నేను లేకపోవుచున్నాను. గనుక నావృత్తాంతమగు జీవేశ్వర జగత్తు నేను ఒక ఘడియనైనా నిల్చుటకు చోటులేక లేకపోదుము యని భావము.

కం॥ లేనినే లేకవచ్చిన, నేనేగిన నుంతుబయలు । నేనెరుగను యీ
నేనుండి దాన్నిగనుగొని । నేనేగితె మరలబుట్ట । నికనెన్నటికిన్ ॥
(219)

ఓ, సద్గురుదేవా అచల పరిపూర్ణ పరబాహ్యమునందు లేనట్టి నేను వస్తూ పోతూ యున్నాను. అచలపరిపూర్ణ పరబయలు ఏకరీతిగానే యుండును. అయినా ఆ బయలువున్నట్టి విధము నేను ఎరుగను నేనువున్నప్పుడు ఆ పరబయలును తెలుసుకొని నేను లేకపోయినయెడల ఇక ఏలోకమందుయైనను ఏకాలమందునైనా పుట్టబోనని భావము.

కం॥ లేని నారాకపోకలు । దేనందున దోచబడె । నదెబయలుసుమీ ।
దానిని గురుకృపచేగని । నేనేగిన రానుపోను । నిజమెన్నటికిన్ ॥
(220)

ఓ, గురురాయా లేక వున్నట్టుగా తెలియబడే నాయొక్క జనన మరణంబులు దేనియందు భావింపబడు చున్నవో అదే అచల పరిపూర్ణ పర బాహ్యము

ఈ బయలు గురుమూర్తి చేత తెలుసుకొని లేనట్టినేను లేకపోయిన యెడల ఏలోకము నందు గూడ జనన మరణంబులు ఎన్నడు జెందబోనని భావము.

కం॥ తనువుకు నాకును వేరని యనగూడదర దెట్టులనిన । ననవర
తంబున్ । పనులన్ని తనువునే లేకను । జేయగ వశముకాదు
కావునసామి ॥ (221)

ఓ, సద్గురుస్వామీ నేననే గుర్తెరిగే శరీరమునకు దానిస్థూలభాగమగు కనబడే శరీరమునకు వేరని చెప్పగూడదు. ఎందుకనగా ప్రపంచపారమార్థ పద్ధతులయందు ఏకార్యమైనప్పటికి స్థూలభాగమగు తనువులేకుండా సూక్ష్మ రూపమైన నేను ఏదైన చేయగలనా చేయలేనని భావము.

కం॥ ననురమ్మని పొమ్మని తా । ననదుసుమీ బట్టబయలు । నాకై నేనే ।
తనువును జగమునుగైగొని । చనుదెంచుట చనుటనాకు । సహజము
తండ్రీ ॥ (222)

ఓ, తండ్రీ అచల పరిపూర్ణ పరబయలు నన్నురమ్మని చెప్పదు నాకై నేనె ఈ శరీరమును అంతఃకరణము సముదాయమగు ప్రపంచమును చేసుకొని జనన మరణంబులు బొందుట నాకు సహజమని భావము.

కం॥ ప్రకటమగు బట్టబయలున । సకలముతో లేకవచ్చి చనుదర ఘడి
యన్ । నాకకోటి । మార్లు నేరా నాకవేళ్ళను లేనటంచు । నూహా
పొడమినన్ ॥ (223)

ఓ, సద్గురుదేవా! ప్రసిద్ధముగాయున్న పరబయలున పిపీలికాది బ్రహ్మ పర్యంతర సకలము లేకనేవచ్చి అరఘడియలో కోటిపర్యాయములు వెళ్ళు చుండును. అయినా నేను లేసనే లక్షణము నాకు తెలిసిన యెడల ఎప్పుడు రాకుండా పోకుండా లేకపోదునని భావము.

కం॥ లేనినే నెరుగకుండిన । మేనుండదు నేనునిల్వ । మేనుండక యీ !
మేనగు నాజోలొల్లని । దానిని గుర్తెరిగి. నేను । తలగితె
వాలున్ ॥ (224)

ఓ, సద్గురుమూర్తీ నేననే ఎరుకలేనిదే శరీరమనే మేనువుండదు. మేను యనే శరీరము లేనిదే నేనుయనే ఎరుక వుండదు. గనుక నేననే శరీరము యొక్క విషయము లేని అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకొని నేననే ఎరుక లేకపోతే జనన మరణ రహితవిధానమునకు వాలునని భావము,

కం॥ మనము మన పెద్దలందరు । చనుదేరక మునుపువారు । చనినన్ గలయీ । ఘనమునుగని మనమేగిన । చనదుగదా మనలబోలి । సారవిచారా ॥ (225)

ఓ, సద్గురుమూర్తి ! మీరున్ను మన పెద్దలున్ను పుట్టకముందు అచల పరిపూర్ణ పరబయలుండును. మీరున్ను నేమున్ను మన పెద్దలున్ను పోయిన తదుపరి ఆ పరబయలు యుండును. దానిని మనము తెలుసుకొని లేకపోయిన తదుపరి మనము లేకుండా పోయినట్లు ఆ అచల పరిపూర్ణ పరబయలు మనవలెనే లేకపోదని భావము.

కం॥ మేను మజ్జననినేనే । మేనికి జనకుడనునేను । మేను లోకటయై । దేనందు సంచరింతుమొ । దానిని పరిపూర్ణమనుచు దలచెద నయ్యా ! (226)

ఓ, సద్గురుమూర్తి । శరీరము తల్లిగాను నేనను ఎరుక తండ్రిగాను నేను మేనులు ఏకమై ఏ దానియందు తిరుగుచున్నామో అనగా నిలిచేందుకు ఆధారము లేక జనన మరణాదులు పొందుచున్నామో దానిని పరిపూర్ణ పరబయలని స్మరించుచున్నానని భావము.

కం॥ మేనున్నదె నేలేకను । నేనెరుగను మేనులేక । నేనిల్వను యీ । మేనుకు నేనుకు మూలము । గానను మము మేమె సృజన । గావింతుమయా ॥ (227)

ఓ, తండ్రీ నేను లేక యున్నను మేను యున్నదని నేను ఎరుగను మేనగు శరీరములేకను నేను వుండను గనుక నేనను ఎరుకకును మేనగు శరీరముకును ఉపాధియగుటకు మూలము ఎచట కూడా లేదు అయినా మమ్ము మేము అనగా నేనువల్ల మేను. మేనువల్ల నేను సృజించుకొందుము యని భావము.

కం॥ నేనిల్వజగములేకను నేనేగిన జగములేదు । నిజమీజగమున్ । నేనును లేనప్పుడుగల । దానిని పరిపూర్ణమనుచు । దలపోయదగున్ ॥ 228

ఓ, గురుమూర్తి ! జగములేక నేను నిల్వలేను. నేను పోయినట్లులైన జగమగు ప్రపంచము నిలువదు. ఇది నిజమని తెలియనగు ఈ జగమును నేనును లేనప్పుడు యుండునట్టిది. అచల పరిపూర్ణ పరబయలని తెలియనగునని భావము.

కం॥ లేనినే మాయమైనను । మానవులది మరుపు మూర్ఛ । మరణం
బనుగా । గాఢనిద్రయు నిర్నిద్రన నేనవివిని మ్మృషనినమ్మ । నేర్రు
నెవాటిన్ ॥ (229)

ఓ, గురుమూర్తీ ! దృశ్యా దృశ్యముగా వున్నట్టి నేను అదృశ్యమైన ఎడల మానవులు నా అదృశ్యమును చూచి అది మరుపుయని, మూర్ఛయని, మరణంబుయని, గాఢానిద్రయని నా అదృశ్యమును గురించి ఎన్నియో విధముల చెప్పుకొనుచుందురు. ఆ రీతిన నిర్ణయించిన లక్ష్యములు నా విషయము తెలుసుకొన్న నేను నిజమని నమ్మజాలనని భావము.

కం॥ వినుభాష్యములను త్రాళ్ళను । జనములునను గట్టియుంచ జనక నీలు
తునా । చనుచొత్తు నాకునేనై । కనుక నెనను నమ్మరెపుడు । ఘనుల
గువారల్ ॥ (230)

ఓ, గురుమూర్తీ ! సూత్రవ్యాఖ్యాన గ్రంథములను బాష్యములను తాళ్ళచేత నేను శాశ్వతమని నన్ను కట్టియుంచిన మాత్రమున నేను పోకుండ అనగా జన్మాదులెత్తకుండా నిల్చియుందునా ? వారు ఎన్ని విధంబుల నిశ్చయించుకున్నను నాయంతట నేను పోతుందును. నాయంతట నేను వస్తుయుందును. గనుకనే అచల పరిపూర్ణ స్థితిగలవారు నన్ను నమ్మరని భావము.

కం॥ నానాభాషలచేతను । నానావిధశాస్త్రతతుల । ననునమ్మటకై నేనే
రచించిపెట్టితి । నానాదేశములయందు । నరరూపమునన్ ॥ (231)

ఓ, గురుదేవా ! స్థావరజంగమ జీవోపాధులయందు ఒకే పద్ధతిగా యున్న ఎరుకయగు నన్ను ఒక్క మానవోపాధియందు యున్న నన్ను మాత్రము శాశ్వతమని నమ్ముటకు అనేక పద్ధతులుగా అనేక పరిభాషలలో అనేక శాస్త్రంబులు నేనే నరరూపమున రచయించి అనేక దేశములలో పెట్టినానని భావము.

కం॥ ఒకచోట నవ్వుదును । వేరొక చోటను మిడుకుచుందు నొకచోటననే
ప్రకటమగుదు లేకుందును నొకచోటను యిట్టిచేష్ట లుండును
నాకున్ ॥ (232)

ఓ గురుదేవా నాకు సంతానము కలిగితే నావంశము ఎడతెగకుండా నిల్చియుండునని సంతోషించుతాను. నా ఉపాధికి అంత్యదశ మరణమని మిడుకుతాను. అహం బ్రహ్మాస్మియను పద్ధతి ననుసరించి వార్తికనిర్ణయము వరకు బ్రహ్మత్వము పొంది సూర్య, చంద్ర, నక్షత్ర, సత్యలోక, కైలాస, వైకుంఠ సకలలోకంబులు నా సత్తావల్లనే వాటి స్థానములయందు నిల్చియున్నవని అన్నిటి

యందు నేనే వున్నట్లు అనగా నువ్వులయందు నూనె వున్నట్లు ప్రకటమగు తాను సద్గురుమూర్తి వల్ల అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకొని నాకు నేను లేకుండా ఇతరులకు వున్నట్లు తెలియునట్లుగా ఉంటూ యుంటానని భావము.

కం॥ కావేటి కాలువలవలె । నావల్లనె కల్పనౌను । నానావిద్యల్ । యీ
విశ్వమందువిశ్వము । నావెంటనె వచ్చుపోవు నావలెనెసుమీ ॥ 233

ఓ, గురుదేవా ! పృథ్వియందు వుండునదులు ఒకటితో నొకటి కలిసి అనేక నామంబులతో వ్యవహరింపబడునట్లుగా ఈ ప్రపంచమునందు అనేక విద్యలు సిద్ధాంతములపైన సిద్ధాంతములు ఈ విశ్వమంచు నాచేతనే చేయబడు చున్నవి. ఈ విశ్వముకూడా నా వెంటనేవచ్చి నావలెనే పోవునదిగాని శాశ్వతముగా యుండునది కాదని భావము.

కం॥ నేనాడదాన నౌదును । నేనేమగవాడనౌదు । నేనేనన్నున్ ।
నేనీవటంచుగూడుదు । నేనేనను జనుపమనుప నీగుదుసుమ్మా ॥ 234

ఓ, గురుమూర్తీ ! నేను స్త్రీరూపముగా నుందును. నేనే పురుషరూపుడ నగుదును. నన్ను నేనే నీవు నేను అనుకొనుచు పొందుచుందుము. నేనే నన్ను పుట్టించుటకు, రక్షించుటకు, చంపుటకు కారణమని భావము.

కం॥ నేనుల మేనుల కుప్పను । నేను బయల్ నన్నెరుగదు । నేచను
దొత్తున్ । మేనై నిమిషములోనిది । మానుగ నావృత్తినేనేమాయను
సుమ్మా ॥ 235

ఓ, గురుదేవా శక్తిద్వయము క్షరాక్షర సమూహము నేనే. అచల పరిపూర్ణ పరబయలు నన్ను ఎరుగదు. నావృత్తి ఏమనగా స్థావర జంగమ రూపములుగా తెలియబడి యున్నట్టులయుండి రెప్పపాటు కాలములో లేకపోవు దును తిరిగి వచ్చెదను. గనుక నన్ను మాయయని లేక తోచినదని అచల ఋషులు నిర్ణయించినారని భావము.

కం॥ నేనుగా కొకటిశుద్ధ । జ్ఞానము గలదనుచు బల్కు । జ్ఞానులమాటల్
పూని వినదగదు - శుద్ధ జ్ఞానంబననేనె నేను । లేనిదియానె॥ 236

ఓ, గురురాయా ! నేను గాకుండా ఇంకొక పరిశుద్ధమైన జ్ఞానము యున్నదని చెప్పేజ్ఞానవంతుల మాటలు నిశ్చయమని వినకూడదు మరియు నమ్మ కూడదు ఎందుకనగా శుద్ధజ్ఞానంబనగా నేనేగనుక నేనుగానిది ఇహ పరాదుల యందు ఏమిన్ని లేదని భావము.

కం॥ నేమాత్ర ముందు ననియను । నామాయల కూతలన్ని యరసిన
సుప్తిన్ । యేమాయె మరణమప్పుడు । యేమాయెను గురుని మాట
నేమాయె నయా ॥ (237)

ఓ, గురుదేవా ! నేననునట్టి ఎరుక మాయయని మీరు శెలవు ఇచ్చినది నిజమే ఎట్లులనగా సుషుప్తి యందు మరణమునందు నేను వున్నానా విచారించి చూడగా నన్ను నేను మరిచిపోయినాను గనుక నేను మాయనే యగుదును. నేను శాశ్వతముగా యుంటున్నాను. శరీరము లేకపోవుచున్నదియని చెప్పునట్టి వాక్యంబులు మాయవాక్యంబులేయని భావము.

కం॥ నేనన్న నహమహంబన । నేనెసుమీ, యహమటంచు నేనెపుడంతే
నేనపుడుబుట్టుటది । జన నేను గతించుటమటంచు నీవెరుగయ్యా॥ (238)

ఓ, తండ్రీ ! ప్రకృతికి వేరుగా యుండినట్టి బ్రహ్మమును నేను యని యనుకున్నను ప్రకృతిలో వుండుచు ప్రకృతి నేనేనని యనుకున్నను ఈ రెండు లక్షణములుగానే నేను యుంటున్నాను. ఎట్లనగా నేను పుట్టినప్పుడు అహం యని యనుచున్నాను. అహంబను లక్షణము లేనప్పుడు నేను ప్రకృతిరూపమున యుంటుయున్నాను, గనుక అది నా మరుపురూపు అనగా మరణము యని భావము.

కం॥ నేనన నాల్గవ దేహము । మేనన నాలోని మూడు మేనులు సుమ్మీ ।
నేను మేనన నహొక్కటె కానిది తనమూల మరయ । గనరాదు
సుమీ ॥ (239)

ఓ, గురుమూర్తీ ! నేననగా మహాకారణమగు నాల్గవ శరీరము మేననగా స్థూల సూక్ష్మ కారణములే మూడు శరీరంబులు నాలోనివే కాని వేరుకావు కనుక నేనన్నా మేనన్నా యొక్కటే, వేరువేరుగా యుండునట్టివికావు. అయినా దీని వుపాధికి మూలము విచారించగా ఎచ్చటకూడా అగుపడదని భావము.

కం॥ అంగములింగము గలసుటె । లింగశరీరం బటంచు లెక్కకు
వచ్చెన్ । లింగం బంగమువెడిసిన । లింగముశక్యోను నేనె లింగం
బనివన్ ॥ (240)

ఓ, గురుదేవా ! జడచేతనములగు నేను మేను ఏకముగా యున్నందుననే అంగము స్థూలమని లింగమగు నేను సూక్ష్మమని విచారించగా తెలియుచున్నది. అదియును గాక సూక్ష్మమగు నేను స్థూలమును విడిచినా లేకపోవుచున్నాను. గనుక నేను ఎరుకయని లింగశరీరమని భావము.

కం॥ లింగము విక్షేపంబన । నంగం బావరణమనిన నగునీరెండే । లింగ
శరీరము దీనికి । భంగము తనమూల మరయ బడినప్పుడగున్॥ 241

ఓ, గురుదేవా ! లింగమగు నేను విక్షేపమును, అనగా కదిలిక గల దానను. అంగము యనగా దాని ఆవరణము, ఈ రెంటికి లింగశరీర మని చెప్ప బడును. దీనికి జనన మరణంబులు తప్పవలయునంటే దీని ఉపాధి ఎచట నుండి కలిగినదని విచారిస్తే లేకుండా పోవునని భావము

కం॥ ఎరుకన మరుపనహానిది । పరిపూర్ణం బీశ్వరుడనబడునెరు కెరుకన్ ।
మరచిన జీవుండనబడు । నెరుకచలము । నెరుగ నరుగు । నెరుక
మరుపులున్ ॥ 242

ఓ, గురుమూర్తీ ! ఎరుక మరుపులు కానిది అచల పరిపూర్ణ పరబయలని చెప్పబడును. ఎరుకను ఈశ్వరుడని చెప్పబడును. ఎరుక తననుతాను మరచినట్టు లైతే జీవుడని చెప్పబడును గనుక ఈ ఎరుక అచల పరిపూర్ణ పరబయలు తెలుసుకొన్న యెడల ఎరుక మరుపులు రెండుకూడా లేకపోవునని భావము.

కం॥ ఎరుకన సత్వగుణంబని । మరపున తామస మటంచు మరి యీ
రెండున్ । సరియైన రాజసంబని నరులెన్నిరి మూటి విడువ నర్థ ము
సుమ్మీ ॥ 243

ఓ, సద్గురుమూర్తీ ! ఎరుకయగు వస్తు సత్వగుణంబని మరుపుయగు శరీరము తామసగుణంబని ఈ రెంటి సమాన చేరికవల్ల సుఖ దుఃఖాత్మకమగు వ్యవహారమగు రాజసగుణమని మానవులు నిశ్చయించినారు. అయినా ఈ మూడు లక్షణంబులు విడుచుటే పరిపూర్ణ పద్ధతి యని భావము.

కం॥ తన్నెరుగ నట్టి బయటన్ । యెన్నడు లేనట్టి నేను యీ విశ్వమునై ।
వున్నట్టులుండి నేలేందున్నదిగని । నేనుబోతె దుందణగుసుమీ ॥
244

ఓ, సద్గురుమూర్తి ! అహం బ్రహ్మాస్మి యని నేను అచల పరిపూర్ణ పరబయలు యందు ఏ కాలమందు లేనిదే విశ్వరూపంబుగా యున్నట్టు తెలియును. నేను లేనట్టి అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకొని నేను లేకపోయిన యెడల జనన మరణ ప్రవాహరూపమగు ఎరుకయగు చలనము లేకపోవునని భావము.

కం॥ ఈ యచల మొక్కటి బ్రహ్మని । మాయా మయమైన విశ్వమంతయు
నేనంబాయ మెరుంగక ననునరు । లీయెడ బ్రహ్మం బటంచు లెక్కిడ
నగుదున్ ॥ 245

ఓ, గురుదేవా ! అచల పరిపూర్ణ పరబయలు ఒక్కటి మాత్రమే శాశ్వత మని విశ్వాభిమానియగు నన్ను విశ్వమును మాయయనే విషయము మానవులు తెలుసుకోలేక నాయందు గల ప్రేమవల్ల ఈ మానవులు నన్ను శాశ్వత బ్రహ్మ యని యనుకొన్నంత మాత్రమున నేను అచల పరిపూర్ణ పరబ్రహ్మ మగుదునా కాదోనని భావము.

కం॥ భూమను భద్రాచలమని । రాములనుచు లేని । నన్న రక్షణమునసే
మీమాట నెరిగుళ్ళక్కని । నామాటను మరచుయునికి నయమని
తోచెన్ ॥ (246)

ఓ గురుమూర్తి ! అచల పరిపూర్ణ పరబయలు యనునట్టి భూమ భద్రా చలమని నిశ్చయించి అందు ప్రతిష్ఠింపబడి యున్నట్టి శ్రీరామచంద్రమూర్తిని లేనట్టి నన్నుగా నిశ్చయించి మీరు బోధించిన అచల పరిపూర్ణ ప్రబోధ లక్ష ణానుసారముగా నేను అబద్ధమని నన్ను నేను విడిచి వుండుటనుసే లక్షణము అన్ని లక్షణముల కన్న న్యాయమైనదని నయమైనదని నాయొక్క నిశ్చయమని భావము.

కం॥ నా గురుడు నాకు దెల్పిన । ఈ గురుబోధంత మీకు యిప్పుడు
నేనున్ । బాగుగ వినజెప్పితిసుమి । యో గురువర్య యని శిష్యు
డూరకయున్నన్ ॥ (247)

ఓ, గురుమూర్తి ! నాకు బోధించిన అచల పరిపూర్ణ బోధయందలి విష యములన్ని నీ ముందు చక్కగా మనవి చేసుకున్నాను. గనుక సరియగునా లేదా చూడవలసినది యని శిష్యుడు వూరక యున్నాడని భావము.

## —(గురుని హర్షము)—

కం॥ విని శిష్యుని వచనోక్తులు । మనమున హర్షించి గురుడు । మస్తక
మున జెయ్యునిచి తొడమీద జేర్చుక తన శిష్యుని మేనునిమిరి తానిట్ల
నియెన్ ॥ (248)

శిష్యుడు ఒప్పజెప్పిన పరిపూర్ణ బోధ లక్షణము సద్గురుమూర్తి విని మనంబున సంతోషము బొంది అస్త మస్తక సంయోగము జేసి తనతొడపైన

కూర్చుండబెట్టుకొని శిరమును తన హస్తముతో స్పర్శించుచు దిగువ జెప్పబోవు లక్షణంబులు చెప్పుచున్నారని భావము.

కం॥ నీవంటి పుట్టివాడిక । భూవలయము నందు ముందు బుట్టడు వెను కన్ । నేవిన లేదున్నాడం । పీవేళ్కకు నిన్నెచూస్తి నిటభళి శిష్యా ॥ 249

ఓ, శిష్యుడా శభాష్ ! అచల పరిపూర్ణ స్థితిగల పురుషుడు ముందు పుట్టుతారని వెనుక పుట్టబోయినారని కాని నేను వినలేదు కాని ఇప్పట్లో నిన్ను మాత్రము చూచినానని భావము.

కం॥ చందురుని నీమ ముద్దాడిందని నట్టిపుడు । నీవు యా సద్బోధన్ । జెందితివి నీకు సరి జగమందెవ్వరులేరు నిన్ను మదిమెచ్చితిరా॥ 250

ఓ, శిష్యుడా ! భూమికి ఎన్నియో యోజనముల దూరమున నున్న చంద్రున్ని భూమియందు తిరుగాడే చీమ ముద్దాడినదని చెప్పినందున ఎంత విచిత్ర మగునో అంత చిత్రము పంచతన్మాత్ర అవరణమునందు సంచరించే నీవు పంచ తన్మాత్ర రహితమైన అచల పరిపూర్ణస్థితి తెలుసుకున్నావని యంటే అంత చిత్ర మగును గనుక నీతో సమానమగువారు జగమున ఎవ్వరుగూడ ఉండబోరు గనుక నిన్ను మదిలో మెచ్చుకున్నానని భావము.

## —( గురు దక్షిణ )—

కం॥ అని మెచ్చి యేమి యిచ్చెద । వని గురుదక్షిణ నటంచు నతడడిగిన నన్నని పల్కె శిష్యరత్నము । విని యిది యిక ముట్టబోక విహరించు మనన్ ॥ 251

ఓ, శిష్యుడా ! నేను నీకు చెప్పిన మార్గమును ఉన్నది యున్నట్లు తెలుసు కున్నావు. ఇక గురుదక్షిణగా ఏమి యిచ్చెదవో ఇవ్వవలయును అనగా నన్నే గురుదక్షిణగా యిస్తు యున్నాను యని శిష్యుడు చెప్పగా విని అట్లు ఇచ్చిన యెడల నిన్ను నీవు అంటకుండా ప్రవర్తన జరుపుకోమని ఆజ్ఞాపించినాడని భావము.

## —( బోధ స్థితి నిర్ణయము )—

కం॥ విని శిష్యుడు గురుమూర్తిని కనుగొని చిత్తరువు ప్రతిమగా నిలిచి యున్నన్ । తన శిష్యుని హస్తములన్ గొని దగ్గర దీసికొని కొడుకా యనుమన్ ॥ 252

ఓ, శిష్యుడా ! సద్గురుమూర్తి ఆజ్ఞాపించిన రీతిగా చిత్తరువు ప్రతిమవలె నిలబడి యుండగా శిష్యుని హస్తములు పట్టుకొని తన వద్దకు రమ్మని నియమించి కొమారా యని సంబోధించినాడని భావము.

కం॥ పరమ హంసాశ్రమ ధరుని । పరిపూర్ణపు బోధ వాని పనులు సమమె । వార్నెరి గెరుగక నుతి నిందలు । గరపిన తత్ఫలమ్ము ప్రజలకగు నిజము సుమీ ॥ (253)

ఓ, శిష్యుడా ! అచల పరిపూర్ణ ప్రబోధ అశరీరుని పనులకన్న పరమ హంసాశ్రమధరుని పనులు తక్కువనే గాని సమానములు కావు. అయినా వారి వేషభాష ఆడంబరములు వీరలవద్ద లేవని వారినే నుతిజేయుచు వీరలను నిందించు చున్నారు గనుక వాటి ఫలంబులు తప్పక వారు అనుభవించెదరని భావము.

కం॥ అర్థము దెలియక గ్రంథము । వ్యర్థంబని నిందజేయు వ్యర్థుల మాటల్ । వ్యర్థములని యీ గ్రంథం । బర్థము సద్గురుని వలన బాగుగ వినుడీ ॥ (254)

ఓ, జనులారా ! భావము తెలియక ఈ గ్రంథము పనికిరాదని చెప్పే అజ్ఞానుల మాటలు అబద్ధమని విడిచి అచల పరిపూర్ణబోధ దృఢత్వముగల సద్గురునివల్ల ఈ పద్యముల భావార్థము వస్తునిశ్చయముగా వినవలయునని భావము.

కం॥ ఈ చెప్పిన గురుబోధను । తాచెవి నిడి బయలుగాంచి తనలేమి నిజంబై చనియె, శిష్యుడప్పుడు లేచెను గురుడచల, మాటలేదా మీదన్ ॥ (255)

ఓ, శిష్యుడా ! సద్గురుమూర్తి చెప్పినట్టి అచల పరిపూర్ణ ప్రబోధను శిష్యుడు శ్రద్ధతో విని అచల పరిపూర్ణ పరబయలునుచూచి తనవునికి అసత్య మని నిశ్చయించి శిష్యుడు వెళ్ళిపోగా గురుమూర్తి బోధించు ప్రబోధ పూర్తి యైనందున బోధ ముగించినాడని భావము.

## —(గ్రంథ సమాప్తి)—

కం॥ శరధి కరితురగ శితకర (౧౭౮౪) పరిమితమైనట్టి శాలివాహన । శకమందు రవిస్తి మాఘ పౌర్ణమి । వరకిఏదుందుభి యనేటి వత్సరమిపుడున్ ॥ (256)

ఓ, శిష్యుడా ! దుందుభినామ సంవత్సర మాఘ శుద్ధ పూర్ణిమ అనగా 1784 శాలివాహన శతాబ్దమునాటికి ఈ గ్రంథ పద్యములు వ్రాయుట పూర్తి

యైవదని భావము. శరధి యనగా సముద్రము, కరి యనగా అష్టదిగ్గజములు, తురగ మనగా గుఱ్ఱంబులు, శితకరు డనగా చంద్రుడు యని భావము.

కం॥ పది యిరువై యైదులు యీ । సదమల కందములు వీట్ని (250)
సదయా మతులై । ముదమున మీరు వినెదరని మదిలోపల దలచి
చేస్తి మానవులారా ॥ (257)

ఓ, జనులారా ! మీరు సదుద్దేశముతో ప్రేమ కలిగి వినినయెడల అచల పరిపూర్ణ ప్రబోధయందలి వస్తు నిశ్చయ లక్షణము మీ అంతఃకరణమును ఆకర్షింపగలదని నా మనంబున దలంచి ఈ 250 కందపద్యములు చేసినానని భావము.

కం॥ ఇతర మెరుంగని సతమందతి మృషయై కానుపించు । నట్టి
మనము । యీాకృతి గురు శిష్యులు । వారల యితరేతర వాగ్వి
లాసమివి మృషలు సుమీ ॥ (258)

ఓ, జనులారా ! తనను తానుగాని, ఇతరులుగాని ఎరుంగనట్టి అచల పరిపూర్ణ పరబయలునందు మిక్కిలి అబద్ధముగానుండి తోచుచున్నట్టి గురు శిష్యులగు మనము పరిపూర్ణ బోధకు నిర్మించిన ప్రబంధమున్ను అందలి గురు శిష్య నిర్మిత ధర్మంబులు ఇతర లక్షణముల విమర్శనలు సర్వము అబద్ధమని కర్తృత్వరహిత కర్మ పద్ధతి యని భావము.

## —(గ్రంథ ఫలశ్రుతి)—

కం॥ ఎవరీ పద్యము లన్నియు । వివరింతురో వారికెల్ల విద్యావిద్యల్ ।
దవిలి బాధింప వెన్నడు । భవనాశ స్థితులు లేక ప్రబలుదు
రెపుడున్ ॥ (259)

ఓ, జనులారా ! ఈ పద్యములను ఎవరు విచారింతురో వారిని జ్ఞానాజ్ఞానంబులు మరియు శరీరాత్మలు అంటి జనన మరణ ప్రవాహరూపమైన బాధ ఎన్నడుకూడ పొందక భ్రాంతిరహితులై యుండెదరని భావము.

కం॥ పాటసుమీ భక్తులకిది । బాటసుమీ బోధజెంద భ్రమరాకుండన్ ।
కోటసుమీ కందములను । తోటసుమీ దీన్ని తొలగ ద్రోయక
వినుడీ ॥ (260)

ఓ, జనులారా ! శిష్యజనంబునకు సంతోషముగా పాడుకొనుటకు పాట వంటిది, జనన మరణ భ్రాంతిరహిత అచల పరిపూర్ణబోధ తెలుసుకొనుటకు

చక్కని మార్గమువంటిది. తిరుగా భ్రాంతిపరులు గాకుండా యుండుటకు కోట వంటిది. పద్య విశేషంబులకు ఆశ్రయము వంటిది. గనుక ఈ పద్యములను వదలక వినవలయును. అనగా మొదటినుంచి ఆసాంతము వరకు ఒక్కటికూడ విడువకుండా సద్గురునోట వినవలయునని భావము.

కం॥ ప్రతిదినము జదివి యెవరీ ప్రతి నర్చన జేతురట్టి ప్రజలకు బోధ
స్థితి కుదర గలదు । గురుకృప కతిపాత్రులు వారు వారి కర్తము
గలదే ॥ 261

ఓ జనులారా ! ప్రతిదినము ఈ అచలబోధ చదివి ప్రబోధ నిశ్చయము తెలుసుకొని జనన మరణ భ్రాంతిరహితమునకు సరిఅయిన మార్గమని కర్తృత్వ రహిత కర్మాచరణ ఆచరించెదరో అట్టివారికి అచల పరిపూర్ణస్థితి కుదురగలదు. వారలు సద్గురుమూర్తి దయకు పాత్రులు కాగలరు గనుక అట్టివారి తరుణోపాయమునకు ఇహపరభ్రాంతులు ఏమిన్ని అడ్డు తగలవని భావము.

ఇది శ్రీమద్రాజాధిరాజ మహారాజ రాజయోగీంద్ర చంద్రులగు శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువు విరచిత క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత పరమతత్వ కందపద్యములకు శ్రీమదచలఋషి రామడుగు శివరామ దీక్షిత అచలగురు పీఠాధిపతులు శ్రీమదచలఋషి దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారిచే వ్రాయబడి భావార్థ 'గురుశిష్య సంవాద సహిత ప్రబోధ చూడామణి సమాప్తము.

శ్రీ సద్గురు మహారాజ్‌కి జై.

# మంగళహారతి

1. గురునకు మంగళ మనరమ్మా - సద్గురు మూర్తిని కనుగొనరమ్మా
తరుణులార యీతనికి భక్తితో - మురయుచు మ్రొక్కిన మోక్షము
చేకురు ॥గు॥

2. క్షర పురుషుండనరాదమ్మా అక్షర పురుషుండన కాదమ్మా
క్షరపురుషాక్షర పురుషుల కావల పురుషోత్తముడనబరగిన మాయీ ॥గు॥

3. క్షేత్రజ్ఞుండన రాదమ్మా యీ క్షేత్ర మతండనగాదమ్మా
క్షేత్రజ్ఞుని తత్ క్షేత్రంబునుయే - మాత్రము దగులక పాత్రుడైన యీ ॥గు॥

4. స్మరణ రూపడన రాదమ్మా - విస్మరణ రూపుడన రాదమ్మా
స్మరణలేక విస్మరణగాక - తత్స్మరణ విస్మరణ లెరుకలేని యీ ॥గు॥

5. దేహియనుట కనరాదమ్మా - యీ దేహ మతండన గాదమ్మా
అహం భావన కంటుసొంటులగు - దేహిదేహముల తెరవుబోని యీ ॥గు॥

6. పిండ రూపుడన రాదమ్మా - బ్రహ్మాండ రూపుడన రాదమ్మా
పిండాండబ్రహ్మాండ ఖాండముల - నిండియుండి యవి రెండుగానియీ ॥గు॥

7. జ్ఞానియనుట కనరాదమ్మా - అజ్ఞాని యనుట కదిలేదమ్మా
జ్ఞానాజ్ఞానములోవ నొక్కటియు తానుగాక శూన్యానికి మీరిన ॥గు॥

8. యోగియనుట కనరాదమ్మా - మరి భోగియనుట కనగాదమ్మా
యోగి భోగి వుద్యోగములంటని - భాగవతాన్వయ భవకృష్ణుండనే ॥గు॥

9. మేలుకీడులనరాదమ్మా - యే మేలు కీడులదిగాదమ్మా
కాలకూటమునకన్న మిక్కిలగు జాలమాంబవ్యథ క్షణములో బాపిన ॥గు॥

---

లక్ష్మీరమణ ప్రింటర్స్ - ధవళేశ్వరం

# మంగళహారతి

1. గురునకు మంగళ మనరమ్మా - సద్గురు మూర్తిని కనుగొనరమ్మా
తరుణులార యీతనికి భక్తితో - మురయుచు మ్రొక్కిన మోక్షము చేకురు ॥గు॥

2. క్షర పురుషుండనరాదమ్మా అక్షర పురుషుండన కాదమ్మా
క్షరపురుషాక్షర పురుషుల కావల పురుషోత్తముడనబరగిన మాయీ ॥గు॥

3. క్షేత్రజ్ఞుండన రాదమ్మా యీ క్షేత్ర మతండనగాదమ్మా
క్షేత్రజ్ఞుని తత్ క్షేత్రంబునుయే - మాత్రము దగులక పాత్రుడైన యీ ॥గు॥

4. స్మరణ రూపడన రాదమ్మా - విస్మరణ రూపుడన రాదమ్మా
స్మరణలేక విస్మరణగాక - తత్స్మరణ విస్మరణ లెరుకలేని యీ ॥గు॥

5. దేహియనుట కనరాదమ్మా - యీ దేహ మతండన గాదమ్మా
అహం భావన కంటుసొంటులగు - దేహిదేహముల తెరవుబోని యీ ॥గు॥

6. పిండ రూపుడన రాదమ్మా - బ్రహ్మాండ రూపుడన రాదమ్మా
పిండాండబ్రహ్మాండ ఖాండముల - నిండియుండి యవి రెండుగానియీ ॥గు॥

7. జ్ఞానియనుట కనరాదమ్మా - అజ్ఞాని యనుట కదిలేదమ్మా
జ్ఞానాజ్ఞానములోవ నొక్కటియు తానుగాక శూన్యానికి మీరిన ॥గు॥

8. యోగియనుట కనరాదమ్మా - మరి భోగియనుట కనగాదమ్మా
యోగి భోగి షుద్యోగములంటని - భాగవతాన్వయ భవకృష్ణుండనే ॥గు॥

9. మేలుకీడులనరాదమ్మా - యే మేలు కీడులదిగాదమ్మా
కాలకూటమునకన్న మిక్కిలగు జాలమాంబవ్యథ క్షణములో బాపిన ॥గు॥

లక్ష్మీరమణ ప్రింటర్స్ - ధవళేశ్వరం